# పీఠిక

మానవజాతివలెనే, రోగచికిత్సా శాస్త్రముకూడా పురాతనమైన. పాపము, నేరము, కామము, ఆహారపానీయములు తీసుకొనుటలో చేసే పొరపాట్లు, జీవనిర్వహణము, కోపము, యుద్ధము మొదలగు వానివలన, పరిపూర్ణ ఆరోగ్యవంతుడైనను క్రమక్రమముగా, రోగగ్రస్తుడవును. యుద్ధములవలన కంటెకూడ రోగములవలననే, మానవులు ఎక్కువగా మృతినొందుచున్నారు. ప్రభుత్వాదరణ పొందుచున్న వైద్యము చిరకాలము నుండి తప్పుత్రోవలనే నడుస్తున్నది. ఇప్పుడుకూడా తప్పుడు సిద్ధాంతాలమీదనే వైద్యశాస్త్రము నడుచుచున్నది. కొత్త సిద్ధాంతాలు వచ్చి పాతసిద్ధాంతాలు తప్పు అంటువి. ఇంకా కొంత కాలం గడచిన తర్వాత యిప్పుడు తప్పులేనివి అనుకున్న సిద్ధాంతాలు ముందుతరాలవారు తప్పులూ అంటారు. మరియు శాస్త్రవేత్తలు, రోగచిహ్నాలను నయముజేసే విధానములను, వేలాదిపుటలుగల గ్రంథములలో నింపివేయుచున్నారు. ఒక్క గ్రంథములోకూడా రోగ మూలకారణమునకు చికిత్సను బోధించుటలేదు.

సూక్ష్మజీవియే ప్రతివ్యాధికిని కారణమని చెప్పి తృప్తిపడుచున్నారు. దేహములో మురికిచేరినది. అది కుళ్ళినది. దానిని వెలువరింపవలసి యున్నది. మన చికిత్సాప్రక్రియలు, అందుకు ఉపయోగింపవలెను. మనము వెంటనే చికిత్స జేయనియెడల దేహమే ఆపనిని జేస్తుంది. దేహంలో ఉండే మురికి అంతా

నిర్మిస్తున్నారు. బాగా భాగ్యమున్నవారు కూడా ప్రజల మేలు గోరి యిట్టి పరిశోధనలను ప్రోత్సహించుచున్నారు. ఆసంఘాలు ఏమి చేస్తున్నవి? పరిశోధన పేరిట అనేక జంతువులను హింసించుచున్నవి. ఈ జీవహింసలోనుండి మానవాభ్యుదయ సూత్రములను కనిపెట్టుదామని వారియుద్దేశము. రోగములు పోవుటకు, వారు ఉపాయాలు కనిపెట్టుటలేదు. మరేమనిన కొన్ని రోగ చిహ్నాలను పోగొట్టుటకు విషముతో కూడిన సిరములను, ఇనాక్యులేషనులను, టీకాలను కనిపెట్టుచున్నారు.

స్వాభావిక చికిత్సాపద్ధతియందును, నిదానశాస్త్రమునందును, పండితులైన వారియొక్క అభిప్రాయములు, ఈ గ్రంథమున జెప్పబడినవి. నూతన రోగచిహ్నాలనుగాక రోగమూలకారణాన్ని పోగొట్టేటందుకు దేహమునందున్న శక్తులను బలపరచి, అనేకులను రోగనివారణ యొనర్చి ప్రఖ్యాతి గాంచినారు. జర్మనీ దేశస్థులు సెక్సోనీజిల్లాలోని లీప్జిగ్ అనే పట్నములోనుండి చిరకాలము ప్రకృతి వైద్యసేవచేసి ఖ్యాతిగడించిన లూయీకూనెగారు చెప్పిన ఉపన్యాసముల సంపుటియే యీ గ్రంథము. లూయీకూనే ప్రకృతి చికిత్సకులలో చాలాగొప్పవారు, వారు కనిపెట్టిన రోగాద్వైత, చికిత్సాద్వైతములు ప్రకృతిచికిత్సలో ఒకక్రొత్త మార్గమును చూపెట్టినవి. సిరములు టీకాలు, ఇంజక్షనులు, ఆపరేషన్లు మొదలగునవి కాకమునుపే, ఆతడు రోగమనగా, దేహమునందు మురుగుచున్న రోగపదార్థమే అనియు, ఆరోగపదార్థమును వెలుపరించుటయే, నిజమైన చికిత్సయనియు కనిపెట్టెను. అందుకు వారు సహజమును, సామా

స్యమును అగు ప్రక్రియలను ఉపయోగించి, దేహమంద
విషములను వెలువరింపగలిగెను. ఇందుకు సంబంధించిన ఉపన్యా
సముల సంపుటియే ది న్యూసైన్సు ఆఫ్ హీలింగ్. అని జర్మను
భాషలో వ్రాయబడిన గ్రంథము. అది యిప్పటికి ప్రపంచ
ములో ఏబది భాషలలోనికి పరివర్తనము పొందినది. ఈ గ్రంథ
మును నేను 1888 సంవత్సరములో చదివితిని. అది నా జీవిత
మున కంతకు క్రొత్త ఆవేశాన్ని గల్గించినది. ఇప్పటికి నాకు ఈ
ప్రకృతి వైద్యానికి అంతకూ యీగ్రంథము పునాదిగా
ఉన్నది. ఈగ్రంథమును ప్రచురించుటలో నాఉద్దేశ మేమనగా,
ప్రకృతివైద్యము శాస్త్రీయమైనదని సిద్ధాంతీకరించుటకే. నేటి
ప్రకృతివైద్యుడు యీగ్రంథమును చదివి ఇంకా గొప్ప
వైద్యము చేసేటందుకుగాను అనువదింపబడినది. రోగి యీ
గ్రంథము చదివితే, రోగం ఎల్లానయమవుతుందో తెలుస్తుంది.
మూలసూత్రం తెలియకుండా వైద్యముచేసే వైద్యులు ఈ
గ్రంథము చదివితే, ప్రకృతివైద్య మూలసూత్రములు, బాగా
బోధపడుతవి.

మందువైద్యుల చేతుల్లో చిక్కి విషపుమందులతోను, సూది
మందులతోనూ, కత్తికోతలుతోనూ, తమ ఆరోగ్యాన్ని, ఆయు
వును, ధనాన్ని, పోగొట్టుకుంటున్న అసంఖ్యాకులగు రోగులు ఈ
గ్రంథమును చదివినేని, రోగమునుగూర్చి వారికిగల అజ్ఞానము
తొలగిపోవును. వారికిగల వ్యాధి బాగుచేసుకొందురు. అందుచే
కోరకై, ముఖ్యముగా యీగ్రంథము ననువదించితిని.

పుచ్చా వేంకటామయ్య.

---

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

మూడవ భాగము



నాల్గవ భాగము

## ౨. నేను తొట్టివైద్యము నెట్లుకనుగొంటిని?

తాను కనుగొన్న నూతనవిషయాలను, తోడివారికి తెలుపవలె ననేకోరిక ఉండటం మానవ సామాన్యమైనది. కీర్తికాంక్షచేత ఇలాంటి కోరిక కల్గుతుంది. బడాయిచేతగూడ ఇలాంటికోరిక పుట్టుతుంది. ఈ కోరికలో తప్పులేదు. ఇది మానవ సహజమైనది. సత్యం చెప్పాలి. లేనిపోని బడాయిలు చెప్పరాదు. ఈ సహజమైన నియమాన్ని అనుసరించే నేను కనుగొని 30 సంవత్సరాలు అనుభవపూర్వకముగా నిశ్చయం చేసిన విషయాలను ఇప్పుడు ప్రజలమేలుకొరకై వెల్లడించు చున్నాను. ఏవో ఊహాజాలాలుసిద్ధాంతాలై తేల్చిపుస్తకాలువ్రాసి ముందుతరాలవారిని, వారి దయ వచ్చినట్లు సిద్ధాంతం చేసుకో నిచ్చేవాడనే. కాని ఇది ప్రత్యక్ష ఫలాల నిచ్చేశాస్త్రము. అందు వలన ఇప్పటి కిప్పుడే అనుభవములో పెట్టిన విషయాలను ఇప్పుడు వెల్లడించుచున్నాను. అందువలన తన తోడిమానవు లకు నేను బోధించిన సిద్ధాంతముల ప్రయోగించి ప్రత్యక్ష ఫలాలను చూపిస్తే "అతడేదో చెప్పినాడు. అవి సరిగా ఫలాల నివ్వడం లేదు. అతను కువైద్యుడు'' అను నిందతో నేను చని పోకుండా తప్పుతుంది. అందువల్లనే రోగులుగా నున్నవారికి ప్రత్యక్షముగా నా సిద్ధాంతాల ప్రకారం చికిత్స చేసి రోగాలు నివారించి ఋజువు చేస్తూ బోధిస్తూ వ్యాప్తి చేస్తున్నాను. ప్రతి వారికి ప్రతి రోగిని తీసుకువచ్చి చూపించడం సాధ్యంకాదు. నా శక్తి కొలది నేను కనుగొనిన విషయాలను వెల్లడిచేయుటకు ప్రయత్నం

చికిత్సా విధానములో సత్యమున్నదని నాకు గట్టివిశ్వాస మేర్పడినది.

ఇంతలో నా వ్యాధి తిరిగి ఎక్కువైనది. నా తల్లితండ్రులనుండి నాకు సంక్రమించిన వ్యాధులు, అందుకు మందు వైద్యులు వాడిన మందులు, వీనితో నా దేహము రోగగ్రస్తమైనది. అది నానాటికి చెడిపోతూ వచ్చినది. ఆబాధలు నేను కష్టపడి భరింపలేకపోతిని. నా జీర్ణకోశములో [illegible]ది. నా ఊపిరితిత్తులు కొంతవరకు చెడినవి. తలలో ఉండే నరాలు ఉద్రేకం పొందేవి. అరుబైట చల్లగాలిలో నిలిచిపోతే కొంతఉపశాంతి కలిగేది. సరియగునిద్ర పట్టేదికాదు. పనిజేసే ఓపిక లేదు. బాగాలావుగా బుగ్గలుబూరలల్లే ఉబ్బిఉండేవి. అప్పటికి అసలులోఉండే ప్రకృతివైద్యాని చక్కటిశ్రద్ధతో జేసేవాడను. స్నానాలు, కట్లు, ఎనిమాలు, ధారాస్నానాలు, మొదలైనవన్నీ చేసేవాడను. కొంతబాధ మాత్రం తగ్గింది. మిగతా దేమీ తగ్గలేదు. స్వేచ్ఛతో కూడిన ప్రకృతిలో జంతువులను చూస్తూ ఉండటంచేత నేనిందు వ్యాప్తి చేస్తూఉన్న ప్రకృతివైద్య విధానానికి మూలసూత్రముల కనుగొనినాను. ఆసిద్ధాంతాలమీద ఒకచికిత్సా విధానాన్ని, ఏర్పాటు చేసుకొని అందుకు తగిన ఉపకరణముల నేర్పరుచుకొనినాను. స్వవిషయంలో, చికిత్స ప్రారంభించినను నాపరిశోధన ఫలించినది. నానాటికి నాఆరోగ్యము వృద్ధిపొందినది. నాసలహా ననుసరించి యీచికిత్సావిధానము నవలంబించినవారుకూడా సంతృప్తులగుచుండిరి. నేను కనిపెట్టిన ఉపకరణములు వారికి బాగుగా ఉపయోగించినవి.

ముఖము చూచి, నిదానము చేయడంలో, ఇదివరకు ఏ ఏ రోగాలువచ్చినవో యిప్పుడున్న రోగాలేమిటో చికిత్సజేస్తే ఏ ఏ స్వాస్థ్యసంకేతాలు కలుగుతవో నేను చెప్పినట్లుగా జరుగుతూ ఉండేవి అందువలన, నేనుకనిపెట్టిన విషయాలయందు నా విశ్వాసము ఎక్కువైంది. నేను ఆత్మవంచన చేసుకోవడంలేదని రూఢిఅయినది. కాని నేనీవిషయాలనుగురించి చెప్పినపుడల్లా ప్రజలు ఆశ్చర్యపొయ్యేవారు. నమ్మేవారు కాదు, కొందరు తూష్ణీంభావంలో ఉండేవారు. కొందరు చీదరించి నిరాకరించేవారు. ఇట్లాచేసేది మందువైద్యులేకాదు. పాతప్రకృతివైద్యుల అనుయాయులుకూడా నమ్మలేకపోయినారు. ప్రకృతివైద్యులమని అనుకొనేవారుకూడా నాసిద్ధాంతములు నిరాకరంచేవారు. రోగుల క్షేమముకొరకై నేనుకనుగొనిన ఉపకరణములను ఉచితముగా తీసుకుని వాడి, చూడవలసినదని అప్పటి ప్రకృతివైద్యులలో కొంతమందిని కోరితిని. వారు వానిని తీసుకుని వాడక, పనికిమాలిన వానికింద, ఒకమూలగాపారవేశారు. రోగము ఏలా కలిగేది, దానికి ఏమిచేసే నయమయ్యేది తెలుసుకున్నాను. అందు కనుగుణ్యంగా, రోగులకు చికిత్సజేయుటకు ఉపకరణముల కనుగొన్నాను. ఒక నిదానశాస్త్రము కనిపెట్టి దానిద్వారా రోగముయొక్క భూత భవిష్యత్ వర్తమానముల తెలుసుకొన్నాను. నా విషయంలో చికిత్సచేసికొని వ్యాధి కుదుర్చుకొన్నాను. నా బంధుమిత్రులకు ఇదేచికిత్సజేసి రోగాలు నయము జేసినాను. నన్నెరుగున్నవారు ఎంతోమంది యీచికిత్సజేసి లాభాలు పొందినారు. అప్పటికీ యీ వైద్యము వ్యాప్తి

కాలేసు. అందువల్ల ఈ వైద్యాన్నిగురించి బోధించి కుదరని రోగాల కుదిర్చి అప్పటివరకు అమలులోఉన్న అలోపతీ వైద్యము, హోమియోపతీ వైద్యము, ప్రకృతి వైద్యములకంటె నా విధానము ఉత్కృష్టమైనదని, ప్రజలకు చూపదలచినాను. సహజనియమాలపై ఆధారపడి, సత్వరముగా రోగనివారణ చేయగలిగిన విధానము, నావిధానమేనని ప్రజలందరికి అప్పుడేనమ్మకము ఏర్పడుతుంది. ఈ పనిచేయడానికి నేనుచాలా కష్టపడవలసి వచ్చింది. ఈ విధంగా నేను చికిత్సా విధానంలో పరిశోధన చేసే ప్రతి సంవత్సరములనుండి, జయప్రదంగా పనిచేస్తున్న ఫ్యాక్టరీ కట్టివేయవలసి వచ్చింది. దీనివల్ల నాకు చాలా నష్టమైనది అంతే కాకుండా ధనకష్టంకూడా వచ్చింది. ఈ ఫ్యాక్టరీని కట్టివేయకుండానే కాలక్షేపం చేశాను. చివరకు నా అంతరాత్మ బోధనచేత నష్టభయమును వదలుకొని ఫ్యాక్టరీ మూసివేశాను. 188 సంవత్సరం అక్టోబరు 10 వ తారీఖున నా ప్రకృతిచికిత్సాలయం తెరిచినాను నా అంతరాత్మ జయించినది. నేను ఏమనుకున్నానో అదే జరిగింది. మొదట కొన్ని సంవత్సరాలుదాకా నా చికిత్సాలయానికి ఎవరూరాలేదు. ఒకరిద్దరికి చికిత్సలుచేస్తే అవి అద్భుతముగా నయమయ్యేవి. దీనితో కొంచెం ఆసక్తి కలిగింది. రోగులు నెమ్మదినెమ్మదిగా రా నారంభించినారు. మొదట్లో స్నానంకొరకై వచ్చేవారు. తర్వాత రోగనివారణకొరకు వచ్చేవారు. కాలంగడచినకొద్దీ, ప్రజాదరణ ఎక్కువైనది. ఇతరపట్టణాలనుండివచ్చి, చికిత్సలో లాభముపొందినవారు వైద్యప్రచారకులుగాను మనకు ప్రతినిధులుగాను తయారయ్యేవారు. నేను

కనిపెట్టిన ముఖనిదానచికిత్సా శాస్త్రములవలన వేలాదిజనులకు రోగనివారణ అయినది, ఎంతోమందికి ముందు రాబోయే రోగాన్నిగురించి నేనుకనిపెట్టి చెప్పినందువల్ల వారు దుర్భర వ్యాధుల బారిపడకుండా ముందుగా కాపాడుకొన్నారు. వచ్చిన రోగాలనునయముచేయుడంకంటే, రాబోయేరోగాలను రాకుండా కాపాడుకోవడమే ఎక్కువమంచిది. అందువలన ఆరోగ్యవంతమైన జాతితయారు అవుతుంది. ప్రతివిషయములోనూ నేను కనిపెట్టిన సిద్ధాంతాలు ఒప్పులని రుజువైనది. ఈ ఎనిమిదివత్సరాలలోను నాఅనుభవముకూడా ఎంతోవృద్ధిపొందినది. పూర్వం ఏదో మామూలుగా ఉండే నాఆరోగ్యం ఈ 8 ఏండ్లు ప్రకృతిసిద్ధాంతములజాగ్రత్తగా అనుసరించుటవల్ల ఎంతోమేలుకలిగింది. అందువలన ఈప్రకృతిచికిత్సాపద్ధతిలో నాకు కావలసినంతబలము, ఓపిక, ఉత్సాహము ఉంటూవచ్చినవి. చిరకాలము ఆలోచించి తర్కించి లింగస్నానమనేదానిని, కొత్తపద్ధతిగా చేయుడం కనిపెట్టినాను. ఈపద్ధతివలన ప్రతిరోగాన్ని నయముచేయుడం సాధ్యమవుతుందని నేనిప్పుడు సంశయములేకుండా చెప్పగలను. లింగస్నానం అంత ఉపయోగకరమైనది. నా విధానములో అన్నిరోగాలు నయము చేయగలనుగాని అదివరకే వారిదేహములు దిగజారిల్లి ఉన్నపుడును, అదివరకే చిరకాలము వాడిన మందులవలన దేహమునందు మందువిషం చేరియుండి ఆవిషాన్ని వెలువరించేటందుకు దేహానికి శక్తిలోపించియున్నపుడు నా చికిత్సాపద్ధతి వలన తాత్కాలిక బాధలుతగ్గి కొంతవరకే రోగం నయమవుతుందిగాని, పరిపూర్ణ ఆరోగ్యం కలుగదు. అందువలన అట్టిరోగులకు రోగనివారణ అవుతుందని నేనుచెప్ప

లేను. నేను ఒకటి సంతోషముగా, ధైర్యముగా, చెప్పగలను. 25 సంవత్సరాలు నా దేహం భౌతికంగా ఎంతో సాధన తర్వాత ఈ విధానంతో నన్ను నేను రక్షించుకొనినాను. ఇదే సమయములో ప్రజలకు మేలు జరిగేటందుకు ఒక సత్యమైన నూతన చికిత్సా విధానాన్ని కనుగొనినాను. ఎంతోమంది ఇట్టి విధానం కనుగొనేటందుకు ప్రయత్నించి విఫలులైనారు. ఇకంతా బడాయికై నే చెప్తూ ఉన్నానని అనుకోవచ్చు. ఎంతో మందికి మేలు జరిగింది. గడిచిపోయిన విషయాల్లో కూడా నేను కనిపెట్టిన సిద్ధాంతాలలో లోటు ఏమాత్రము లేదని తేలినది. నేనీ సిద్ధాంతాన్ని స్వయముగా పరిశోధనలు చేసి, కష్టించి తెలుసుకున్నాను. నేను రోగులకు వైద్యము చేయుటకు అవసరమగు విద్యను ఏ కాలేజీలలోను చదువుకోలేదు. అందువలన నన్ను ఎవరైనను కువైద్యుడని పిలువవచ్చును. శాంతముగను, సమభావముతోను ఈ నిందను ఓర్చుకుంటాను. ఏమనిన, మానవాభ్యుదయము నకై పాటుపడిన విజ్ఞానవేత్తలందఱును ఇట్టి నిందను భరించినవారే. ప్రకృతివైద్యమును మొదట కనుగొన్న ప్రీస్నిట్జ్ కర్షకుడు. స్క్రాత్ దైవభక్తుడు. ఫాంక్ ఆరణ్యకుడు. ఇతడే జె. హెచ్. రాసే. హాక్ అనే వైద్యుడు. వీరు బాగుగా ఆలోచించి పట్టుదలతో ఈ వైద్యమును నానాటికి వృద్ధిచేస్తూ వచ్చారు. నేను ఆతరగతిలోవాడను. అందువలన నాకు నిందాభయములులేవు. అలోపతి, హోమియోపతి వైద్యాలతోనూ, పాతప్రకృతి వైద్యముతోనూ నా నూతన వైద్యవిధానమును పోల్చి చూద్దాము.

ఇప్పుడు వాడుకయందున్న చికిత్సా విధానములలో ఉన్న లోపములను తెలిపెదను. అవి యెందుకు రోగములను కుదుర్ప లేక పోవుచున్నవో చూపెదను. అయితే ఆ విధానములను నిందించుట కొరకుగాక, ప్రజలకు మేలు కలుగుటకు ఆ విధానములయొక్క అంతర్యములు బోధించుట కవసరమైనంతవరకే విమర్శించెదను. తరువాత ఎవరు ఎంతవరకు అర్థముచేసుకో గలిగితే, ఎంతవరకు నమ్మగలిగితే, అంతవరకే నమ్మవచ్చును. తరువాత ఎవరి యిష్టము వచ్చినపద్ధతి వారవలంబింప వచ్చును.

అల్లోపతి వైద్యము :— ప్రకృతి వైద్యమునకును, దీనికిని నిదానములోను, చికిత్సా విధానములోను ప్రత్యక్షముగా విరోధ స్వభావమున్నది. రోగులకు వారిచ్చే విషపు మందులవలననే మానవజాతిలో పరిపూర్ణ ఆరోగ్యవంతులు అరుదై పోయినారు. వారి మందులవలననే నానాటికి కాలిక వ్యాధులు భయంకరముగా నిరంతరాభివృద్ధి నందుచున్నవి. ప్రకృతి చికిత్సావిధానపు వాడుక వలన శస్త్ర చికిత్సతో పనియే లేకుండా పోయినది.

హోమియోపతి :— మందు వైద్యముయొక్క అనర్థకతను వెల్లడించునది గనుక ధైర్యముగల స్నేహితునిగా హోమియోపతిని, ఆహ్వానింతును. పథ్య నియమములవలన రసాయన వేత్తయైనను కనిపెట్టజాలని సూక్ష్మమైన మందులవాడుక వలనను వారు రోగముల నయము చేయుచున్నారు. మందు వైద్యము నుండి మరలుటకును, ప్రకృతి వైద్యములో ప్రవేశించుటకును మధ్య మార్గముగా దీనిని స్వీకరింపవచ్చును. అయితే వారు పథ్యము నిర్ణయించుటలో ఒక విధానము నవలంబించుట లేదు.

అంతేగాక వారు వాడేమందులు ఎంత సూక్ష్మస్వభావము గల వైనను మంచివే. ఇవికూడా ఏమాత్రమైనా అపకారము చేయకుండా మానవు.

**పాత ప్రకృతి వైద్యము:—** ఇదివరకు చెప్పిన చికిత్సా విధానాలన్నిటికీ ఇది పెద్దది. మందులతోనూ శస్త్రములతోను. ఈ వైద్యమునకు పనిలేదు. ఈ వైద్యముయొక్క ప్రాతిపదికమీదనే, నేడు నవీన వైద్యవిధాన మేర్పడియున్నది ఈ వైద్యవిధానంలో ప్రారంభకులుగా నున్న ప్రిస్నిట్జ్, ష్రాత్, రాస్సే, తియోడర్‌హాన్ అనువారి పద్ధతులనే అనుసరించి పోవుచున్నారు. ఈ దేశాల్లో ఎవరో ప్రకృతి వైద్యాభ్యాసకులు ఉన్నారు. వైద్యులు ఉన్నారు. కాని వారిని సూచించటానికి నాకు ఇష్టము లేదు. నాకు ఖ్యాతికొరకై ప్రకృతిమతులనెట్ల ప్రకృతి వైద్యాన్నినడపి ప్రకృతి వైద్యానికుండే సహజత్వాన్ని పోగొట్టినారు. రోగపదార్థముయొక్క స్వభావం అది ఏయేకారణములచేత వివిధ ప్రదేశాలలో ప్రవేశిస్తుందో, వివిధవ్యాధుల గల్గిస్తుందో, వివిధరూపాంతరము పొందుతుందో పూర్వపు ప్రకృతివైద్యవిధానంలో ఎక్కడా పేర్కొ లేదు. రోగానికి మూలకారణమేమిటో వివిధ రోగాలకు ఆ మూలకారణము ఎట్లా కారణమగుచున్నదో ఆ వైద్యమునందు వివరము లేదు. ఇంతవరకు ఇతరులకు ఎరుకపడక నేను కనిపెట్టిన సిద్ధాంతాలకు మూలసూత్రములయిన ప్రకృతినియమాలుకూడా ఆ వైద్యమువారికి తెలియవు. వారు ఒక రోగానికి నిదానము చేయాలంటే ఆలోపతీ వైద్యుల సహాయం కావలసి వచ్చేది. ఆరోగ్య నియమాలను ఆధారం

చేసుకుని చేసే చికిత్సలో అసలు ఈ నిదానాలతో పనిలేదు. ఇనప్పటికీ వారు అలోపతీవైద్యుల సహా నిదానంచేయడానికి తీసుకునేవారు. నేను కనిపెట్టిన తొట్టివైద్యమునకు చేసే నిదానమే వేరు. రోగముయొక్క నిజస్వభావము నుబట్టి యీనిదానశాస్త్ర మేర్పడినది. రోగియొక్క ముఖము, మెడ, చూచి రోగము ఏదశలో ఉన్నదో మనము కనుగొనగలము. దీనికే ముఖనిదానమని పేరు.

పాత ప్రకృతి వైద్యము లో నీటిని అనేకవిధాలుగా ఉపయోగించి రోగనివారణచేసే పద్ధతులు ఉన్నవి. కట్లు, ఎనిమాలు, ధారాస్నానాలు, జల్లుస్నానాలు, ఉర్ధ్వాంగస్నానాలు, పూర్ణాంగస్నానాలు, కటిస్నానాలు, ఆవిరిస్నానాలు, అందు వివరింపబడియున్నవి. రోగముయొక్క నిజస్వభావము తెలిసినతర్వాత మనకిన్ని చికిత్సాప్రక్రియలతో పనిలేదు. మన వైద్యములో జలచికిత్సాప్రక్రియ యొక్క సంఖ్యను తగ్గించితిని. పూర్వపు ప్రకృతి వైద్యము లో, పథ్యము జాగ్రతగా నియమించరు. కొంతమాంసాహారముకూడా పథ్యంతోపాటు ఇచ్చేవారు. గట్టినూత్రాలతో సంబంధములేకుండా, రోగియొక్క ఇష్టానిష్టముల ననుసరించి పథ్యము ఏర్పర్చేవారు. ఈతొట్టివైద్యశాస్త్రములో సహజమైన ప్రకృతి సూత్రాలమీద ఆధారంచేసి నిర్దుష్టమైన స్పష్టమైన నిర్వచనంచేసితిని. ఆ నిర్వచనప్రకారము ఉద్రేకం గల్గింపని, నవ జనాహారాన్ని ఏర్పాటు చేసితిని. పాతప్రకృతివైద్యము నుండి ఈవిధంగా మార్పుపొందిన ఈ తొట్టివైద్యము అత్యద్భుతంగా పనిచేసింది. అందువల్లనే ఈవిధానానికి నవీనప్రకృతి

వైద్యమనియు, నవీన చికిత్సావిధానమని కూడా పేర్లుపెట్టితిని. ఇందులో మందులతోనూ, శస్త్రములతోను, ఇంజక్షనులతోను పనిలేదు. ఈవిధానం కనిపెట్టేలోపల, నేనుచేసిన ప్రయోగాలన్ని యిచట వివరముగా వర్ణింపజాలను. అయితే వాటియొక్క చరిత్ర వినుటకు కొంతమంది అభిలషిస్తారు. అయితే దానివల్ల ఏమీ లాభము లేదు. సరియైనదోవ కనపడేలోపల నేను త్రొక్కిన తప్పుదోవలన్నీ త్రొక్కకుండా ఉండేటందుకు కొంతవరకు ఉపయోగించవచ్చు.

## ౨. ఆరోగ్యము - అనారోగ్యము

ఇప్పటివారి అభిప్రాయములు ఈ విషయంలో వేరు వేరుగా నున్నవి మనము తరచుగా వింటూనే ఉంటాము. ఒక డంటాడూ:- నేను బాగా ఆరోగ్యంగానే యున్నాననియు నన్ను మేహ వాతపు నొప్పులు బాధిస్తున్నవి అని. మరొకడంటాడూ:- నాకు ఆరోగ్యం బాగానే ఉన్నదిగాని, కొద్దిగా నాతులు దుర్బలములుగా నున్నవని. దేహము అనేక తుంపులయొక్క కలియక అని, అందులో ఒకతుంపు రోగంగానున్నా మిగతా అన్నితుంపులూ ఆరోగ్యంగా ఉండవచ్చునని వారినమ్మిక. వానిలో అన్యోన్యంగా సంబంధం ఉన్నదని వారికి తెలియదు.

ఇది సామాన్యుల అభిప్రాయంకాదు. బాగా చదువుకున్న వైద్య శాస్త్రవేత్తలయొక్క అభిప్రాయము. వారు ఏ అవయవములో బాధఉంటే ఆ యవయవానికి చికిత్సజేస్తారు. దాని ప్రక్కనున్న అవయవంతో కూడా వారికి సంబంధంలేదు. నిజ మేమనగా

దేహమంతా ఒకసమిష్టిపదార్థము. అందులో అన్యోన్యముగా అవయవాలన్నీ కలిసియే పనిజేస్తూఉంటవి. దేహంలో ఒక భాగం రోగగ్రస్తమయింది అంటే, తదనుగుణంగా మిగతా భాగాలు రోగగ్రస్తము గాక మానవు. ఇది సత్యము మన పరిశోధనలో కనపడే విషయము. పంటినొప్పి వచ్చినదనుకోండి. అపుడు ఏపనీ చేయడానికి ఇష్టముండదు. ఆహారపానీయాలు కూడా రుచింపవు. వేలులో ఒక పేడు దిగబడిందనుకోండి. అపుడూ ఆహారపానీయాలు రుచింపవు. పనిచేయుటకు ఇష్టముండదు. కడుపులో నొప్పి వచ్చినపుడు ఏపనీ చేయలేము, ఆలోచించలేము. మొదట ఒకచోటి బాధను రెండవచోటికి నాడులు చేరవేస్తవి. ఇదే చిరకాలం జరిగిందంటే, మనకు కనుపడినా, కనుపించక పోయినా ఆబాధవల్లకలిగే ఫలంకూడా నిలబడి పోతుంది. అందువల్ల ఒకదేహం ఆరోగ్యంగా ఉండాలంటే అందులోఉండే అవయవాలల్లో వేనిలోను బాధ ఉండరాదు. పీడన, ఉండకూడదు. ఒత్తిడి ఉండరాదు. అంతేగాకుండా, ఆ యా యవయవాలు తిన్నగా పనిచేయడానికి ఏ యే అవయవము ఎంతెంత పొడుగు వెడల్పు లావు ఉండాలో ఎక్కువ తక్కువలు లేక అంతేఉండి దేహంలో ఏభాగంలో అవి యిమిడి ఉండాలో ఎంతచోటులో అవి ఒదిగి ఉండాలో అంతే పరిమాణంలో ఉన్నపుడు దేహంలో ఆరోగ్యం ఉంటుంది. అపుడే సౌందర్యము ఉంటుంది, దేహము పైభాగములో, రూపములో, ఎక్కడనైనా అమితత్వముంటే అది స్పష్టమైన కారణాలవల్ల వస్తుంది. సహజమైన రూపమేదో మనకు తెలియాలంటే నిరంతర పరిశీలన అవసరం. మొదట కొంతమంది ఆరోగ్యవంతులను

చూచి వారిని పరిశీలింప నారంభించితే సహజమైన ఆరోగ్యమేదో మనకు తెలుస్తుంది. నిజానికి పరిపూర్ణ ఆరోగ్యవంతులే మనకూ ఎక్కడా కనుపించడంలేదు. మనము, బాగా బలంగాను ఆరోగ్యంగాను ఉన్నారని, ఎవరిని అనుకొనుచున్నామో, తమకు ఆరోగ్యం బలము ఉన్నదని ఎవరు మనకు చెప్పుచున్నారో, అట్టి వారికిగూడా ఎక్కడో నొప్పి-అపుడపుడు తలనొప్పి-వంటి పోటో గలదనే మనకు తెలుస్తుంది. దీనివలన మనకు పరిపూర్ణ ఆరోగ్యవంతులు లేరని తేలిపోయినది. సహజమైన ఆరోగ్యవంతుని రూపము తెలుసుకునే టందుకు, మనం ఎంతో పరిశీలన చేయవలసియున్నది. ఏదోమోస్తరు ఆరోగ్యవంతులను, రోగం వచ్చినవారిని, దగ్గిరగా నిలుచుండబెట్టి చూస్తే వారిలో వారి రూపాలలో ఉండే తేడాలు గుర్తుంచుకుంటుంటే పరిపూర్ణఆరోగ్యవంతులెవరో మనకు తెలియును. రోగమువలన దేహరూపములో మార్పులు వస్తాయని చెప్పాను. ఈవిషయము తెలియడానికి మనకుగురుచు తెలిపించే కొన్ని విషయాలను చెప్తాను, దేహమంతా లావుగానుండే ఒకరినితీసుకోండి సన్నగాఉండే యింకొకరిని తీసుకోండి. ఇద్దరి దేహములు ఆరోగ్యవంతములుకావు. రెండూ రోగలక్షణములే. ఒకనికి అకాలంలో పళ్ళురాలిపోయినవి. వానిముఖసౌందర్యము చెడిపోయినది. ఒకనికి మేహవాతపు నొప్పులు; దేహమునందలి సంధులన్నియు ఉబ్బిఉంటవి. వీని అన్నిటియందును రోగపదార్థము పేరుకొనియుంటుంది. ఈసంగతి మన వైద్యములో ప్రారంభకులుగా ఉండేవారికి, కూడా కనపడుతుంది. ఐతే మిగతా వ్యాధులలో రూపమునందలి మార్పులు కంటికంత తేలికగా తెలియవు. అయినను అవికూడా తెలిసికొనేటందుకు

ఉపాయమున్నది. ఆరోగ్యవంతునిచూపు చాంచల్యములేక, నిర్మలముగను, శాంతముగను ఉంటును. అయితే యీ విషయములను తెలిసికొనేటందుకు ఒకరికుండే సామర్థ్యముకంటె, మరొకరికి ఎక్కువతక్కువలుగా నుంటుంది. అందుచే సామాన్యులకు కంటిలో ఉండే తేడా కనిపెట్టడం అసాధ్యముగా ఉంటుంది. మనము తరచు వింటూనేఉంటాము.నీలోచాలా మార్పువచ్చిందే అని. ఆవచ్చినమార్పు ఎటువంటిదో, అదిఎందువల్ల వచ్చిందో అతడు వివరింపలేకపోయినా అతనికి తెలుస్తుంది. రోగం ఎక్కువైనకొద్దీ, దేహంయొక్క సౌందర్యముకూడా తగ్గిపోతుంది. ఈ విషయాలనుబట్టి మనకేమి తెలియుచున్నది? దేహము యొక్క రూపమునందలి మార్పులవలన ఉండుండేరోగాలను కనిపెట్టవచ్చును ఆమార్పులు తలలోను కంఠంలోను ఎక్కువగా గన్పడుతవి. ఈరూప భేదాలనుగురించి దేహము లోపలనుండే రోగముయొక్క తేడాలను గుర్తించవచ్చు.

ఇది ప్రతివారికి సాధ్యమవుతుందో లేదో నేను నిజముగా చెప్పజాలను. నిరంతరపరిశీలన, ఓర్పుతోగూడిన పరిశోధన ఈ రూపభేదాలను గుర్తుపట్టటానికి అవుసరం. ఈ విషయంలో ఇంకా లోతుగా తెలుసుకోదలచిన వారు నేను రచియించిన ముఖ నిదానశాస్త్రము చదువవచ్చును. ఇపుడు ఆరోగ్యం అంటే ఏమిటో తెలిసికొనేటందుకు ఇంకొక ఉపాయంకూడా చెప్తాను. రోగం వచ్చినపుడు అవయవా లన్నిటిలోను, నడక చెడి యుంటుంది. అందువల్ల ఏ అవయవము తిన్నగాపనిచేయక పోయినా దేహము రోగగ్రస్తమయినదని మనం చెప్పవచ్చు.

ఏదో ఒక అవయవము తీసుకుని అది తిన్నగా పనిచేస్తుందో లేదో చూస్తే మనం ఆరోగ్యం ఉంకీ లేనికీ చెప్పవచ్చు. ఇలా పరీక్ష చేయడానికి బాగా వీలుగా ఉండేవి జీర్ణావయవాలు. జీర్ణ క్రియ బాగా ఉంటే ఆరోగ్యం బాగా ఉన్నట్లు గురు. ఎప్పుడో ఒకరోజుగాకుండా నిరంతరం జీర్ణ యంత్రం బాగా పనిచేయుచూ ఉంటే మనం పరిపూర్ణారోగ్యవంతులమని నమ్మవచ్చు. జంతువులను చూచినపుడు మనము సులభంగా ఈ విషయాన్ని తెలిసికోవచ్చు జీర్ణ క్రియకు పర్యవసానంగా వచ్చే మలం ఎలాఉందో తెలిస్తే జీర్ణ క్రియ ఎలాజరిగింది మనం చెప్పవచ్చు. మలమోచన మైనపుడు జంతువులకు ఆ మలము ఆసనమున కంటుకోనకుండా బైటికి వస్తుంది ఆ విధంగానే మనకు కూడా మలమోచన మైనపుడు ఆసనమునకు అంటక బైటికి రావలెను. పశువులు, పక్షులు, సహజస్థితిలో నుండి మలమోచనం చేసినపుడు ఇలాగే జరుగుతుంది. అసహ్యముగాజూడబడే మలమునుగురించి నే నింత స్పష్టముగా చెప్పినందుకు నన్ను క్షమించ వలసినది.

రోగారోగ్యములగూర్చి చెప్పేటప్పుడు మనము అన్నివిషయాలనుగూర్చి పరామర్శచేయుక తప్పదు. మలము సరైనరూపం లోనూ పరిమితిలోనూ దేహమునుండి వెడలిపోయేటపుడు ఎట్టి బాధాకలుగకుండాను, ఆసనానికి మలము అంటకుండాను, ఉండునట్లుగా, మలకోశము నిర్మింపబడి యున్నది. దీనినిబట్టి తనకు ఆరోగ్యం ఉన్నదో లేదో ప్రతివాడు తెలుసుకోవచ్చు. ఈఒక్కలక్షణము ఎవరికి తిన్నగాఉంటుందో అతడు ఆరోగ్య

వంతుడని చెప్పవచ్చు. అతనికి మనస్సులో ఏవిధమైన బాధలూ ఉండవు. దేహబాధలు ఉండవు. బైటినుంచి వచ్చే కారణాలవల్ల వచ్చే బాధలు ఇందులో చేరవు. తనకు ఒక దేహము కలదను నమ్మకే అతని కుండదు.

పని చేయుడంలోనే అతనికి ఇష్టము. ఉల్లాసము ఉంటుంది. విశ్రాంతిలో అతనికి సౌఖ్యం కనుపడుతుంది. మానసికమైన వడిదుడుకులను అతడు సులభంగా భరిస్తాడు. ఆపుల మృతి మొదలగు వాని వలన గల్గే మానసిక తాపాలు కూడా కంటి వెంట నీరు కార్చుటతో తగ్గిపోవును. ఆరోగ్యవంతుడు కుటుంబములో వచ్చే బాధ్యతలను, వడిదుడుకులను సరిచేసుకొంటాడు. ప్రేమపాత్రులైన తనకుటుంబంలోని వారిని భరింపటానికి, ఎప్పుడూ సిద్ధంగా ఉంటాడు. భరింపగలననే విశ్వాసం ఉంటుంది. ఆరోగ్యవంతురాలయిన తల్లి కూడా సహజంగానే తనబిడ్డలను భరించుకోగల్గుతుంది. వారు కూడా ఆరోగ్యవంతులుగా ఉంటే అటువంటి కుటుంబము యొక్క ఆనందం వర్ణింపతరము కాదు. వారిముఖాలు ఎప్పుడూ నవ్వుతో కళకళలాడుతూ ఉంటవి. వారికి చికాకు, చీదర, చిరాకులు వుండవు. గొణుగుడు, సణుగుట, ఏడ్పుటా ఉండదు. అట్టి వారికి చదువు చెప్ప వలసివచ్చినా ఉపాధ్యాయులకు వారు అనువర్తులుగా ఉండి సులభంగా విద్య గ్రహిస్తారు.

ప్రకృతిమీద ఉండే ప్రేమవల్ల శాస్త్రాన్ని అభ్యసించాను. తీవ్రమైన వ్యాధి మందు వైద్యులతోడి అనుభవము వలన ప్రకృతి వైద్యము వంకకు వచ్చాను. తీవ్రమైన నా వ్యాధికి పాత ప్రకృతి

వైద్యవిధానాలు చేయవలసినంత మేలు చేయకపోతే క్రొత్త పరిశోధనలు చేయవలసివచ్చింది. జీవజంతువుల నిరంతరముగా పరిశీలించుచుండుటవలన రోగంవచ్చినపుడు దేహంమీద కలిగే మార్పులు నేను గుర్తుపట్టితిని. రోగంవచ్చినపుడు దేహం మీదకలిగే మార్పులవలన రోగం అంటే ఏమిటో అది ఎందు కొస్తుందో నాకు తెలిసినది.

## 3. రోగమెట్లు గల్గును?

రోగమన నేమి? అది ఎట్లుకల్గుచున్నది? ఏరూపమును పొందు చున్నది? ఈ ప్రశ్నలను ఈ అధ్యాయంలో వివరించెదను. దీనితర్వాత జ్వరమన నేమి? అన్నిటికికలిపి ఒక టేజవాబు చెప్ప బోవుచున్నాను. ఈ ప్రశ్నలు సిద్ధాంతరీత్యానే గాకుండా చికిత్స జేయుటంలోకూడా చాలా అవుసరంగా జవాబుచెప్పవల సినవి. రోగం అననేమో మనకు పూర్తిగాను స్పష్టముగాను తెలిసేనేతప్ప ఒకరోగానికైనా సరియైన చికిత్స మనం చేయ జాలము. ఈ లోగా చికిత్సజేయజూచుట చీకటిలో తవ్వులా టయ్యే. ఇప్పుడు మనం అవలంబింపబోయ్యే పద్ధతి అన్ని ప్రకృతి సూత్రాలను తెలిసి చికిత్సచేయబోవుచున్నాము. మనం పరిశీ లించిన విషయాలలోనుండి తేలిన పర్యవసానముతో ఆరంభిం చుచున్నాము. కావలెనన్న వారికి ప్రయోగంచేసి మనసిద్ధాంతం యొక్క సత్యాన్ని రుజువుచేసాము. మొదట రోగు లందరి లోను సామాన్యముగా నుండే లక్షణాలను పరిశీలించడం

తర్వాత ఆ పరిశీలించిన లక్షణాలు ప్రతిరోగిలోను తర్చుగా ఉంటూ ఉన్నాయేమో చూద్దాము. ఈ లక్షణాలు చాలా ప్రధానములు. వీటిని ఆధారముచేసుకుని రోగముయొక్క నిజ స్వభావము తెలిసికొనే ప్రయత్నం చేద్దాము.
క్రిందటి ప్రకరణంలో అన్నిరోగాలలోను దేహంయొక్క రూపంలో మార్పులు వస్తాయని వ్రాశాను. ఆలక్షణాలు స్పష్టముగా తెలుస్తవని వ్రాశాను. అవే లక్షణాలు ఇతర రోగుల్లో కూడా కనపడుతున్నవేమో నేను పరిశీలించడం ఆరంభించాను. చూడగా చూడగా ఈ లక్షణాలే ప్రతిరోగియొక్క ముఖము లోను కనుపడినవి. అందువలన, ముఖము కంఠముచూస్తే మనం రోగముయొక్క నిజస్థితిని తెలిసికొనేటందుకు వీలవుతుంది. కొందరిలో నేను అకస్మాత్తుగా చూచిన లక్షణాలు మిగతా వారిలోకూడా కనుపడునేమోనని సంవత్సరాలకొలదీ పరిశీలనలు చేసినాను. ప్రతిమార్పులోను దేహములోని ఆరోగ్యంకూడా మార్పు పొందుతున్నదేమో కూడా పరిశోధన చేసితిని.
ఇట్లు చేయగా ప్రతిపరిపూర్ణారోగ్యమైన దేహానికి ఒకసహజమైన రూపముంటుందనీ ప్రతిఆరోగ్యవంతుని దేహము ఒకేమాస్తరు లక్షణాలు గల్గియుంటుందనీ, అట్టి సహజమైన రూపానికి, భిన్నంగాఉన్న ప్రతి దేహంలోనూ, తప్పకుండా, రోగముండుంటుం దని నాకు గట్టి విశ్వాసం గలిగినది. ముఖాన్ని కంఠాన్ని చూస్తే దేహముయొక్క ఆరోగ్యమితిని స్పష్టముగ చెప్పవచ్చునని నేను కనుగొన్నాను. ఈ సూత్రాలమీదనే నేనుముఖనిదానశాస్త్రము కనిపెట్టితిని. దీనిని పదిహేను సంవత్సరాలనుండి నావాడుకలో పెట్టి చూస్తున్నాను.

కంఠములోను, ముఖములోను, కిలిగేమార్పులే, ఉదరంలోను, పిరుదులలోను, ఇంకా ఎక్కువగా కనపడుతవి. ఎందువల్లనంటే, రోగపదార్థము మొట్టమొదట, ఉదరంలో ఉత్పత్తియై పైకి వ్యాపిస్తుంది. అందువల్ల ఏయే స్థానాలు, ముఖంలోను, కంఠలోను కన్పడుతాయో అవి యింకా ఎక్కువగా ఉదరములోను, పిరుదులలోను, కనుపడుతవి. అంతేకాదు. ముఖము, కంఠం చూస్తే దేహము యొక్క మొత్తపు స్థితి తెలుస్తుంది. రోగపదార్థం మొదటగా వ్యాపించినప్పుడు, అది కంఠమునందు, ముఖమునందలి, కండరములలోను చిక్కుకొని ముఖాన్ని కంఠాన్ని ఉబ్బునట్లు చేస్తుంది. అందువలన రోగపు ప్రారంభదశలో ముఖము, కంఠము, ఉబ్బికనుపడతుంది. ఈస్థితి అంత ప్రమాదకరమైనది గాదు. తర్వాత మెత్తగా నున్న కండలు గట్టిపడతవి. ఇది రెండవ దశ. ఈదశలో కంఠము అటుఇటు త్రిప్పటానికి వీలు లేనంతగా కంఠమునందలి కండరములు బిగిసిపోతవి. ఇక ఉబ్బటానికి కండరములలో చోటు లేకపోతే కంఠంలోకివచ్చిన రోగపదార్థము కాయలుగను కంతులుగను ఏర్పడును. తలను అటుఇటు త్రిప్పినప్పుడు, కంఠమునందు చేరినకంతులు మొదట చేతికే తెలుస్తవి. తర్వాత కంటికీ కనుపడతవి. ఇటువంటి కణుతులు, కాయలు, శిరస్సునందును, కంఠమునందును, కబంధమునందును, దేహము యొక్క మిగతా భాగములందును, తప్పకుండా ఉన్నాయని మనము నమ్మకముగా చెప్పవచ్చు.

ఇట్టిరోగియొక్క ఉదరమును వత్తిచూస్తే మనకు వివిధ పరిమాణాలలో అట్టికంతులు తప్పకుండా కనుపడుతవి. ఇట్టి కణుతులు ముందే ఉదరములో నేర్పడి తర్వాత కంఠములో ఏర్పడుతవి. ఈకణు

తులు ఎందుకు ఏర్పడునో యింతవరకు ఎవరూవివరించి యుండలేదు. శ్వాసావయవవ్యాధులను గురించి వ్రాసినపుడునేనీ విషయాన్ని వివరముగా తెలియజేస్తాను.

ఇకనన్నని వ్రాయుండు, ఇందుకుభిన్నంగా రోగపదార్థం గడ్డ గట్టి మెలికలుతిరిగి సహజమైన కండరములు స్థానముతిప్పి యుండుట చూస్తూఉన్నాము.

చర్మముమీద సహజమైన రంగు చెడిపోయి ఉండుట చూస్తూ ఉన్నాము. దీనివల్లగూడా దేహంలో రోగమున్నదని మనం నిశ్చయంగా జూచి చెప్పవచ్చు.




1. కూనేవైద్యమునకు పూర్వము. 2. కూనేవైద్యమునకు తరువాత.

ఇచట రెండుబొమ్మలున్నవి. ఇందులో మొదటి బొమ్మ ఒక రోగిది. అతనిది గుండెజబ్బు నంజు. అతడు మన చికిత్స ప్రారంభించినపుడు తీసిన బొమ్మ అది. 4 మాసాలు మన చికిత్సచేసిన పిదప తీసినబొమ్మ రెండవది. ఈ 4 మాసాలలోను ఈచికిత్సతో

అతనిలో కల్గిన మార్పులను ఈ బొమ్మలో చూడవచ్చును. ఆ బొమ్మలలోను తేడా చూచినప్పుడు అతని దేహములోని రోగ పదార్థము ఈ 4 నెలలలోను ఎంతో తగ్గిపోవుట మనకు కను పడును.

ఈ రెండు పటాల్లో నూ డే తేడాను ముఖనిదానము దగ్గరబెట్టుకుని పరిశీలనచేయవలసినది. ఇంతకంటె వివరంగా చెపితే, మనం ఇప్పుడు రాస్తున్న విషయాన్ని వదలి చాలాదూరం పోవలసి వస్తుంది.

అయితే దేహంలో కలిగే రూపభేదాలవలన మనకు రోగస్వభా వం ఏమితెలియును? మొదట ఉబ్బుట, లావగుట దేహంలో ఏదోపదార్థం అదనంగాఉన్నదీ అనిఅర్థం. ఈపదార్థాన్ని దేహ ము ఇముడ్చుకో లేకపోయిందో లేక చేరకూడనిచోట చేరిందో అదీగాకపోతే ఆపదార్థం దేహానికి సంబంధించినదిగాదో ఎవరికీ తెలియదు. అంతేకాదు. ఈ పదార్థమునల్ల వ్యాధివస్తుందో, రోగంవల్లే ఈపదార్థమేర్పడుతుందో కూడా మనకు తెలియదు. శ్రద్ధగా పరిశీలనచేస్తే మనకు సత్యం తెలుస్తుంది. ఈ చేరే పదార్థం దేహంలో ఒకవైపు తక్కువగను చేర నారంభించును. మనం ఏవైపు పరుండుమో, ఆవైపుచే చేరటంకూడా జరుగు తుంది. దేహంలో జేరిన రోగపదార్థము గురుత్వ నియమాను సారంగా మనం ఏవైపున పరుండుమో ఆవైపునే పేరుకొను చున్నది. ఈ వైపున ఉండే అవయవాలే జబ్బుపడుతున్నాయి కూడాను. అందువల్ల ఈ పదార్థమే రోగానికి కారణమని తెలుచున్నది. అట్లుగ కాకపోయినఎడల ఏవైపున ఈరోగపదా

ర్థము పేరుకోలేదో ఆవైపున, ఉండే అవయవాలు రోగగ్రస్త ములు కావలసియున్నవి. అట్లు జరుగుట లేదు గనుక పేరుకున్న రోగపదార్థమే, దేహంలో రోగాన్ని కలిగిస్తున్నదని స్పష్టపడు తున్నది. ఈసిద్ధాంతాన్ని రుజువు చెయ్యటానికి ముందు, ఇంకా కొన్ని ఉదాహరణలు ఇస్తాను.

ఈచేరిన పదార్థము దేహానికి ఉపయోగించేది కాదని, దేహాని కంటె భిన్నమైనదని మనం తీర్మానించు కోనచ్చు. ఆరోగ్య వంతుని దేహంలో ఉండే దేహసంబంధమైన ధాతువులుఅతడు ఏవైపున పడుకున్నా దేహంలో రూపభేదాలను కలిగించడం లేదు.

అందువలన దేహంలోఉండే ఆరోగ్యవంతమైన పదార్థాలు గురుత్వ నియమానికి లోబడవని రోగపదార్థమే గురుత్వ నియ మానికి లోబడుతుందని తేలిపోయింది

దేహంలో ఉండే రోగపదార్థాన్ని దేహమే బైటికి గెంటివేయ ప్రయత్నము చేస్తూ ఉంటుంది. పుండ్లు వ్రణములు లేస్తవి. ఎక్కువగా చెమటపోయవచ్చు. చర్మవ్యాధులు రావచ్చు. ఈ విధంగా దేహము రోగపదార్థాన్ని వెలువరించే ప్రయత్నములు జేస్తుంది. ఈ ప్రయత్నములలో తగినంత రోగపదార్థము వెలువడిపోయిన యెడల, దేహం చాలా తేలికపడి, కులాసాగా ఉంటుంది. ఇప్పుడు రోగంఅంటే ఏమిటో ఆలోచిద్దాము. దేహములో రోగపదార్థము చేరుటయే రోగము. ఈసిద్ధాం తం తప్పో ఒప్పో చూచేటందుకు ఒకనిర్దుష్టపరీక్ష ఉన్నది. మనం దేనిని రోగపదార్థం అంటున్నామో మనము పరి

యైన మార్గముగా వెలువరించి వేసినపుడు రోగబాధలు పోతవి. రూపభేదంకూడా మారి, దేహానికి సహజరూపం వస్తుంది. ఈవిధంగా జరిగినపుడు మనం చేసిన నిర్వచనం సిద్ధాంతం అవుతుంది. సత్యమని రుజువవుతుంది. ఈ పరీక్ష ఇదివరకే చెప్పేను. ఈ గ్రంథం అంతటిలోనూ ఈ విషయాన్నే రుజువు చేయబోవుచున్నాను. ఈ రోగపదార్థపు స్వభావమేమిటో ఆ పదార్థం దేహంలో ఎలాప్రవేశించినదో ఆలోచిద్దాము. దేహంలోనికి ఏ పదార్థమైనా చేరాలంటే రెండుమార్గము లున్నాయి. ఒకటి ముక్కు. రెండు నోరు. ముక్కులోగుండా పోయినపదార్థం ఊపిరితిత్తుల్లోకి పోతుంది. నోటిలోగుండా పోయిన ఆహారపానీయాలు జీర్ణకోశములోనికి పోతవి. ఈరెండు త్రోవల దగ్గర ఇద్దరుకావలివా రున్నారు. ముక్కుదగ్గర ఘ్రాణేంద్రియమును, నోటిలో రసనేంద్రియమును గలవు. ఘ్రాణేంద్రియము గాలిలోనుండే మంచిచెడుగులను పరిశీలించి చెడు గాలి వదలి మంచిగాలినే పీల్చుటకు తోడ్పడవలెను. అట్లే రసనేంద్రియము ఆహారములోని మంచిచెడుగులను విచారించి దేహసంరక్షకములగు పదార్థములనే లోనికి పోనిచ్చి దేహ నాశనకరములైన పదార్థములను లోనికి రానీయక దేహమును కాపాడుచుండవలెను.

మనము ఎంతకాలము సహజనియమాల ననుసరించి జీవింతుమో మనము ఘ్రాణేంద్రియము, రసనేంద్రియము జేసిన హెచ్చరికలను విని అందులకు అనుగుణముగా నడుచుకొందుమో అంత కాలమే యింద్రియములు జాగ్రత్తగా పనిచేస్తవి. అస్వాభావి

రుచులకు మరగి మన మా యింద్రియములు చేయు హెచ్చరికల వినమానినప్పటినుండియు అవి యిక హెచ్చరింప మాని వేయును. అందువలన ఎట్టిగాలియైనను ఎట్టి యాహారపానీయములైనను నిరాటంకముగ మన దేహములలోకి చేర నారంభించు చుండును. పాగాకు పీల్చేచోట కూర్చొని అదేగాలిని పరిశుద్ధ వాయువును పీల్చినట్లుగా ప్రేమతో పీల్చువారిని మనము తరుచు చూస్తూ ఉన్నాము.

మన నాలుక ఇంతకంటెను చెడిపోయినది. ఎంత అసహజమైన ఆహారమైనను నాలుకకు క్రమముగా అలవాటు చేయవచ్చును. ఇపుడు కొన్నిరకాల వంటకములు లేకపోయినయెడల జరుగ దనుకొనుచున్నాము. కొన్నిశతాబ్దములకు పూర్వము వాని పేరైనను మన పూర్వు లెరుగరు. ఇప్పటివారికి ఈ వంటకములు అలవాటు పడినందున వానినే తిందురుగాని సహజమైన ఆహారమును తిన లేకపోవుచున్నారు. జీర్ణకోశంలోకి పొయే ఆహార పదార్థము చెడినంతగా మన ఊపిరితిత్తులలోకి పొయే గాలి అంతగా చెడిపోదు. ఎందువల్ల ననగా నాక్కు గాలినే పీల్చగల్గుతుంది, గాని ద్రవపదార్థములను ఘనపదార్థములను గ్రహింప జాలదు. ఇప్పటికికూడా, నిర్మలమైన చల్లనిగాలియందు మనకు గల ప్రీతిలో మార్పు రాలేదు. కాని మనపెద్దల ఆయురారోగ్యములను వృద్ధిచేసిన అంబలి యిపుడు మనకు తృప్తి నిచ్చుట లేదు.

మన జీర్ణక్రియ మనం తినే యసహజమైన ఆహారములవల్ల ఎంత చెడిపోయినదీ నే నొక ఉదాహరణము ఇస్తాను.

ఒకగుర్రమున్నది. అది ఒక వంద మణుగుల బరువు తేలికగా మోస్తుంది. 160 మణుగులు బరువు వేసి ఆగుర్రాన్ని కొడితే ఆబరువునుకూడా లాగుతుంది. ఐతే అది తాత్కాలికమే. కొట్టి 160 మణుగుల బరువు లాగించగలిగేను గదా యని, రోజూ అదేపనిగా బరువు వేయుచున్నయెడల ఇంకా కొద్దికాలం ఆ బరువును ఆగుర్రం లాగుతుంది. అయితే ఈ అదనపుశ్రమవలన గుర్రం చెడిపోతుంది. బరువును లాగే సామర్థ్యం క్రమంగా తగ్గిపోయి, చివరకు100 మణుగుల బరువు లాగే సామర్థ్యం కూడా తగ్గి పోతుంది. దానికి కాళ్లు దుర్బలము అయిపోతవి. ఆసంగతి పైకే కనుబడుతుంది మనదేహములోని జీర్ణయంత్రం సంగతి కూడా యింతే. అవి మోయగలిగిన బరువుకంటె యెక్కువ బరువు వేసి యిప్పటి కాలంలో దొరుకుతుండే ఉద్రేపనద్రవ్యముల వేయుచూఉంటే కొంతకాలం ఆబరువంతా మోస్తవి తర్వాత అవిదుర్బలమై తాము చేయవలసిన కర్మలో కొంత భాగమే చేయగల్గుతవి. ఒక ఆరోగ్యవంతునికి రోగం కలగాలంటే అకస్మాత్తుగా కలుగదు. రోజూ వరుసగా నెమ్మదిగా జరుగుతుంది. ఒకొకరికి 10-20 సంవత్సరాలుకూడా పట్టుతుంది. అందువల్ల రోగికిపిన ఆరోగ్యం పోయి రోగం వస్తున్నదని తెలియనే తెలియదు.

రోగగ్రస్తమైన ఒకజీర్ణఅవయవములో ఎంత ఆహారపదార్థం వేయవలెనో నిర్ణయించడం చాలాకష్టము. ఒకనికి ఒకనారింజ కాయతో ఆరోగ్యం కలిగితే అతనికే రెండవనారింజకాయ జబ్బు చేస్తుంది. అంత దుర్బలస్థితిలో ఒక నారింజకాయ జీర్ణింపజేసను

గలదు. రెండవనారింజకాయ వ్యాధి గలిగిస్తుంది. దేహం భరింపగల్గినదానికంటె అధనంగా తీసుకన్న ఆహారాలన్నీ విషంగా మారుతవి. మనం ఒకసంగతి జ్ఞాపకం పెట్టుకోవాలి. మనము తినే ప్రతి పదార్థం జీర్ణము కావాలి. మంచి ఆరోగ్యస్థితిలో నున్న జీర్ణకోశము గూడా నిజానికి కొంత ఆహారపదార్థమే జీర్ణము చేయగలదు. అంతకంటె ఎక్కువ తింటే అది విషమే, అవుతుంది. అది సక్రమంగా మలమూత్రాలుగా వెడలిపోకుంటే అదే రోగపదార్థ గా మారుతుంది. అందువలన ఆహారపానీయాలలో మనం తీసుకునే శ్రద్ధమీదనే మన ఆరోగ్యానందములు ఏర్పడుతవి.

అయితే యీరోగపదార్థము యేమవుతుంది? దేహారోగ్యమునకు ఉపయోగించదు, గనుక దీనిని రోగపదార్థ మన్నాను. దీనిని దేహము వెలుపరింప ప్రయత్నము జేస్తుంది. ప్రకృతి యిందుకు కొన్ని మార్గములను సృష్టించి యున్నది.

వాయురూపంగా ఉండే మలాలను ఉచ్ఛ్వాసముద్వారా బెట గాలిలోనికి వదలుతుంది. జీర్ణకోశములోనికి పోయిన ఆహారఘనపదార్థమలినముల మలకోశము వెలువరిస్తుంది. రక్తమునందు చేరిన మలముల చర్మముద్వారా చెమటగను, మూత్రపిండములనుండి మూత్రముగను శ్వాసకోశములనుండి గాలిగను వెడలిపోవును. మనం చేసిన పాతకాలన్నిగూడా దేహాన్ని నశింపజేయకుండా ఉండేటందుకు మలమూత్ర శ్వాసకోశాలే గాక చర్మము గూడా ఎంతో శ్రద్ధగా పని చేస్తున్నది. నిజానికి మనము ఇంతకంటె యెక్కువ ఏమీ చేయనక్కరలేదు. కాని మనము

ఏమిచేయుచున్నాము? ఆబహిష్కార్యావయవాలు వెలువరింప లేనంతగా దేహానికి అపకారం జేసే పదార్థాలను స్వీకరించుచున్నాము అందువల్ల కొంత రోగపదార్థము మిగిలిపోవుచున్నది. అది ఎక్కడ మిగిలిపోవుచున్నది. ఏ అవయవాలు శుద్ధి క్రియను నిరంతరము చేస్తూ ఉండాలో, అట్టి అవయవాలందరినే ఈరోగ పదార్థం చేరుకొంటుంది. అందువల్ల శుద్ధి క్రియకు ఆటంకం జరుగుతుంది. కొంతరోగపదార్థం రక్తాభిసరణమునకుకూడా అడ్డు తగులుతుంది. ఈరోగపదార్థము దేహక్రియలలో తరుగుపోయిన భాగాలను పూరించేటందుకు పనికిరాదు సరికదా ప్రత్యేకంగా హాని జేస్తుంది. ఈ విధంగా జేరిన రోగపదార్థము మొట్టమొదట మలమూత్ర శ్వాసకోశములదరిని చేరుతుంది. ఒకసారి రోగ పదార్థం చేరనారంభించితే ఆ యా అవయవాలు క్రమక్రమముగా దుర్బలములయిపోతూ ఉండుటవలన రోగపదార్థం యింకా వడివడిగా చేరనారంభిస్తుంది. వెంటనే జీవితనియమాలలో మంచిమార్పులు చేసుకోవాలి. లేకపోతే యీరోగపదార్థము అంతు లేకుండా పెరిగిపోవును. ఇపుడే దేహములో రూప భేదములు కలుగ నారంభించును. అపుడు ముఖనిదానశాస్త్రము తెలిసినవారికి ఆమార్పులు కనుపడుతవి.

ఇపుడు దేహములోపల రోగపదార్థము అంతర్గతముగా ఉంటుంది. బాధ లేమీ ఉండవు. రోగికి తెలియనంత నెమ్మదిగా వ్యాధి పెరుగుతూ ఉంటుంది. కొంత కాలానికి తన దేహంలో ఏదో కొంత అనారోగ్యంగా ఉన్నదని తెలుస్తుంది. అప్పుడతనికి వెనుకటి ఆకలి ఉండదు. వెనుకటివలె పనిపాటలు చేయ లేడు. ఆలో

చనగూడ పూర్వము చేసినంత చేయులేదు. మలమూత్రస్వేద ములు సక్రమంగా జరుగుతూ ఉన్నంతకాలము, శ్వాసక్రియ నిరాటంకముగా జరుగుతూ ఉన్నంతకాలము, అతడింకా అలాగే కాలక్షేపం జేస్తూనే ఉంటాడు. మలమూత్రశ్వాసస్వేద ములు సక్రమముగా వెడలిపోక బాధించినపుడు తనకు వ్యాధి ఉన్నదని తెలిసికొంటాడు.

మొట్టమొదట బహిష్కార్యావయవములచెంత చేరనారంభించిన రోగపదార్థం అక్కడ చోటుజాలక దూరప్రదేశములకు ప్రయాణం జేస్తున్నది. అనగా తలవైపునకు నడుస్తుంది. శిరస్సులోకి చేరుకునే లోపల కంఠములోగుండా పోవలెను. కంఠంలో అదివరకే ఎన్నో నాళాలు రంధ్రాలు ఉన్నాయి. ఈరోగపదా ర్థము కంఠంలోగుండా పోయ్యేటప్పుడు కొన్నిరూపభేదములను గలిగిస్తుంది. కంఠం కదిలించుటలోగూడా కొంతబిగువు కనిపి స్తుంది. ఏవైపున కంఠం మరీబిగువుగా ఉంటుందో ఆవైపు నుండే రోగపదార్థం శిరస్సులోనికి పోవుచున్నదని చెప్పుటకు వీలుగా ఉంటుంది.

దీనినిగురించి యింకా యెక్కువ చెప్పేలోపల యింకొక్క సంగతి చెప్పవలసి యున్నది. రోగపదార్థము యొక్క ప్రారంభము మనకు తెలియదు. ఏమంటే ఎంతోమంది బిడ్డలు రోగపదార్థ ముతోనే జన్మించుచున్నారు. అందువల్లనే, ఏబిడ్డకూడా శిశు వ్యాధులనుండి తప్పించుకొనలేకపోవుచున్నది. అంటే ఆబిడ్డ * దేహంలో పిత్రియముగా సంక్రమించిన రోగపదార్థమును వెలు వరించుటకు దేహప్రకృతి చిన్నప్పటినుండియే ప్రయత్నము

చేస్తుంది. ఆయాప్రయత్నములే శిశువ్యాధులు. ఈ ప్రయత్నములద్వారా వారిదేహములు శుద్ధి పొందుతవి. దేహమునందు చేరిన రోగపదార్థం ఏమవుతుందీ అనే విషయాన్ని గూర్చి చెప్పబోవుచున్నాను. మొదట ఉదరమునందు చేరనారంభించిన రోగపదార్థం క్రమక్రమముగా వృద్ధి అయి దేహమునందలి ఇతరభాగములకు కూడా వ్యాపించి, దేహపుసహజనడకకు ఆటంకం గలిగిస్తున్నది. రోగపదార్థముకొరకై ఆయాఅవయవములు కొద్దిగా విరివిపొందినప్పటికి దేహమున ఉపయోగించే పోషకద్రవ్యాలు ఉండేటందుకు చోటు లేకుండాపోతుంది. రక్తాభిసరణమునకు ఆటంకం యేర్పడుతుంది. మలమోచనమునకు నిరోధమేర్పడుతుంది. రోగపదార్థం చేరిఉండటంవలన, శుద్ధిక్రియను నడుపవలసిన అవయవాలు కూడా యిరుకైపోతవి. ఎంతో కాలం దాకా యీరోగపదార్థము అంతర్గతముగా చేరియుండి, పెద్ద రోగాలేమీ రాకుండా బాధలేమీ లేకుండా జరిగిపోతుంది గాని, జీవనసరళియందును, వాతావరణమునందును అనుకూల మార్పులు కలిగినపుడు అకస్మాత్తుగా ఈరోగపదార్థములో కూడా మార్పులు వస్తవి. రోగపదార్థములో నీటిలో కరిగే స్వభావము ఉన్నది. మరిగేస్వభావము, విశ్లేషము నొందే స్వభావము కొత్తరూపాలను పొందే స్వభావమూ గలదు. దీనికే మండము అని పేరు. ఇట్లు రోగపదార్థమూ, మండము పొందినపుడు సూక్ష్మాతిసూక్ష్మమైన క్రిములు పుట్టి చురుకుగా పనిచేస్తవి. రోగపదార్థముయొక్క పరిమితి విశ్లేషముచేత ఎక్కువ అవుతుంది. కొద్ది స్థలములో యిమిడినది ఎక్కువభాగం ఆక్రమించుకుంటుంది. అట్లు విరివిపొందిన రోగపదార్థముయొక్క

ఒరపిడివలన వేడి పుట్టుతుంది. మండము ఎంత ఎక్కువగా ఉంటే వేడికూడా అంత ఎక్కువగా ఉంటుంది. దేహమునందలి రోగపదార్థములో అన్యోన్యముగా జరిగిన ఒరపిడివలనను, రోగపదార్థమువలన దేహమునకు గల్గిన రాపిడివలనను, రోగపదార్థమునందు గల్గిన మండము (పులిసిపొంగుట) వలన వేడిమి గల్గుతున్నది.

రోగపదార్థమునందు గలిగిన మండమును, అనగా పొంగును సక్రమమార్గమున మలమూత్రాదిబహిష్కార్యావయవములచెంతకు రప్పించి వెలువరింపగలము. అట్లే దేహమునందు మండము వలన గల్గిన రూపభేదములనుకూడా పోగొట్టవచ్చును. ఇది ఎవరికిని ఇంతవరకు సరిగా అర్థముగాని విషయము. ఇది ఎట్లు జరుగుచున్నదో ఎవరికిని తెలియుటలేదు. నేను కొద్దిగ వివరింప ప్రయత్నింతును. ఒకనీరే చల్లదనమువలన గడ్డగట్టుటయు, అమిత వేడిమివలన ఆవిరి అగుటయు మన మెరుగుదుము. ఆకాశము లోనికి ఆవిరిరూపమున ఎగిరిపోయిన నీరే అనుకూలపరిస్థితులేర్పడినపుడు మేఘముగా నై వానగాను వడగండ్లుగను వచ్చుట మన మెరుగుదుము. అట్లు వచ్చిన వానయే నదులన్ని నిండి సముద్రములోనికి పోయి తిరిగి వేసవిలో ఆవిరియగుటయు మన మెరుగుదుము. నీటియందు ఇన్ని మార్పుల తెచ్చినది వాతావరణమునందలి శీతోష్ణములయొక్క మార్పేకదా!

దేహంలో నుండే రోగపదార్థంకూడా ఈవిధముగానే శీతోష్ణములయందలి మార్పులవలన వివిధములగు రూపాంతరములను పొందుతూ ఉంటుంది. దేహమునందు గల రోగపదార్థమునందు

మండమువలన పుట్టిన సూక్ష్మక్రిములయొక్క పుట్టుకను గురించి మనకేమీ ప్రమేయము లేదు. దేహమునందు రోగపదార్థమున్నది. అందు మరుగు పుట్టినపుడు అనుకూలముగా ఈ సూక్ష్మజీవులు వృద్ధిపొందునవని తెలిస్తే చాలు. రోగపదార్థం లేకుండా ఈ సూక్ష్మజీవు లుండజాలవు. అని మనకు తెలిసి ఉండాలి. దేహంలో రోగపదార్థ మున్నపుడు వాతావరణమునందలి శీతోష్ణ స్థితులు ఆ రోగపదార్థము వెడలిపోవుటకు అనుకూలమైన స్థితులుగల్గి ఉన్నపుడు రోగపదార్థములో మండము పుట్టుతుంది. అంతేకాకుండా, దేహమునందున్న రోగపదార్థం తగినంత ఉండి అది మురిగి కుళ్ళిపోవడానికి సిద్ధంగా ఉన్నపుడుకూడా ఇటువంటి మండము పుట్టుతుంది. ఋతువులు మారినపుడు జలుబు - అతిసారము – గ్రహణి - మొదలైనవి పుట్టుతవి. జీర్ణావయవాలల్లో ఉండవలసినదానికంటె ఎక్కువకాలం నిలువఉండే ఆహారపదార్థం తిన్నప్పుడుకూడా మండము పుట్టుతుంది. కోపము, భయము, ఉద్రేకము, అదురు, మానసికాందోళన – మొదలగు వానివలన కూడా రోగపదార్థములో మండవ్యాప్తి గల్గును. నా పరిశోధనలో తేలిందేమంటే ప్రతితూరియు – ఉదరమునందలి రోగపదార్థమందే మండమారంభమవుతుంది. మలకోశం తిన్నగా పనిజేస్తూ ఉన్నవారికి ఆ రోగపదార్థం అతిసారముగా వెడలిపోతుంది. మలబంధముతో బాధపడుతున్నవారికి వెంటనే ఆ మలపదార్థము వెడలిపోక, ఉదరమునందలి రోగపదార్థమునందు గల్గిన మండము దేహమునందు రోగపదార్థమున్న యితర భాగములకు వ్యాపించును.



ఈ సీసాబొమ్మను చూడండి. దీనికి కింది కి త్రోవ లేదు. ఇందులో ఉండే పులిసిన పదార్థము సీసామూతి వంకకు వ్యాపించుచున్నది. ఆవిధంగానే మలబంధము ఉన్నవారి దేహతత్వమునందు రోగ పదార్థము క్రిందికిపోక పైకి నడుస్తుంది. అందువల్లనే తలనొప్పి, కండ్లమంటలు, మూడుపోటు, వగైరా బాధలు, దేహంలో వేడి పుట్టుట, రక్తములోని వేడిపెరుగుతుంది. దీనినే మనము జ్వరము అనేది. దేహములోనున్న రోగపదార్థములో మందము గలిగి సహజముగ మలమును వెలువరించవలసిన, మలమూత్రకోశములు తిన్నగా పనిజేయనపుడే యిట్టి జ్వరము గల్గుచున్నది. ప్రతి దినము సక్రమముగా వేళకు మలవిమోచన కానపుడును, బైటికి వెళ్లవలసిన మూత్రపరిమితి తగ్గినపుడును, చర్మరంధ్రములు మూసుకుపోయి సరిగా చెమట పోయనపుడును శ్వాసకోశములు

దుర్బలములయి సరిగా వానిపనిని చేయనపుడు మాత్రమే యిట్టి జ్వరము వస్తుంది. చిరకాలంగా నేను పరిశోధన జేసి తెలిసి కొన్న జ్వరము యొక్క వివరము యిట్టిది.

---

## ౪. దేహమునందలి మండమే జ్వరము

ఇప్పుడు జ్వరము వచ్చినప్పుడు ఉండే లక్షణాలను పరిశీలిద్దాము. మానవదేహంలో కాకుండా వెలుపల ఈ మండ వ్యాప్తి ఏలా జరుగుతుందో చూద్దాము. సీసా ఉన్నదనుకోండి. అందులో కల్లు పోయండి. కొన్నిరోజులు ఉంచేసరికి అది పులిసిపోతుంది. అంటే ఏమిటి? అందులో మురుగు పుట్టింది. పరిశీలనగా చూస్తే అందులో సన్నని క్రిములుంటాయి. ఆక్రిములు బైటనుండి వచ్చిన వని అనుకోకూడదు. అవి కల్లులోనే పుట్టి కల్లులోనే పెరుగు చున్నవి. అంతకంటె కల్లే ఆవిధంగా తయారైనదీ అనిచెప్పవచ్చు. ఒక వస్తువు మురిగినపుడెల్లా మొదటి ద్రవ్యమె ఆవిధముగా మారినది అని అర్థము. మనము తిన్న, త్రాగిన, ఆహారపు నీ యూతే జీర్ణక్రియలో మార్పులు పొందిపొంది మనదేహంగా మారుచున్నవి.

ఈవిధంగా మన జీవితమంతాకూడా ఒకవిధంగా పరిణామాల పరంపర. నేనిప్పుడు వర్ణించిన మండమే లేకపోతే అసలు జీవి తమే లేదు. ఈపరిణామము మనకు అనుకూలమైనపుడు ఆరోగ్య మంటాము. మనకు వ్యతిరేకమైనపుడు అనారోగ్య మంటాము. మండంలో కనుపడే లక్షణాలు మొదట ఒకసీసాలో పోసిన

ద్రవ్యము విడిపడి అందులో బరువైనవస్తువు అడుగుకు చేరు తుంది. తేలికయైన వస్తువు పైకిచేరుతుంది. అందులోని ద్రవ్యము పులియటానికి అనుకూలమైన కాలము వచ్చినంతనే పులియ నారంభించి క్రిందినుంచి మూతివంకకు వ్యాపిస్తుంది. అడుగున చేరుకున్న పదార్థము కొద్దిగాఉంటే మందము కొద్దిగా ఉం టుంది. అడుగున చేరినపదార్థం యెక్కువగాఉంటే మందమూ ఎక్కువగా ఉంటుంది.

వాతావరణమునందలి వేడి ఎంతయెక్కువగాఉంటే మందము కూడా అంతయెక్కువగా ఉంటుంది. అంతయెక్కువగాఉంటే, మందముకూడా తక్కువగా ఉంటుంది. సారాయము, బీరు, సీసాలలోపోసి నేలభోషాణములలో దాచిపెడతారు. నేలభోషా ణములలో శీతోష్ణధర్మములు, సమానములుగా, ఎండాకాల శీతాకాలములలో ఉంటవి గనుక మందము గలుగదు. ఆవిధం గానే మానవదేహములోకూడా శీతకాలంలోకంటే, వేసవి కాలంలో, త్వరగా మందము గల్గుతుంది. అందువల్లనే ఉష్ణ మండలాల్లో తరుణవ్యాధులు ప్రధానంగా ఉంటవి. సమ శీతోష్ణమండలాల్లో, మందము తిన్నగాజరుగదు గనుక, కాలిక వ్యాధు లెక్కువగాఉంటవి. ఉష్ణమండలాల్లో పగటివేడి నూరు డిగ్రీలుంటే, రాత్రి 40 డిగ్రీలుంటుంది. ఆరెంటికి తేడా 60 డిగ్రీలుంటుంది. సమశీతోష్ణమండలాల్లో సాధారణంగా 22 డిగ్రీలకు మించిపోదు. సమశీతోష్ణ మండలాల్లో జ్వరములు వేసవిలో వస్తాయి. కారణమేమిటంటే ఆరోజులలో పగలు రాత్రి ఉష్ణములో తేడాలుంటాయి. చిన్నపిల్లలకు తరుణవ్యాధులు

రావడము, వయసువచ్చినకొద్ది కాలికవ్యాధులు వస్తూఉండటం కొందరికి ఆశ్చర్యం కలిగించవచ్చు. అయితే దీనికికూడా కారణముంది. చిన్నబిడ్డల దేహంలోనుండే అవయవాలు చాలా చురుకుగా నుంటవిగనుక బైట ఉష్ణములో తేడా ఏమంత లేకపోయినా, మండము వృద్ధిపొందుతుంది. తరుణవ్యాధుల ద్వారా వారిదేహంలోనుండే రోగపదార్థము వెలువరింపబడి ఆరోగ్యము వృద్ధిపొందుతుంది.

నీటిలో కలిగిన పరిణామమే, మానవ దేహంలో కూడా కలుగుతుంది. శరీరబంధము యొక్క దిగువభాగములోనే, మొదట రోగపదార్థము చేరును. బైటి వాతావరణము యొక్క మార్పులవలనను ఆఘాతముల వలనను, మానసిక ఉద్రేకముల వలనను దేహముయొక్క దిగువ భాగంలో చేరిన రోగపదార్థమునందు మండము కలుగుతుంది. అది విపరీతించినపుడు చోటుచాలక చర్మము మీదకి వత్తుకుంటుంది. చర్మములో సాగే గుణమున్నంత వరకూ దేహము ఓర్చుకుంటుంది. చర్మములో సాగేగుణము తగ్గిపోయినంతనే మండపదార్థమునకు చర్మమునకు ఘర్షణ (నరపిసి) కలుగుతుంది. అందువలన వేడిమి పుడుతుంది. జ్వరములో ఎందుకు వేడి పుట్టునో మనకిపుడు తెలిసినది.

అదేవిధముగా జ్వరములో దేహము ఎందుకు ఉబ్బి యుంటుందో కూడా మనకు బోధపడుచున్నది, మండము పొందిన పదార్థము చర్మమువంకకు వత్తుకోవడమూ, చర్మము సాగేగుణముండుట వల్ల విరివి చెందడం, అందువల్ల దేహము యొక్క పరులత పెర

గడం తటస్థించుచున్నది. చర్మములో సాగేగుణం తగ్గిపోయి యిక సాగటానికి వీలు లేనప్పుడు ఘర్షణయెక్కువై వేడికూడా యెక్కువగును. జ్వరములో ప్రమాదము కూడా యిప్పుడే యున్నది. అపుడు రోగపదార్థం వెలుపలికి రాక లోపల అవయవాలమీదనే యెక్కువ వత్తిడిచేస్తుంది. అందువలన లోపల అవయవాలు మండిపోతూ యుంటవి. చర్మరంధ్రములు త్రోవ యివ్వకపోతే ప్రాణమోసం వస్తుంది. మన చికిత్సవలన రోమ రంధ్రములను వికసింపజేస్తే ప్రాణాపాయం తప్పుతుంది, అప్పుడు చెమట పోస్తుంది. జ్వరముకూడా తగ్గుతుంది. లోపలనుండే రోగపదార్థం వెడలిపోతుంది సీసాపోలికమానవ దేహమునకుపోల్చటానికి అన్నివిధాల సరిపోదు. సీసాలో నుండే మండపదార్థము విరివి పొందినపుడు వ్యాప్తి చెందేటపుడు దానికి ఆటంకాలేమీ లేవు. మానవ దేహంలో రోగపదార్థములో మంటము కలిగినపుడు వ్యాప్తి పొందటానికి అన్నీ ఆటంకములే. ప్రతిఅవయవము, మంట వ్యాప్తిని నిరోధిస్తూనే యుంటుంది. అందువలన ఘర్షణ, వేడిమి పుట్టుతూ ఉంటవి. ప్రతి అవయవములోనూ యిట్లు ఘర్షణ కల్గుటయేగాక ఒక్కొక్కపుడు ఆ యవయవములునశించి పోవుటయు తటస్థించును. మండ వ్యాప్తిని పొందేరీతిలో మార్పు గలిగినట్లయితే ప్రాణాపాయము తప్పిపోతుంది. రోగపదార్థము ఏ అవయవము మీద ఎక్కువ వత్తిడి గల్గిస్తుందో మనం ఆ అవయవము చెడిపోయిందంటాము. అపుడు జీర్ణకోశ వ్యాధులని పైత్యకోశ వ్యాధులని హృదయకోశ ఊపిరితిత్తుల వ్యాధులని మనము పిలుస్తూయుంటాము. రోగి పరుండుతీరునుబట్టి రోగ పదార్థము చేరుకొంటూ ఉంటుంది. అందులో కల్గినమంటము

ఏ వైపుగా వ్యాపిస్తుందో యే అవయవమును పీడిస్తుందో అది వివిధ మానవులలో వివిధరీతులుగా ఉంటుంది. ఇప్పుడు చర్మమును ఎట్లా వికసింప జేయాలో చెపుతాను, ముందుగా యింకొక్క విషయంకూడా చెప్పాలి. జ్వరం కలగడానికి ముందుగానే కొన్ని రోజులనుండి కొన్ని వారాలనుండి మరికొందరిలో కొన్ని నెలలనుండి దేహంలో చలిచలిగాను బద్ధకంగా ఉంటుంది. దీనికి కారణమేమనగా దేహంలో రోగపదార్థము ఎక్కువగా చేరడమే అది రక్తాభిసరణానికి జీర్ణక్రియకు ఆటంకంగా ఉంటుంది. అందువలననే రక్తము చివరలకంట ప్రవహింపక చలిచలిగా ఉంటుంది. రక్తములోపలనే ఎక్కువగా నిలచి ఉండటంచేత ఆలోపలభాగాలలో వేడి యెక్కువౌతుంది. ఈవిధంగా, వివిధమానవులయందు వివిధ పరిమితిగల కాలం వరకూ యీరోగపదార్థం చేరుతూ ఉండి గాలియందలి మార్పు అఘాతిమో మానసికోద్రేకమో కలిగినంతనే మందము గలుగును. పేరుకొనిన రోగపదార్థము – రక్తాభిసరణమును – జీర్ణక్రియను, సరిగా జరుగనీయదని చెప్పియున్నాను. రక్తవాహికలలో మిక్కిలి సన్నగా ఉండే కేశనాళికలలో రోగపదార్థము చేరిపోయి రక్తము చివరలకంట ప్రవహింపనపుడు చర్మతలమునకు రక్తము సంపూర్ణముగా లభింపదు. అందువలననే – దేహములో చలిగాను బద్ధకంగాను ఉన్నపుడు చర్మముకూడా చల్లగా ఉంటుంది. అపుడు చేతులు కాళ్ళుకూడా చల్లగ ఉంటవి.

జ్వరము రావడానికి ముందుగా – దేహముపై భాగము కాళ్ళు చేతులు వేడి తగ్గియుంటవి. ఈసంగతి జ్ఞాపకం ఉంచుకోవాలి.

లేకపోతే పొరబడుతాము. బద్ధకంగా ఉన్నపుడే చికిత్స జేసుకొంటే జ్వరము రాదు. ఇది మొగ్గలోనే తుంపుట వంటిది. రోగ పదార్థంలో మండము గల్గినపుడల్లా సూక్ష్మాతిసూక్ష్మములైన క్రిములు గల్గుతవి. అందువల్లనే జ్వరములలో దేహములో సూక్ష్మక్రిములుంటవి. ఉదయమునందు చేరిన రోగపదార్థములో మండము గల్గినపుడు సూక్ష్మక్రిములు పుట్టుతవి. అవి రోగ పదార్థమునందే పుట్టుతవి. గాని వేరేరావు. రోగ పదార్థమునందు మండము తగ్గినంతనే సూక్ష్మక్రిములు కూడా కాన రాకుండాపోతవి. మండపదార్థము వెలువడిపోయినంతనే ఆరోగ్యముకూడా గల్గును.

ఇందువల్ల తేలినదేమనగా రోగపదార్థము లేనిదే సూక్ష్మక్రిములు ఎచ్చటినుండిగాని ప్రవేశించి రోగములను కల్గింప జాలవు. అందువలన మనము సూక్ష్మజీవులను సంహరింప ప్రయత్నము చేయనక్కర లేదు. మండ పదార్థానికి మూలకారణమైన రోగపదార్థము పోయినంతనే - రికివారికి భయము గల్గించే, సూక్ష్మజీవులనే ఈ భూతాలు తమంతనే తాము అదృశ్యములగును. ముందు అంటువ్యాధులను గురించి వివరించెదను. కొన్ని ఉదాహరణముల వలన నా సిద్ధాంతములను తెలియజెప్పెదను. ఒక గదిలో రోజూ కసువు చిమ్మకుండా ఉంటే ప్రతిదినమును అందులో మలినములు పేరుకొనును. కొన్ని వారముల తర్వాత ఆగదిలో రకరకాలైన సూక్ష్మక్రిములు చేరుకొనును. అందులో మనము నివసించుటకు వీలుండదు.

వైద్యులు చేస్తూయున్నట్లుగనే మనంగూడా కొన్ని విషాలను ఆగదిలో చల్లితే, చాలాక్రిములు చచ్చిపోతవి. అయితే యేమి

లాభము ? మళ్ళీ కొత్తక్రిములు ఎప్పటికప్పుడు పుట్టుతవి. అయితే శాశ్వతమైన లాభము చేకూరదు. ఆగడిని శుభ్రముగా ఊడ్చి బాగుచేసి ప్రతిదినము 1-2 తూరులు చక్కగా బాగు చేయుచుంటే ఎట్టి సూక్ష్మక్రిములు చేరవు. శాశ్వతలాభము చేకూరుతుంది.

ఇంకొక ఉదాహరణ: అరణ్యముల ప్రక్కన ఉండే పల్లెలు చాలా తేమగా ఉంటవి. అక్కడ లెక్కలేనన్ని దోమలు పుట్టి చీకాకు గల్గిస్తవి.

మీచిత్తమువచ్చినన్ని విషాలు వాడండి. వందలాదిగా దోమలను చంపవచ్చు. వేలాదిప్రాణము తీయవచ్చు మరల ఆమురికి గుంటలనుండి లక్షలాది దోమలు జన్మించుతవి. మురికిగుంట తీసి వేయుడం జరపకపోతే – ఆదోమలు నశింపవు. మురికి లేని ఎత్తైన కొండలమీద దోమలు ఉండనే ఉండవు. ఎవరైన దోమలను, కొన్నిటిని కష్టపడి యెత్తైన కొండలమీదికి చేర్చినా అవి అచటనిలువక పల్లంగా ఉండే మురికిగుంటల మీదికే పారి పోతవి.

ఇంకొక్క ఉదాహరణ చెప్పెదను. ఈ ఉదాహరణలో నేను చెప్పదలచుకొన్నది బాగా బోధపడుతుంది. ఉష్ణమండలాల్లో సమశీతోష్ణమండలాల్లో కంటెను, శీతలమండలాల్లో కంటెను, వేడి యెక్కువగా నుండుటవలన రకరకాలైన జంతుజాలములు పుట్టిపెరుగుచున్నవి. ఇచట ప్రధానమైన శాక భక్షకములును మాంసభక్షకములును కుణపభక్షకములును నగు పెద్దజంతువులు గలవు. ఎంతకష్టపడినను వానినిసంపూర్ణముగా నశింపజేయు లేము.

మురల కొత్తవి జన్మించుచునే యుండును. ఈవిధంగా అమితమగు వేడివలన వివిధరకములైన జంతువులు వృద్ధిపొందును. ఇక్కడనే ఎక్కువగా కుళ్ళుటకూడా ఉంటుంది. అందువల్లనే మాంసము తినే జంతువులు, కుళ్ళునుతినే జంతువులు వృద్ధిపొందుతవి. కుళ్ళునుతినే జంతువులు వృద్ధిపొందకపోతే చచ్చిన జీవజాలము మురిగి, భూమి నివాసయోగ్యం గాకుండా పోతుంది. అందువల్లనే కుణపభక్షక జంతువులుకూడా మన క్షేమంకోసరమై అవుసరములై యున్నవి. ధృవప్రాంతములయందు గడ్డిని నాచును తినే రెయిన్ డీర్ తప్పితే పెద్దజంతువులేమీ బ్రతుకుటలేదు. ఉష్ణమండలాలనుండి మాంసభక్షక జంతువులను లేకుండా చేయాలంటే అవి ఏజంతువుల తిని జీవిస్తున్నాయో – ఆజంతువులను లేకుండా జేయాలి. కుణప భక్షక జంతువులను లేకుండా జేయాలంటే కుళ్ళు లేకుండా జేయాలి. అంతే గాని, మిగతా మార్గాలన్నీ నిష్ప్రయోజనములు. పెద్దజంతువుల కంటె – చిన్న జంతువుల నశింప జేయుట మరీ కష్టము సూక్ష్మక్రిములను నశింపు చేయడం అసలే సాధ్యం కాదు. ఎన్ని విషపు మందులను వాడినా సూక్ష్మ జీవులు నశింపనే నశింపవు. ఒక రకమైన సూక్ష్మజీవిని నశింపజేస్తే యింకొక రకమైన సూక్ష్మజీవి పుడుతుంది. సూక్ష్మక్రిములకు జీవనాధారమైన రోగ పదార్థమును దేహము నుండి వెలువరించి నంతనే – దేహమునందలి సూక్ష్మ క్రిములు వాటంతట అవే పోవు చున్నవి. పై ఉదాహరణముల వలన ప్రకృతి యందు పెద్ద ఎత్తున ఏయే పనులు జరుగు చున్నవో మనదేహము నందును అచంచల మగు ప్రకృతి నియమాను సారముగ చిన్న ఎత్తున అదేపని జరుగుచున్నది.

రోగములో కూడా ప్రకృతి నియమాలు మారవు. ఆ యా జంతువులకు జీవించుటకు అనుకూలమైన ఆహార ద్రవ్యములు లభించినపుడే మాంసభక్షకములును, కుణప భక్షకములును అగు జంతువులు పుట్టి పెరిగినట్లే దేహములో రోగ పదార్థము లేనిదే మండము లేదు - మండము లేనిదే వేడి పుట్టదు, వేడి లేనిదే జ్వరము లేదు.

జ్వరమునకు కారణము - యిప్పుడు మనకు తెలిసినది గనుక జ్వరము రావటానికి ఉపాయము కూడా కనిపెట్టుట కష్టము లేదు. చర్మము మీద వత్తుకుని వేసిని గల్గించుచున్న మండ పదార్థము - వెలువడి పోవుటకు చర్మ రంధ్రములు వికసింప జేసి చెమటను గల్గింప వలెను. చెమటపోసిన మండపదార్థము కొంత వెడలి పోయి, చర్మపు బిగువు తగ్గి జ్వరపు వేడిమి లేకుండా పోతుంది. అయితే యింత మాత్రమున రోగపదార్థపు మూలకారణము పోలేదు. దేహంలో ఉన్న రోగ పదార్థము లో కొంతలోనే మండము పుట్టుతుంది. మిగతా రోగ పదార్థము నిలువ ఉండును. అది బాగా క్రమక్రమముగ వృద్ధి పొందుతుంది అనగా జ్వరపు మూల కారణము అట్లాగే నిలచి యున్నది. అనుకూలమైన పరిస్థితు లేర్పడినంతనే తిరిగి జ్వరము వస్తుంది. కనుక దేహములో కదలకుండా నిలువ ఉన్న రోగ పదార్థమును వెలువరించుటకు మనము ప్రయత్నించవలెను. ఇందుకు నేను ముందు వర్ణింప బోవు చున్న, కటి లింగ స్నానములు కని పెట్టినాను. వానియొక్క వాడుకవలన దేహము బలపడును. అపుడు రోగ పదార్థమును దేహము వెలువరించును.

అదే సమయములో దేహమునందలి క్రియా కలాపములకు - ఆటంకం లేకుండా జరుగునట్లు చూడ వలయును.

రోగికి పరిపూర్ణమైన విశ్రాంతి నీయవలయును. గ్రంథ పఠనము తోనూ వాగ్వాదములతోను మానసికోద్రేకముల గల్గ నీయ రాదు. బజారులోని బండ్ల మోతలు గూడా వినపడకుంటే మంచిది. అది కూడా అపకారం చేస్తుంది. రోగి పరున్న గది లోనికి పరిశుద్ధమైన వాయువును రానీయవచ్చునే గాని, పెద్ద వెలుతురును రానీయరాదు. రాత్రుల యందైనను చీకటి గది లో పరుండ వలెనే గాని దీపము పెట్టికొనరాదు. రోగపదార్థ ములో తగినంత భాగం వెలువడి పోయేదాకా యీ నియమా లను పాటింప వలయును. కొన్ని సామాన్య సూత్రములను ఏర్ప రుచు కొనుటకు వెనుక చెప్పిన దానిని సంగ్రహముగ చెప్పె దను. రోగు లందరి యందును - దేహములో రూపభేదములు గలును. - ఇట్లు గలుటకు కారణము దేహమునందు జేరియున్న రోగపదార్థము. దీనికే రోగమని పేరు. రోగ పదార్థము దేహ మునకు ఉపయోగించే వస్తువు కాదు. తినిన ఆహారము సక్రమ ముగా జీర్ణము గాక పోవడంవల్లనే యీ రోగ పదార్థము దేహ ములో చేర యున్నది. రోగ పదార్థము మొదట, మల మూత్ర కోశముల ద్వారా, తర్వాత చర్మము ఊపిరి తిత్తుల ద్వారా చేరుచు న్నది. మల మూత్రము లు కొంత వరకైనా వెడలిపోవు చున్న పుడు దేహమునందలి రోగపదార్థము ఎక్కువ బాధలు కల్గిం పదు. మల మూత్రము లు తెంపుగా కాక చెమట సరిగా పోయక శ్వాసక్రియకు అవరోధ మేర్పడునప్పుడు దేహమునందు

గొప్ప అశాంతి ఏర్పడుతుంది. అంత వరకును దేహము నందలి రోగపదార్థము కాలికముగను-అంతర్గతముగ నుండి చిరకాలము ఎట్టి బాధలు లేకుండా శాంతముగ జరిగి పోతుంది. బాధలు లేకుండా రోగ పదార్థము దేహము లోపలనే నిల్చియున్న స్థితి కాలిక స్థితి. రోగ పదార్థము - ముదురుగ దగిన స్వభావము గలిగి యున్నది. అదే మందిముకు కారణము - ఆ మండమునందే సూక్ష్మజీవులు వృద్ధి అవుతవి. మండము ఉదరమునందు పుట్టు తుంది. అక్కుండి ఊర్ధ్వ ముఖముగా వ్యాపిస్తుంది. అప్పుడు రోగి స్థితి కూడా మారుతుంది. అతనికి బాధలు తెలుస్తవి. దేహము వేడి యెక్కుతుంది. జ్వరము వస్తుంది. బాధ కల్గించే - జ్వర వ్యాధులు యివి. వీనిని తరుణవ్యాధులందుము. పై సంగతుల వలన మనకు తేలిన పర్యవసాన మేమంటే:—రూపభేదాలే గాని ఒకే ఒక రోగమున్నది. ఆ రోగమునకు మూల కారణము దేహములో చేరిన రోగపదార్థము- అందువలన మనము వివిధ రోగాలగా చెప్పుకోకూడదు. ఒకే రోగముయొక్క వివిధరూపాలుగా మాత్రమే చెప్పుకోవాలి. ఆకస్మికముగా వచ్చే దెబ్బలు తగులుట, కత్తికోతలు - చిదుగుట - నలుగుట- మొదలైనవి యిప్పుడు చెప్పిన జాతిలో చేరిన వ్యాధులుగావు. వుండ్లను గురించి ముందు వ్రాస్తాను. అందువల్ల వాని చికిత్సావివరము ఇందులో ఎత్తుకో లేదు. నేను కనిపెట్టిన అన్నిరోగాలకూ ఒకటే కారణము అనే సిద్ధాంతాన్ని వెనుకటి పేజీలలో రుజువు పర్చి, సిద్ధాంతీకరించియున్నాను. సాహసమైన దైనప్పటికి రోగమనేది, ఒకటేను అనేవిషయం నేనెట్లా తెలుసుకున్నానో కూడా వివరించియున్నాను. రోగులకు చికిత్స చేయుటలో ప్రధానంగా ఉప

యోగించే రోగం ఒకటి, రోగకారణం కూడా ఒకటే—అనే సిద్ధాంతాన్ని నేను జరిగిన విషయాలపై ఆధారం జేసి రుజువుపర్చి గూడాయున్నాను.

నవీన భౌతిక శాస్త్రాలకు ప్రత్యక్షము - ప్రమాణము, అవి పరిశోధన వలన తెల్సుకొంటూరు. ఆ విధంగానే నేను గూడా అన్ని రకములైన రోగములను ఒకే విధమైన చికిత్సతో కుదర్చ గల్గిన యెడల నేను కనిపెట్టినసిద్ధాంతం సత్యసిద్ధాంతమని రుజువౌతుంది ఈ విధంగా అనేక వేల మందికి రోగములు నయము జేసి రుజువు పర్చిఉన్నాను. ఇంకా అనేకమందికి నయము జేసి - రుజువు చేయడానికి సిద్ధంగా గూడా ఉన్నాను. ఈ గ్రంథం చివర జేర్చిన రోగ నివారణ వృత్తాంతముల వలన ఒకే చికిత్సతో అన్ని వ్యాధులు ఏలా కుదిరినవో చూడగలరు. వివిధ రోగాలతో బాధపడుతుండే వారికే - వారి దేహము లోపల వెలుపల గల్గుతుండే మార్పులను వివరిస్తూ, ప్రతి ఒకరికి చికిత్సల చెప్తూ, చేయిస్తూ, అందువల్ల కలిగే ఫలాలను గ్రంథస్థం చేయడం అలవిగాని పని. సామాన్యంగా కనుపడుతుండే కొన్ని రోగాలను, కొన్ని భయంకర వ్యాధులను, పేర్కొనివాటికికారణాలను చికిత్సను, వివరించి - అనుభవంలో నయముచేసిన కొన్ని రోగ వృత్తాంతాలు గూడా చేర్చి, రోగమూ- రోగకారణము ఒకటే నని - అనేకం కాదని రుజువు చేస్తాను.

# ౫. శిశువ్యాధులు

## వాని కారణము – ఉద్దేశ్యము, చికిత్స – వాని ఏకత్వము.



దేహమునందు రోగపదార్థ ముండుటయే రోగము. క్రిందటి ప్రకరణములలో జరిగిన చర్చకంతకు అదే ఫలితాంశము. పుట్టినప్పటికే కొందరియందు రోగపదార్థ ముంటుంది. దేహానికి అపకారం చేసే ఆహారపానీయాలు స్వీకరించుట వలన కొంత చేరుతుంది. అట్టి రోగపదార్థాన్ని మలమూత్ర స్వేదములుగాను, కఫముగను దేహము వెలువరింప ప్రయత్నము చేస్తూనే యుంటుంది. ఈ విధముగా వెలువరింప జాలనప్పుడు, దేహం లోనే ఉంచుకొంటుంది. ఈ విధంగా దేహం యొక్క రూపంలో మార్పులు వస్తాయి. ఆ మార్పులు, ముఖంలోనూ కంఠంలోనూ

కన్పడుతవి. మండము గల సీసా ఈ పటములో చూపబడినది. సీసాకు బిరడాలేదు గనుక లోపలి మండపదార్థము పొంగి బైటికి పోతుంది. మూతి తెరచి ఉండక మూతికొక రబ్బరుటోపీ ఉంద నుకోండి. అందులోనుండి గాలికూడా బైటికిపోదు. మొదట వదలుగా ఉన్న రబ్బరు టోపీ లోపల మండపదార్థము పొంగినకొద్దీ - బిగసి యింకా సాగుతుంది. దేహంతో పోల్చవలె నంటే గాజుసీసాకు బదులుగా ఒకరబ్బరుతిత్తి ఉన్నదనుకోండి- ఆరబ్బరు తిత్తిలోనుండి, లోపలి భాగం మనకు కనుపడుతూ ఉంటుందనుకోండి-మండ పదార్థమున్న రబ్బరుతిత్తి అంతా సాగి ఉబ్బును. మన దేహంలో కూడా యిట్లే జరుగుతుంది. అయితే దేహానికి రబ్బరు తిత్తికి మరొక భేదము గలదు -. రబ్బరు తిత్తిలో మధ్యభాగం అంతా ఖాళీగా ఉన్నది. మానవదేహంలో అట్లు కాదు. అంతటా అవయవాలు ఉన్నవి. మండపదార్థ వ్యాప్తిని అవి అడుగడుగునా అడ్డగిస్తవి. ఆ యా అవయవము లను తప్పించుకో వలెనన్నా తప్పించుకోవాలి. లేదా వానిలో జొరబడాలి. ఇంకో త్రోవ లేదు. మిగతా విషయాల్లో రబ్బరు తిత్తిలో వలెనే, మానవ దేహంలో రూపభేదాలు ఏర్పడుతవి. మానవదేహంలోని రోగపదార్థము మండమునొంది దేహమం తటా వ్యాపిస్తుంది. ఇందువలన దేహములో వేడి పుట్టుతుంది - దేహం అంతా ఉద్రిక్తమవుతుంది. దీనినే మనము జ్వరమం టాము. మండము లోపలనే ఉంటే, లోపలే వేడి వుండి, చర్మం శీతలముగా ఉంటుంది. దీనికంటె జ్వరం రావడమే మంచిది. జ్వరంలో కూడా మొదట చలి ఉండి, తర్వాత వేడి వస్తుంది.

రోగపదార్థాన్ని వెలుపరించటానికి ఇది యవసరము. జ్వరము కలుగక రోగపదార్థము, దేహములోనే ఉంటే లోపలి అవయవాలు ఇంకా ఎక్కువగా చెడిపోతవి. లేదా అందు కల్గిన మండము వలన వేడి యెక్కి నశించి పోతవి. మృతికూడా వస్తుంది. ఒకవేళ మృతి రాకపోతే లోపలి అవయవాలు రోగపదార్థములో నిండుతవి. శిశువుల వ్యాధులనుగూర్చి చెప్పేటప్పుడు ఈ విషయాన్ని మీకు తిరిగి జ్ఞాపకం చెయ్యవలసి వచ్చినది. శిశువులకు వస్తూఉండే అసంఖ్యాకములగు వ్యాధులు వారికి వస్తూ ఉండే వ్యాధులెల్ల ఏలా ఒకే కారణము వల్ల వస్తాయో యిపుడే చూపుతాను. ఒక్కొక్క రోగాన్ని ఒక్కొక్క పేరుతో తెలిసికోవడం మనపని కాదు. అలా తెలిసికోవడంవల్ల కొన్ని చిక్కులు ఉన్నవి దేహంలో రోగపదార్థముండి అందులో మండము గల్గినపుడే ఏ వ్యాధిఅయినా వస్తుంది. దాదాపుగా శిశువు లందరును పుట్టినప్పటికే రోగపదార్థము ఉంటున్నది. గనుక ప్రతి బిడ్డకు వ్యాధులు వస్తున్నవి. పెద్దవారికంటె బిడ్డలకే ఎక్కువగా ఇట్టి తరుణవ్యాధులు ఎందుకు కల్గుతాయో లోగడ వివరించాను. అయితే రోగం రాకుండా జేసుకోవచ్చు. పెద్దపెద్ద పట్నాలు గ్రామాలు నశించకుండా ఉండాలంటే అందులో తుపాకి మందు లేకుండా చేయాలి. ఎంత జాగ్రత్త తీసుకున్నా తుపాకీ మందు నిలువ ఉన్న చోట ఒక నిప్పు రవ్వ పడకుండా మానదు. నిప్పు రవ్వపడితే పట్నాలు గ్రామాలు ఆగవు. మన దేహాలను గురించి ఆవిధంగా జాగ్రత్తగా నుండనవసరము లేదా? తీవ్ర వ్యాధులకు మూల కారణమైన రోగపదార్థాన్ని మనం

ఎందుకు నిరంతరము చేరుస్తూ ఉన్నాము? ఉన్న రోగపదార్థము వెలువరించుటకు మనమేల ప్రయత్నింపము? దేహమునకువచ్చిన జ్వరము లోపలి మాడను వెలువరించుటకు మార్గము చేస్తుంది. రోగపదార్థం యెప్పుడూ యేదో ఒకవ్యాధిని కలుగ జేయుటకు సిద్ధంగాఉంటుంది.

---

## ౬. ఆటలమ్మ, పొంగు, సర్పి, మశూచికము, కోరింతదగ్గు, గండమాల.

ఇపుడు బిడ్డలకు వచ్చే రోగాలను గురించి వ్రాస్తాను. ఇదివరకు వాడుతున్న పేర్లనే మనకేమి సంబంధము లేకపోయినప్పటికి వ్రాస్తున్నాను. అయితే అవి రోగము యొక్క వివిధరూపాలను గూర్చి చెపుతవి. బిడ్డలవ్యాధులు వివిధరూపాలలో కనుపడుతవి. వానినుండి వచ్చే ప్రమాదముగూడా వివిధ పరిమితులతో ఉంటుంది. ప్రతి సందర్భములోనూ సరియైన చికిత్స జెప్పడంకూడా కష్టమే. వేరువేరు బిడ్డలయందు వేరువేరు రూపాలతో రోగం ఎందుకు వస్తుందో వివరించి ఆ రోగములన్నియు ఎట్లు జయప్రదముగా కుదుర్చ వచ్చునో వ్రాస్తాను. బిడ్డల వ్యాధులు ఎంత వేరు వేరుగా గన్పడినా వానిలో రెండులక్షణాలు ప్రధానంగా ఉంటవి. ఒకటి వేడి, రెండు చలి.

### ఆ ట ల మ్మ

ఒక బిడ్డకు ఆటలమ్మ వచ్చిందీ అనుకోండి. మొదట చీకాకు ఉంటుంది. తర్వాత చర్మము వేడిగాను పొడిగాను ఉండి రాత్రిళ్ళు

నిద్రయుండదు. ప్రలాపము ఉంటుంది. బిడ్డకు జ్వరము వస్తుంది. ఈ జబ్బు ఏమిటో ఎవరికీ ఏమీ తెలియదు. చుట్టు పక్కల బిడ్డలకు ఆటలమ్మ రావడంచూచి ఈబిడ్డకూ ఆటలమ్మవచ్చిందీ అంటారు. ఇతర వైద్యాలలో దీనికేమీ మందు లేదు. ఏదైనా మందు వాడితే ప్రమాదము వస్తుంది. మన వైద్యములో మాత్రము దీనికి తప్పకుండా చికిత్స ఉన్నది. జ్వరము ఎప్పుడూ, చెమటపోస్తే తగ్గుతుంది. కనుక మనముకూడా చెమటపోసే ప్రయత్నం చేస్తాము. చెమట పోస్తే కొంత జ్వరము తగ్గుతుంది. వేడి తగ్గటానికి కూడా మనము చన్నీటితో చికిత్స చేస్తాము. ఈచికిత్సలతో జ్వరముతగ్గుటయే గాక ఆటలమ్మ పొక్కులు కూడా పొక్కకుండానే రోగం నయమగును. ఆటలమ్మ అనే పేరు రాకుండానే దేహంలో ఉండే రోగపదార్థాన్ని మలమూత్రాలు గాను చెమటగాను వెలువరించి వేస్తున్నాము. ఇది వెంటనే చేయకపోతే దేహం మీద ఎర్రనిపొక్కులు పుట్టుతవి. ఈ పొక్కులు ఎంత దట్టముగా పోస్తే దేహంలోని రోగపదార్థమునందు మండము అంత బలముగాఉన్నదని చర్మము ద్వారా రోగపదార్థము వడిగా పోవుచున్నదని అందువలన బిడ్డకు ప్రాణాపాయం లేకుండా భద్రంగా ఉంటుందని మనము తెలిసికోవలెను. పొక్కులు పలచగా వచ్చినపుడు లోపలి అవయవాలలో వేడి ఎక్కువగా ఉన్నదని దేహమునందలిమండము చాలా దుర్బలముగా ఉన్నదనీ బిడ్డకు అపాయము ఎక్కువగాఉన్నదనీ తెలిసికోవలెను. అప్పుడు ఊపిరితిత్తులు వేడియెక్కి ప్రాణాపాయము సంభవించుట కలదు. దీనివలన తేలినది యేమంటే

ఆటలమ్మ వలన ప్రాణాపాయం రాదు. ఆటలమ్మ తిన్నగా పోయక పోవటంవల్లనే ప్రాణాపాయం వస్తుందీ అని.

పరిపూర్ణ ఆరోగ్యము కలుగుటకై మనము రోమరంధ్రములను వికసింప జేస్తాము. అంతే కాకుండా లోపల అవయవాలను పీడిస్తూఉండే అంతర్గతమగు వేడిని సాంతముగా తగ్గించుటకు చన్నీటి చికిత్సలు చేస్తాము. దానితో జ్వరము తగ్గుటయే గాక తిరిగి జీర్ణశక్తి వృద్ధి అవుతుంది. దేహములోపల వేడిని కటి లింగ స్నానములతో తగ్గిస్తాము. తల్లి ప్రక్కలో బిడ్డ గనుక పరుండేటట్లయితే ఆమె వంటి వేడివలన బిడ్డకు చెమట పోస్తుంది. లేదా బిడ్డను ఉన్ని గుడ్డలో గాని, దూదిపరుపులో గాని పరుండ బెట్టవలయును - బిడ్డ పీల్చుటకు నిరంతరాయముగా చల్లని గాలి వచ్చుటకు అనువుగా కిటికీలను తెరచి ఉంచవలెను. బిడ్డకు తల్లి ప్రక్కలో గాని, పరుపుమీదగాని పరుండ బెట్టినపుడు చెమట పోయకపోతే చెమట పట్టుటకు వేడినీటి ఆవిరిస్నానము చేయింపవలయును. నేను కనిపెట్టిన మడతలకుర్చీమీద ఈ ఆవిరిని సులభముగా పట్టవచ్చును. వేరువిధముగాకూడా బిడ్డకు చెమట పోయుటకు అనువుగా ఆవిరి పట్టేపద్ధతి ఎవరికి వారు ఏర్పాటు చేసుకోవచ్చు. ప్రతి ఆవిరిస్నానానంతరం, ఆవిరిపట్టిన భాగం చల్లపడుటకు ఒక కటిస్నానం చేయింపవలెను. బిడ్డకు చెమట పోసినతోడనే చాలా మేలు గలుగుతుంది. బిడ్డ స్థితి బాగుపడు తుంది. జ్వరము తిరిగి వచ్చినపుడల్లా కటి లింగ స్నానములలో నేదో చేయించి దేహముయొక్క వేడిమి తగ్గించి బిడ్డను ప్రక్కమీద కప్పి పరుండబెట్టవలయును. ఇట్లు పరుండబెట్టి నందున బిడ్డకు దేహము కొంచెము చెమర్చును. జ్వరము తిరిగి

తిరిగి వచ్చినప్పుడల్లా యిట్లే శైత్యోపచారము, ఉష్ణోపచారము చేయుచుండ వలసినది. రోగపదార్థమందము యొక్క పీడనము తలకాయలో జాస్తిగా ఉన్నపుడు కన్నులకు జబ్బుచేయును. ఇట్లే యింకా ఏ అవయవములోనైనా పీడనము ఎక్కువగా నున్నయెడల ఆ ప్రదేశమునకు మాత్రము మృదువగు వేడి నీటి ఆవిరిని పట్టవలయును. ఆచోట చెమట పోసినంతనే ఆ భాగం మీద నుండే వత్తిడి తగ్గిపోతుంది. ఆఅవయవము నశించిపోయే అపాయం తప్పిపోతుంది. ఆయా ప్రదేశాలలో చేసేచిన్న ఆవిరిస్నానాలతర్వాతకూడా ఒకకటిస్నానమో, లింగస్నానమో, చేయవలసినది. అందువలన ఆ యా ప్రదేశములయందు కల్గిన వేడి ఈ కటి లింగ స్నానములచే తగ్గిపోవును. జ్వరమును గురించి ఆటలమ్మను గురించి నేను మొదట చెప్పిన విషయాలను చూచినట్లయితే దేహమునందు, ఎక్కువగా చేరియున్న రోగపదార్థము ఏదో కారణముచేత మందముపొందినదనీ దానివలననే దేహములో జ్వరము ఆటలమ్మ గలిగినదనీ తెలియుచున్నది. ఇందువలన ఇతిర విధాలుగా, కనుపడే రోగాలన్నీ యేకారణము చేత కల్గుతున్నవో అదే కారణంచేత ఆటలమ్మ కూడా గల్గినదని రూఢియగుచున్నది.

## పొంగు

ఆటలమ్మకున్న లక్షణాలే పొంగుకుకూడా ఉంటవి గాని యిందులో జ్వరము ఎక్కువగా ఉంటుంది. జ్వరము ఎక్కువగా ఉన్నది గనుక చికాకుగూడా యెక్కువగా ఉంటుంది. పొంగులో మొదట సన్నని పొక్కులుపుట్టి తర్వాత పెద్దవి అవుతవి.

ఆటలమ్మలో వలె పొక్కులు దేహమంతటా పుట్టక తలమీద మొదలుకొన్న ఉదరము మీద పొక్కులుంటవి. పాదాల మీద పొక్కులుండవు. దేహమంతా కూడా ప్రచండమైన వేడిమి ఉంటుంది. పాదాలు మాత్రము చల్లగా ఉంటవి. తల, హృదయము ఈవ్యాధిలోన యెక్కువగా వేడి యెక్కుతవి. ఈ వ్యాధి వచ్చిన, బిడ్డలు-కన్నులు చెవులు పోట్లుగను మంటలు గను ఉన్నవంటారు. ఈ లక్షణాలను సులభంగా అర్థము చేసు కోవచ్చు. ఉదరమునందలి రోగపదార్థమునందు గల్గిన మండము ఊర్ధ్వముఖముగా వ్యాపించి కంఠములో నుండి శిరస్సులోనికి వెళ్ళిపోయినది. అదివరికే అచట చేరిన రోగపదార్థమునందును, తీవ్రమగు మండము గల్గినది. ఆటలమ్మయందు వలెనే యీ పొంగువ్యాధి యందును పొంగుపోసిన ప్రదేశము ఎంత తక్కు-వగా ఉంటే ప్రమాదం అంత యెక్కువగా ఉంటుంది.

అయితే తొందరగాను నమ్మకముగాను ఈ రోగాన్ని కుదు ర్చుటయెట్లు? అనే ప్రశ్న వస్తున్నది. ముఖ్యంగా కన్నులు చెవులు శాశ్వతముగా చెడిపోకుండా మొట్టమొదట చికిత్స జేయాలి. శిరస్సునకు మృదువుగా ఆవిరిపట్టితే తలలో ఉండే రోమరంధ్ర ములు వికసించి అందు మండమునొందుచున్న రోగపదార్థము వెలువడును. తల ముఖము యొక్క చర్మము. ఈ విధముగా మెత్తపడినంతనే ఆప్రదేశములో నుండే పీడనము కూడా తగ్గి పోతుంది. తిరిగి కొద్దికాలానికే బాధలు కన్పడుతవి. అప్పుడు తలకు మళ్ళీ యింకొక ఆవిరిస్నానము పట్టవలసినది. ఇట్లు అనేక తూరులు పట్టవలసివస్తుంది. అయితే యింతమాత్రముతో అపా యము తీరింది అనుకోవటానికివీలు లేదు. దేహమునందు మండము

పొందుచున్న రోగపదార్థాన్ని ఇతరవిధముల వెలువరించక పోతే కన్నులలో చెవులలో ఉండే పోట్లు ఉండిఉండివస్తూనే యుంటుంది. కటి లింగ స్నానములు చేయుటవలన రోగపదార్థము మల మూత్రాలుగాను, చెమటగాను వెడలి పోతుంది. పొంగు జ్వరము వచ్చినప్పటి నుండి జీర్ణక్రియ క్రమముగా ఉండదు. తల్లిదండ్రులు గుర్రుపట్టి యుండక పోవచ్చును గాని జ్వరానికి ముందు నుంచి కూడా బిడ్డయొక్క జీర్ణక్రియ చెడే ఉంటుంది. జ్వరమువలన - జీర్ణ అవయవాలలో నుండే ఆమత్వచము ఇగురుకు పోతుంది. అవి పొడిగా ఉంటవి. అవి పనిచేయ లేవు. మలబంధము కూడా ఉంటుంది. చల్లని నీరు దానితో కలిపి రుద్దుట ఉంటుంది, గనుక చల్లని కటిస్నానమువలన జీర్ణక్రియ బాగుపడుతుంది. కొద్దికాలములోనే ప్రేగులలో నుండే వెళుసుతనం తగ్గి ప్రేగులు మెత్తబడి విరేచనం సాఫీ అవుతుంది. పొంగుజ్వరాలలో ఇది ఒక మంచిలక్షణము. ఈ వ్యాధి యందు ఎక్కువకాలం పట్టుదలగా చికిత్సచేస్తే తప్పకుండా జయము గలుగుతుంది. ఇందువలనకూడా ఆటలమ్మలోకంటె పొంగువ్యాధిలో దేహమునందలి రోగపదార్థం ఎక్కువగా ఉన్నదని దానిని వెలువరించుటకు ఎక్కువకాలం పట్టినదని తెలియవలెను. దేహమునందలి రోగపదార్థమునందు గలిగిన మండముపలననే - పొంగుజ్వరముకూడా గల్గినదని తేలుచున్నది. అయితే యిందు మండముపొందిన రోగపదార్థము చాలా ఎక్కువగా ఉన్నదని, అది శిరస్సుకంటా వ్యాపించినదని, మండము ఎక్కువగా ఉన్నదని గ్రహింపవలెను. అన్నిజ్వరాలకు ఏరోగ పదార్థము కారణమో పొంగుకుగూడా అదే కారణమని

తేలినది. నేను కుదిర్చిన ఒక పొంగు జ్వరవృత్తాంతముకూడా యిచట జేర్చుచున్నాను. లీఫ్‌జిగ్‌లో ఒకవస్తువును తయారు చేసేవా డున్నాడు. అతనికి 7 ఏండ్ల కుమార్తె 2 ఏండ్ల కుమారు. వా రిద్దరికి పొంగు చూపినది. ఆవ్యాధి చాలా తీవ్రమైనదని అది నయమగుటకు 6 మొదలు 8 వారాలవరకూ పట్టవచ్చునని వారివైద్యుడు తెలియజేసెను. ఆబిడ్డల తండ్రిపేరు డబ్లియూ, అతడు నావద్ద ఆవిరిపట్టే మడతలకుర్చీ కొన్నాడు. తనబిడ్డలకు గురించి నాతో సంప్రతించినాడు. ఇంటివైద్యుడు చెప్పే చికిత్స చాలాకాలము పట్టేటట్లు కనుపడినది. ఆపిల్లలను నేను పరీక్ష చేశాను. ఆరోగం పూర్తిగా నయము కావడానికి మనవిధానంలో 1 వారం చాలునని అతనికి వాగ్దత్తము చేసితిని. ఇదివరకు చెప్పిన చికిత్సే వారికి చేశాను. ఆబిడ్డలకు ప్రతిరోజూ ఆవిరి పట్టించేవాడను. 70, 72, డిగ్రీల ఫారెన్‌హీటుగల చల్లని నీళ్లతో కటిస్నానం చేయించేవాడను. జ్వరం ఎక్కువైనపుడెల్లా యింకొక కటిస్నానం చేయించేవాడను. జ్వరము అతితీవ్రముగా ఉండుటవల్ల ప్రతి 2 గంటలకి ఒక కటిస్నానము చేయింపవలసి వచ్చినది. ఈబిడ్డలవిషయంలో వారి పథ్యాన్నిగురించి ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలిసి వచ్చింది. మాంసాహారముగాని పోపులు పెట్టినపదార్థములుగాని తింటే జ్వరము ఎక్కువై ప్రమాదం సంభవించును. అందువలన బాగా ఆకలిగా ఉన్నపుడే పొట్టు తీయని గోధుమపిండితో చేసిన రొట్టెగాని అంబలిగానియిప్పించే వాడను. తోడుగ పండని పండ్లరసముగలవి యిప్పించేవాడను. ఇదివరకే చెప్పినట్లు ఒకవారములోపలనే ఆబిడ్డలవ్యాధి కుదిరి నది. వారి తల్లితండ్రులు సంతసించినారు. వారి కుటుంబ

వైద్యుడు ఆరోగం అంత తొందరగా నయమయితే మూత్రపిండవ్యాధి వస్తుందన్నాడు. అట్టివ్యాధి రాలేదు. ఆ బిడ్డలకు రోగం పూర్తిగా నయమైనదని అతడు ఒప్పుకోనవలసివచ్చినది.

## సర్పి

ఈ వ్యాధి చాలా అపాయకరమైన దగుటవలన ఈరోగంపేరు చెపితేనే, తల్లిదండ్రులు హడలిపోతారు. పైవ్యాధులకు, దీనికీ పోలిక లేదు. ఈవ్యాధిలోకూడా జ్వర ముంటుంది. జ్వరము కూడా అంతతీవ్రముగా ఉండదు. బిడ్డలకు వచ్చినవుడుగూడా యిట్లాగే జ్వరము తగ్గిఉంటుంది. శ్వాస సులభంగా ఆడదు. అందువల్ల ఆ బిడ్డలు ఆందోళనపడుతుంటారు. ఇట్లాంటి పిల్లలకే ప్రమాదం ఎక్కువ. ఈవ్యాధిలో జ్వరములోపలఎక్కువగా దహించుతూ ఉంటుంది. చర్మము తిన్నగా పనిచేయక పోవుటవలన చెమట పోయదు. ఎప్పుడోగాని మలమూత్రములు కావు. పోవటానికి చోటు లేక ఉదరమునందలి రోగపదార్థమంతము ఊర్ధ్వముఖముగా నడచును. ఇట్టి రోగులకే ఎక్కువ ప్రమాదములు వస్తవి. ఆటలమ్మ పొంగులో వలెనే సర్పివ్యాధిలో గూడా రోగపదార్థాన్ని వెలువరింపగలిగితే ప్రమాదము తప్పుతుంది. ఆటలమ్మపొంగువలె గాకుండా యీ సర్పిలో జ్వరము లోపల యెక్కువగా ఉంటుంది. లోపలనున్న జ్వరాన్ని చర్మముమీదికి తెప్పించలేకపోతే ప్రమాదము తప్పదు. మలమూత్రములు తిన్నగా వెడలవు - చర్మము తిన్నగా పనిచేయదు. ఇక మంశపదారము పోవడానికి ఒకేత్రోవ ఉన్నది. అదే కంఠము — కంఠంలోకుండా రోగపదార్థం యావత్తు

పోవలసివచ్చేటప్పటికి, శ్వాసకు ఆటంకము ఏర్పడి ప్రాణాపాయము సంభవిస్తుంది. ఇట్టి అపాయం సిద్ధంగా ఉన్నపుడు తాత్కాలిక ఉపశాంతికొరకై కంఠానికి ఉపశాంతి చేయాలి. కంఠానికి ఆవిరిపట్టినపుడు గొంతును పీకిస్తూ ఉండే రోగపదార్థం తొందరగా వెడలిపోతుంది బాధకూడా తగ్గుతుంది ఇందువల్ల తాత్కాలిక అపాయం తప్పిందే గాని దేహంలో ఉన్న రోగపదార్థం అలాగే ఉన్నది. అయితే తాత్కాలికంగానైనా దేహంలో ఉండే రోగపదార్థాన్ని వెలువరించుకొనేటందుకు మనకు కొంత వ్యవధి దొరికింది. ఉదయమునందలి రోగపదార్థము వెడలిపోవటానికి మన ముపయోగించే కటిలింగస్నానమువలన కంఠంలో నుండే వత్తిడికూడా తగ్గిపోతుంది. దీర్ఘములగు లింగస్నానములవలన గొంతులో పుట్టుతూ ఉండే సర్పిపొక్కులు అత్యద్భుతముగా తగ్గుతవి. గొంతువంకకు పోయిన రోగపదార్థముయొక్క వత్తిడివలనను మండము నందలి పులుపువలనను గొంతంతయు వాచి లోపల పుండగును. సర్పిపొక్కులకన్నా యివి ఎక్కువప్రమాదకరమైనవి. సర్పిరోగం రాకపూర్వము మోకాళ్ళలోను - భుజములలోను నొప్పిగా ఉన్నట్లు రోగి చెప్పును. ఇచ్చోట కల్గిన మంటలను రోగి కొంతకాలము భరించగలడు. గాని, గొంతులోని మంటలను భరించుట చాలాకష్టము. అందువలన గొంతులో మంటలు పుట్టకుండా శ్రద్ధ తీసుకొనవలయును. సర్పిపొక్కులు తగ్గినంతనే చికిత్స ఆపివేయరాదు. మలమూత్రములు తెంపుగా అవుతూ జీర్ణక్రియ బాగుపడేవరకూ కటిలింగస్నానములు చేయుచూ జాగ్రత్తగానుండవలెను. అంతవరకూ రోగికి ప్రమాదము తప్పి,

నట్లు కాదు. చర్మముక్రింద చేరిన రోగపదార్థము చర్మము ద్వారా బైటికి పోవలసియున్నది. ఈ సంగతి ఇదివరకే చెప్పితిని. మూతిమూసిన రబ్బరుతిత్తిలో పులిసిన పదార్థము పోసినపుడు అందు కలిగిన మండమువలన విరివిచెంది రబ్బరుతిత్తిని అన్నివైపులను పీడించును. అది విరివిచెందకుండాను, వత్తిడి లేకుండాను, తప్పించుకోలేదు. అయితే ఆ తిత్తికి సన్నని రంధ్రములను పొడిచితిమేని, లోపలిపదార్థము వెలుపలికి వచ్చి రబ్బరుతిత్తియొక్క వైశాల్యం తగ్గిపోతుంది. అదేవిధముగా, ఆవిరితో రోమరంధ్రముల వికసింపజేసినయెడల దేహావయవములను పీడించే రోగపదార్థమండము ఆ రోమరంధ్రములగుండా బైటకు వచ్చి ఆరోగ్యము గల్గును. ఆరోగ్యము కోరేవారంతా తమకు బాగా చెమట పోసేటట్లుగా చూచుకోవలసినది. ఆరోగ్యవంతుని చర్మము, ఎండిపోక, తగుమాత్రము తేమగలిగి – సమశీతోష్ణముగా ఉండును. చర్మము ఎండి పెళుసుఎక్కి ఉంటే తప్పకుండా అది రోగలక్షణమే. సర్పి రోగములో చర్మము ఏమీ పనిచేయదు. అందువల్ల ప్రయత్నించి అందులో చురుకు పుట్టించాలి. ఆరోగ్యవంతురాలైన తల్లి తనబిడ్డను ఈవ్యాధిలోకూడా ప్రక్కలోనే పరుండబెట్టుకోవాలి. ఇందువల్ల బిడ్డచర్మము చెమర్చి ప్రాణాపాయం లేకుండా బ్రతుకుతుంది. మలబంధం ఉన్న రోగులకు చర్మమైనా గట్టిగా పనిచేయకపోతే అపాయం సంభవించును. బిడ్డ చర్మము పొడిగా నుండ నారంభించినపుడే బిడ్డను పక్కలో పరుండబెట్టుకుని తన దేహోష్ణమువలన బిడ్డచర్మమునందు చైతన్యముగలిగించి రోమరంధ్రముల వికసింపజేసియున్నయెడలను–

అప్పటినుండియే బిడ్డకు మలమూత్రములు జారీగా అగుట యందు శ్రద్ధతీసుకుంటూ ఉంటేను, బిడ్డకు సర్పివంటి దుర్భర వ్యాధులు రావు.

ఇతరవిధాల చెమటపట్టించటానికి సాధ్యంకానప్పుడే నీటిఆవిరి నుపయోగింపవచ్చును.

సర్వరోగములకు మూలకారణమైన రోగపదార్థమే సర్పిరోగానికి కూడా కారణమని, లక్షణాలు భేదమేగాని రోగకారణంలో భేదములేదని మనము తెలిసికొన్నాము. పైన కన్పడు లక్షణాలు చూచేవారికి వేరురోగానికి - వేరువేరుకారణములు ఉన్నట్లు కనపడుతః గాని శాస్త్రజ్ఞానముగలవారికి, లక్షణాలు భేదముగా ఉన్నా రోగము ఒకటిగానే కన్పడుతుంది. నేను స్వయముగా చికిత్సజేసి నయముచేసిన రోగనివారణవృత్తాంతము కూడా యిచట చేర్చెదను.

ఒకనికుమారుడు తొమ్మిదివత్సరములవయస్సుగలవాడు, అతనికి తీవ్రమైన సర్పిరోగము గలిగినది. ఆబిడ్డకు ఒక్కసారి నీటిఆవిరి పట్టిరి. ఆబిడ్డను ఒకపేముకుర్చీలో కుర్చోబెట్టి, ఆకుర్చీక్రింద సలసల మరగకాగిన నీటికుండను పెట్టితిమి. ఆకుండలో 4 సేర్ల కాగిననీరు ఉన్నది. పాదములకు ఆవిరివచ్చుటకు పాదములక్రింద ఒక వేడినీటికాగును ఉంచితిమి. ఆకాగుపైన 2 కొయ్యముక్కలను అడ్డమువేసి పాదములు దానిమీాద పెట్టుటకు వీలుచేసితిమి. బిడ్డదేహమంతయు కంబళికప్పితిమి. దేహమంతయు చెమర్చిన తరువాత, ఆబిడ్డకు 72 ఫారెన్‌హీటు డిగ్రీల చల్లని నీటిలో కటి స్నానము చేయించిరి. ఉదరము చల్లనినీటిలో ఉండెను. తల లోని వేడితగ్గువరకును,ఇట్టి కటిస్నానముచేయించిరి. చికిత్సారంభ

మున శ్వాసపీల్చుటకష్టముగ ఉండెను. తొట్టిస్నానము చేయుచుం డగనే ఆబాధ క్రమముగా తగ్గిపోయెను. ప్రతి 3 గంటలకు ఒకే తూరి అరగంట పరిమితిగల 1 లింగస్నానము చేయింపవలసి వచ్చెను. ఇట్లు రాత్రింబవళ్ళు చేసిననేగాని జ్వరతీవ్రతతగ్గలేదు. మంచిగాలిలోనికి వచ్చుటకై ఆబిడ్డపరున్న గదితలుపు నిరంతరము తెరచియుంచితిమి. ఇట్లు చేయుచున్న స్నానములవల్ల తాత్కాలికంగా జ్వరము తగ్గుచూ మొదటిదినముననే ఆపద తప్పి పోయి నది. ఈవిధంగా అయిదురోజులు చేసేటప్పటికి ఆబిడ్డకు ఆరోగ్యము గల్గినది. ఇంతసులభముగా మన వైద్యములో రోగము నయమైనది. మందువైద్యులు యీరోగమునకు మందులు యింకను వెతుకుచునే యున్నారు.

## మశూచికము

ఈవ్యాధి చాలాతరచుగా వస్తుంది. ప్రభుత్వమువారి లెక్కలలో అవన్ని చేరవు. ఆరోగ్యశాఖవారు పెట్టే యిబ్బందులను మనసులో పెట్టికొని చాలామంది తమ బిడ్డలకు మసూచికం వచ్చినా రూల్సుప్రకారం ప్రభుత్వమునకు తెలియజేయరు. వారికి తెలిస్తే ఇంటిల్లిపాదికి - టీకాలు వేస్తారు. జ్వరాలు వస్తవి. ఇలా చేసినా మసూచికం రాకుండా ఉంటుంది అంటే అదీ లేదు. ఈబాధలు పడలేక యెవరూ ప్రభుత్వమునకు తెలియజేయరు. క్రమమైన చికిత్సచేస్తే మసూచికంవల్ల ప్రమాదము రాదు. పొక్కులు పుట్టే పొంగుజ్వరాలు యింకా చాలా ఉన్నవి. మశూచికం పెద్దమ్మవారంటారు. ఇంతకంటె చిన్న పొక్కులు లేస్తే చిన్నమ్మవారంటారు. ఇంకా వేపపూతఅని

తట్టమ్మవారని అనేకరకా లున్నవి వీనిఅన్నిటిలోనికి మసూచికము చాలా ప్రమాదకరమైనది. ఇందు జ్వరము తీవ్రముగా ఉంటుంది. జ్వరాన్ని నయముచేయుడానికి మందులు వేస్తే తప్పకుండా ప్రాణము పోతుంది. అందుకనే మసూచికం అంటే ప్రజలు అంతగా భయపడుతారు. చాలారోజులు రోగంతో తీసుకునే కామిలాకంటే, తత్కాలంలో ప్రాణం పోయే వ్యాధులంటే ప్రజలకు చాలా భయము. నిజానికి, కామిలారోగము సామాన్యముగా నయముకాదు. నయమైనా చాలాకాలము పట్టును. మశూచికమునకు సరిఅయిన చికిత్స తెలియనందున టీకాలతో మశూచికం రాకుండా చేసామని చేసే ప్రయత్నములో ప్రమాదములు సంభవించుచున్నవి. మనవైద్యములో, సరిఅయిన చికిత్స ఉన్నదిగాన మశూచికమువల్ల ప్రమాదము లేదు. తేలికగా నయమవుతుంది. మశూచికానికి టీకాలతో పనీ లేదు.

మసూచికము పొక్కులు వచ్చినతరువాత సులభంగా అందరికి తెలియును.కాని మొదటలో నిది కూడా అన్నిజ్వరాలమాదిరిగానే ఉంటుంది, నెమ్మదిగా ఎర్రనిపొక్కులు పుట్టును. అవి మొదట చిరుసెనగలంత ఉండి తర్వాత పెద్దవగుతవి. ఆపొక్కులు సగము చర్మములో నుండి తక్కినసగము పైకి ఉబుకుతవి. ఆపొక్కునెత్తిన నల్లని చుక్క పుట్టుతుంది. ఇట్టి పొక్కులు దేహమంతటా పుట్టవచ్చు. లేక కొన్నిభాగాలలో పుట్టవచ్చు. దేహములో చేరిన రోగపదార్థము వ్యాపించిన రీతినిబట్టి ఈ పొక్కులు పుట్టుట ఆధారపడి ఉంటుంది. దేహంలో ఉన్న రోగపదార్థము ననుసరించే మండముయొక్క ఉత్పత్తికూడా

ఉంటుంది. ముఖముమీద పొక్కులు ఎక్కువగా పుట్టినపుడు ముఖము అందవికారమగుట తటస్థించును. మనవైద్యములో అయితే ముఖమున మచ్చలు గుంటలు పడవు. కొందరికి దేహ మంతా పొక్కులు పుట్టడం, కొందరికి కొంతభాగమే పొక్కులు పుట్టడం, కొందరికి తలమీద పొక్కులు కలగడం కొందరికి పల్చగా పోయడం, కొందరికి వత్తుగా పోయడం జరుగుతుంది. ఇందులో ఆకస్మిక సంభవము, ఏమీ లేదు. రోగపదార్థము వ్యాపించిన రీతిని బట్టి, పరిమితిని బట్టి, అట్లు తటస్థించుచుండు నని మనకు స్పష్టముగా తెలియును. ఈవిధముగా మిగత భాగా లలో పొక్కులు ఏమీ లేకుండా కొంతమందికి ముఖమున గుంటలు పడుటయు, కొంతమందికి వేరువేరు చోట్ల మచ్చలు పడుచుండుటయు తటస్థించుచున్నది. శిరస్సు రోగపదార్థము వ్యాపించుటలో చివరిభాగము మండముపొందుచున్న రోగపదా ర్థము ఇచ్చటికి వచ్చిఆగిపోవును. రబ్బరుటోపి పెట్టిన సీసావిష యములో జరిగినట్లే యిందుకూడా రోగపదార్థము శిరస్సు వంకకు వడిగా నడచి అందు తీవ్రమగు పీడనము గలిగించును. చాలావిషయములలో మసూచికపుపొక్కులు బాగుగా పోసిన యెడల అపాయము తప్పిపోయినట్లే. ఏమంటే యెవరిలో ధాతు శక్తి తక్కువగా ఉండి దేహములో మరికి పొక్కులు పొక్కవో వారికే ప్రాణాపాయం సంభవించును. అట్టివారికి మరణించిన తర్వాత పొక్కులు అకస్మాత్తుగా బైటికి రావడము కద్దు. ఇక్క డకూడా మసూచికం బాగా పొక్కులుగా పోయకపోవడం చేత ప్రాణాపాయం సంభవించును.

కొంతమందిరోగులు తీవ్రమైన జ్వరములోనే చనిపోవుచుందురు.

మిగతా పొంగుజ్వరములలోవలె మసూచికంలోకూడా తీవ్ర మగు జ్వరము ఉంటుంది. ఈ జ్వరము పొక్కులుపొక్కే-దాకా యెక్కువగా ఉండి తర్వాత తగ్గిపోతుంది. పొక్కులు చాలా దురదగాను మంటగాను ఉంటవి. రోగి ఆ బాధకు గోకుతాడు. అవి సరిగా పక్వముగాకమునుపే బద్దలయిపోతవి. అందువల్లనే అట్లు పొక్కులు చిట్లినచోట గుంటలుపడుతవి. పూర్వకాలంలో కూడా ఈసంగతులు తెలుసు. రోగిని గోక్కోకుండా రోగిచేతిని పాపము కట్టివేసేవారు. ఇప్పటికీ వైద్యులు ఈసలహానే యిస్తూ ఉంటారు. ఈ సలహావల్ల రోగులు ఎంతబాధపడేది వారికి తెలియదు. మనవైద్యము రోగులపాలిటి వరప్రసాదము. మన వైద్యములో మసూచికములో గుంటలుపడవు. ప్రాణాపాయ మునూ సంభవింపదు. మనము సామాన్యముగా జ్వరమునకు చేసే చికిత్సతోనే దురద, మంటలు, లేకుండా చేస్తాము. వీటి ఆవి రితో చర్మరంధ్రముల వికసింపచేస్తాము. చెమట పోస్తుంది. ఉద రమునందలి మండమువలననే పొంగును,కటిలింగస్నానములతో తగ్గిస్తున్నాము. వేడిమి తగ్గియున్నచోట సారాయము పొంగదని మనకు తెలియును. అట్లే ఉదరమును కటిలింగస్నానములతో చల్లబరచినపుడు ఉదరమునందలి రోగపదార్థపు పొంగులో తీవ్రత తగ్గిపోవును. వేడి పెరిగినకొలది మండము వృద్ధిఅగుటయు వేడిమి తగ్గినకొలది - మండము తగ్గుటయు తటస్థించును.

ఈవ్యాధియందు, దేహతత్వమంతయు మిక్కిలి ఉద్రిక్తమై యుం టుంది. గనుక నెమ్మదిగను శాంతముగను శ్రద్ధగను చికిత్సచేయ వలెను. రోగాన్నిగురించి చెప్పే బీభత్సము, మనవైద్యమువలన

తగ్గిపోతుంది. ఎవరికోతప్ప తొందరగాను నిశ్చయంగాను రోగ నివారణ అవుతుంది. దేహము రోగపదార్థముతో మిక్కిలిగా పూరింపబడి యున్నపుడును, అదిగాక దే ధాతుశక్తి మిక్కిలి తగ్గియుండి రోగపదార్థమును వెలువరించే సామర్థ్యమును గోలు పోయినపుడును, అరుదుగా అపాయము సంభవించును. అప్పు డైనను, రోగప్రారంభములోనే చికిత్స మొదలుపెట్టినయెడల అపాయము సంభవింపక రోగనివారణమగుచున్నది. అందువలన ఎట్టిజ్వరమైనను అది యేజ్వరమో నిర్ణయింపవలసిన పనిలేకుం డానే మొదటినుంచేమనచికిత్స చేయనారంభింపవలెను. ఇట్లుచేసి నపుడుప్రమాదాలు లేకుండారోగనివారణమవుతుంది. అందువల్ల చికిత్స యెప్పుడూ వెంటనే మొదలుపెట్టవలెను.

ఇంతభయంకరమైన మసూచికానికిగూడా సామాన్యజ్వరాలకు చేసే చికిత్సే, పనికివస్తుంది. దానితోనే మసూచికంగూడా నయ మవుతుంది. సర్వరోగాలకు కారణ మొకటే అయినపుడు ఏ రోగమైనా ఒకటే చికిత్సతో నయమవుతున్నపుడు, మసూచికం అంటే మనకు భయం లేకుండా పోయింది. ముఖనిదాన శాస్త్రము మన కిపుడు లభించినది. గనుక మసూచికము వంటి ప్రబలమయిన శుద్ధిక్రియ రాకపూర్వమే అనేకసంవత్స రాలు ముందుగానే, మనము కనిపెట్టి రోగము రాకుండానే దేహమును కాపాడగలము. నేను స్వయముగా చికిత్సజేసి నయ ము చేసిన ఒక రోగనివారణ వృత్తాంతమును ఇచట జేప్పుచు న్నాను. ఒకడు యంత్రాలయములో పనిజేయుచున్నాడు. అతనికి ఏ గురు సంతానము. అందులో 7,9, 13, వయస్సుగల 3 గురు

బిడ్డలకు మసూచి వచ్చినది. అంతకుముందే తండ్రికి మసూచికం వచ్చిఉండెను. అందువలన ఆరోగం ఎంతబాధాకరమో తెలుసు. రాబొయ్యే ప్రమాదముకూడా అతనికి తెలుసు. అధికారులకు తెలిస్తే తనను తనకుటుంబాన్ని పెట్టేబాధలు కూడా అతనికి తెలుసు. ఎవరికి తెలియకుండా బహురహస్యముగా తొట్టి వైద్యము మొదలిడినాడు. ఆవిరి. కటిస్నానము చేయించేవాడు. అప్పటికేరోగము తీవ్రదశలో ఉన్నది. బిడ్డల దేహముమీదఅవి పొక్కులు పుట్టినవి. కనుపడకుండా ఉండుటకొరకు బూడిదరాచే వాడు పడితే ప్రభుత్వపు వారు చిక్కులు పెడతారు. ఒక్కొక్కరికి మొత్తం 4 ఆవిర్లు 10 కటిస్నానములు చేయించేసరికి జ్వరము తగ్గినది. అపాయము తప్పిపోయింది. చర్మముపై పొక్కులు కూడా రాలిపోవడం ఆరంభించినవి. ఉద్రేకం కలిగింపని ఆహారము, చల్లని నిర్మలమైనగాలి చికిత్సకు తోడుపడినవి. ఆవిరి, ఉపశమన స్నానములు ఇంకా కొన్ని రోజులు చేయించేసరికి ఆ బిడ్డలు లేచి బైట తిరుగగల్గిరి. ఇంకోవారం చేసేసరికి పరిపూర్ణారోగ్యము కల్గినది. ఆశ్చర్యమేమంటే అందులో ఒకబిడ్డ వంటిమీదా మసూచికపు పొక్కు కనుపించుటయే లేదు. దీని వలన తేలినదేమంటే – టీకాలువేసి మసూచికం రాకుండా చేసుకోవడం సంశయాస్పదము. దేహములోనున్న మురికికి తోడు టీకాలవలన కొత్తమురికి చేరుతుంది. మనవైద్యవిధానంగా చికిత్సచేస్తే మసూచికం రాకుండాపోతుంది. వచ్చిన మసూచికానికి చికిత్సచేస్తే ప్రమాదమురాకుండా పోతుంది. టీకాలయొక్క, పనికిమాలినతనాన్ని గురించి నేనెక్కువగా చెప్పదలచుకోలేదు. టీకాలువేయుడమంటే, రక్తములోకి బుద్ధి

పూర్వాకముగా సంరికిని ఏక్కించుకొనుటయే. ఇట్టి అసహజమైన పగతిని మానవులు ఎలా అవలంబిస్తున్నారో నాకు ఆశ్చర్యముగా ఉన్నది. సరిఅయిన జ్ఞానం లేకపోతే యిలాగే. అద్భుతాలమీద నమ్మకము పుడుతుంది.

## కోరింత దగ్గు

మసూచికము, కలరా, సర్పి మొదలగు వ్యాధులను చూస్తే అందరికి భయముగా ఉంటుంది. అయితే కోరింతదగ్గును చూస్తే యెవరికీ భయములేదు. కాని చాలామంది పిల్లలు ఈ కోరింత దగ్గుతోటి చనిపోతారు. ఒకవేళ కొంతిమంది చావకుండా బ్రతికినా చాలకాలము ఎక్కువ బాధ పడతారు. ఏమైనా దగ్గు రావటము మంచిలక్షణము కాదు. దేహములో రోగపదార్థము ఎక్కువగా లేనిదే దగ్గురాదు. మలమూత్రకోశములు తిన్నగా పనిచేయక దేహంలో ఉండే రోగపదార్థము పైకి నడచినపుడే దగ్గు వస్తుంది. చర్మము తిన్నగా పనిచేసినా, మలమూత్రకోశములు బాగా పనిచేసినా దగ్గు రాదు.

కోరింత దగ్గువచ్చిన పిల్లలకు కూడా దేహంలో రోగపదార్థము ఉండటము, అందులో మండము పుట్టటం, దానివల్లనే వేడి పుట్టుటయు నుండును. మలమూత్ర కోశములు తిన్నగా పని చేయవు. చర్మములోకూడా చైతన్యము తగ్గి చెమట తిన్నగా పోయదు. అట్టి సందర్భములో ఉదరమునందు పుట్టినమండము, ముఖమువంకకు నడుస్తుంది. తీరా దగ్గువచ్చినపుడు పోసే చెమటతో మనకు సంబంధము లేదు. అప్పుడు చెమటపోస్తే యితర చికిత్సలతో పని లేకుండా పోతుంది. అప్పుడుకూడా చెమట,

పోయకపోతే ముఖము నల్లపడుతుంది. ఒకొక్కప్పుడు ప్రాణం కూడా పోతుంది. అట్లా మరణించిన బిడ్డలకు చనిపోయినతర్వాత కన్నులలోనుండి, ముక్కులలోనుండి. చెవులనుండి నెత్తురుకారుతుంది. అంటే రోగపదార్థానికి పోయే మార్గము లేక యీ ద్వారములవెంట బైటికి వచ్చినది. ఇట్టిస్థితిలో చికిత్స యేమీలేదు. అయినను సకాలములో చికిత్స జేసినయెడల ఎంతతీవ్రమైన కోరింతదగ్గు అయినా సులభంగానే నయము చేయువచ్చు.

ఈ జబ్బులోగూడా అదేచికిత్స. అన్ని రోగాలకు కారణము ఒకటైనపుడు చికిత్సకూడా ఒకటిగానే ఉంటుంది. మొట్ట మొదట వెంటనే చెమట కలిగించుటకు ప్రయత్నించ వలెను. ఊర్ధ్వముఖముగ వ్యాపించుచున్న రోగపదార్థమును క్రిందకు మల మూత్ర కోశములదరికి, ఆకర్షింపవలెను. దేహములోనుండి మాలిన్యములు వెడలుటకు ప్రకృతి సిద్ధమైన అవయవాలు మల మూత్ర కోశము లే. కటిలింగస్నానములు చేయుటవలన పైకి పొంగుచున్న రోగపదార్థము పొత్తి కడుపువంకకు ఆకర్షింపబడును. అచటనుండి సహజమార్గమున మలమూత్రములద్వారా వెడలిపోవును. చెమట పోసినంతనే దగ్గుబాధ తగ్గిపోవును. జీర్ణక్రియ బాగుపడినంతనే రోగము శాంతించును. రోగనివారణకు ఎంతకాలము పట్టునో చెప్ప లేము. రోగపదార్థ పరిమితినిబట్టి వ్యాధి కొన్నిదినములలో నయము కావచ్చు. కొన్ని వారాలు పట్టవచ్చు.

కోరింతదగ్గు వచ్చిన తరువాత 2-3 మాసాలవరకు నయము కాదని చెపుతారు. ఇది సరికాదు. మనవైద్యము చేస్తే అంత

కంటె తొందరగా నయమవుతుంది. అన్నిరోగాలకు వలెనే కోరింతదగ్గు కూడా రోగపదార్థ సంచయమువలన కలిగిన వేడిమి వలననే వస్తుంది అని మనము తెలుసుకున్నాము. దేహానికి అపకారము చేసే రోగపదార్థమును వెలువరించుటకు దేహముచేసే ప్రయత్నమే ఈ తరుణజ్వరములు అని మనకు రుజువు అయినది. కనుక ఇట్టి తరుణజ్వరాలు వచ్చినపుడు, మనము విచారపడక సంతోషించవలెను. సరిఅయిన చికిత్సచేస్తే దేహములో నుండే రోగపదార్థము, అంతయూ వెడలిపోవును. అందు వలన ఆరోగ్యమును కలిగించే వ్యాధులు దేహానికి ఎంత మేలు చేస్తాయో మనము గ్రహించవచ్చు. నేను చెప్పదలచిన దేమో, యింకో ఉదాహరణముతో చెప్పెదను. మనకు అప్పుడప్పుడు కనుపడే జడివానవంటిదీ జ్వరము. జడివానకు ముందు చాలా ఉక్కగా ఉంటుంది. గాలి ఆడినట్టే కనపడదు. ఇవ్వాళ చాలా ఉక్కగా ఉన్నదీ అంటాము. ఆవిధంగానే జ్వరానికి ముందుకూడా చలిచలిగాను బద్ధకంగాను ఉంటుంది. నిస్సత్తువగాను ఉంటుంది. ఉక్క యెక్కువై పెద్దవాన కురుస్తుంది. అలాగే బద్ధకంఎక్కువై జ్వరము వస్తుంది. పెద్ద వాన కురిసిన, గాలి చల్లబడుతుంది. వాతావరణము చల్లబడుతుంది. ప్రాణానికి హాయిగా ఉంటుంది. జ్వరముతో ఆపద వస్తుంది, జ్వరము నయమైనంతనే, ఆపద తీరిపోతుంది. దేహంలో ఉన్న రోగపదార్థము వెడలిపోవుట వలన దేహము తేలిక పడుతుంది.

ఆరోగ్యము కలుగుతుంది. పై ఉదాహరణలో పేర్కొనిన జడి వాన, జ్వరము, అపాయకరమైనవి సక్రమముగా అవి వెడలి

పోయిన తర్వాత — వాతావరణము నందును, దేహమునందును, అమిత సౌఖ్యముగా ఉంచును, ఆరోగ్యం రావాలంటేను, వాతావరణము నిర్మలము కావాలంటేను, జ్వరము, జడివాన రాక తప్పదు. ఇందులో ఒకదానికి కారణము దేహములోనున్న రోగపదార్థము. రెండవ దానికి కారణము గాలిలోని తేమ. ప్రకృతి యందు నియమాలన్నీ యిలాగే సరుగా ఉంటవని దీనినిబట్టి తెలిసికోవచ్చు. కోరింత దగ్గుకుకూడా నాచికిత్సాలయములో ఏలా చికిత్సజేసి నయముచేశానో యిట పేర్కొనుచున్నాను. 1889 సంవత్సరం జులై మధ్యభాగంలో లిప్‌జిగ్ నగరములో 4ఏండ్ల పిల్లవానికి ఒకనికి కోరింతదగ్గువచ్చింది. ఆగష్టు మొదటి భాగంలో ఆకోరింతదగ్గు ఎక్కువైనది. 2 ఏండ్ల ఆడపిల్లకు ఇంకొకతెకు కోరింతదగ్గు వచ్చినది. 10 రోజులలో ఆ కోరింతదగ్గు మరింత ఎక్కువైనది. ఈ రోజుల్లో బిడ్డకు ఆహారంఅవుసరం లేకుండాపోయినది. అదివరదాకా వారికి తెలిసినట్లుప్రకృతివైద్యమే చేస్తూఉండేవారు. అపుడు నా సలహా కోరినారు. ఆచిన్నపిల్ల అప్పటికే దుర్బలముగాఉన్నది. నిలుచోలేదు. ఆబిడ్డలకు దినమునకు 4 లింగస్నానములు చేయించి పరుపుమీద పరుండబెట్టే వాడను. చెమటపోయుటకు ప్రతిదినము, ఒక ఆతపస్నానము చేయించేవాడను. స్వాభావికమైన ఆహారాన్ని ఇప్పించేవాడను. వాతావరణము బాగున్నది. ఆతపస్నానములకు వీలయ్యేది. తోడుగాజేసిన లింగస్నానములు, బాగుగాపని చేసినవి. శ్రద్ధగా కొన్ని వారాలు మన చికిత్సచేసినతర్వాత, అపాయం తప్పిపోయినది. 2వ నెలలో సంపూర్ణముగా ఆరోగ్యము కలిగినది. పథ్యము విషయములో ఆ చిన్నబిడ్డ — ఉప్పు, పంచదార, వెన్నచేర్చని

జావ త్రాగేదికాదు. అలవాటుపడిన కాచనిపాలు - పంచదారతో చేసిన చోకలెట్లు తినేది. దీనివలన మనము తెలిసికొనవలసినది యేమంటే చిన్నబిడ్డలకు పసితనమునుంచే స్వాభావికాహారములు అలవాటు చేయవలయును. ఆ బిడ్డను చిన్నప్పటినుండి వేరే ప్రక్కమీద పరుండబెట్టేవారు. అందువల్ల ఆ బిడ్డను తల్లిప్రక్కమీద పరుండబెట్టుట సాధ్యముకాలేదు - తల్లిపక్కలో పరున్న బిడ్డకు తల్లి దేహపువేడివలన తేలికగా చెమట పోస్తుంది అందువలన, ఆబిడ్డను తల్లిప్రక్కలో పరుండబెట్టినప్పుడు, తన చిన్న ప్రక్కకోసముని ఆబిడ్డ యేడ్చేది. ప్రకృతిలో జీవించే జంతువులను చూచినపుడు మనకీ సంగతి తెలుస్తుంది. అవి తమబిడ్డలను తమ వంటివేడితో వెచ్చనచేసి బలపరుస్తవి. పిల్లలు ఆరోగ్యంగా ఉన్నపుడే, తల్లిపక్కన పరుండుట, అలవాటుచేయాలి. అలాచేస్తే వ్యాధి వచ్చినపుడు తేలికగా తల్లి ప్రక్కలో పడుకుంటారు. దానితో ఆరోగ్యము వస్తుంది. ఒకరి గాలి ఒకరు పీలుస్తారనే భయానికిచోటు లేదు.

## గండమాల

ఈ వ్యాధియందు మిగతా జ్వరములయందువలె వేడిపుట్టదు. అందువల్ల మిగతా జ్వరములతో ఈవ్యాధిని చేర్చుట లేదు. అయితే రోగపదార్థములేనిదే యీ గండమాలవ్యాధి రాదు. అందువలన, నేను గండమాలను వానితోనే చేర్చినాను. ఈ వ్యాధియును మిగతా రోగములంతకన్న ప్రమాదకరమైనదే. ఈవ్యాధి పితృయముగ సంక్రమించే వ్యాధులలోనిది. చిన్నతనములో జ్వరమువస్తే ఈరోగపదార్థము వెలువడిపోయేది. రోగ

పదార్థమును వెలువరించే ధాతుశక్తి దేహములో లోపించుట వలననే గండమాలవ్యాధి కలిగినది. సమశీతోష్ణమండలాలల్లోను, ధృవ మండలాల్లోనూ ఈవ్యాధి యెక్కువగా వస్తుంది. బైటికి కనుపడే లక్షణాలుఏవనగా పెద్దతల, చదరమైన ముఖము, ఎర్రని కన్నులు, లావైనదేహము, దుర్బలమయినకాళ్ళు, రూపభేదము గల పాదములు, చేతులు, తెలివితక్కువ తనము. ఈ లక్షణాలన్నీ అందరియందు కన్పడవు. కొందరిలో కొన్ని – కొందరిలోకొన్ని ఉంటవి. పాదాలు చేతులు చల్లగా ఉంటవి. దేహమంతా కూడా చలిచలిగా ఉంటుంది. ఈ చలిచలిగా ఉండటంలోనే రోగం మరీ తీవ్రమవుతుంది. పాదాల్లోను, చేతుల్లోను, రోగపదార్థముచేరుట వలన రక్తము సరిగా ప్రవహించక చల్లగా ఉంటవి. లోపల దేహాన్ని దుర్బలపరిచే అధికోష్ణము ఉంటుంది. రక్తవాహికలకు చివరగా ఉండే కేశనాళికలు రోగపదార్థముతో నిండియుండుట వలన రక్తము తిన్నగా ప్రవహింపదు. అందువలన శుద్ధరక్తము చర్మమున కంట ప్రవహింపదు, అందుచేత చర్మము చల్లగా ఉంటుంది. రోగము తరుణమైనదిగాదు. కనుక బాధ లేమీ ఉండవు. దేహముయొక్క పైభాగముచూచి దేహములోపల రోగమున్నదని మనము తెలిసికొనుచున్నాము.

ఇంతవరకు ఈ రోగమంటే యేమిటో, అది యెందుకు వస్తుందో, అది యేమిచేస్తే పోతుందో యెవరికీ తెలియదు. వాతావరణంలో మార్పువస్తే రోగం కుదురుతుందని రోగిని ఇతరదేశాలకు పంపించుతూ ఉండేవారు ఏదో కొద్దిమార్పు వస్తూఉండేది. అది యెక్కువకాలం ఉండేదికాదు. మన అనుభవములో ఒక

బిడ్డ తల్లిదండ్రులనుండి సంక్రమించిన రోగపదార్థముచేత దేహ మంతానిండినది. ఈరోగపదార్థము చివరలకంట వ్యాపించి అం దులో తల లావైనది. కోలగా ఉండవలసిన ముఖము చదరమై నది. వుష్ణిసే వస్తువగల రబ్బరు టోపీనిపెట్టిన సీసాను వ్యాపకానికి తెచ్చుకొనండి. సీసాలోఉన్న ద్రవ్యం పొంగినకొద్దీ సీసామూతికి పెట్టిన రబ్బరు ఏవిధంగా ఉబ్బుతుందో ఆదేవిధముగా గండమాల రోగంగల బిడ్డతలకాయ లావుఅవుతూఉంటుంది. ఆపులిసే ద్రవ్య మే రబ్బరు తిత్తిలో పోసినపుడు, ఏవిధముగ రబ్బరుతిత్తి ఉబ్బు తుందో ఆవిధంగానే,గండమాలరోగి దేహంకూడా లావవుతుంది. ముఖనిదానశాస్త్రం వలన ఎప్పుడో రాబొయ్యే గండమాల రోగంకూడా మనము, ముందుగానే కనిపెట్టగలము. ఇందుకు సంబంధించిన వివరములు, నేనురచించినముఖనిదానశాస్త్రము నందు గలవు. పాదములు చేతులు కూడా, ఈ వ్యాధిలో వంక రులు పోతవి. చర్మములో చైతన్యము తగ్గియుంటుంది. చర్మము క్రిందచేరిన రోగపదార్థమును వెలువరించే సామర్థ్యము చర్మా నికి లేదు. రక్తవాహికలలో చేరిన రోగపదార్థమువలన రక్తము తిన్నగా ప్రవహించదు. అందువలన చర్మము చల్లగా ఉంటుంది. లోపల అవయవాలల్లో ఎక్కువ వేడిమి ఉంటుంది. అందువల్లనే దేహములో ప్రాలుమాలిక ఉంటుంది. ఇది అంతర్గ తమైన జ్వరముయొక్క లక్షణము. ఈ స్థితిలో మనము చికిత్స చేయకపోతే యింతకన్నా ప్రమాదకరమైన వ్యాధి వస్తుంది. గండమాల రోగులకు సాధారణంగా వచ్చేది క్షయ. అందువల్ల వెంటనే చికిత్స చెయ్యాలి. అయితే మనము ఎలా చికిత్స చెయ్యాలి? అనే ప్రశ్న వస్తున్నది. అంతర్గతముగా ఉన్న వేడి

మిని బైటికి రప్పించాలి. చర్మముమీద ఉన్న చల్లదనం పోగొట్టి వేడిమి కలిగించాలి. చలి చలిగా ఉన్న దాన్ని జ్వర ముగా మార్చాలి. చికిత్సమాత్రము ఏమీ మారదు. జ్వరము వకు చేసిన చికిత్సే దీనికొని చర్మములోనుండే రంధ్రములను వికసింపజేసి చెమట పుట్టించాలి. అందువలన మంతమైన రోగ పదార్థము వెడలి పోతుంది. మన కిదివరకే పరిచితమైన ఆవిరి స్నానముల వల్లనూ, కటి లింగ స్నానముల వల్లనూ, మల మూత్ర కోశములను, చర్మమును ఉద్దీపన చేయవలయును. చర్మము నెమ్మదిగా వేడెక్కి చెమట పోయును. అపుడు చర్మము నందు సహజమగు ఉష్ణముండును. ఈ చికిత్సలవలన తాత్కా లిక ఉపశాంతి గల్గును. పట్టుదలగా, శ్రద్ధగా, చికిత్స జేసినపుడు ఇంకా యెక్కువ పరిపూర్ణారోగ్యము కలుగుతుంది. పరిపూర్ణా రోగ్యము ఎంతకాలమునకు గల్గుతుందనే సంగతి చెప్పడం కష్టం. ఈ పని రోజుల్లో, వారాల్లో, నెలల్లో, అయ్యేదికాదు. నెలలూ సంవత్సరాలు పడుతుంది. బాగా దేహములో ధాతుశక్తి నశించి పోయినవారికి రోగపదార్థము దేహములో ఎక్కువగా చేరినవారి ఆరోగ్యంకల్గదు. దేహంలో నుండే రోగపదార్థము వలన- ఏవి ధంగాచర్మము చల్లగా, వెచ్చగాఉంటుందో వివరించియే యున్నా ను. ఒకే రోగపదార్థమువలన, విరుద్ధ స్వభావముగల ద్వివిధాలైన రోగాలు విరుద్ధమైన కారణములు, గలవిగా, మనకు అగుపడిన ప్పటికీ, నిజానికి ఆరెంటికి మూలకారణము రోగపదార్థమే. అయితే వివిధదశలలో వివిధలక్షణములను, గల్గించటానికి రోగ పదార్థమునకు సామర్థ్యమున్నది. గోడమీద పాకే గొంగళి పురుగే, ఒకగూటిలోకి చేరి బైటికివచ్చే టప్పటికి, ఒక శీతా

కోక చిలుకయై వచ్చుచున్నది. ఆమూటిలో ఉన్నది కూడా ఒకే జీవి. అది, ఏ విధముగా, 3 రూపాలలో ఉంటున్నదో, ఆవిధంగానే, దేహంలోనున్న రోగపదార్థము కూడా, వివిధదశలలో, వివిధరూపాలలో, ప్రత్యక్ష మవుచున్నది. గొంగళిపురుగునుచూచి, సీతాకోకచిలుకను జూచినవారు, అవి రెండు వేరువిధవస్తువులనిన, మనసు నమ్మదు. కాని అదే సంగతి రోగములనుగురించి మనముచెప్పినపుడు చాలామంది నమ్మలేకపోతున్నారు. మా చికిత్సాలయములో నయముచేసిన ఒక గండమాలరోగివృత్తాంతము చెప్పెదను. 5 సం॥ కుర్రవానికి అతని రెండవయేటనుంచి గండమాలవ్యాధి - ఆ వయస్సులో అతనికి రోగముపెరిగి నడవలేనిస్థితికి వచ్చినాడు. పిల్లల బడిలో అతనొక మొద్దువలె పడిఉంటాడు. ఎంతోమంది పెద్దవైద్యులు చికిత్సలు చేశారు. లాభించలేదు. వారు మందులు ఇచ్చినపుడల్లా రోగముపెరగడం ప్రారంభించినది. చివరకు నడకకూడా లేకుండాపోయినది. మందులు - సీమసున్నపు పట్టీలు - స్నానాలు - విద్యుచ్ఛక్తి అన్నీ వాడినారు - లాభము కనుపడలేదు. ఆ వైద్యులకు గండమాలఅంటే యేమిటో తెలియదు. 5 వ సంవత్సరం పూర్తి అగుచుండగా అతను మనవైద్యానికి వచ్చినాడు. అదివరకు ఏ వైద్యులుకూడా అతని జీర్ణశక్తినిగూర్చి శ్రద్ధతీసుకోలేదు. అది బొత్తిగా చెడిపోయిఉండెను. ఒడలంతయు ఉబ్బి గట్టిపడి - కంతులతో నిండియుండెను. మొదటివారములో మన చికిత్స వలన అతనికి జీర్ణక్రియ కొంచెము బాగుపడినది. మనచికిత్స వలన అతనికి లాభంగలుగునని నమ్మిక గలిగినది. చికిత్స చేస్తూ

ఉండగా వారానికివారానికి స్థితి బాగుపడుతూవచ్చి, ఆరవవారం నాటికి అతడు అవలంబనలేకుండా నిలుచో కలిగినాడు. అతని దేహముయొక్క లావు తగ్గినది. మెత్తబడినది. చేతికి తగులుతూ ఉండే అనేక కంతులు కరిగి కనుపడకుండా పోయినవి. 6 నెలలు చేయునప్పటికి లావుగా ఉన్న అతని తలతగ్గి, సహజ పరిమాణము నకు వచ్చెను. ఇతరులవలెనే అతడును పరుగెత్తగలడు – గెంత గలడు – సుఖముగానూ, ఉల్లాసముగానూ ఉన్నాడు. రోగము నయమైనదని చెప్పవచ్చును.

ఇంకా రోగముల నన్నిటిని పేర్కొనుమనా? గవదబిళ్లలు, దద్దురులు, ఈడ్పు, అతిసారము, తలనొప్పి మొదలగు వ్యాధు లన్నియు ఒకేరోగపదార్థమువలన గలుగును. అన్నిటియందు వేడిమి యుండును. చికిత్సకూడా ఒకేమాదిరుగా ఉంటుంది. కటిలింగస్నానములు, ఆవిరి – ఇవే చికిత్సా ప్రక్రియలు. వీనితోనే పై రోగములన్నియు కుదుర్ప గలము.

## ౭ రోగమంటే ఏమిటి?

రోగము ఏరూపముతోనున్నా, అందు తప్పకుండా రెండు లక్షణాలు మనకు కనపడుతున్నవి. ఎక్కువ వేడిగా అన్నా ఉంటుంది, లేక చలి అయినా యెక్కువగా ఉంటుంది. ఈ రెండు లక్షణాలుకూడా జ్వరముయొక్క రూపాలేనని మనమిది వరకే తెలుసుకున్నాము. వివిధరూపాలతో నుండే వేలాది రోగాలను ఒకేవిధమైన చికిత్సతో కుదిర్చియున్నాను. అందు వలన రోగాలన్నింటికి మూలకారణాన్ని వెతుక్కుంటూ పోతే,

రోగపదార్థము ఒకటే కనపడుతుంది, అనగా ఒకేరోగమున్నది. అది అనేకరూపాలతో మనకు ప్రత్యక్షమగుచున్నది. దానికి చికిత్సకూడా ఒకటే. అసలు రోగముమాత్రము ఏమిటి? దేహంలో ఉండే రోగపదార్థాన్ని వివిధమార్గాలుగా, వెలు పరింప దేహము చేసే ప్రయత్నమే మనము రోగమంటాము. అందువలన మందు వైద్యాలవలె, దేహంచేసే యీ ఆరోగ్య ప్రయత్నాన్ని అణచివైచి, రోగపదార్థాన్ని దేహములోనే మురిగేటట్లుగా, చేయరాదు. అందువల్ల రోగము దేహము లోపలనే కాలికముగా నిలిచిపోతుంది. అట్లాకాకుండా దేహ ముచేసే ప్రయత్నానికి తోడుపడి రోగపదార్థము వడిగా వెలు వరించుటకు మనదేహమునకు తోడ్పడవలెను. మనము తోడు పడినయెడల, రోగమువల్ల వచ్చేప్రమాదాలు రాకుండాపోతవి. ఈ పరిస్థితులలో దేహములోనుండే రోగపదార్థము అనేక మార్పులను, పొందుతూ చాలా చురుకుగా ఉంటుంది.

రోగము వచ్చినపుడు మనము తీసుకొనవలసిన ఆహారమును గురించి చెప్పుచున్నాను. రోగులు తీసుకునే ఆహారపానీయాలు కొత్తగా రోగపదార్థాన్ని చేర్చకుండా ఉండాలి. దేహమునందలి మందమును వృద్ధిచేసేపదార్థములను, రోగులు తినకూడదు. దేహములో శుద్ధిక్రియ ప్రబలముగా జరుగుతూయుంది గనుక జీర్ణక్రియకు కొత్తబరువులు ఏవీ వేయరాదు. రోగికి బాగా ఆకలిఉంటేతప్ప, బలవంతంగా ఆహారము ఇవ్వరాదు. సాధ్య మైనంత తక్కువఆహారములనే ఇవ్వవలయును.

అంటువ్యాధులనుగురించి కొలదిగా చెప్పితిని. అదివరకే దేహ మునందు రోగపదార్థము చేరకుండాఉంటే యెట్టితరుణవ్యాధియు

గలగదు. కనుక నిట్టి కాలికదశయే ప్రమాదకరమైనది. తల్లి దండ్రులనుండి బిడ్డలకు వారిదేహమునుండి కొంత రోగపదార్థము సంక్రమించుట కలదు. అప్పుడైనను ఆరోగ్యవంతులగు తల్లిదండ్రులనుండి బిడ్డకు రోగపదార్థము చేరుటకు వీలులేదు. తల్లిదండ్రుల రూపురేఖ లేకాకుండా వారి కంటిరంగు, శక్తి యుక్తులు, తెలివితేటలు కూడా, బిడ్డలకు సంక్రమించుట మనము, చూచుచున్నాము. అట్టియెడల తల్లిదండ్రులనుండి అందును తల్లినుండి బిడ్డకు రోగపదార్థము సహజముగనే సంక్రమించును. తల్లిదండ్రులు ఏవ్యాధులతో బాధపడుచుందురో, బిడ్డలకుకూడా అట్టి వ్యాధులే వచ్చుచుండుట తరచు చూచుచున్నాము. రోగము అంటుట యనగా తల్లిదండ్రులనుండి బిడ్డలకు సంక్రమించుటయే. తరుణవ్యాధులు ఒకరినుండి ఒకరికి సంక్రమించునని భావింపబడుచున్నది. కాని అప్పుడైనను, రోగపదార్థములేనివారి దేహమునందు ఎట్టి ప్రబలమగు అంటువ్యాధియు అంటుకొనదు. రోగుల దేహమునుండి, లోని రోగసూక్ష్మజీవిని, గాలితో కలిపి పీల్చినను సూక్ష్మజీవులను, నీటితో కలిపి త్రాగినను కూడా రోగపదార్థము లేనివారికి, ఏ వ్యాధులురావు. దేహములో అదివరకే రోగపదార్థము ఎక్కువగా ఉండి, అంటువ్యాధులవారు అనబడే వారి సమీపమునకు పోయినపుడు వాతావరణమునందలి వేడికూడా సహాయపడితే, అదేమో సరు రోగం పీడికికూడా రావటము కద్దు. దేహమునందున్న రోగపదార్థపు పరిమితి చాలా తగ్గిఉన్నపుడు అట్టివ్యాధులు అంటుకొనూ అంటుకోవు-అంటుకున్నా తేలికగా నయమవుతవి.

తరుణవ్యాధులన్నిటిలోను, దేహమునందలి రోగపదార్థము నిరంతరాయముగా పొంగి వెలుపడిపోతూఉంటుంది. దేహము నుండి, రోగపదార్థము ఎంతతగ్గిపోతూఉంటే అంత ఆరోగ్యము వస్తుంది. అందువల్లనే రోగమునుండి అప్పుడప్పుడు తేరుకునే వారినుండియే యిట్టి రోగములు అంటుకొనును. అందరూ యెరిగిన ఒకఉదాహరణము చెప్పి వ్యాధులు అంటుకొనుట యన నేమో చెప్పెదను. కాగి పులియటానికి సిద్ధముగాఉన్న పాలల్లో కొద్దిగా పులిసిన మజ్జిగవేస్తే వెంటనే పాలు తోడుకుని గడ్డకట్టును. ఆపాలే చల్లబడిపోతే తోడుకోవటము ఆలస్యము. అప్పుడు కలిపిన బియ్యపు పిండిలో పుల్లచల్లకాని - నిన్నటిపులి పిండిగాని కలిపితే ఆ పిండి త్వరగా పులిసిపోతుంది. ఈ అంటు వ్యాధుల్లో కూడా యీలాగే జరుగుతుంది. అంటువ్యాధుల వారి దేహములో నుండి, మండపదార్థ లేశములు, గాలిలో కలిసి అదివరకే, దేహమునందు మండము కాదగిన రోగపదార్థముగలవారి దేహములో ప్రవేశించి ఆ రోగపదార్థమునందు నెమ్మదిగా మండమును గలిగించును. ఇట్లు గలిగిన మండము మొదటవారి దేహమునందలి మండముతో తుల్యమగు లక్షణములు గలిగి అదేరోగము గలిగించుచుండును. అధికముగా రోగపదార్థము గలవారి దేహములోనే యీలామార్పు వస్తుంది. ఎవరి దేహాలలో రోగపదార్థము ఎక్కువగా ఉంటుందో వారికే యీ అంటువ్యాధుల భయము ఉన్నది. దీనినే ఆయావ్యాధుల రోగ ప్రవణతగలవారికి, ఆయావ్యాధులు వస్తవని అంటారు. ఈ రోగ ప్రవణత ఎట్లావస్తుందో యెవరికీ తెలియదు, సూది తీసుకుని టీకాలమందు ఎక్కించటానికి గాలిలో కలిసిన

మందపదార్థ లేశములు సహజమార్గాన దేహములో ప్రవేశించ టానికి సంబంధము లేదు. సహజమార్గాన ప్రవేశించిన మంద లేశములు దేహమునందలి రోగపదార్థమును కదిలించి వెలువ రించును. టీకాలమందు వేసినపుడు ధాతుశక్తి అణగారిపోయి రోగపదార్థము అంతర్గతముగ కాలికముగా నిలిచిపోతుంది. హోమియోపతీశాస్త్రము యీ విషయాన్ని బాగుగా వివరించి యున్నది. టీకాలమందు దేహములో ప్రవేశించినపుడు అది రోగపదార్థాన్ని వెలువరించకపోగా అదివరకున్న రోగపదా ర్థానికి తోడగుచున్నది. ఇందువల్లనే రోగము మరీ కాలికమగు చున్నది. అందువల్లనే టీకాలు వ్యాప్తిలోనికి వచ్చినతర్వాత దేశములో విపరీతముగ కాలికవ్యాధులవారిసంఖ్య నానాటికి పెరిగిపోవుచున్నది. జ్వరానికి వాడిన క్వయినా, యాంటిప్పైరిన్, యాంటిఫైబ్రిన్, మార్ఫియా, మొదలగు మందులన్నికూడా యీదేపని చేసినవి. దేహమునందున్న ధాతుశక్తిని వృద్ధిగానీయక, స్తంభింపజేసినవి, దేహమునందు రోగపదార్థములో ముంచవు పుట్టక అందువలన దేహమునందే రోగపదార్థము నిలిచిపోవును. అందువల్లనే యిదివరకు కనివిని యుండని కర్కటవ్రణము, మేహవ్రణము, తీవ్రమగు నాడీవ్యాధులు, మానసిక వ్యాధులు, క్షయ, సవాయి – మొదలగు వ్యాధులు తరుచుగా వచ్చుచున్నవి. దేహములో ఎక్కువగా రోగపదార్థము చేరియుండి దానిని వెలువరించే సామర్థ్యము దేహమునకు తగ్గి నపుడే యిట్టి కాలికవ్యాధులు తరుచు వచ్చుచుండును. ఈవ్యాధుల యందు రోగపదార్థము మిక్కిలి యెక్కువగా చేరి పరిపూర్ణా రోగ్యము గలిగించుటకు, అలవిగాకుండును. రోగాన్ని వెంటనే

దేహాన్ని రక్షించుకొనే సామర్థ్యం తగ్గిపోయి, పొగాకు అలవాటైపోతుంది. పొగచుట్ట త్రాగేవారు తమ జీర్ణశక్తి సరిగా లేనందువల్ల చుట్ట త్రాగలేకపోతున్నా, మానుకుంటారు. జీర్ణశక్తి బలపడి చుట్ట అభ్యాసపడితే చుట్టను బాగా త్రాగగలము అనుకుంటారు. నిజమేమనగా! జీర్ణశక్తి బాగా వున్నప్పుడే చుట్ట అభ్యాసము కాదు. జీర్ణశక్తి చెడిపోయిన తరవాతే చుట్ట అభ్యాసమగుతుంది. ఆవిధంగా రోగపదార్థంతో నిండిపోయిన దేహము నిరంతరము విషపుమందులవాడుకవలన ధాతుశక్తి తగ్గిపోవుటచేత సామాన్య కారణాలతో రోగపదార్థములో మండాన్ని కలిగించి తొలగించే సామర్థ్యాన్ని కోల్పోతుంది. అందువల్లనే ఋతువులు మారినప్పుడు, వాతావరణములో కలిగే ఆకస్మిక మార్పుల వలన రోగపదార్థమునందు మంటను కలుగుటకు వీలుయేర్పడును.

ఇంకా కొన్ని ఉదాహరణములు చెప్పెదను. బీరుసారాయము, సీసాలోపోసి మూతపెట్టి చీకటింటిలో చల్లని ప్రదేశములో పెట్టితే పొంగదు. సీసాబిరడా గట్టిగా ఉంచి, ఆసీసాను ఎండలో పెట్టినపుడును, ఉష్ణప్రదేశములో ఉంచినపుడును అందు మంటము పుడుతుంది. అందులో క్రొత్తసూక్ష్మజీవులు యేవి ప్రవేశించటానికి వీలు లేకుండా గట్టిగా బిరడా పెట్టినా యీ వేడిమివలననే అందులో మండము పుట్టుతున్నది. మొదట నిర్మలముగా నున్న బీరుసారాయి యిపుడు మురిగి చిక్కబడుతుంది. అందులో సూక్ష్మజీవులు పుట్టుతవి.

గాలిలోకూడ యీలాగే జరుగుతుంది. ఒకరోజున ఆకాశము నిర్మలముగా ఉంటుంది. వేసవిలో వేడిగాకూడా ఉంటుంది. మర్నాడు ఆకాశమంతా మబ్బు కమ్ముతుంది. గాలి చల్లబడుతుంది. మబ్బులోనుంచి వాన వస్తుంది. యీచల్లదనంలోకూడా తేడా లుంటవి. దానిని పట్టుకొని ఒకరోజున మంచు కురుస్తుంది. వేరొకరోజున వడగండ్లు పడుతవి. ఒకరోజు, మంచుగా పేరుకొంటుంది. ఒకరోజు వాన కురుస్తుంది. ఇన్నిరూపాలుగాకన్పడిన వస్తువ జలమేనని మన కందరకు తెలుసు. గాలిలోని చల్లదనమును పట్టి యిన్ని తేడాలుగ కన్పడినవి.

ఉష్ణమండలాలలో, తేమ యెక్కువగా ఉండే మన్యప్రాంతాలలో గాలియందంతటను, ఎల్లప్పుడును, మండము గలిగించే పదార్థము ఉంటుంది రోగపదార్థముతో నిండిన దేహముగల వారు, అక్కడ కొద్దికాలము నివసించినా, చలిజ్వరము వస్తుంది. మన్యపుగాలిలో నుండే మండపదార్థము వారిదేహములో యున్న రోగపదార్థముతోకూడ పనిచేసి జ్వరాన్ని గల్గించినవి. నిలవనీరుకూడా యిలాగే చేయగలదు, గాని, యింత తీవ్రముగా చేయదు. కొండలమీద యిసుకగట్టానికి వీలులేని చెరువుల్లో వున్న నీరున్నూ, చుట్టూ మట్టికట్టలు వేసిన నేలమీద వున్న చెరువునీరున్నూ, పోల్చి చూడండి. నేలమీద చెరువునీరుకూడా మొదట నిర్మలముగా ఉంటవిగాని వాతావరణములో మార్పు గలిగినపుడల్లా ఆనీటియందును మార్పులు వస్తూవుంటవి. చిట్టచివరకు నీరంతా పసరువేసి చెడిపోతుంది. అప్పుడందులో నీరు మనదేహంలోకూడా మండమును గల్గిస్తుంది. అందుచేతనే

శీతకాలంలో చెరువుల్లోనీరు చల్లగా ఉండి మురిగిపోకుండా ఉంటవి. వేసవికాలంలో నీరు వేడెక్కి తొందరగా మురిగి పోతుంది.

ప్రత్యక్షముగా అంటువ్యాధులరోగులతో సంబంధము లేని వారికికూడా కొన్ని అంటువ్యాధులు రావడం మనము చూస్తూ ఉంటాము. ఇవ్వాళ ఇక్కడ అంటువ్యాధి ఉంటే రేపు యింకొకచోట ఉంటుంది. అయితే ఎవరికీ రోగపదార్థము లేకుండా ఎట్టి అంటువ్యాధియు కలగదు. 1890 సం॥ మొదట్లో వచ్చినంత ప్రళయంగా ఇన్‌ఫ్లూయెంజారోగం రాకపోయినా ప్రతి సంవత్సరం ఏవో అంటువ్యాధులు యెక్కడో అక్కడ రావడం చూస్తూనే యున్నాము. వేరువేరు కాలములందు ఆటలమ్మ, పొంగు, సర్పి, కోరింతదగ్గు, జలుబు, ఇన్‌ఫ్లూయెంజా మొదలగు వ్యాధులు అనేకమందికి ఒక్కొకసారి రావడం చూస్తూనే యున్నాము. ఒక్కొక్క ప్రదేశములో యుండే ప్రజలజీవిత సరళిలో కొన్ని సమానఆచారములు ఉంటున్నవి. అందువల్ల వారి దేహములో పెరిగే రోగపదార్థంకూడా స్వభావంలోను, పరిమితిలోను, సమానంగా ఉంటుంది. వాతావరణంలో మార్పులు వచ్చినపుడు ఒకరిదేహంలో రోగపదార్థములో మందమును కలిగించిన కారణాలే మిగతవారి దేహములలో మందమును కల్గించుచున్నవి. అందువలన మందముయొక్క రీతికూడా సమానముగానే యుంటుంది. అందువల్ల అనేకమందికి ఒకే దేశంలో ఒకే కాలంలో ఒకే విధమైన రోగాలు వస్తవి. వారందరి దేహములో నుంచి రోగపదార్థము ఒకేపరిమితిలో వెళ్ళిపోతుంది.

ఆరోగ్యముకూడా కల్గుతుంది. దానిని మనము అంటువ్యాధి అంటాము. అంటువ్యాధులలోకూడా లక్షణములు అందరికి సమానముగా ఉండక కొంచెము తేడాగా ఉంటవి. గాలియందలి మార్పులవల్ల కలిగే అంటువ్యాధులు, యివ్వాళ యిక్కడ కనపడితే రేపు యింకొకచోట కనపడుతవి.

పూర్వకాలంలో అంటువ్యాధులు యింత యెక్కువగా వుండేవి కావు. చిన్న చిన్న వ్యాధులకు పూర్వపువైద్యులు యింత పెద్దపెద్ద చికిత్సలూ చేసేవారు గారు. అందువల్ల దేహములు అప్పటివి యింతగా రోగపదార్థముతో నిండియుండేవి గావు. అంటువ్యాధివంటి ప్రబలరోగం వ సేసేగాని మందులతో అణచి పెట్టబడిన ధాతుశక్తిగల యిప్పటివారి దేహంలో ఉన్న రోగ పదార్థము వెడలిపోదు. ఈ సంగతి అందరికీ తెలిస్తేనేగాని రోగాలను మందులతో అణచిపెట్టడం మానివేయరు. ఎంత కాలము మందులతో రోగాలను అణచిపెట్టడం మానివేయరో, అంతకాలం దేహాలు రోగపదార్థముతో కాలికవ్యాధులు పెరుగుతవి. ఆరోగాలు పోవాలంటే ప్రాణాపాయకరమైన పెద్ద వ్యాధులు రాకతప్పదు.

వెనుక చెప్పినదే తిరిగి చెపుతున్నాను

1 తల్లితండ్రులనుండి బిడ్డలకు రోగములు సంక్రమించు టానికి తల్లితండ్రులనుండి బిడ్డ దేహములో ప్రవేశించిన రోగపదార్థమే కారణము. ఈవిధంగా రోగాలు రాకుండా కాపాడాలంటే యీ రోగపదార్థము లేకుండా చేసుకోవాలి. దేహమునందు రోగ పదార్థం ఉండి ఆయారోగ ప్రవణత ఉన్నపుడే అంటువ్యాధులు ఒకరినుండి వేరొకరికి అంటుతవి.

2. గాలిద్వారా అంటువ్యాధి కలిగినవారి రోగపదార్థ మంట లేశ ములు అదివరకే రోగపదార్థముతో దేహాలు నిండియున్న వారి యందు ప్రవేశించి, అందు మండమును కలిగించును. రోగపదార్థం లేకుండా రోగప్రవణత లేదు. రోగప్రవణత లేకుండా రోగం అంటుకోవటం లేదు. రోగి గదిలో శుద్ధమైన గాలి ఉండేటందుకు, అవసరమైనన్ని కిటికీలు తెరచి ఉంచవలయును. అత్తరులుగాని, పూతినాశకములగు మందులుగాని, గాలి యొక్క నైర్మల్యాన్ని చెడగొట్టుతవి. కనుక వానిని వాడరాదు. రోగి మీదనుండి వచ్చే గాలిలో నున్న మురికిని గ్రహించే సామర్థ్యం మన ఘ్రాణేంద్రియానికి లేకుండా మొద్దుబారిపోతుంది. దేహానికి వాడిన మందులవలెనే, యివికూడ మేలు చేయక కీడు చేయును ప్రపంచకంలో ఉన్న విషపుమందులన్ని వాడి గాలిలో ఉన్న మురికిని పోగొట్టటానికి ప్రయత్నము చేయవచ్చు. ఇవియన్నీ ఉపయోగంలేని ప్రయత్నాలే. ఏమాత్రము మండ లేశ మున్నా రోగపదార్థమునందు మండమును కలిగిస్తుంది. అందువల్ల కటి లింగస్నానాలవలన దేహంలో రోగపదార్థం లేకుండా రోగపదార్థాన్ని రోగప్రవణతను పోగొట్టుకోవడం సరిఅయిన మార్గం. అనేకతూరులు అంటువ్యాధి రోగులు వదిలిన గాలిని చికిత్సా కాలంలో తరుచుపీలవాలిసివచ్చేది. ఒక్కలింగస్నానము చేయుడం తోనే అదే వాసన నాశ్వాసలోనుండి బైటికి పోయేది. ఈ విధముగా రోగవిషాన్ని వెలువరించే సామర్థ్యము మనచికిత్సలో కలదని, రుజువైనది.

3. అన్ని అంటువ్యాధులలోను, మనను రక్షింపగలది, యీతొట్టి వైద్యము. ఇందువలన రోగాలకు కారణమైన రోగపదార్థము

మన దేహములోనుండి వెడలిపోతుంది. కారణము లేనందువలన అంటువ్యాధి మనకు రాదు.

రోగము పుట్టుటయు అది అంటుకొనుటయు దేహములో రోగ పదార్థ మున్నప్పుడే కలుగుతుంది. ఇదే లేనిచో యేరోగమూ రాదు. యేరోగమూ అంటుకోదు. రోగపదార్థము ఉండటం వల్లనే రోగం రావడముగాని అంటుకోవటంగాని తటస్థించును. దేహముపైన కాకుండా లోపలకూడా యెవరు నిర్మలముగా ఉంచుకొంటున్నారో, వారికి అంటువ్యాధి రాదు. అంతర్గతమగు నిర్మలతయే అన్నిరోగాలను కుదుర్చుతుంది. వేరువేరుగా కనపడే రోగాల కన్నిటికి యేవో క్రొత్తక్రొత్త కారణములు ఉంటవి అని కొందరు అనుకొందురు. ఒక నీరే అనేకరకములగు రూపములు పొందినట్లును, గొంగళిపురుగే సీతాకోకచిలుకగా మారినట్లును మనము తెలిసికొన్నాము గనుక పైఊహ తప్పని నిర్ణయించ గలము.

ఈ సంగతులన్నీ తెలిసిన మనకు కలరా, మసూచిక, సర్పి మొదలగు వ్యాధులకు మందువైద్యులు వేసే టికాలు యెంత అవ్యక్తమైనవో తెలియుచున్నది. ఇండ్లకు యిుండ్లే మిగతావారు పోవటానికి వీలులేకుండా జేసి, బజార్లనిండా కార్బాలిక్ యాసిడ్, ఫినాయిల్ జల్లి, గాలిని పాడుచేసి, బావుల్లో పొటాసియం పర్మాంగినేటు, క్లోరిన్ వేసి నీరు చెడగొట్టి అంటువ్యాధులను నశింపజేశాము అనుకొనుచున్నారు. అనేక వారాలు వడ్డుకు రాకుండా ఓడలను సముద్రములోనే లంగరువేసి అట్టిపెట్టు చున్నారు. దీనివల్ల కూడా అంటువ్యాధులను ఆపివేయు

చున్నా మనుకొనుచున్నారు. చిరకాలము చికిత్సలు చేసి అనేక రోగములను నయము చేయుచున్న నాకు అంటు వ్యాధిని గూర్చి యింకొకవిధముగా తెలియుచున్నది. కుటుంబములో వసతి లేక అంటువ్యాధి గల్గిన బిడ్డకు తోడుగా యితర బిడ్డలను పరుండబెట్టినపుడు వారికి అంటువ్యాధి కలుగలేదు. వారిదేహములందు రోగపదార్థము లేనందువలన రోగపదార్థ బీజములు వృద్ధిపొందుటకు వీలులేక అంటువ్యాధులు రాలేదు. వైద్యులు చెప్పిన నియమాలన్ని అవలంబించి జాగ్రత్త తీసుకున్న వారంతా వారివారి దేహములలో రోగపదార్థము ఉన్నందుచేత ఆటలమ్మ, పొంగు, మసూచికం మొదలగు వ్యాధులు రానేవచ్చినవి. అట్టివారికికూడా, మసూచికం మొదలగు వ్యాధులు తప్పక వస్తవని ముఖనిదాన శాస్త్రమువలన నేనువారికి ముందుగానే చెప్పినాను ఇందువలన తేలినపర్యవసాన. మేమంటే; అంటు వ్యాధులు రాకుండా మందువైద్యులు వేసే టీకాలు, ఇంజక్షనులు మొదలగు నివారణోపాయము లన్నియు, హాస్యాస్పదములైనవి. అరణ్యములో ఒక పెద్దచెట్టు. దానిని చెదలు రకరకాల పురుగులు తొలుచుకు తింటవి. దాని ప్రక్కనే ఒక చిన్నచెట్టు నవనవ లాడుతూ పెరుగుతూ ఉంటుంది. పెద్దచెట్టును తినుపురుగులు చిన్నచెట్టుజోలికి రావు. చిన్నచెట్టులోకూడా అదివరకే మురికి చేరివుంటే పెద్దచెట్టునుతిన్నపురుగులుచిన్నచెట్టునుగూడా తినేవే. పురుగులు మొదలగునవి పెరగడానికి చెట్టులో తగినంత మురికి లేనందువల్ల ఆపురుగులుగాని, చీడగాని పట్టలేదు.

ప్రజలందరు నే నిందులో చెప్పిన విషయములు బాగా తెలిసి నపుడు మందువైద్యులు చేసే అసత్య ప్రచారమునకు ప్రజలలో

అనుమతి లేకుండా పోతుంది. అంటువ్యాధులు వచ్చినపుడు ప్రజలు కల్లోలపడి పిచ్చిపనులు చేయకుండా నెమ్మదిగా యుక్తమైన చికిత్స చేసికొని రోగనివారణ చేసుకుంటారు.

---

# వాతవ్యాధులు

## మేహవాతము, ఆమవాతము, తుంటి నొప్పి,
## అంగవైకల్యము, వానికారణము, చికిత్స.

మేహవాతపువ్యాధిలో బాధలు ఒక్కచోట ఉండక దేహములో సంధులు గలచోట నెల్లా ఉండును. ఈవ్యాధిలో నేను చేసే చికిత్సాపద్ధతి మీాకు విన కుతూహలముగా నుండును. పూర్వ కాలములో మొగవారిలో ముసలివారికిమాత్రమే యీవ్యాధి వచ్చేది. ఇప్పుడో; స్త్రీపురుషవివక్షత లేకుండా చిన్న పెద్దల కందరికి వచ్చుచున్నది. ఎన్నోమందులు ఆవ్యాధికి కనిపెట్టి వాడు చున్నారు. గాని ఆవ్యాధి వృద్ధిపొందుతూనే ఉన్నది. ఈ మేహ వాతపు నొప్పులు ఎప్పుడో ఒకప్పుడు కాలో, చెయ్యో, భుజమో, దంతాలో, తలకో, అందరిని బాధపెడుతూ ఉన్నవి. సంధులను బాధించే మేహవాతపు నొప్పులు, మరీ భయప్రద మైనవి. ఈ రోగానికి మూలకారణ మేమిటో తెలిసికొనేటందుకు ప్రజలెవరూ ప్రయత్నించుటలేదు. నాకు జలుబు చేసిందీ అంటారు ఒకరు. ఈ శతాబ్దపువారు జలుబుచేసినపుడల్లా గాలి మారిందనో ఋతువు మార్పుచేతనో తమకు జలుబు చేసిన

టంటారు. ఇంతకంటె యెక్కువ ఆలోచించరు. ఒకపటాలము ఉన్నదనుకోండి. అందులో ఉండేవారంతా పడుచువారు. బలశాలులుగదా! సిసలైన మనుష్యులను యేరి మరీ పటాలములో చేర్చుదురుగదా! పటాలము వదలి, తడిగాలిలో వారు ప్రయాణము చేయవలసివచ్చినపుడు కొందరికి దగ్గు, కొంతమందికి రొంప, కొంతమందికి పంటినొప్పి, ఇంకను కొందరకు మేహవాతపునొప్పులు, వస్తవి. కొంతమందికి తలనొప్పి, వంటి వ్యాధులు వస్తవి. ఇవంతా గాలివలన వచ్చినవి అంటారు. ఇదీ సత్యముగానే కనుపడుతుంది. ఎందువల్లనంటే వారంతా చలిగాలిలో ఉన్నారు. అందువలన యీ రోగాలు వచ్చినవి అంటారు. అయితే రోగకారణము తప్పుచోట వెతికారు, ఇంతకంటె అపసిద్ధాంతము లేదు. ఏమంటే అదేగాలికి అనేకమందికి రోగాలు రావు.

అనేక శతాబ్దాలుగా రోగము అంటే యేమిటో తెలియకుండానే రోగులకు సరిఅయిన సహాయం, చికిత్స జరుగకుండానే గడచిపోతున్నది. యెన్నివైద్యాలుచేసినా మేహవాతపువ్యాధి పెరిగిపోవుచున్నది. మేహవాతము వచ్చినపుడల్లా దేహములో యేదో ఒకవైపు నున్న అవయవాలకే వస్తుంది. ఈ ఒక్క కారణముచేతనే, మేహవాతపు నొప్పులకు మూలకారణము గాలిపాటు కాదని, తేలినది. గాలిపాటువలననే మేహవాతము వచ్చేటట్లయితే, నొప్పులు ఒకవైపుకు వచ్చి, ఒకవైపుకు రాకపోవడం ఏమిటి? ఒకరోగి గాలివచ్చేవైపున కుడిభాగం ఉండేటట్లు కూర్చున్నపుడు గాలి కుడివైపునే తగులుతున్నది. కుడివైపువదలి

ఆరోగికి యెడమవైపున మేహావాతపునొప్పులు వచ్చుచున్నవి. మేహావాతాన్ని తప్పకుండా కుదుర్చాలి అంటే మేహావాతము ఎందుకు వచ్చేది తెలియాలి. ఇతరవ్యాధులకు యీరోగానికి ఉన్న పోలికలు మనకు తెలియాలి. ఈ రోగములోకూడా వేడి ఉంటుంది. వాచి ఉబ్బియున్న భాగాలలోనే నొప్పు లుంటవి. ఆకలి తగ్గిపోతుంది. సంధులలో వచ్చినటువంటి మేహావాతపునొప్పులలో వాపు ఎరుపు కొన్నిప్రదేశాలలోనే ఉంటుంది. పైచెప్పిన లక్షణాలనుబట్టి మనము రోగకారణముదగ్గిరకి వచ్చాము. జ్వరము, వాపు, అజీర్ణము యివి దేనివలన వస్తవి? మేహావాతములో కొన్ని సంధులలోనే రోగం వస్తుందని చెప్పేను. సంధులకు దిగువనే వాపు, బాధలు ఉంటవి. సంధులకు ఎగువన, వాపు ఉండదు. బాధ ఉండదు. ఇది ఆకస్మికముగా సంభవించినదిగాదు. దీనికి కూడా యేదో కారణము ఉండితీరాలి. రోగపదార్థము వ్యాపించేటప్పుడు, జ్వరముండదు. చివరలదాకా రోగపదార్థము వ్యాపిస్తుంది. సమశీతోష్ణమండలాలల్లోను, ధ్రువమండలములలోను, వయస్సువచ్చినవారియందును, మేహావాతపునొప్పులు, యిట్లు గలుగుచున్నవి. గాలిలో వేడిమి తగ్గినపుడు, అదివరకు, దేహమంతా వ్యాపించిన రోగపదార్థము, పొత్తికడుపువంకకు తిరిగిపోవ ప్రయత్నించును. ఉష్ణమువలన పదార్థములు విరివిచెందుటయు, శీతమువలన ముడుచుకొనుటయు మనమెరుగుదుము. ఈ సార్వజనికసిద్ధాంతము, మానవదేహానికికూడా వర్తిస్తుంది. జ్వరములో విరివియగుట మనము చూచుచున్నాము. దీనికి వ్యతిరేకముగా చలిచేత అవయవాలు ముడుచుకుంటున్నవి.

అందువల్ల వానిలోనున్న రోగపదార్థము విరివియై పొత్తికడుపు వంకకు పోవుచున్నది. ఇట్లుపోవుటలో చలిచేత ముడుచుకొనిన ఉదరుకు సంధులలోనుండి పొత్తికడుపువంకకు పోవలెను. సంధులెపుడునూ, కదులుతూ ఉంటవి. గనుక రోగపదార్థము పైకి పోవటానికి ఆటంకము యేర్పడుతుంది. అందువలన నొప్పుట వాస్తుంది. తీవ్రమగు బాధ పుడుతుంది. ఇందువల్ల సంధులకు దిగువ, మోకాలున భుజము మోచేయికి దిగువనే వాపువస్తూ ఉంటుంది.

ఇక పటాలములోని సిపాయీల విషయము యెత్తు కొన్నపుడు వారికి, వచ్చిన వ్యాధులకు కూడా కారణము దేహములోనే యున్నదని, తెలియుచున్నది. గాలిపాటువలన కలిగిన పనియేమంటే, రోగపదార్థమునందు, మార్పుకలిగినది. అది వెడలిపోవటానికి, ప్రయత్నము చేస్తుంది. అందువల్లనే అంతర్గతమును, కాలికమును, అగు స్థితినుండి, తరుణమగు జ్వరవుస్థితి వచ్చినది. రోగపదార్థము యెచ్చోట చేరియున్నదో అట్టి సంధులకు దిగువను, వాపులును బాధలును గల్గినవి. ఇపుడు మనకు సంధులలో గల్గిన మహావాతానికి, కారణము తెలిసినది. ఇంతదూరము తెలిసిన తర్వాత, మహావాతముగల సంధులలో మాత్రమే, చికిత్సజేయుట హాస్యాస్పదమని తేలినది. ఆ ప్రదేశములో ఉన్న రోగపదార్థాన్ని, పలచన చేయుటకునూ, సంధులలోని యీడ్పును తగ్గించి నివివిచేయుటకును, తాత్కాలిక ఉపశాంతికొరకు మాత్రమే, నీటి ఆవిరి పనికివస్తుంది. శాశ్వతముగా, రోగనివారణ కావాలంటే, రోగపదార్థాన్ని సహజ

మార్గముల, బహిష్కార్య అవయవముల చెంతకు ఆకర్షించి వెలువరింపవలసియున్నది.

ఇది సంధులలోని మేహవాతానికి, కానుండా అన్నిరకాల మేహవాతానికి యిదే చికిత్సం. భుజములలోగాని, వెన్నులో గాని, ప్రక్కలయందుగాని, కంఠములోగాని, సంధులలో గాని, బాధ కలిగిందంటే క్రిందనుండి పైకి పోవాలని ప్రయత్నించే రోగపదార్థము వత్తిడి వలవంక, యిరుకైన సంధుల మార్గములు రెండవవంక ఉండి, ఘర్షణ జరుగుచున్నదని తెలియుచున్నది. ఆటంకము లేకుండా పైకిపోవటానికి వీలుకలుగ నందున వేడిపుట్టినది. దేహమునం దంతటను అంటే మూత్ర పిండముల యందును, గుండెలయందును, ఊపిరి తిత్తులందును, సంధులయందును, కూడా ఘర్షణకలిగి; వేడిమి, దానితోపాటు బాధలు పుటుతున్నవి, ఆయా అవయవాలలో నిలువ వుండుట వలన వానిలో కూడా రూపభేదములు కలుగును.

మేహవాతములో కలిగే ప్రతిమంట; వత్తిడి ఘర్షణ వలననే వస్తుంది. ఘర్షణ; రోగపదార్థముయొక్క కదలికవలననే వస్తుంది. మేహవాతాన్ని గురించి చెప్పేది యిదే.

ఈ సిద్ధాంతాన్ని రుజువుచేయుటకు నేను నయముచేసిన అనేక మేహవాత వ్యాధులలోనుండి అనేక ఉదాహరణముల నిచ్చు చున్నాను. ఒకామెకు మేహవాతపువ్యాధి. కుడికాలు మోకాలు వరకును వాచియున్నది. వెన్నులోను, మెడలోను, కూడా కలక లున్నవి. నేను చికిత్స చేయబోయినపుడు "నీవు యేమి చికిత్స చేయదలచావు? అని ఆమెనన్ను అడిగెను" ఈ ప్రశ్న

నాకు పరిపాటిఅయినదే. మహావాతపు రోగులు నన్ను యిలాగే అడుగుతుంటారు. ఆమెకుఅనేకవారాలు చికిత్సచేసాను. నయము కాలేదు. రోగాద్వైత చికిత్సా ద్వైతములగురించి ఆమెకు నచ్చ చెప్పినాను. కాళ్లకి వెన్నుకు మెడకు తొడలకు వేరేవేరే కట్లు కట్టి చికిత్సలు చేయింపనని కూడా చెప్పినాను. అన్నిబాధలూ, లోపలఉండే వ్యాధులు, వేడివలననే వస్తవి. పైనచేసిన వేడి చికిత్సలవలన యేమీలాభము లేదు. రోగపదార్థములో మండము పుట్టి వేడి పుట్టును. రోగానికి మూలకారణమైన రోగపదార్థము యొక్క పరిమితిని తగ్గినే మహావాతము, నయమగుతుందని కూడా ఆమెకు చెప్పితిని. నేనుచెప్పిన సిద్ధాంతము, చికిత్స చేసికూడా. రుజువుచేస్తాను అని చెప్పితిని. రోగిని కదిలించటానికి, వీలుగాని స్థితిలో ఉన్నది. అందువల్ల తొట్టిని రోగియొక్క మంచముదరికి తీసుకొనివచ్చితిమి. రోగిని తొట్టిలో కూర్చోపెట్టే టందుకు, ముగ్గురుమనుష్యులు, కావలసివచ్చారు బాధపడుచూ, ఆరోగి తొట్టిలో కూర్చుంది. ఒక పనికత్తెచేత, ఆమెకు లింగస్నానమును చేయించితిమి. 15నిమిషములు లింగస్నానము చేసేసరికి, యేడుస్తూ మూలుగుతున్నరోగి నెమ్మదిపడినది. "మంచిది నీవుఅంతలో శాంతిపడ్డావేమి?" అనిఅడిగితిని. తనబాధలుతగ్గినవనిఆమెచెప్పెను. దీనినిబట్టి మనచికిత్స సక్రమమైనదని తేలినది.

తిరిగి బాధలు వచ్చినపుడల్లా మనచికిత్స చేయుడంతోనే తగ్గేవి. కొలదిదినములలోనే, యితరుల సహాయం లేకుండా ఆమె స్వయముగా తొట్టిస్నానము చేయగలిగినది. కొద్దివారాలలోనే ఆమెకు బాధలన్నితగ్గి తనపనిపాటలను చూచుకొనగలిగెను.

ఇంకొకవిషయము. ఆమెకు సంధుల సంబంధమైన మేహాశలకలు. 2 పెద్దవయస్సు. నెలలాది చికిత్సచేసి లాభముగానక నన్ను పిలిపించెను. ఈస్థితిలోకూడా నేను చికిత్సచేయగలనేమో అని అడిగెను. నేను ముఖనిదానము చేసితిని. ఇంకను మిగిలిపోలేదని చెప్పితిని: అతనికి యెడమకాలునొప్పి. అతడు నావద్దకువచ్చి నవుడు, ఒక బండిమీదవచ్చెను. రెండుస్నానములు చేసినంతనే, అతడుస్వయముగా నడచిపోగలిగెను. అతనికి కుడికాలినొప్పి రాకుండా, యెడమకాలునొప్పి యెందుకు వచ్చిందో, నేను తెలియజెప్పెదను.

జ్వరమునుగురించి, యిదివరకు చదివినపుడు, సీసాను ఉదాహరణగాచెప్పి, దేహములో రోగపదార్థము వకవైపునే యేలాచేరు తుందో, చెప్పితిని. ఇతరవివరాలలో నిమిత్తంలేకుండానే రోగపదార్థము చేరినవైపునే బాధలు యెట్లువచ్చునో, మీరు తెలిసికొనగలరు. అయితే దేహములోనున్న రోగపదార్థము దేహమంతటా వ్యాపిస్తుందిగదా; అదే ఒకచోట యేలాచేరు తుంది? అని మీరడుగవచ్చు. నిజానికి రోగపదార్థము ఒకే వైపున ఉండదు. కాని మొదట చేరేటప్పుడు ఒకేవైపున చేరు కుంటూ పోయి ఆవైపు చోటుచాలనపుడు, రెండవవైపున చేరుతుంది. చాలాకాలముదాకా మొదటి వైపునే యెక్కువ రోగపదార్థము పేరుకొంటుంది. రోగపదార్థము గురుత్వా నియమాన్ని అనుసరించి,రోగియే వైపునపరుండునో, యాంత్రికముగా ఆవైపునచేరుతుంది. రెండు సీసాలనిండా మంచినీరుపోసి బిరడాలు పెట్టి, సీసాలను అట్లే ఉంచవలసినది. తెల్లవారిచూస్తే ఆ సీసా

లలో యేమీ మార్పు కనుపడదు. వానిని యేవైపున పరుండ బెట్టినది గుర్తు తెలియదు. ఆ సీసాలలోనే కొద్దికొద్దిగా మన్ను కలిపి, బిరడాలు పెట్టి ఒకరాత్రిల్లా పరుండబెట్టి మర్నాడు చూస్తే మనకు భేదాలు స్పష్టముగా తెలియును. సీసాలను పరుండబెట్టినవైపున మన్ను పేరుకుంటుంది. దానిపైన నీరు నిర్మలముగా నుండును. మూడవరోజున ఆ సీసాలలోనే కొద్దిగా పులిసిన బియ్యపు పిండివేసి బిరడాపెట్టి పరుండపెట్టినయెడల సీసాలు పరుండబెట్టినవైపున ఉన్న బియ్యపు పిండి పులిసి పైకి పొంగును. సీసాలో యేవైపున పులిసిన పిండి ఉందో, పొంగు కూడా ఆ వైపునుంచే వస్తుంది. ఇది ఆకస్మికసంభవము కాకుండా ప్రతిసారి యిలాగే జరుగుతుందని మనకు తెలియును. మట్టిలోకూడా పొంగు వస్తుందిగాని అది చాలాకాలానికిగాని రాదు. గాలిలోకూడా మార్పు రావాలి. మానవదేహముతో పోల్చవలెనంటే, సీసాకు బదులుగా సాగేగుణము గలిగిన రబ్బరు తిత్తిలో పులిసిన పిండిని పోసి పరిశోధన చేయవలసినది. అప్పుడు లోపలనున్నపిండి విరివి పొందుతుంది. రబ్బరుతిత్తి లావవుతుంది. పై ఉదాహరణములవలన మనదేహములో మార్పులు యేలా జరుగునో తెలుస్తున్నది. మనము పరున్నవైపున దేహములోని, రోగపదార్థము చేరుకొనును. పరిపూర్ణారోగ్యవంతుని చూచినపుడు, అతను యేవైపున పరున్నదీ తెలియదు. అతడు యేవైపున పరున్నాకూడా సుఖముగా నిద్రింపగలడు. రోగపదార్థము దేహములో ఉన్నపుడే ముఖనిదానశాస్త్రమువలన మనము అతను పరుండువైపును గుర్తింపగలము. రోగపదార్థము

కొంత ఉన్నదీ, కూడా గుర్తుపట్టగలము. రోగపదార్థము ఎక్కువై దేహమంతాకూడా రోగపదార్థముతో, నిండినకొలదిని, రోగి కొంటూ పడక కుదరక, అటుయిటు కొట్టుకొనుచుండును. ఒకేవైపు రోగపదార్థముతో నిండియున్నపుడు, రెండవవైపునకంటె మొదటివైపున యెక్కువ విరివిగా రోగపదార్థము చేరుకొనును. ఇందువలన కుడివైపుగాలి కెదురుగానున్న మేహాకలకలు, యెడమవైపునకు యెందుకు వస్తాయో తెలియుచున్నది.

మనుష్యులలో, సీసాలోవలె ఒకేవైపున రోగపదార్థము చేరుట చాలా అరుదు. కాని బిడ్డలలో తల్లి కడుపులో ఉండగా చేరే రోగపదార్థము మాత్రము ఒకవైపునే చేరుతుంది. తల్లి కడుపులో నుండగా తల్లి పరుండువైపు తల్లి కడుపులో, బిడ్డ ఒదిగిన ప్రదేశమును బట్టి యిట్లు జరుగును. ఒకరికి పంటినొప్పి ఒకవైపునే వచ్చుటకును ఆ రోగి యెడమకాలులోనే మేహాకలకలు రావడానికి కారణము మీ కిపుడు బోధపడినదిగదా! ఈ చివరరోగికి నయముచేసినతర్వాత, ఒక తీవ్రమైన మేహావాతపు రోగిని చూచుటకు నన్ను మాగ్డేబర్గునకు పిలిచిరి. నేను వెళ్ళితిని. లక్షణములే తీవ్రముగా నున్నవి, గాని, రోగి స్థితి సామాన్యముగా నుండెను. మోకాలు, చీలమండ బాగా వాచి బాధగా ఉండెను. రోగి కాలును చాపలేడు. తనజీవితము లో చాలా బాధపడితిననియూ, ప్రతిసంవత్సరమూ యీరోగము వచ్చుచుండుననియు, వచ్చినపుడల్లా రోగము ముదురుచుండుననియు అతడు చెప్పెను. అతని దేహము ఆపాదమస్తకము

రోగముతో నిండియున్నది. కొత్తగా రోగపదార్థము మోకా లిలో చేరుతుంది. అదివరకుచేరిన రోగపదార్థము, వెనుదిరిగి వచ్చుటకు ప్రయత్నము చేయుచున్నది. యీస్థితిలో రోగపదా ర్థము గడ్డకట్టుతుంది. అప్పుడు దానిని ఆమవాతమని పిలుతురు. ఆప్రదేశమున వేడి చికిత్స చేయడంచేత మరీ గట్టిపడినది. మన చికిత్సలో మార్పువచ్చింది. రోగముకూడా నయమైనది. ఇది వరకుచేసిన చికిత్సలవలన బైటికిపోవలసిన రోగపదార్థము అణిచి పెట్టబడినది. తరుణము చిక్కినంతనే ఆరోగపదార్థము మండ ము వెడలిపోవటానికి సిద్ధముగా ఉంది. వాచిన ప్రదేశాలు ఆవిరిపట్టినంతనే మెత్తపడ సారంభించినవి. దీర్ఘములగు ఉపశ మన స్నానములవలన రోగపదార్థము, వెలువడుటకు ఉపయో గించినవి. కొలదిదినములలోనే యీవ్యాధి నయమైనది.

ఒకామెకు ఆమవాతము. చేతులు కాళ్ళు బిగిసి యున్నవి. ఇది వరకు వాడిన మందులన్నియు వ్యర్థములైనవి. ఆమెకు జీర్ణ క్రియ సరిలేదనియు, అందువలననే యీ వ్యాధి కలిగినదనియు, జీర్ణక్రియ బాగుపడినంతనే ఆరోగము నయమగుననియు చెప్పి తిని. మలమూత్రములు తిన్నగానై చెమట తిన్నగా పోస్తే జీర్ణక్రియ బాగుపడుతుందని చెప్పితిని. దినమునకు మూడులింగ స్నానములవంతున చేయుటకును, కొత్తగా రోగపదార్థము చేరుటకును, వీలులేని, అనుకూలాహారము తినుమని చెప్పితిని. కొలది వారములు గడచిన పిమ్మట మొద్దుబారి చల్ల గానున్న సంధులు మెత్తబడి వేడి యెక్కినవి. చల్లనినీటితో చేసిన లింగస్నానములు, ఆమెలో చల్లదనమును కలిగింపక వేడినే

కలిగించినవి. తొట్టిస్నానములవలన దేహమునందలి రోగ పదార్థము తగ్గిపోవును. అందువలననే రక్తాభిసరణము క్రమపడి చల్లగానున్న ప్రదేశములందు సహజమగు వేడిమి కలుగును. సంధులలో నున్న వేడిమికూడా క్రమక్రమముగా తగ్గి, సహజమగు వేడిమి ఆమెకు కలిగినది. రోగము కుదిరినది.

ఇంకొక ఆమవాతపురోగి. ఒకయింటిలోని పిల్లలకు కొన్ని వారములు చికిత్సచేసి రోగనివారణ చేసితిని. ఆయింటిలోనే ఒకచిన్న గదిలో ఒకముసలమ్మ యున్నది. నాతో అప్పుడప్పుడు మాట్లాడుదామని అనుకునేది.

"నామనమలకు మనమరాళ్ళకు, చికిత్సజేసి, రోగాలు నయము చేసినావు. నేను 3 సంవత్సరాలనుండి బాధపడుచున్నాను. అటు యిటు కదిలించుటకు, యింటిలోనివారుకూడా బాధపడుచున్నారు. నాకుకూడా చికిత్సచేసి రోగనివారణ చేయరాదా?" యని ఆమె నన్ను అడిగినది. మలమూత్రములు తిన్నగా కాక పోబట్టి చెమట తిన్నగా పోయకుండుటవలన, ఆమె కారోగము కలిగినదనీ మలమూత్రములు తిన్నగానై చెమటపోస్తే రోగము నయమవుతుందని ఆమెకు చెప్పితిని. "పూర్వమందు నాకు బాగానే చెమటపోసేది. కొన్ని సంవత్సరాలనుండి నాకు సరిగా చెమటపోయటం లేదు. విరేచనంకూడా సరిగా కాదు. 4, 5, 6, రోజుల కొకతూరి విరేచనమగుచున్నది. నీవుచెప్పినది నిజమే" అని ఆమెచెప్పినది. చాలామంది యిలాగే చెవుతారు. తమకు బాగా జీర్ణశక్తి ఉందని విరేచనంమాత్రం బాగా కావడం లేదని అంటారు. లోపలకిపోయే పదార్థము బాగానే పోవు

చున్నది. బైటికి రావలసినది సూత్రీను క్రమముగా రావటము లేదు. అదే దేహములో చేరి ఆమవాతాన్ని గలిగిస్తున్నదని ఆమెకు నేను చెప్పితిని. 70 ఏండ్ల ముసలావిడకు నేను చెప్పినది నచ్చినది. తనకుకూడా ఒకటి రెండురోజుల్లో ఈ వైద్యము మొదలుపెట్టమని చెప్పినది. అలాగే నావద్ద స్నానపుతొట్టి ఉంచి పంపించి ఆమెకు స్నానం చేసుకునేపద్ధతి నేర్పించాను. దినదినమునకు మూడు స్నానములు చేయించేవారము. ప్రతి స్నానము తరువాత ప్రక్కమీదకెక్కి పరుండబెట్టేవారము. ఆమెకు నేను నమ్మకమున్న దానికంటె త్వరితముగనే చెమట పోయుటారంభించినది. ప్రతిస్నానము తరువాత ఆమెకు చెమట పోసేది కట్టుకొన్న గుడ్డలన్నీ తడిసిపోయేవి. ఒక రాత్రిలోనే రెండుమూడుమార్లు దుస్తులు మార్చాలిసివచ్చేది. కొలది వారాలలోనే తనపనులు తాను లేచి బాధలు లేకుండా గదిలో పనిచేసుకో గలిగినది. ఈరోగిది ఆమవాతము. మొదటి ఆమెది మేహవాతము. ఆమెకు జీర్ణక్రియ సరిగా లేకనే వచ్చినది. ఒకరోజున ఆమె ఇట్లు చెప్పినది. "నాకు మొదట్లో మేహవాతపునొప్పులుండేవి అప్పుడు వుండే వర్తకపు వత్తిడివలన నేను ఆ మేహవాతపు నొప్పులకు వైద్యము చేసుకునేటందుకు తీరేదికాదు. తరువాత వృత్తి మానివేయవలసి వచ్చినది. తరువాత యీ ఆమవాతము వచ్చినది" అని చెప్పినది. మేహవాతము వచ్చినపుడు శ్రద్ధ తీసుకోకపోతే ఆమవాతముకింద మారినది.

## తుంటినొప్పి

మేహవాతమునందువలెనే యిందుకూడా వాపు, బాధా వుండును. ఈవ్యాధిలో నొప్పి తుంటియెముక సంధిలో ఉంటుంది. మేహ

వాతపు నొప్పులు యెలా నయమవుతాయో తుంటినొప్పి కూడా అదే చికిత్సతో నయమవుతుంది. నాదగ్గర చికిత్స పొందిన ఒకరు వ్రాసిన రోగనివారణ వృత్తాంతము యిక్కడ చేర్చు చున్నాను. "1885 సంవత్సరం యెడమతొంటి బిగిసి తీవ్రమైన నొప్పి ప్రారంభించినది. తర్వాత కుడితొంటిలోను, నడుము లోను బిగిసి పోయినది. నేను సంప్రదించిన వైద్యుడు, అది తుంటినొప్పిఅని చెప్పెను. అతడు చేసిన చికిత్సవలన రోగము నయము కాలేదు. వెలుతురును చూడలేను. కనురెప్పలు వణు కును. ముఖమంతయునొప్పి, తలలో బరువు, యెడమచేతిలోను, పై చేతిలోను, బాధలు, దౌర్బల్యము యివి కలిగెను. చెప్పులు విడువలేను. మేజోళ్ళు వదలలేను. ప్రక్కమీద ఒకరితోడ్పాటు లేనిదే పడుకోలేను. ఈస్థితికి నాపని వచ్చినది. తీవ్రమగు బాధ లతో నా తలంతా నెరిసినది. ఈపట్నములో నుండే 12 గురు సుప్రసిద్ధ వైద్యులు నాకు చికిత్స జేసినా లాభము గలుగలేదు. విశ్వకళాపరిషత్తు ఉపన్యాసకులు, వారి విద్యార్థులకు నన్ను చూపించి పాఠములు బోధింపుచుండిరి. ఒక విద్యార్థి నన్ను గురించి వ్రాసి డాక్టరు పట్టమును సంపాదించెను. నెలలాదిగ పట్నములో నుండే ఆసుపత్రిలోను విశ్వకళాపరిషత్ ఆసుపత్రి లోనూ, నేను వసించుచుంటిని. 1889 సం॥ జనవరి నెలలో లీప్‌జిగ్‌లోని ఒకవైద్యుడు, ఒకవైద్యకళాశాల ఉపన్యాసకుడు, నన్ను కూనేగారిసలహా పొందమనిరి. అపుడు కూనేగారు ప్రకృతి వైద్యోపన్యాసముల నిచ్చుచుండెను. 1889 సంవత్సరం జనవరి 23 వ తేదీన నేను వారితో సంప్రదించితిని. 24 వ తేదీ, తొట్టి

వైద్యము మొదలుపెట్టితిని. మొదటి స్నానముతోడనే, మూత్రము యెక్కువగా వెడలిపోయినది. ఉదరములావు తగ్గినది. తల తేలికయైనది. కొన్ని సంవత్సరాలనుండి కర్రలయొక్క సహాయము లేనిది నడువలేనివాడను. ఆరోజు కర్రలసహాయము లేకయే నడువగలిగితిని. విశ్వకళాపరిషత్తు ఉపన్యాసకులకు వారికోరికపై నాస్థితిని వారికి తెలియజేసితిని. మూడు వారాలు తాము చెప్పిన సలహాను నేను తెలిసికొని చేసినాను. 1839 సంవత్సరము, 13 వ ఫిబ్రవరి తారీఖున, మీరు యేర్పాటుచేసిన బహిరంగసభలో, 20, 30, మంది విద్యార్థులయెదుట, నా దేహమంతయు, కదలించి చూపి నే నారోగ్యవంతునిగా నున్నట్లు, తెలియజేసితిని. అప్పటినుండి నేటివరకూ ఆరోగ్యముగానే యున్నాను. పని చేసుకొనుచునే యున్నాను. పూర్వము నేను కదలలేకపోతిని. ఇపుడు రెండుచేతులలోను నూరేసి పౌనుల బరువుయెత్తికొని నడువగలను. 1885 సంవత్సరము వేసవి నుండి 1889 సం॥ జనవరి 23 వ తేదీవరకు, లిప్జిగ్ నగరములోని సుప్రసిద్ధవైద్యులందరు చికిత్స జేసిరి. నా స్థితి నానాటికి చెడిపోయెను. రోగనివారణ కాలేదు. 1889 సం॥ జనవరి 23 తేదీనుండి ఫిబ్రవరి 13 వ తేదీవరకు, మీకొత్త పద్ధతి ప్రకారము, చికిత్స జేసి, నారోగము పోగొట్టి, పనిజేసేశక్తిని ప్రసాదించితిరి."

## అంగవికారము

ఇదివరకు వర్ణించిన వ్యాధులన్నియు ఒకే కారణముచేత వచ్చినట్లు రుజువైనది. ఆమవాతము మేహావాతము కూడా

రోగపదార్థము వలన వచ్చినవని రుజువు చేసితిని. ఎత్తైన భుజములు, వెన్నువంపు, మెలికలు తిరుగుట మొదలగు అంగవైకల్యములు కూడా అన్నిరోగాలకి కారణమైన రోగపదార్థము వలననే కలుగుచున్నట్లు, రుజువు చేసెదను. ఇట్టి అంగవికృతులయందెల్ల రోగపదార్థము వేరువేరు ప్రదేశములయందు, చేరుటయే కారణమని కూడా రుజువు చేసెదను. అంగవికృతులు కూడా ఒకదానికొకటి తోడుగా ఉండి అవియును రోగపదార్థమువల్లనే కలుగుచున్నవని తెలిసికొనుటకు తోడుపడును. ఆమవాతమునందు యేవిధముగా ఒక చెయ్యో కాలో నడుమో బిగుసుకొనునో అదేవిధముగా అంగవికృతి యందును యెక్కువ భాగము బిగిసికొని పోవును. రోగపదార్థము యేవిధముగా ఒక చోటికి చేర నారంభించినది, అది యెందువల్ల యెక్కువగా అక్కడే చేరినది, నేను వివరముగా తెలియజెప్పెదను.ఎన్నో సంవత్సరాలురోగపదార్థము చేరితేగాని దేహముయొక్క రూపమునందు వికారము యేర్పడదు. అప్పుడు కూడా యేదైనా తరుణవ్యాధి వస్తే కొంత రోగపదార్థము వెడలిపోతుంది. దానితో తాత్కాలికముగా అంగవికృతి కూడా లేకుండా పోవుట కద్దు. తిరిగి రోగపదార్థము చేరినకొద్దీ, అంగవికృతియును వృద్ధిపొందుచుండును. ఈ విధంగా ఒకరికి మసూచికము, ఒకరికి విషజ్వరము, యింకొకరికి సర్పి, కలిగించిన రోగపదార్థమే యింకొకరి రూపమునందు వికృతి గలిగించినది. తరుణవ్యాధులు గలిగింప కలిగినంతవరకును, దేహము రోగ పదార్థమును, వెలువరించుచుండును. రోగపదా

రోగపదార్థము చేరనారంభించి, క్రమముగా వృద్ధినందినది. కనుక క్రింది ఉదరము లావుగాగాని, రోగపదార్థము, కాలిశా వస్థను బొందుటవలన గట్టిగాగాని, యుండును. ఇట్టి వ్యాధి సామాన్యముగా శిశువులకు చిన్నతనములోనే గలుగును. తల్లి కడుపులోనున్నపుడే రోగపదార్థము చేరి పుట్టువారును గలరు. అందువలననే 15 సంవత్సరముల శిశువులలో వెన్ను యెత్తుగా నుండి రొమ్ము అణుచుకొనిపోయినవారు గలరు. ఇట్టివారికి, చిన్నతనములో చికిత్సచేసిన మేలుగదా! ఏలయన? పెద్దవారికి 1 సంవత్సరములో నెంతసుగుణము గలుగునో, చిన్నవారలకు ఒకనెలలోనే అంత మేలు గలుగును. చిన్నవారిలో ధాతుశక్తి చాలాబలముగ నుండును. ముఖనిదానశాస్త్రమున, అనుభవము గడించినవారు ఇది బాల్యదశలోనే గుర్తింపగలరు. రోగపదార్థము కొందరియందు ఒకేవైపుగా వ్యాపింపక, కుడివైపున కొంతదూరము, ఎడమవైపున కొంతదూరము వ్యాపించును. తరువాత భుజముల పీడించును. 5 వ పటము యిట్టిదే. రోగపదార్థము, ఇందు ప్రారంభమున మెడమువైపున యెక్కువగా చేరి ఉన్నది, కొంతదూరము పైకి వ్యాపించి మధ్యలో నిరోధము కలగగా సూటిగా పైకి వ్యాపింపక కుడి వైపునకు తిరిగినది. తరువాత దానిస్వభావము ననుసరించి యెడమ వైపునకే మరల తిరిగినది. కనుక యెడమభాగము దిగువను యెగువను పెంపు యెక్కువగా కనబడుచున్నది. మధ్యభాగమున మాత్రము పెంపు, కుడివైపుననే యెక్కువగా నున్నది. అందువలన వెన్నుపాము వంకర తిరిగినది. ఇది ప్రారంభమున

తల్లిదండ్రుల ద్వారా సంక్రమించి యెండ్లు గడచినకొలదీ వృద్ధి పొందినది. ఇట్లు కలిగిన వెన్నువంపునకు పాలాస్త్రిబద్దలు వేసి కట్టుటయు, రబ్బరు బద్దెలుకట్టి బిగించుటయు, చికిత్స లుగా వాడుదురు. రోగికి బాధయేగాని లాభము లేదు.



6వ పటము.

అంగవికృతిమారదు. అంగవికృతిని గలిగించిన రోగపదార్థము నకు చోటు కావలెను. వెన్నువంపు కొరకు చేసిన ప్రయత్నము వలన రోగపదార్థము రొమ్ములో చేరుకొనును. కనుక రోగపదా ర్థము యొక్క స్థానమే యిందుమారినది. రోగపదార్థము యేమియు పోలేదు. ఆరవపటముచూడుము. ఇందు రోగపదార్థము క్రిందకు మీదకు పోక వెన్నుపై నిలిచిపోయి శాశ్వతముగ వెన్నువంపు

గలిగించినది. ఇట్టి వెన్నువంపు సహితము కుదుర్పవచ్చును. నేను కుదిర్చిన ఒకవృత్తాంతము నిచట చెప్పుచున్నాను. 1889సంవత్సరములో నేను లీప్ జిగ్‌లోని నాస్వీయ చికిత్సాలయమున ఉండగా ఒకఆమె 13సంవత్సరముల తనకుమారుని వెంటబెట్టుకొని వచ్చిచూపినది. ఆ పిల్లవానికి వెన్నువంగియుండెను. అతనిని బండిమీద తీసుకొనివచ్చిరి. అతడు కర్రలమీద తప్పకొన్ని అడుగులైన నడువలేడు. 7 వ చిత్రపటమే వానిరూపము.



౭ వ పటము.



౮ వ పటము.

వీపుమీద వాచియుండెను. వీనికి యేమిచికిత్సలు చేయించినారని? నేను ఆమెను ప్రశ్నించితిని. ఈకుర్రవాని కీవ్యాధి

5 సంవత్సరముల క్రితము కలిగి యుండెననియు డాక్టరుగారికి చూపగా, ఆతడు శస్త్రముచేసి లోపల, లోహపు పట్టీలనంటించె ననియు, చాచి పరుండ బెట్టిరనియు, అందువలన వాని దేహ మంతయు, నెక్కువ బాధలు కలిగెననియు, ప్రయోజనము కలుగ లేదనియు, ఆమె చెప్పినది. తరువాత మందులు వాడిరి. అవియును, నిరుపయోగములైనవి. తరువాత చేసిన వైద్యము లన్నియు నిరుపయోగములైనవి. అప్పుడు వానితల్లి నాచికిత్స చేయింప మొదలిడెను. వానిదేహమున ఉన్న రోగ పదార్థము వెన్నున నిలిచిపోయినదనియు, ఉపశమనస్నానము లచే రోగపదార్థమును, వెలువరించివేసిన, రోగనివారణ మగు ననియు, నేను చెప్పితిని. దినమునకు 3 లింగ స్నానములును, దాహమును కలిగింపని ఆహారమును యేర్పాటుచేసి చికిత్సించి తిమి. పిల్లవానిని గ్రామమునకు వెలుపల, ఆరుబైట గాలిలో నడచునట్లు యేర్పాటుచేసితిని. చిన్నవయసువా డగుటచే దేహ మునందు సమగ్రమగు ధాతుశక్తి యుండుటవలన వానికి వెంటనే సుగుణము కలుగనారంభించెను. వారము దినముల లోనే అతను బండితో నిమిత్తము లేకయే చేతికర్రలమీద నడచి నాచికిత్సాలయమునకు రాగలిగెను. ఇట్లే 15 దినములు చేయగా చేతికర్రల నిమిత్తముగూడ లేకుండా నడువగలిగెను. వెన్నువంపును తగ్గనారంభించెను. తరువాత 15 దినములలో అతడు సుఖముగానడచి బడికి పోగలిగెను.తరువాతను నావైద్యము కొన్నిదినములు చేయగా వానివెన్నువంపుపోయి నిలువుగా నిలచి నడువగలిగినాడు. రోగము కుదిరినది, అప్పటి పటమే

8 వవది, కనుక, అన్ని ఇతర వ్యాధులకువలెనే; యీవ్యాధియు కలుగును. అంగ విక్రృతియుండును, రోగపదార్థము వెలువడి పోయినంతనే వ్యాధి కుదురుచున్నది. గూనివాండ్రను మనము తరుచు చూచుచుందుము. కొందరికి వెన్ను బాగా వంగి యుండును. వీ: కన్నిటికి తల్లిదండ్రులద్వారా సంక్రమించిన రోగపదార్థమే కారణము. వీనిలోని కెల్ల విలక్షణమగు నింకొక రకపు విక్రృతిని గురించి, నేను మీకు చెప్పవలసియున్నది. కొందరి కీరోగపదార్థము మెడలోనుండి పైకి త్రోసికొనిపోయి తలలో చేరుకొనును. తల విపరీతముగ పెరిగియున్న యెడల వానిదేహమున కాలికమగు రోగపదార్థము తీవ్రరూపమున దాగియున్నదని యర్థము.

తలలో రోగపదార్థముచేరి జన్మించిన శిశువుల ప్రసవము మిగుల కష్టము. ప్రసవకాలమున యెక్కువ బాధలు కలిగి తల్లి డిల్లుదురు. అందుచే విపరీత లావు తలలు గల శిశువులు, వ్యాధులపాలై మరణింతురు. నావైద్యములో యేచికిత్సలతో, జలుబు, తలనొప్పి, జ్వరము, అతిసారము, తగ్గిపోవునో అవే చికిత్సలతో అంగవిక్రృతియు కుదర్ప సాధ్యమని, యిదివరకే రుజువుపరచియున్నాను. ఏలయన, అన్నిరోగాలకు నేరోగపదార్థము కారణమో, అంగవిక్రృతికిని అదేరోగపదార్థము కారణమై నపుడు అన్నిరోగములకు నేయేచికిత్సలు గుణకారులో, ఆచికిత్సలే అంగవికృతిని పోగొట్టుటలో ఆశ్చర్య మేమియున్నది. కనుక అంగవిక్రృతియు రోగవిశేషమే. దానికిని రోగపదార్థమే కారణము, రోగపదార్థ విమోచనముతో అదియును అంతరించును.

# ౯. చలిచేతులు, చలికాళ్ళు, వేడితల

తలయెప్పుడును చల్లగా నుండవలయును. చేతులు కాళ్ళు వేడిగా నుండుట ఆరోగ్యవంతుల సహజ లక్షణము. ఇందుకు భిన్నముగ తలవేడిగను, చేతులు కాళ్ళు చల్లగా నుండేవారిని తరుచు మనము చూచుచున్నాము. ఇట్టి రోగలక్షణములు యెందుకు వచ్చు చున్నవో విచారింతము. వేడి లేకుండా వ్యాధి, వ్యాధి లేకుండా వేడి ఉండదని మనము యిదివరకు తెలిసికొన్నాము. తల వేడిగా నున్నది. అది వేడిగా నుండుటయు కాళ్ళుచేతులు చల్లగా నుండుటయు కూడా దేహములోని వేడి కేగుర్తు. ఏలాగంటే, దేహములోని రోగపదార్థమువలననే రోగము వచ్చుచున్నది. ఆరోగపదార్థము మొదట ఉదరములోనుండి క్రమముగా ఉదరానికి దూరముగానున్న పాదములు, చేతులలోనికి చేరినది. రోగపదార్థము పొంగినపుడు అది చిట్టకిన వ్రేళ్ళలోను పాదము లందు, పిక్కలయందు అదివరకే రోగపదార్థము చేరియుండుట వలన ఆయాభాగములలోనికి చొచ్చుకొని పోవలేదు. అందు వలన అక్కడ వేడిమి గలగదు ఆయాభాగములలో చేరిన రోగ పదార్థపు వత్తిడివలన క్రమముగా రక్తాభిసరణము జరుగదు. అందువలనగూడా ఆభాగములు చల్లగా నుండును. అట్లే చేతులు కూడా చల్లబడును.

కొందరియందు మొట్టమొదట చేతివ్రేళ్ళు కాలివ్రేళ్ళు మాత్రమే చల్లగానుండి మిగతా భాగము వెచ్చగా నుంటుంది. కాలము గడచిన కొలదీ మోకాలువరకు కూడా చల్లపడి పోయిన వారు ఉన్నారు. ఇంకాకొందరికి ఒక కాలు చల్లగా ఉండి ఒక కాలు వెచ్చగా నుంటుంది. ఇట్టివారు వెచ్చదనము కొరకై

ఉన్ని మేజోళ్ళు ధరిస్తే అందువలన ఉపశాంతి కలుగుతుందిగాని అది తాత్కాలికమే ఏమనగా ఉన్ని గుడ్డలో వేడినిచ్చే గుణము లేదు. దేహముయొక్క వేడిని బైటికి పోకుండా కాపాడును. గనుక దేహముయొక్క వేడి దానికి పట్టి వెచ్చగా నుండును. అందువలన ఆ ఉన్నివస్త్రములు ఉన్నిగుడ్డలు మనకు వేడినిచ్చి నట్లు అగపడును. పాదము నందలి రోగపదార్థము యొక్కవై రక్తాభిసరణము తిన్నగా జరుగక అప్పుడు ధరించిన ఉన్నివస్త్ర ముల వలన వేడిమి కలుగదు.

తలసంగతి వేరు. తలలో మెదడునకు వచ్చే రక్తము దేహము యొక్క రక్తములో ఓవ వంతు ఉంటుంది. కనుక అక్కడ రోగ పదార్థముతో నిరంతరముఘర్షణ జరుగుతూనే ఉంటుంది. అందు వల్ల చాలా కాలము దాకా తలలో వేడిమి తగ్గిపోదు కాని కొంత కాలానికి తలలో వేడిమి కూడా తగ్గి పోయి చల్లబడుతుంది. అట్టిరోగులను నేను చూచితిని. కనుక తలలో యున్న ప్రతీకార శక్తి కూడా కొంతమితియున్నది. తలలోకి చేరినరోగపదార్థము ఎక్కువైనపుడు అందుప్రతీకారశక్తి తగ్గిపోయి చల్లబడుచున్నది. ఇట్లు పాదములు, చేతులు, చల్లగానుండి తల వేడిగానున్న రోగులకు ఆయాప్రదేశములలో యేమియు చికిత్సచేయక ఉద రము మీద చేసిన చల్లని ఉపశమన స్నానములవలన రోగనివా రణమగుట మా అనుభవములోని విషయము. వారికి యుక్త మైన ఆహారము యిచ్చుచుంటిమేని క్రమముగా తలలో నున్న వేడిమి తగ్గి చల్లబడుచున్నది. పాదములలోను చేతుల లోను చల్లదనము తగ్గి అవి వేడిమి పొందుచున్నవి. వెయ్యి

మంది కిట్లు రోగములు కుదిర్చియున్నాను. ఇంకనూ కుదరవలె గలను. ఇట్టి రోగులకు వెంటనే చికిత్స చేయకపోతే వారికి మహావాతము రావటానికి వీలున్నది.



## ౧౦. ముఖనిదానము

నావద్దకు వచ్చేరోగులందరు ఇతరవిధములైన చికిత్సలన్నీ చేసినతర్వాతగాని రారు. అందువలన మందువైద్యులుచేసే నిదానం యెట్లా వుంటుందో తెలిసికొనేటందుకు నాకు వీలు యేర్పడినది. ఒకపొడగాటి మనిషి నాతో సంప్రతించటానికి వచ్చినాడు. అతను తగినంతలావుగా నున్నాడు. అతనిని సామాన్యముగా ఆరోగ్యవంతుడనే జనులు అనుకొంటుంటారు. తనకు పనిచేసే శక్తి లేదు అని అతను నాతో చెప్పినాడు అతడు చాలామంది వైద్యులతో సంప్రదించినాడు. వారతనిని తాకి, వత్తి ప్రయోగించి విన్నారు. వారంతా యేకకంఠంగా చెప్పినదేమనగా, అతడు అన్నివిధాల ఆరోగ్యవంతుడే. తనకు రోగం గలదనే, భ్రాంతిమాత్రమే అతనికి గలదు. తీర్థయాత్రలు చేస్తే అతనిరోగం నయమగునని చెప్పిరి. అతడట్లే తిరిగినాడు. రోగంమాత్రము నయము లేదు. చిట్టచివరకు నావద్దకు వచ్చినాడు. వానిమెడ, తల, పరీక్షగా చూచినపుడును, తల అటు, యిటు, త్రిప్పినపుడును, కంఠమును చూచినపుడును, అతని దేహమంతయు, సంపూర్ణముగాను, ప్రబలముగాను, రోగపదార్థముతో నిండియున్నదని కనిపించినది. సహజమైన చికిత్సావిధానం అతనికి నేను బోధించితిని. ఆరువారాలు జరిగేటప్ప

టికి అతని దేహములోనుండే రోగపదార్థము తగ్గి తాను దివ మంతయు పనిచేయ గలుగుచున్నట్లు నాకు సంతోషముతో తెలియజేసెను. ఈ విషయములో యెవరివిజ్ఞానము అనుభవ మునకు సరిపోవుచున్నదో మీకు తెలియగలదు.

ఆరోగ్యవంతులుగా కనపడుతూ, మిక్కిలి దుర్బలముగా నున్న రోగులు, నాకు ప్రతిదినమూ తటస్థపడుచున్నారు. ప్రతి వైద్యుడు తనకు రోగం లేదని చెప్పడం తనరోగం భ్రాంతిమూలా మని చెప్పడం వారికి విసుగు కలిగిస్తుంది. అందువలన వైద్యు నితో సంప్రదించుట అంటేనే వారికి సర్వాసహ్యము. అందుచే యిప్పటి వైద్యనిదానశాస్త్రము యెంత అసమగ్రమైనదో మనకు తెలియుచున్నది. ఒక బాలికకు 18 సంవత్సరాలు. ఆమెకు పాండు వ్యాధి. ఆమెకు అన్ని విధాలా ఆరోగ్యముగా ఉన్నదని, కొద్దిగా పాండు రోగం కలదనియు దానికి లోహం తింటే తగ్గిపోతుందని, చెప్పిరి. ఆమె లోహంమాత్రలు తిన్నది. ఆమె రక్తము, వృద్ధిపొంద లేదు. ఎర్రదనము చెంద లేదు. నా నిదానశాస్త్రము ప్రకారము మిగతా అన్ని విధాలా ఆరోగ్యముగానున్న వారికి పాండువ్యాధులు రావు. ఆమె దేహమంతయు రోగపదార్థముతో నిండి చర్మా నికి రక్తాన్ని చేర వేయవలసిన సన్నని కేశనాళికలనిండా కూడా రోగపదార్థముచేరి రక్తాభిసరణమును అరికట్టినపుడే చర్మమున కంట రక్తము ప్రసరింపక చర్మము పాలిపోయి రోగిష్ఠిమారి రంగు వచ్చుచున్నది అని మనకు తెలియును. అనేక సంవత్సరాలుగా ఆమె జీర్ణక్రియ చెడి ఉన్నదని ఆమె ఒప్పుకొన్నది. చాలా మందికి నిజంగా సరిఅయిన జీర్ణక్రియఅంటే యేమిటో తెలియదు.

అందువల్ల వారికి దాని ప్రాముఖ్యము కూడా తెలియదు. ఇది నేను నిత్యమూ చూస్తుండేదే. నేను ఒకనొక రోగికి చెప్పిన చికిత్సే ఈమెకు కూడా చెప్పితిని. కొలదిమాసములు ఆమె యీ చికిత్స నాచరించి పరిపూర్ణ ఆరోగ్యమును పొందినది. ఈ విషయములో కూడా మందువైద్యులయొక్క నిదానం విఫలమైనది. జీర్ణక్రియ సరి లేక రోగపదార్థము చేరుట, రోగపదార్థము చేరియుండుటచే రక్తాభిసరణము క్రమముగా జరుగక, చర్మము పాలిపోవుట సహజంగా జరిగేవిషయాలు. చర్మము పాలిపోయి కనుపడినప్పుడల్లా దేహమంతా రోగపదార్థాక్రాంతమై యున్నదని మనము మరువరాదు. ఒక్కసారి కంఠమువంక నేను చూచి చెప్పగలిగిన విషయాన్ని మందువైద్యులు తమయంత్రసామగ్రి అంతా వినియోగపర్చి నిదానం చేయలేకపోయిరి.

ప్రబలమగు మలబంధము గల ఆమె నావద్దకు వచ్చినది. ఎన్నో మందులు వాడిరి. అవి యేమీ పనిచేయలేదు. మలబద్ధకము అదే పోతుంది, చాలామందికి ఆరోగ్యవంతులకు కూడా మలబద్ధకము ఉంటుంది. దాన్నిగూర్చి బెంగ వద్దని వైద్యులు చెప్పినారు. ఆమె దేహమంతయు రోగ పదార్థముతో నిండియున్నదని, అందులో ఉదరమునందు కాలికమగు అంతర్గత ఉష్ణము పుట్టినదని, ఆ వేడిమివలన ప్రేగుల యందలి ఆమత్వచము ఎండిపోయినదని, అందువలననే మలము గడ్డగట్టి ప్రబలమగు మలబంధ మేర్పడినదని నేను నిశ్చయించినాను. మొదటి స్నానముతోనే ఒకతూరి విరేచనమైనది. కొలదికాలము నా చికిత్సచేసి ఆమె తన మలబంధమును

పోగొట్టుకొనెను. ఈ విషయంలో కూడా మందు వైద్యుల నిదానశాస్త్రము యెంత అసంపూర్ణమైనదో తెలియుచున్నది. ఒక మనిషికి ఆరోగ్యము ఉంది మలబద్ధకము కూడా ఉంటుంది; అని యెవరైనా చెప్పితే ఇంతకంటె మోసము, ఇంతకంటె పొరపాటు, అజ్ఞానము వేరే ఉండదని చెప్పవచ్చు.

రోగము ను గురించిన సత్యమునకు దీనికి యెంతో భేదమున్నది. చిన్న పిల్లలకు కూడా పైభాగమును చూచి లోపలిభాగం చెప్ప లేనిపసిబిడ్డలమాటలు యివి. సర్వరోగాలకు మూలంగా అజీ ర్ణము ఉంటుందీ అనేది నిర్వివాదమైన విషయము. ఒకగొప్ప వైద్యుడున్నాడు. ఆయన అనేక శవపరీక్షలు చేసినాడు. ఆయన రోగులు ఒకరోగంతో చావడమేమి, ఆచవిపోవుటకు యింకో రోగం యేల కారణముగుట లేదో యెన్నివిధాల/ ఆలోచించినా నాకు బోధపడటం లేదని నాతో చెప్పినాడు. దేహము నందలి అంతరావయవములన్ని సరిఅయిన స్థితిలో ఉన్నవి. అందెక్కడా రోగానికి కారణము గనపడుటలేదని చెప్పినాడు. బ్రతికిఉన్న దేహములో నడుస్తూఉన్న అవయవాలయొక్క పరీక్ష నేను చేసేది. అతను చేసేది ఉపయోగము లేని చచ్చిన శవముల పరీక్ష. నేను చెప్పదలచిన విషయాన్ని ఈ క్రింది ఉదాహరణముతో చెప్పెదను. "ఒక డోక కుప్పెయంత్రము కొనపోయినాడు. అమ్మే చోట మొదటిరకము మరలన్ని వయసన పెట్టివున్నవి. పైకి యేమీ దోషము కనుపించటంలేదు. పనితనము బాగా వుంది. అందులో ఉండే ప్రతి చిన్నపనిముట్టు కూడా బాగానేఉంది. అక్కడపెట్టి నపుడు చూస్తే అన్నీ బాగానేఉంటవి. పనిచేయించి చూచినపుడు

దోషము లేకుండా ఉండాలని ఒక స్నేహితుడు చెప్పినాడు. ఎంత మంచిగా కనపడిన మర అయినా, ఆడించినపుడు తిన్నగా పని చేయకపోతే ఆ మరంతా వ్యర్థమేగదా! అందువల్ల మరను ఆడించి చూచుకోవాలి. మానవ దేహముగూడా యింతే. చనిపోయిన తరువాత పరీక్ష చేస్తే యేమి తెలుస్తుంది? అందువల్ల చనిపోయిన శవాలను కోసి పరీక్ష చేయడంవల్ల యేమి తెలుస్తుంది? ముఖనిదాన శాస్త్రము జీవించియున్న మనుష్యుల యొక్క నడచే అవయవాలలో చేసే పరీక్ష.

అన్ని రోగాలకు మూలము రోగపదార్థమనీ, అది అజీర్ణమువలన వస్తుందనీ తెలిసినదిగనుక, ఒక్కొక్క రోగానికి పేరు కనుక్కోవడం, ఆ వ్యాధిపేరమేదో కనుక్కోవడం అనవసరము. చికిత్స చేసేటపుడు యివన్నీ అనవసరము. ఆవిధంగా కనుక్కోటానికి ప్రయత్నించితే మనకు పొరపాటు రావచ్చు. మనకు కావలసినదల్లా యేమంటే ఒక మనిషికి రోగపదార్థము ఉన్నదా? లేదా? అది యెంత కాలము నుండి చేరుచున్నది? అది యేమార్గముకుండా యెక్కినది? మనకు తెలిస్తే రోగము నయము కావడానికి యెంత కాలము పట్టేది చెప్పగలము. రోగికి చికిత్స చేసేటప్పుడుకూడా పొరపాట్లు లేకుండా చేయగలుగుతాము.

# ౧౧. చికిత్సా ప్రక్రియలు.

అనేకరోగములను గురించి వివరముగా సకారణముగ తెలిసికొన్నాము గనుక మానవజాతిని బాధించే ఆయావ్యాధులను నివారణచేయుటకు చికిత్సాప్రక్రియలను తెలిసికొందాము. అన్నిరోగాలకు కారణము ఒకటేనని ఋజువైనది గనుక మనము చేసే చికిత్సకూడా, ఒకేస్వభావముగా ఉండవలెను.

## ఆవిరిస్నానము

మొదట ఆవిరిస్నానమును గురించి చెప్పెదను. ఇవి అనేకరకములు. చర్మములోని మాంద్యమును పోగొట్టి నమ్మకంగా చెమట పోయించే పరికరాలల్లో ఆవిరిస్నానము, ముఖ్యమైనది. ఆరోగ్యముకొరకై ప్రయత్నించేవారికి ఆవిరిస్నానము చాలా అవసరము.

## దేహమున కంతకు పట్టే ఆవిరి స్నానము.

అన్నిరోగములలోను ఉపయోగపడేది; కుటుంబములోపల ఉపయోగించటానికి వీలుగానుండి యెక్కువ ఖర్చులేకుండా తయారయ్యే పనిముట్టుకొరకు చిరకాలం ఆలోచించినాను. చిట్టచివరకు ఆవిరిపట్టే మడతమంచం కనిపెట్టితిని. ఇది మడిచినపుడు ఒక కుర్చీ యిమిడే చోటులో యిముడుతుంది. ఆవిరికి యెవరైనా అమర్చగలరు. ఈ పనిముట్టు నుపయోగించాలంటే తోడుగా ఒక మెత్తని కంబళి - 2, 3, చిన్న కుండలు ఒక స్నానపుతొట్టి కావాలి. ఈ పనిముట్టువల్ల ముఖ్యమయిన ప్రయోజనమేమంటే దేహమంతా ఆవిరి పట్టాలన్నా లేక

దేహంలో ప్రత్యేకంగా ఒక భాగానికే ఆవిరి పట్టాలన్నా అప్పుడప్పుడే అమర్చుకోవచ్చు.

ఒకటవ పటము చూడుము. ఆ విధముగా అమర్చుకుని 3, 4, కుండలలోగాని, చిన్న కాగులలోగాని, సగానికి నీళ్లుపోసి పొయ్యి మీదపెట్టి తెర్లింతలయ్యేదాకా కాచి ఆవిరి మంచముకింద పెట్ట వలయును. తరువాత నేయుతో నేసిన ఆ మడతమంచముమీద దిగంబరముగా పరుండి పైన మెత్తని కంబళి కప్పుకొన వలయును. ఆ కంబళి రోగిమీదుగా పక్కలను మూయు నట్లుగా జారి యుండవలయును. అందువలన రోగికి ఆవిరి బాగుగ తగులును. వెలుపలికిపోదు. మొదట్లో రోగియొక్క తలనుకూడా కప్పియుంచవలెను. తరువాత, రోగికి సహాయము చేసేవారు మంచముకింద ఉంచిన కుండలమీది మూతలను తొలగింప వలెను. ఇట్లు తొలగించుటలో రోగియొక్క సౌఖ్యానుకూలముగా మొదట్లో ఆవిరి కొద్దిగా రానిచ్చి, తరువాత యెక్కువగా రానీయాలి. బిడ్డలకు ఒక కుండలో నీరుచాలు. పెద్దలకు 2, 3, కుండల లోని నీరు కావలసివస్తుంది. ఒక కుండలో నీరుపోసి పొయ్యిమీద కాగనియ్యవలసినది. ఏకుండలోనైనా ఆవిరితగ్గిపోతే దానికి బదులుగా పొయ్యిమీది ఆవిరివచ్చిన కుండనుంచి ఆవిరి చల్లారిన కుండను మరల పొయ్యిమీద ఉంచవలయును. బిడ్డలకు ఆవిరి పట్టేటపుడు ఒక్కసారి దేహానికి అంతకూ ఆవిరి పట్టకుండా మొదట నడుముకింద, పాదాలకింద, తర్వాత వెన్నుకింద, మార్చి మార్చి పట్టవలసినది. పెద్దవారికి ఆవిరి పట్టేటప్పుడు పాదాలకింద పెట్టిన కుండ మార్చాలిసిన అవసరము లేదు. మిగతా ప్రదేశాల

క్రిందపెట్టినకుండలు ఆవిరి తగ్గినపుడల్లా మార్చుకొంటూ ఆవిరి పట్టవలసినది.

కుండలను ఆల్కహాల్ దీపాలమీద వేడిచేసి ఆవిరి వచ్చేలాగ ఏర్పాటు చేసియున్నాను. ఆపద్ధతి అవలంబించే యెడల తేప తేపకు కుండలను మార్చాలిసిన పని ఉండదు.

10, 15 నిమిషాలలో వెనుకవైపు అంతా చెమట పోస్తుంది. అప్పుడు రోగి బోర్లపరుండి, పొత్తికడుపుకు, రొమ్మురొమ్ముకు, ఆవిరిపట్టవలయును. అదివరకు చెమటపోయడం మొదలు పెట్టక పోతే దీనితో బాగా చెమట పోస్తుంది. తలక్రింద ఆవిరిపాత్ర పెట్టకపోయినా, తలకుకూడా చెమటపోస్తుంది. బిడ్డలకు ఆవిరిపట్టేటపుడు రెండోకుండ సామాన్యంగా మార్చాలిసిన అవుసరముండదు. ఒకకుండఆవిరే సరిపోవచ్చు. తేలికగా చెమటపట్టని వారు మొదట కొంచెము అసౌకర్యముగా నుండినా, తలకూడా కప్పుకొని పరుండవలయును. అవుసరము ననుసరించి అనగా తేలికగా చెమటపోసేవారికి తక్కువకాలము 15 నిమిషాలును, కఠినముగా చెమట పట్టేవారికి అరగంటవరకు ఆవిరి పట్టవలెను. తేలికగా చెమటపట్టే వారికి ఆవిరికుండలు మార్చనక్కరలేదు. కఠినముమీద చెమటపట్టేవారికి, కుండలుమార్చవలెను. ఏప్రదేశములో రోగపదార్థమాడము యెక్కువగానున్నదో ఆప్రదేశములో చెమట ఆలస్యముగా పోస్తుంది. రోగికికూడా ఆప్రదేశములో యెక్కువకాలం ఆవిరిపట్టడానికి యిష్టము ఉంటుంది. అందువల్ల ఆవిరిపట్టేటప్పుడు రోగిహితవు చూచి మరీ ఆవిరి పడుతూ వుండాలి. ఇలా చేసినపుడు రోగము కుదరుటకూడా తేలికగా జరుగుతుంది.

బలహీనులుగా ఉండేవారు, మిక్కిలి రోగగ్రస్తులుగా నుండేవారు, నాడీ దౌర్బల్యము గలవారు యెప్పుడూ ఆవిరి స్నానములు సేయరాదు. అట్టివారికి ఉపశమన స్నానములు చాలును. వానికితోడుగా ఆతప స్నానముల హితవు ననుసరించి చేయింపవచ్చును.

వీనితోనే దేహమునందలి రోగపదార్థము వెడలిపోవును. తేలికగా చెమటపోసేవారికి ఆవిరిస్నానములే చేయింపనక్కరలేదు. వారమునకు 2 స్నానములు చాలును. యెక్కువ చేయింపవలసి వచ్చినప్పుడు, సమర్థుడగు వైద్యుని సలహాతో చేయింపవచ్చును. ఆవిరి స్నానమైన తరువాత, దేహమంతయూ చన్నీటితో కడిగి, తుడిచి, 68 డి, మొదలు 81 ఫారెన్ హీటు డిగ్రీల చల్లని నీటిలో దేహము చల్లబడుటకు ఒక కటిస్నానము చేయువలయును దేహము యెంత వేడిగా వుంటే చల్లదనాన్ని అంత తేలికగా భరిస్తుంది. ఆవిరిస్నానం తరువాత, కటిస్నానం చేయుటానికి యెవరూ భయపడనక్కరలేదు. ఏమనగా, కమ్మరంలో ఉక్కుపనిముట్టును కాల్చి నీటిలో ముంచిన తరువాత దానిలోనుండే పాటవము వృద్ధి అవుతుంది. అలాగే మానవ దేహంకూడా ఆవిరిపట్టిన తరువాత కటిస్నానంచేస్తే బలపడి రాటు తేలుతుంది.

కటిస్నానంచేసిన తరువాత, దేహము తిరిగి చెమర్చుటకు ఆరుబైట సూర్యకాంతిలో కసరతు చేయువలయును. దుర్బల దేహులకు ఆవిరి పట్టనేరాదు. అట్టివారికి ఆవిరిపట్టుక

తప్పనట్లయితే వారు వ్యాయామము చేయలేరు గనుక అట్టివారు పక్కమీద దుప్పటి కప్పుకొని పరుండవలయును. చల్లని గాలి లోనికి మాత్రం రానీయవలయును. ముఖముమీద గుడ్డ కప్పి యుండరాదు.

నీరు 212 ఫారెన్‌హీటు డిగ్రీల వేడికి వచ్చుసరికి ఆవిరి రానారంభించును. ఇంకా కొంతసేపు కాగనిస్తే మనకు కావలసిన ఆవిరి కుండనిండా చేరుకొనును. ఒకసారి యిట్లా చేసి చూస్తే కావలసిన ఆవిరి తయారైనదో లేదో తెలుస్తుంది.

ఆవిరి మడతమంచమూ, లేక, పేము నేసిన బెంచియూ లేకపోయినప్పుడు, పేముకుర్చీ అయినా, మనము ఆవిరిగా వాడుకొనవచ్చు. రోగి ఆ పేముకుర్చీమీదే కూర్చుండవలయును. ఒక కంబళిరోగిని కుర్చీని కప్పునట్లుగా ఆ కుర్చీపై జారవిడువవలెను. యీ కుర్చీక్రింద ఆవిరిగల కుండను పెట్టవలయును. వేరొక ఆవిరికుండమీద 2 కొయ్యముక్కలు అడ్డముగా వేసి దానిమీద 2 పాదములు ఉంచవలయును. ఏ ప్రదేశమునకు కావలెనంటే ఆ ప్రదేశానికి నా ఆవిరిమడతమంచముతో చెమటపట్టించుకొనుటకు అనువుగా యేర్పాటు చేసియున్నాను.

## ఉదరముకు ఆవిరి పట్టుట.

పాండువు, ఋతుదోషములు, స్త్రీలవ్యాధులు, మొదలగు ఉదర సంబంధమైన మొండివ్యాధులకు, చికిత్స చాలా బాగా పని చేస్తుంది. ఉదరమునకు ఆవిరిపట్టే పద్ధతి, రెండవపటములో, చూపబడినది. పటమును బట్టి ఆవిరిపట్టే విధానం సులభముగా తెలి

యును. ఇందులో ఒక కుండే వాడుతారు. కుండలోని ఆవిరి తగ్గిపోయినపుడు రోగి హితవు ననుసరించి వేరొకకుండను ఉపయోగింపవచ్చును. ఈ ఆవిరిలో దేహమంతా కూడా, వేడి యెక్కుతుంది. అందువలన చన్నీటితో పాత్రికదువును కడగి తుడిచి, దేహమంతటికి ఆవిరిపట్టినప్పటివలెనే, ఒక చన్నీటి కటిస్నానము చేయవలయును. స్త్రీలవ్యాధులలోను యితర ఉదర వ్యాధులలోను ఉదరానికి ఆవిరిపట్టి నపుడల్లా కటిస్నానముకన్నా, లింగస్నానమే యెక్కువ ఉపయోగకరంగా ఉండును. కటి లింగస్నానములలో యేది చేసినా, దేహమునకు గలిగిన అధిక ఉష్ణము తగ్గి సుఖమైన చల్లదనము కలుగువరకు చేయవలయును. జాగరూకతతో ఆవిరిస్నానములు చేయించినపుడు అవి ఆశ్చర్యకరముగా పనిచేస్తవి.

## తలకు, కంఠమునకు ఆవిరి పట్టుట.

8 వ పటము చూడుము. రోగికూర్చున్న బల్లమీదనే ఆవిరి పాత్రను పెట్టవలయును. తలకు, కంఠమునకు, ఆవిరిపాత్రకు, కలిపి కంబళి కప్పవలయును. తల కంఠము బాగుగా చెమట పట్టు వరకూ, ఆవిరిపట్టవలయును. దంతవ్యాధులు మొదలగు బాధలు చెమటపట్ట నారంభించిన తోడనే తగ్గనారంభించును. బాగుగా చెమటపోసినతరువాత తల కంఠము మొదురురొమ్ము చన్నీటితో బాగా కడిగి తుడిచివెంటనే ఒక కటిస్నానముగాని, లింగస్నానముగాని చేయవలయును. బాధలు తిరిగి వచ్చినపుడల్లా దేహమున కంతటికిని ఆవిరి పట్టవలయును. ఉదరమునకు ప్రధానముగా ఆవిరి పట్టవలయును. కంఠమునకుకూడా ఆవిరి పట్టవల

యును. ఆ యా ప్రదేశములలో పట్టే ఆవిరి, కన్నులు, చెవులు, ముక్కు, గొంతు, మొదలగు వాని బాధ యందును, దంతవు పోటు, కురుపులు వ్రణములయందును వెంటనే బాధను తగ్గించుటకు మిక్కిలి ఉపయోగించును. ఆవిరిపట్టే మడతమంచము లేకపోయినా, ఆయా ప్రదేశములలో పట్టే ఆవిరి నేర్పుగా పట్టుకొనవచ్చును. ఉదరానికి ఆవిరిపట్టేటపుడు ఏ సులకమంచమైనా పనికివస్తుంది. శిరస్సుకు ఆవిరిపట్టేటపుడు, ఒక బెంచీకి దగ్గరగా ఒక కుర్చీ లాగుకొని కుర్చీ వెన్నుమీద తల ఆనించి, బెంచీ మీదనే ఆవిరిపాత్ర పెట్టుకొని ఆవిరిపట్టుకొనవచ్చును.

— —

## ౧౨ ఎండ ఆవిరి.

బాగా ఎండ ఉండి, గాలి వేడిగా ఉన్నపుడు ఆవిరిపట్టడం మంచిది. నేలమీద ఒకచాపను పరుచవలయును. రోగి దేహముమీద సాధ్యమయినంత, తక్కువ దుస్తు లుండవలయును. కాలికి మేజోళ్ళుగాని చెప్పులుగాని ఉండకూడదు. స్త్రీలు, ఆడపిల్లలు మందమైన చొక్కాలు తొడుగుకొనరాదు. రోగి ముఖమును, తామరాకులతోగాని, అరటి ఆకులతోగాని, కప్పియుంచవలెను. దిగంబరముగానున్న రోగి ఉదరముమీద అల్లి ఆకులతో కప్పియుంచవలెను. ఆకులు దొరుకకపోతే, ఉదరముమీద తడి గుడ్డను వేయవలయును. ఎండ ఆవిరి పట్టేటపుడు ప్రక్కనుంచి చల్లగాలి రాకుండా చూచుకోవాలి. ఎండ ఆవిరి అరగంట మొదలు గంటన్నర వరకు పట్టవచ్చును. తేలికగా చెమట పట్టని రోగులు యెక్కువకాలము ఆవిరి పట్టవలసి యుంటుంది.

ఆవిరి పట్టేటపుడు రోగికి బలహీనముగా తోస్తే ఆవిరి పొడిగించ టానికి వీలు లేదు. ఎండ వేడిగా ఉంటేకూడా ఆవిరికాలము తగ్గించ వలసి ఉంటుంది. ఎండ ఆవిరి పట్టేటప్పుడు తలనొప్పి, తలతిరు గుట వచ్చినట్లయితే ఎండ ఆవిరికాలమును తగ్గించవలసిఉన్నది. చెమట తేలికగా పట్టని వారికిని, అసలే పట్టనివారికిని మాత్రమే పుట్టిబాధలు వస్తవి. ఎండఆవిరి పట్టినప్పుడుకూడా దేహములోని రోగపదార్థము కరుగుతుంది. దానిని తొలగించుటకు, నీటిఆవిరి పట్టినప్పటివలెనే దేహమంతయు చన్నీటితో కడిగి తుడిచి, కటిలింగస్నానములు చేయవలయును. కటిలింగస్నానముల తరువాత, దేహమునకు వెంటనే సహజఉష్ణము రానివారు తిరిగి కొంతసేపు యెండలో కూర్చుండవచ్చును. లేదా నడువవచ్చును. ఎండలోకూర్చున్నపుడుకూడా నెత్తికి ఎండతగలకుండా ఒకతల పాగా చుట్టుకొనవలయును. దుర్బలముగానున్న రోగులకు ఎండ ఆవిరికూడాపనికిరాదు. దేహములో ధాతుశక్తివృద్ధిపొందేదాకా ఎండఆవిరి పట్టరాదు. ఎండఆవిరి పట్టటానికి మంచికాలము హిందూదేశములో ఉదయము 8–10 గంటల మధ్యను, సాయంత్రం 2–4 గంటలమధ్యను, పట్టవచ్చును. ఉదయము భోజనముచేయుటకు పూర్వమందు ఎండఆవిరి. ఉపశమనస్నానములుముగింపవలయును. మధ్యాహ్నము అన్నము తిన్నతరువాత 3 గంటలుఆగి సాయంత్రపు యెండఆవిరి పట్టవలెను.

## ఆయాప్రదేశములకు ఎండ ఆవిరిపట్టుట

గాయలు కణుతులు ఉన్నపుడును, బహిరంగవ్రణములందును గడ్డకట్టిన భాగములందును, లోపల గడ్డలున్నపుడును, బాధ

లున్నప్పుడును, ఆయా ప్రదేశములయందు ఎండ ఆవిరిపట్టిన చాలమేలు కలుగును. ఇదియును దేహానికి అంతటా కూడా ఎండఆవిరి పట్టినట్లే పట్టవచ్చు. ఇందు కూడా ఆవిరిపట్టవలసిన భాగం, ఎండలో ఉంచి ఆ ప్రదేశము మీది వస్త్రమును తొలగించి దానిపైన, 1 2. ఆకుపచ్చని ఆకులను కప్పవలయును. ఎండ ఆవిరినిగురించి ఇకసంగతి చెప్పవలెను. చన్నీటి స్నానములు క్రమమైన, పథ్యము, చేస్తూ ఉండేవారికి ఎండఆవిరివలె పనిజేసే చికిత్సాప్రక్రియ యింకొకటిలేదు. కాలికవ్యాధులలో, రోగపదార్థాన్ని కరిగించి వెలుపరింపగల ప్రక్రియలలో కెల్ల, మిక్కిలి, శక్తివంతమయినను సౌమ్యమయినను అయిన చికిత్స ఎండఆవిరే. దీనితో తుల్యమైన, ప్రక్రియ యింకొకటి లేదు. ఒక పోలిక చెప్పవచ్చు. ఒకవస్త్రము మురికిగానుంటే ఆ వస్త్రము యెండలో వేసినపుడు మురికిఅంతా ఎండిపోతుంది. అదే వస్త్రము తడిపి ఎండవేసి తిరిగి తడిపి ఎండలో వేస్తూవుంటే అందులో ఉండేమురికి అంతాపోవడమే కాకుండా ఆవస్త్రం తెల్లబడుతుంది. సూర్యకాంతి, నీరు, గాలి, మన్ను దీనిమీదనే భూమి మీదనుండే జీవరాసులయొక్క బ్రతుకు ఆధారపడి యున్నది. ఈ నాలుగు భూతములు సమముగా అందినపుడే వృక్షజాతి వృద్ధిపొందుతుంది. ఇందులో యే ఒక భూతమైనా తిన్నగా అమరకపోతే, వృక్షములు వృద్ధిపొందక గిడసబారిపోవును. అట్టి భూతములలో జలమును సూర్యకాంతిని దురదృష్టవశాత్తు చాలామంది జనము సక్రమముగా వాడుకొనుటలేదు. అందువలన దేహములందలి పాటవము తగ్గిపోయి

రోగగ్రస్తమవుచున్నారు. ఆరోగ్యవంతుడు ఎండలో తిరిగితే అతనికి యేబాధ కలుగదు రోగియైనవాడు ఎండలో తిరిగినప్పుడు అతని దేహమునందలి రోగపదార్థమునందు కదలిక కలిగి తల తిరగడం, తలనొప్పి, దౌర్బల్యము, వేడిమి కలుగును. దేహమునందలి రోగపదార్థమును వెలువరించే మలమూత్రకోశములును చర్మమును, దుర్బలము లయినపుడే యిట్టి బాధలు కల్గుచున్నవి. ఎండ ఆవిరిపట్టి దానితరువాత చేయవలసిన కటిస్నానం చేయకపోతే, మనకు రావలసినంత సుగుణము రాదు. దేహములోని ధాతుశక్తిని వృద్ధిజేసే సామర్థ్యం నీటిలో నున్నదిగాన స్నానములు చేయుట మిక్కిలి అవసరము ఉన్నది. చెట్లు కూడా తేమలేనిచోట సూర్యకాంతిలో మాడిపోతవి. ప్రకృతిలో జరిగే క్రియాకలాపము మనము అర్థము చేసుకొంటే, కాలిక వ్యాధులలో ఎండఆవిరివల్ల తాత్కాలికముగా కలిగే, తలదిమ్ము, వికారము, మొదలగు బాధలను ఉపశమన స్నానములతో తగ్గించుకొనగలము ఎండఆవిరితో జోడించి, చేసిన కటిలింగ స్నానముల వలన అద్భుతముగ రోగనివారణ మగును.

దుస్తులు లేకుండా ఎండలో పరుంటే ఎండబాధ అతి తీవ్రముగా ఉంటుందని మీరనుకోవచ్చు. ఇది పొరపాటు. ప్రకృతివంక చూడండి. ద్రాక్షతీగలో ఉండే ద్రాక్షకాయలు, యెండవేడి మీదపడకుండా ఆకులచాటున దాగి ఉంటవి. ఆకుల చాటున దాగిన కాయలు బాగా వృద్ధిపొంది పండుతై. ఆకుల నీడ దొరకనికాయలు చిన్నవిగను పుల్లగాను ఉంటై. బత్తాయి కాయలు కూడ ఆకులు చుట్టబెట్టిన, కాయలు బాగా స్వాది

నంత శీతలోదకము మనకు దొరకకపున్నను, దొరికినదానిలో శీతలతరముగానున్న నీటితోనే, జర్మనీయుందువలెనే గుణమిచ్చి తీరును. (ఇచ్చటకూడా ఉపాయములు కటిస్నానపుతొట్టి దొరక నప్పుడు తొట్టియెనను 8 బిందెలు నీరుపోసి చేయవచ్చును.) మిక్కిలి తక్కువ నీరుపట్టునదియైన నీరు వెంటనే వెచ్చబడును. గాన, నీరు తగినంత పట్టుతొట్టిని సంపాదింపవలెను. భావుల నీటికన్నా చెరువులకు ప్రవాహోదకము మంచిది. భావిసీరేగాని దొరుకనపుడు తొట్టిలో నీరుపోసిన తరువాత గొంతసేపు ఉండ నీయవలెను. నీరు వేడి యెక్కరాదు.

స్త్రీవలెనే పురుషుడును, తొట్టిలో వేసిన యెత్తుపీటపై దిగంబర ముగ, కాళ్ళు తొట్టి వెలుపల ఉండునట్లు, కూర్చుండ వల యును. పీటమీద 3 అంగుళముల నీరుండవలయును. తర్వాత లింగముమీద చర్మమును, ముందుకు లాగి నీళ్ళలోనే, ఉంచి, యెడమచేతి చూపుడువేలు పెద్దవేలు సందునగాని, పెద్ద వేలు అనామిక వేలు సందునగాని, పట్టుకొని కుడిచేతితో నొక జేబురుమాలతో నీటిలోపలనేయున్న లింగ అగ్ర చర్మ మును కడుగుచుండవలయును. (అనగా నీటి తాకిడి చివర చర్మమునకు మాత్రము తగులునట్లు) — గుడ్డతో — క్రిందనుండి పైకి, పైనుండి క్రిందికి లింగపు చివరి చర్మమునకు తేలికగా తుడుచుచుండవలెను. స్వాస్థ్య సంకటములో — లింగాగ్రము పుండు పడునేని, నీటిని గిలకొట్టి లింగాగ్రచర్మమునకు నీటి తాకుడు గలుగునట్లు చూడవలయును.

అంతర్గత దాహము, వ్రణములు గలవారికి లింగస్నానము చేయుచు ప్రథమస్నానానంతరమే, పైమంట మొదలగునవి స్నానము చేయు ప్రదేశమునను చుట్టపట్లను గాన్పించును. ఇట్టివి గలిగినపుడు, భీతిల్లక పట్టుదలతో లింగస్నానము జేయుచునే యుండవలెను. అవుసరమగునేని యింక కొంచెము మెత్తని గుడ్డతోనే తోళన చేయవచ్చును. ఎత్తుపీటమీద 3 అంగుళముల నీరుండవలయును. నీరు సాధ్యమైనమట్టుకు చల్లనిదిగా ఉండవలయును.

లింగాగ్రమునందు దేహమునందలి మజ్జానాడియొక్కయు ప్రధాన నాడీమండలము యొక్కయు చివరలు గలవు. కాన యిచ్చట జేసిన శైత్యోపచారమువలన నాడీమండలము, మెదడు చల్లబడును. నాడులన్నియు నుద్దీపన బొందును. రోగపదార్థమందు మరికట్టుపడి నాడు లన్నియు బలపడును. ఇచ్చట జేసిన శైత్యోపచారము చెట్టునకు మొదట నీరు పోయుటవలె గుణమిచ్చును.

దేహమునందలి ధాతుశక్తి చెడియున్న దక్క శీతలోదకముతో జేసిన లింగస్నానమునకు అత్యద్భుతమును అనన్యసామాన్యమును అగు రోగనివారకశక్తులు గలవు. దేహమునందు అత్యధికమగు ఉష్ణముండినపుడు దేహమునందు లింగాగ్రమున జేసిన శైత్యోపచారమువలన ప్రకృతియం దంతటను సమత్వం బొందును. వ్యాధులన్నిటిలోను జీర్ణశక్తి తగ్గియే యుండును. గాన చికిత్స ప్రారంభింపగనే యుద్దీపనకర పదార్థములను అతిమాత్రముగా దినుట కలవాటుపడిన జీర్ణకోశ మిప్పుడుస్వాభావిక

పదార్థముల స్వీకరించుచుండుటచే నాహారపరిమితి తగ్గిపోవును. ఉపశమన స్నానముల వలనను, స్వాభావికాహారముల వలనను, ధాతుశక్తి తిరిగి బలపడును. జీర్ణశక్తి వృద్ధియగును. రోగనివారణ యగును.

దేహమునందు నుండమగుచున్న రోగపదార్థమును, ఉపశమన స్నానములవలన, మండమును అంతర్గతమును అగువేడి, క్రమముగా దిగిపోయి రోగము శాంతించుచున్నది. దేహమునందలి నాడీమండలమంతటితోడను సంబంధముగల లింగాగ్రమునందు జేసిన శైత్యోపచారమువలననే ముఖ నేత్ర, కర్ణ వ్యాధులును, మశూచికము, కలరాయు, యెట్లు దిగిపోవుచున్నవో, తత్త్వమిప్పటికి బోధపడి రోగాద్వైతమును, చికిత్సాద్వైతమును బోధపడియుండును. నాడుల సంబంధము విచ్ఛిన్నమైన తప్ప దేహమునందు దైశికముగానే యొక్కయవయవమును, ప్రత్యేకముగా చెడియుండదుగనుక, ధాతుశక్తిని బలపరచునట్టి నా ఉపశమన స్నానముల వలన అంతర్గతమగు వేడి క్రమముగా దిగిపోయి దేహతత్త్వము బలపడి, రోగనివారణ మగుచున్నది. ఆబలపడుటలో, దేహమున కనవసరమగు పదార్థములను,లోనికి పోనీయకుండు, సామర్థ్యము దేహమునకు గలుగునుగాన, అప్పుడట్టి అస్వాభావికాహారము తినినను, మోకిలింత గలుగును. అనేకులిదికొత్తరోగమని,భీతిల్లుచున్నారు. ఈలింగస్నానమునకు, తోడు కటి ప్రదేశమునకు, మట్టికట్టుటవలన, మిక్కిలి ప్రయోజనము గల్గును. పుండ్లకు, బహిరాఘాతములకు, యిట్టికట్లు మిక్కిలి ప్రయోజనకరము. నాడీసముదాయము విచ్ఛిన్నమైన

రోగులకు ఉపశాంతి మాత్రమొసగును. నాచే విధింపబడిన స్నానములను బహుమితముగా వాడవలసిన, సందర్భములనుగలవు. అట్టిసమయములలో స్నానము తాత్కాలికముగా నాపివేయ వలసి యుండును. నాచికిత్సానుభవము లేని, రోగులు తాముగా గ్రంథస్థమగు విషయములపై ఆధారపడి చికిత్స నారంభింపక, యీచికిత్సయందు ప్రావీణ్యముగల వారికి జాబు వ్రాసిన తగు సలహా బొందెదరేని ఉపశమనస్నానములవలన, యెట్టిఅపాయ మును గలుగదు.

---

# ౧౪ ఆహారపానీయములు

ఇదివరకు చెప్పిన విషయమును బట్టి, ఆహారమునందలి లోపములవలననే రోగమువచ్చునని తేలినది. జీర్ణక్రియ చెడినపుడే దేహమునందు రోగపదార్థము చేరి వృద్ధి నొందును. అందువలన మనము తినే ఆహారమును గురించియు, త్రాగు జలమును గురించియు, శ్రద్ధ అత్యంతముగా తీసుకొనవలెనని తేలుచున్నది. విద్యుచ్ఛక్తిని గలిగించి, యెడతెగక వ్యాపింపజేయుటకు, కొన్ని ధాతువులు కావలెననుట అందరికి తెలిసినదే. రాగియందును, తుత్తునాగమునందును, సహజముగా ఉండే శక్తిని వెలువరించుటకు ఒక ద్రావక ముండవలయును. ఆద్రావకము వాని యందలిశక్తులను కదలించి వెలువరించును. ఆ వెలువడినశక్తి సవ్యాపసవ్యశక్తులుగా ధనఋణాగ్రముల వెంట బైటికి వచ్చును. తుత్తునాగము రాగికి బదులుగా తుత్తునాగము, అంగారముకూడ

వాడవచ్చును. అయితే వానినే చూర్ణము చేసి వాడినపుడు విద్యుచ్ఛక్తి రాకపోవచ్చును. లేదా వచ్చినా చాలా స్వల్పముగ రావచ్చును.

ఇప్పుడు వాడినదికూడా శుభ్రనాగము, అంగారము వాడినాము గదా, శక్తి యెందుకు రాలేదు? అని మీరడుగవచ్చు. దానిని చూర్ణించకుండా గట్టిస్థితిలో వాడితేనే, పుట్టవలసినంత విద్యుచ్ఛక్తి పుట్టును. లేనియెడల పుట్టదు. ఆవిధముగనే మానవదేహములో కూడా జీవశక్తులు పుట్టవలెనంటే సరిఅయిన ఆహారమునే తినాలి. మంచి స్వచ్ఛజలమునే త్రాగవలెను ఈరెంటికంటెకూడా యింకొక గొప్ప ఆహారమున్నది. ఏనిమిషంలోనూ యీఆహారం తీసుకోకుండా ఉండలేము. అదే గాలి. ఇప్పుడున్న గాలిలోనుండి యింకొకవిధమైన గాలిలో మనిషిని ఉంచితే, కొలది నిమిషాలలోనే అతనియందలి ప్రాణశక్తులు ఆరిపోయి అతను చనిపోతాడు. ఆహారమువలన వచ్చే అపాయములు నెమ్మదిగను ఒడిదుడుకులు లేకుండాను వస్తవి. మంచి ఆహారానికి, ప్రాణం తీసే విషానికి చాలారకాల పదార్థములు మధ్య వున్నవి. స్వాభావికాహారానికి, అస్వాభావికాహారానికి, ఉండే భేదము మొదట గుర్తించటానికి వీలుగానంత స్వల్పముగా నుండును. మనము తినిన ఆహారపదార్థమునందలి లోపములవల్ల జీర్ణక్రియ చెడును. జీర్ణక్రియ చెడుటచే, దేహంలో రోగపదార్థము చేరుతుంది. అందువల్లనే మంచిఆహారాన్నే తిని జీర్ణక్రియ చెడకుండా కాపాడుకోవాలి. నిత్యజీవితములో సంభవించే కొన్ని విషయాలను ఉదాహరణముగా యిచ్చి చెడ్డ ఆహారమంటే

ఏమిటో అజీర్ణమంటే ఏమిటో వివరించెదను. ఒకని కెంత స్వల్పా హారము దినినను దేహము లావుబారుచున్నది. ఇంకొకను బల కరములని తలంపబడు మాంసము, గ్రుడ్లు, సారాయము, చేపలు మొదలగునవి కొన్ని తినినను సన్నగిల్లి క్షీణించి పోవుచున్నాడు. ఇందు మొదటివానికి ఆహార అవసరము లేకపోవుటవలన కొంతటి స్వల్పాహారమైనను దేహపోషణగా మారక, రోగ పదార్థముగా నిల్చిపోవుచున్నది. రెండవవానికి తినినఆహారము క్రమముగా మారకపోవుటవలన దేహమునందలి శక్తి నానాటికి క్షీణించి పోవుచున్నది. పైరెండు స్థితులను జీర్ణదోషము లేగాన ఇద్దరకూ ఆహార ఆధిక్యతే కాన్పించుచున్నది. ఇకనెట్టి ఆహా రము తినిన ధాతుశక్తి వృద్ధియగునో విచారింప వలసియున్నది. దీర్ఘకాలమునకుగాని జీర్ణముగాని పదార్థము లజీర్ణమును గలిగిం చును. అట్టిపదార్థములనే తినిన అవి జీర్ణమై తిరుగ ఆకలి కలిగే వరకు వేచియుండవలయును. మామూలు వేళకు భోజనము చేయవలసి యుండుటచే మన మిట్టి నియమమును పాటించుట లేదు.

చల్లదనమువలన మంద మరికట్టబడుచున్నది. అట్లే జీర్ణమంశ మును శీతకాలమునందు కార్తీకసోమవారములు, పూర్ణిమలు, మాఘభానువాసరములు మొదలగు ఉపవాస నియమములు, ఆచారమందున్నవి. వేసవియందు జీర్ణమగునంతటి పరిమితి గల ఆహారము చలికాలమున జీర్ణము కాదు. అందువల్ల శీతకాల మున వేసవియందుకన్న ఆహారపరిమితిగాని తిను పూటలను గాని తగ్గించవలెను. చలికాలమున చేసిన అపరిమితాహార

భక్షణవలన చలికి తాళుకొనుశక్తి తగ్గిపోవును. మనము పశుశాలలయందుంచి మేపు పశువులిందుకు నిదర్శనము. అడవియందు చలికాలమున అపుడు దొరికిన ఆహారముతో దృప్తినొందియుండు పశువులు చలికి తాళుకొన గలుగు చున్నవి. పశుశాలల యందలి పశువుల బయట కట్టివేసిన బాంతురేగిపోవుచున్నవి. అపరిశుద్ధమగు గాలికన్న పరిశుద్ధమగు వాయువు చర్మమునకును, కాచిన నీటికన్నను, మరికి ఉప్పునీటి కన్నను, తియ్యని శుద్ధమగు ప్రవాహోదకము నాలుకకు హితమై, నవజీవనము నిచ్చునట్లే పరిశుద్ధమగు అపుడు కోసిన ఫలములు ఎంతయు హితవుగనుండి ఆరోగ్యదాయకమైనవి. ఇండ్లలోనుండి అపరిశుద్ధవాయువులో ఆహారమును తినుచుకన్నా, ఆరుబైట పరిశుద్ధవాయువులో ఆహారము తినుటచే, నములుటలో అది పరిశుద్ధవాయువుతో మిశ్రమై సులభతరముగ జీర్ణమగుచున్నది. త్వరగా జీర్ణమగు ఆహారము చే స్వాభావికములు. ధాతుశక్తిని వృద్ధిచేయునవి. అట్టి వానిని తినవలెను. అవి అపుడు కోసిన (లేతకాయకూరలు) పండ్లు తీయునివి. స్వాభావికమునై ఉన్నవి. స్వాభావికస్థితియందే నోరూరించి జిహ్వకు హితమగు ఆహారము లన్నియు త్వరగా జీర్ణమై ప్రాణశక్తిని, ధాతుశక్తిని వృద్ధిబరుచును.

ఆహారము నిలువవుంచుటకుగాను చేయు పచనాదికములన్నియు వానియందలి జీర్ణస్వభావమును తగ్గించును. స్వాభావికాహారములకన్న అవి తక్కువ యుపయోగకరములు. పచనాదికములలో, యేవి తక్కువలవణముతో వండి, మసాలాలు

విస్తారముగా లేకున్నచో అవి మసాలాతో ఎక్కువ లవణ ము చేర్చి తయారు జేసిన వాని కన్నా గుణకారులు, సులభజీర్ణకారులు. ద్రవరూపమగు చారు, కాఫీ, టీలు పాయసాదికముల కన్నా నమిలి తిన్న నేగాని మింగుడుపడని, పదార్థములు శ్రేష్ఠములు. పాయసాదికముల విడువక సేవించుచుందుమేని, ఉదర వ్యాధులు, అగ్నిమాంద్యముల గరగించును. మాంసాది పదార్థములు, కాకరకాయ మొదలగు శాకములు వాని వాని స్వాభావిక స్థితిలో అసహ్యము, వికారము గలిగించును అట్టివానిని వండినను వార్చినను అవి అస్వాభావికము లే అవి మన ఆహారము లే కావు. బ్రతికియున్న యెద్దును, కొవ్విన మేకను, ఎవరైన స్వాభావికస్థితిలో తినగల్గుదురా? వండినయెడల అవి రుచించును. మసాలాలవలన అవి అస్వాభావికములు, అనారోగ్యకరములు. రోగపదార్థమును జేర్చునవిగా తయారగును.

ముదిరిన కాయలకన్నను, ధాన్యములకన్నను, లేతవి మిగుల త్వరగా అరుగును. అవిత్వరగా మండమై జీర్ణమగునవి గాన అది వరకు ప్రేగులయందు నిలచిఉన్న రోగపదార్థమును, తమతో బైటికి లాగుకొని వచ్చును. దాన అతిసారము, గ్రహణి గలుగును. దీని కనేకులు భీతిల్లి లేతకాయలనిన వెర్రిచూపులు చూతురు. ఈ అతిసారము వలన దేహమునందలి, రోగపదార్థము, బహుత్వరగా వెడలిపోవును. గాన లేతకాయలు శీఘ్ర జీర్ణకారులు.

పెంపుడు కుక్కకు అమితాహారము, యజమాను డిచ్చుటచే జబ్బు పడినపుడు తనజాతి కసహజమైన, గరికను దినును

దానిచే కుక్క దేహమునందు రోగపదార్థము, త్వరలో వెడలి పోవుట, అనేకులెరిగిన విషయము. ముదిరినట్టిపండిపట్టి కాయలను జీర్ణించుకొనుటకు యెక్కువ జీర్ణశక్తి కావలెను, గాన అట్టి శక్తిగలుగు వరకు విడువక లేతకాయలే తినదగినవి. ధాన్యములు, నమలితినుట అవుసరముగాన అవి బాగుగా జీర్ణమగును

దంతపటుత్వ మారోగ్యలక్షణము. దంతపటుత్వము తగ్గియుండి పండినపండుగాని, వండిన యాహారముగాని, జీర్ణముగానివారు ధాన్యములను తవుడుతో విసరించి, నమలవలెను. రోగమునకు కుదురు యోగ్యతయున్న, నీ పిండి నమలుట వలన, లేతకాయలు తినుటవలన, బహుత్వరగా రోగపదార్థ బహిష్కరణ మగును. తవుడుగల ధాన్యపురొట్టెలు, గోధుమ పైపొట్టుతో కూడిన రొట్టెలు, శ్రీఘ్రజీర్ణకారులు. పొట్టు లేని ధాన్యములను నుగ్రహము లకు బెట్టిన, నవి చియ్యబట్టిపోవును. మలబంధము గలుగును. పని జేయలేకపోవును. తవుడుతో బెట్టిన ఆరోగ్యము గలుగును. ఇది పై విషయమున ఉదాహరణము. ధాన్యములపై నుండు తవుడు జీర్ణమునకు ముఖ్యావసరమగు పదార్థము.

పప్పుపదార్థములును, పలుచగా వండినపప్పును, పుచ్చుకొనిన అపానవాతము గలిగించి అజీర్ణము చేయును. అవియే పొట్టుతో తగుమాత్రపు నీటిలో (చిమడ నీయకుండా) గుగ్గిళ్ళుగా దినిన చో, పప్పుగా దినిన దానిలో మూడవవంతు సరిపోయి యేబాధలు లేక జీర్ణమై బలము నిచ్చును. అందలి జీర్ణశక్తియు, నొక్కే విధముగా నుండదు గాన, ఇంతపరిమితిలో యీ ఆహారము తిను

మధ్య క్రిందిపండ్లును, క్రిందివరుస పండ్లమధ్య పైపండ్లును ఇముడునట్లుండును. అవియు మొనలుదేలి చీల్చుటకు ఉపయోగించును. ఉదా:- కుక్క పండ్లు. తృణభక్షక జంతువుల పండ్లు మొద్దుబారి గడ్డికొరకి నములుటకు మాత్రము ఉపయోగించును. ఉదా:- ఆవులు, మేకలు, గొఱ్ఱెల పండ్లు. సర్వభక్షక జంతువుల పండ్లు ఉభయకార్యముల నిర్వర్తింపననువుగా ఉండును. ఉ:- ఎలుగుగొడ్డు. ఇట్టివి బహు అరుదు. ఫలభక్షక జంతువులకు మునిపండ్లు కొరకుటకును, దంతములు నములుటకును, అనుకూలముగా నుండును. వీనికి మాంసము చీల్చుట కనువైన పెద్దకోరలుకాని, గడ్డి నములుట కనుకూలమగు వెడల్పయిన పండ్లుగాని లేవు. ఉ:- కోతి ఫలభక్షక జంతువుల పండ్లవంటి పండ్లున్నందున మానవుడు ఫలభక్షకజాతిలోనివాడు.

2 ఆంత్రనిర్మాణము:- మాంసభక్షక జంతువులయొక్క యాంత్రము తలనుండి తోకమొదటివరకు కొలిచిన కొలతకు నాల్గు అయిదు రెట్లు ఉండును. ఫలభక్షక జంతువులకు తలనుంచి దిగువ వెన్నుపాము చివరకు దీసిన కొలతకు వాని ఆంత్రము 10, 18, రెట్లుండును. మానవు డాంత్రనిర్మాణముంబట్టి, ఫలభక్షకకోటిలోనివాడు.

3 జీర్ణాశయము:- మాంసభక్షక జంతువులకు చిన్నదిగను గుండ్రముగను ఉండును. తృణభక్షక జంతువులకు జీర్ణాశయము కోశరూపమున నుండును. అందొకటి యపక్వపదార్థములకును, రెండవది పక్వపదార్థములకును స్థానమై విశాలమైన ప్రధాన జీర్ణాశయమునుగలిగిఉండును. ఫలభక్షకజంతువుల జీర్ణాశయము

మధ్యము పరిమాణమున నుండును. అంత్రేమూలము జీర్ణాశయమున కుపశాఖముగా ఉండును. ఇట్టి జీర్ణాశయనిర్మాణమే మానవునకును గలదు. గాన అతడు ఫలభక్షక జాతిలోనివాడు.

4 జ్ఞానేంద్రియములు:— ఇందు ముక్కు, నేత్రము, నాలుక ముఖ్యములు. మాంసభక్షక జంతువులు ఆహారమును పసిగట్టగలవు. శాకాహారులన్ననో ఆహారమును జూచి సంతోషింతురు. మాంసభక్షణ సేయు మానవుడు, వండి మసలాదినుసులు జేర్చని పచ్చిమాంసమును వాసన జూచిన కంటగించుకొనునుగదా! పచ్చిమాంసము నొక ప్రక్కను, పండినఫలము నొకవంక నుంచిన—పండినపండు; సువాసన మనల ఆకర్షించునది గదా! మన నాలుకను ఉద్రేకింప జేయునది గావున మానవుడు ప్రకృతి సిద్ధమైన ఫలహారమునే భుజింపవలెను. అందు వలన సుఖజీవన మవలంబింపవచ్చును. అని ప్రాకృతవాదుల వాదన.

అస్వాభావిక పదార్థముల కలవాటుపడిన సర్కసులోని వానరములు, కొద్ది రోజులలోనే, తేజోహీనములై క్షయాదిరోగములచే బాధపడుచుండును. మరియు శాకాహార విషయమున మాంసాశనులు జేయు వాదనలేవియు న్యాయబద్ధములు గావు. ఆర్యులలోని బ్రాహ్మణులు ఇవి లేకనే జీవింపగలుగుచున్నారు. గాన మాంసాహార మనవసరమేగదా! మానవులను, నీతిమంతులుగా చేయునది యింద్రియనిగ్రహమే కదా! అది స్వాభావిక సాత్వికాహారముచే సిద్ధింపగలదు

సాత్త్వికాహారపానీయములవలన మనోబుద్ధులు నిర్మలతను పొందుచున్నవి. విశాల, నిర్మల హృదయాంతఃకరణాలు గలిగించుటకు తోడుపడును. మానవులను దీర్ఘాయుష్మంతులను జేయుటకు ఉపయోగించును. స్వాభావికమును, సాత్త్వికమును, అవిదాహియగు పథ్యమువలననే సంపూర్ణ స్వాస్థ్యము చేకూరును అన్యథా చేకూరుట అసాధ్యము. కాన బాల్యమునుండియు అట్టి పథ్యము అవలంబించినచో దైహిక మనోవ్యాపారముల సత్యాద్భుతముగాను, ఉత్సాహముగను, ఓపికతోను నిర్వహింపగలుగ చెప్పగలను. నేటి నాగరికతయందు విదాహియును, అస్వాభావికమును అగు పథ్యమే అంతటను కానిపించుచున్నది. అందుచే చిత్రవిచిత్రములైన అసంఖ్యాక వ్యాధులు కలిగినవి. వీటిని అవిదాహియగు పథ్యము నవలంబించినచో దైహికశక్తులు అభివృద్ధియై రోగపరిమోచన మగును. ప్రకృతియందు మానవునకు దక్క ఇతర జంతువులు అన్నియు పరిశుద్ధమగు తీయని ప్రవాహోదకమునే తప్ప త్రాగవు. ఫలరసము నీట గలిపి త్రాగినను దానివలన నవసరమునకు మించి, నీరు త్రాగుట సంభవించును గాన ఫలరసమును సహితము కలుపని పరిశుద్ధోదకమునే త్రాగవలయును. ఎంత చర్చించినను జగన్మాతయగు ప్రకృతి, ఫలములనే స్వాభావికాహారముగా నిర్దేశించుచున్నది. గాన ఫలాహారమే మిక్కిలి స్వాభావికము, విధివిహితముగా కనబడుచున్నది.

ధాన్యములు, దుంపలు, శాకములును సయితము మన జ్ఞానేంద్రియముల నాకర్షించునవియే గాన ఫలములతో వానిని సహి

జీర్ణమగును. ఈ పిండియైనను తగుమాత్రమే తినవలెను. మితి మీరిన అపకారమే చేయును.

రోగులకు: చిక్కగా కాచిన జావ మిక్కిలి యుపయోగకరము. అందు, (ద్రాక్షగాని, కిస్మిసుగాని, లేక దుర్వాసనలేని పచ్చిపాలుగాని కలిపి పుచ్చుకొనవచ్చును.) దుర్వాసనగలపాలు ఆరోగ్యదాయకములు కావు) కాచినపాలు కష్టముమీద జీర్ణమగును. అవి మనిషినిలావు పారించును. దేహపోషక పదార్థములు అందు తగ్గియుండును భోజనకాలమందు యేవైనాపండ్లు తినవచ్చును. ఇవేకాక బార్లీ, యవలు, బియ్యము, రాగులు, మొదలగువానితో రుచిభేదమునకై, కూరగాయలు చేర్చుకొనియు తినవచ్చును. కాని రోగుల జీర్ణశక్తి మిక్కిలి తగ్గియున్నప్పుడును, మిక్కిలి రోగగ్రస్తులకును, బాగుగా నమలిననేగాని మింగుడు పడనటువంటి విసరి పైపొట్టు చెరిగివేయని పిండితో తయారు చేసిన రొట్టియును, పండ్లును మాత్రమేఆహారముగా నీయవలెను. ఆకలి యున్నచో జిహ్వకు హితవుగనే ఉండగలదు. ఏ పదార్థము దినుచున్న ఆపదార్థమే నాలుకకు హితవగుచుండును.

మనకు మొదటలోవ్యాధివచ్చుటకు, అసహజపదార్థమును, మితిమీరి తినుటయే కారణము. అదియే రోగపదార్థమును కూడబెట్టును. స్వాభావికపథ్యమును, అసహజపదార్థమువలెఅతిగా తినుట జరుగక, తినినది తిన్నగా జీర్ణమై శాశ్వత ఆరోగ్య భాగ్యము గల్గజేయును. రోగమును పోగొట్టునవి, స్వాభావిక పథ్యపానములును, ఉపశమన, ఆతపస్నానములు రోగపదార్థ విమోచనము జేయగలవు.

## రొ ట్టె త యా రు జే యు వి ధ ము.

పొట్టుతో విసరిన ముడిగోధుమ, జొన్న, మొక్కజొన్న పిండు లలో నేదో ఒకటిగాని 2 గాని కలిపి (ఒంటికి సరిపడుటను బట్టి నిర్ణయము) ఒకపళ్లెరములో పోసి చన్నీటితో బాగుగా తడుప వలయును. వేడినీటితో కలిపిన, రొట్టె, తేలికదై రుచిహీన మగును. గాన చన్నీటితోనే తడిపిపెట్టవలయును. తర్వాత రొట్టెలు చేయు పెట్టెలో పిండిని రొట్టెగాచేసి ఉంచవలయును. ఇట్లు వెనుక, ముందు, ప్రక్కలను వేడిగాలికి బాగుగా కాలిన తరువాత రొట్టెలో పచ్చిలేకుండా, జూచి దింపుకొనవలయును. యితర పదార్థములు, రొట్టెపెట్టెలో ఉంచరాదు.

## జా వ చే యు వి ధ ము

మెత్తని పిండిని నీటితో పలుచగా కలిపి పొయిమీదనుంచి యుడుకనీయవలెను. కాగినంతసేపు కలియబెట్టుచుండవలెను. అందు కొంచెముగా ఉప్పు (స్వల్పముగా) వెన్నగాని కలిపిన కలుపవచ్చును. లేదా మానవచ్చును. కొంచెము ద్రాక్షపండ్లు గాని, కిసమిసపండ్లుగాని కలిపిన జావ రుచిగా ఉండును. ఆహారము యే యే పూట యెట్లు తినిన బాగుండునో వ్రాయు చున్నాను. యీ క్రింది పద్ధతి ప్రకారము ఏర్పాటు చేసుకొన వలయును.

ఉదయము:—(1) గోధుమరొట్టెయు, పండ్లునుగాని, (2) రొట్టె, జావగాని, (3) పిండి, రొట్టె, పండ్లుగాని తినవచ్చును.

మధ్యాహ్నభోజనము:—(1) చిక్కగా కాచిన జావ, గంజికాని;

(2) నూకలు, గోధుమ నూకలు, పొట్టుతీయని గోధుమలు, పిండి పిసికి వేసి కాచిన చిక్కని జావకాని, (యిందులో వెన్న, పండ్లు, నెయ్యి యిష్టమున్న చేర్చుకొనవచ్చు.) (3) బటానీలు, చిక్కుడుకాయలు ఇతరములగు లేతకాయలు, నీటితోనే యుడుకునట్లు ఉడకనీయవలెను. అందు కొంచెము పరిమళ ద్రవ్యములు, నిమ్మపండ్ల రసము జేర్చవచ్చును. (4) ఆ యా ఋతువులలోని పండ్లు కాయలుగాని (5 రొట్టె, - పండ్లుగాని, యుపయోగింపవలెను.

సాయంత్రపు భోజనము:- రొట్టె, దానితో పండ్లుగాని, రొట్టె పండ్లు జావగాని యుపయోగించుకొనవలయును. ఏ దేశము నందు నివసించువారి కాదేశమునందే తగిన శాకాదు లుత్పన్నమగుచున్నవి. అతిశీతల ధ్రువప్రాంతమున శాకముల పుట్టుకయే లేదు. అవి మానవనివాసయోగ్యములే కావు. అచ్చటనున్న వారికి ఇచటనుండి ఫలాదుల ఎగుమతిజేసినను అవి మార్గమధ్యమున మార్పునొందును. గాన ఆహారయోగ్యములు కావు. జీర్ణము కావు. ధ్రువప్రాంతమున నివసించు ఎస్కిమో జాతి వారు విధిలేక మత్స్యములను, మాంసమును, వేటాడి తినవలసి యుందురు. గాన వారి దేహములు మిక్కిలిగా రోగపదార్థములతో నిండియుండును. మనుష్యులు తమ యాహారమును పగలు రెండు ఝాముల లోపల బాగుగను, సాయంత్రమున కొలదిగను భుజించుచు రాత్రి నిద్రపోవునప్పటికి కడుపునందు జీర్ణశ్రమ లేకుండా జూచుకొనవలెను. అనేకులు నిద్రపోదగిన కాలమందు ఇంకను రాత్రి భోజనము చేయుచుందురు.

వారికి నిజముగు నిద్రాసుఖ ము లేదు. వారు నిద్ర లేచునప్పటికి రాత్రికన్నా బడలికగా నుండును. మధ్యాహ్నమున సూర్యుడు ఉచ్చదశయందుండుట వలన దేహమునందలి నాడులన్ని యుజ్జీవనము నొందియుండును. సాయంకాలమున నాడులన్నియు, క్రమముగా చలాకీ తగ్గి రాత్రి పడునప్పటికి విశ్రాంతి కోరుచుండును. మధ్యాహ్నము దాటినదగ్గరినుండి సాయంత్రమున సూర్యునియొక్క నీచత వలన క్రమముగా ఉత్సాహము సన్నగిల్లును గాన సాధ్యమైనంత పెందలకడనే శయనించి యుషఃకాలమువనే, నిద్ర లేచుట మంచి ఆరోగ్యనియమముగ నుండును. ఇకను మంచి యేటిఇసుకగాని సముద్రపుయిసుకగాని, మానవులకు యుపకార పదార్థము. ఇసుక నోట నుంచుకొని కొంచెము నీటితో కలిపి త్రాగినచో మలదోషము లుండవు. దినమునకు 1. 2. దఫాలు ఇట్టియిసుకను లోనికి బుచ్చుకొనుటచే అద్భుతమగు మేలుకలుగును. ఇసుక మానవులకు అత్యావసరమగు పదార్థము, సన్నని యిసుకకంటె గండ్రయిసుక మంచిది. ఇసుక కోణములు లేనిదిగా నుండవలెను. ఉప్పునీటిలో కాచిన యిసుకల కోణములు పోయి ఉపయోగించును.



# రెండవ భాగము

## ౧. నాడీవ్యాధులు

అన్నిరోగాలకు కారణము ఒకటే అను సిద్ధాంతము. నాడీవ్యాధులు, మానసిక వ్యాధులకు కూడా వర్తిస్తుంది. లెక్కలేనన్ని రూపములతో ప్రజలను పీడించుచున్నందువలన యీకాలమునకు నాడీవ్యాధులకాలమని పేరు పెట్టిరి. కనుపడుతూ ఉండే నాడీ వ్యాధులకు పేర్లు పెట్టుటకును వానియొక్క మూలకారణాన్ని, స్వభావాన్ని కనిపెట్టుటకును, యెంతోకష్టపడుతున్నారు. పిరికితనము, నాడులలో కలకలు, నాడులలో మంటలు, తన ఆరోగ్యమునుగూర్చిన పిచ్చి, హిస్టీరియా, ఉన్మాదము, ముదిపిచ్చి, కార్పణ్యము, పక్షవాతము మొదలగు యెన్నో వ్యాధులను కనుగొన్నారు. ఇంకా యివే కారణాలతో యెన్నో ఇతర వ్యాధులుకూడా వున్నవి. నాడీవ్యాధులు పెరిగినకొద్దీ వాని లక్షణములుకూడా పెరుగుచున్నవి. రోగముయొక్క నిజస్వభావము తెలిసికొనేటందుకు పేరు గాని,లక్షణము గాని సహాయం చేయడం లేదు. నాడీరోగికి లోపల ఏదో చికాకుఉన్నట్లు శాంతి లేనట్లు తెలుస్తుంది. ఆచీకాకు యిట్టిదనిగాని రోగి చెప్పలేకుండును. నాడీరోగులలో ఒకడు ఎక్కువగా మాట్లాడుతూ వుంటాడు. ఒకడు అసలే మాట్లాడడు. యెంతోమందికి సరిగా నిద్ర రాదు. కొందరు నిరంతరము యేదోపనిచేస్తూనే యుంటారు. కొందరు అమితబద్ధకస్తులు, ఒకనికి ఈ ప్రపంచకముఅంటే రోసగింపు.

అందువల్ల ఆత్మహత్యచేసుకొనే కోరికతో వుంటాడు. ఒకడు లజ్జాధికారి, నిష్కారణంగా భయపడతాడు. కొందరికి దేహమంత వణుకుతూ ఉంటుంది. కొందరికి ప్రతిబంధవాతము స్వాధీనం తప్పుతుంది.

ఒక అవయవముగాని దేహంలో ఒక భాగంగాని, రెండువైపుల గాని, ఒక పక్షంగాని పడిపోతుంది. ఇవిగాక, రకరకాలుగా ఉండే ఉన్మాదభేదాలు ఉన్నవి. తను దేహంలో ఉండే శక్తిని వినియోగపడకుండా యీ నాడీవ్యాధులు అడ్డుకుంటవి. ఒకరికి అవయవాలు స్వాధీనము తప్పుతే యింకొకరికి ఆలోచనలు వారి స్వాధీనములో ఉండవు. ఇంకొకరు తను యిష్టమొచ్చినపనే తాము చేయలేరు. కొందరు మాట్లాడే మాటలే వారి స్వాధీనములో ఉండవు. వేలాది నాడీరోగులను పరీక్షచేసినప్పుడు, యేయిద్దరి రోగలక్షణాలు ఒకటిగా నుండవు. నాడీవ్యాధులు ఎన్నో రకాలుగా ఉంటవి. అందువల్లనే యీ రోగాలకన్నిటికి మూలకారణాన్ని కనుక్కోలేక పేర్లు పెట్టలేక సరిఅయిన చికిత్స నిర్ణయింపలేక శ్రమపడుచున్నారు.

వారిచ్చే మందులుకూడా రోగతీవ్రతను తగ్గింపలేకున్నవి. రోగనివారణం చేయలేకపోతున్నవి. ఈమందులవలన నాడులు తాత్కాలికంగా చచ్చుపడికూడా పోతున్నవి.

మందులవలన, యేవిధంగానైనా, లాభము కలుగును, అనుకోవడం పెద్దపొరపాటు. దేహంలో యుండే రోగపదార్థాన్ని నాడులయొక్క చలనాన్ని పెంచో తగ్గించో, పోగొట్టాలని చేసే ప్రయత్నం యెట్లా సఫలమగుతుంది? ఒకరికి దేహమునందు మందు, చిన్నమోతాదులో వేసినపుడు, చలనము

విక చికిత్సవలన కొద్దిఉపశాంతి తాత్కాలికంగా కలిగినా అది నిలిచిఉండదు. తొట్టివైద్యశాస్త్రమువలన మనకు ఈ రోగములయొక్క నిజస్వభావము తెలియుచున్నది. అనేకమందికి నేను నాడీవ్యాధులను కుదిర్చియున్నాను. అందువలన మన సిద్ధాంతములు దోషరహితములని తెలినవి. ఈ సందర్భములో నాడీవ్యాధులను గురించి కొద్దిగా వివరించెదను.

మన దేహంలో రెండురకములైన నాడీసంహతులు గలవు. ఒకరకము మనయిష్టానుసారము పనిచేస్తవి. రెండవ రకము మనకు తెలియకుండగనే శ్వాస, జీర్ణక్రియ, రక్తప్రసరణము మొదలగు పనులను నడుపును. దేహములో నుండే రోగపదార్థమే యితర వ్యాధులకు యేలా కారణముగా ఉంటుందో ఆవిధంగానే నాడీవ్యాధులు గలిగించుటకును కారణముగా నున్నది. దీనికెవరును ఆశ్చర్యపడనక్కర లేదు. ఏమంటే దేహములో ఉండే సహజమగు కదలికలకు ఎపుడు రోగపదార్థము అడ్డము వచ్చి బాధల గలిగించునో అపుడు మనకు రోగము ఉందని తెలుస్తుంది. ఇంతకుముందే ముఖనిదాన శాస్త్రమువలన మనము రోగము ఉన్నదని కనిపెట్టగలము, బాధ కలిగేటప్పటికే రోగపదార్థము యెక్కువైనదని అర్థము. రోగపదార్థము. కూడికగా చేరనిదే రోగము రాదని తెలిసికొన్నాము. దేహమునందు రోగపదార్థము చేరినపుడు అది ఆయా అవయవాలను చెడగొట్టటమే కాకుంటా, ఆ అవయవాల లోపలి నాడులను చెడగొట్టుతుంది, సామాన్యంగా మనయిచ్ఛమీాద నడిచే, నాడులు స్వాధీనముతప్పినపుడు మాత్రమే. మనము రోగము కలదని

గుర్తుపట్టెదము. అయితే అంతకుమునుపే మనయిచ్ఛతో సంబంధము లేకుండానే నడిచే స్వతంత్రనాడీమండలము చెడిపోతుంది. శ్వాస, జీర్ణక్రియ, రక్తప్రసరణము వీనికి సంబంధించిన వ్యాధులు తొందరగా వృద్ధిపొందుతవి. అక్కడకూడ నాడులు తిన్నగా పనిచేయక చెడిపోయినపుడు మాత్రమే మనము ఆయా అవయవాలలో రోగం ప్రవేశించిందని తెలిసికొంటాము. సామాన్యముగా శ్వాస, జీర్ణక్రియ, రక్తప్రసరణము మొదలగు కదలికలకు కారణంగా ఉండే ఊపిరితిత్తులు, జీర్ణావయవాలు, హృదయకోశము, రక్తవాహికలు మొదలగు అవయవాలయొక్క కదలిక స్వతంత్రనాడీ మండలమువలననే జరిగిపోవుచున్నవి. సామాన్య పరిస్థితులలో మనకు వానియందలి కదలికలు తెలియనే తెలియవు. వానియందు మిక్కుటముగ రోగపదార్థము చేరినపుడుమాత్రమే మనకు అవి కదులుటయందు కలిగే బాధ తెలుస్తుంది. అందువలన సామాన్యవ్యాధులందుకూడా వానికి సంబంధించిన నాడీచలనము రోగగ్రస్తమవుతుంది.

పరిపూర్ణ ఆరోగ్యానికి క్రమమయిన జీర్ణక్రియ ఉండాలి. ద్వితీయంగా సంక్రమించినవ్యాధులు తప్ప మిగతా రోగాలన్నీ, జీర్ణకోశములోనే ఆరంభించును.

అందువలన నాడీవ్యాధులన్నియు వస్తే ద్వితీయంగా రావాలి. లేకపోతే జీర్ణక్రియయందలి లోపమువలన రావాలి. ఇంకో రకంగా రావు. ప్రపంచమునందలి అన్నిరోగాలు యీ రెండు కారణాలనుంచే వచ్చును. దేహంలో ధాతుశక్తి క్షీణించి

ఉన్నవరకు, ఏదో తరుణవ్యాధిగా దేహము, రోగపదార్థమును వెలువరించే ప్రయత్నములు చేస్తూనే ఉంటుంది. ఏ కారణం చేతనైనా ఆ ధాతుశక్తి లోపించినపుడే తరుణవ్యాధులు రాక కాలికవ్యాధులు వస్తవి. కాలికవ్యాధుల చివర దశలుగా నాడీ వ్యాధులు, మానసికవ్యాధులు వచ్చును. ఇందువలన నాడీ వ్యాధుల పైలక్షణములు యెట్లా ఉన్నప్పటికీ అవి అన్నీ కూడా దేహసంబంధములైన కాలిక వ్యాధులేను.

ఇతరవ్యాధులు అన్నిటియందువలె స్థలో, వేడో, ఏదో ఒకటి ఉంటుంది. చలనము యెక్కువ కావడమో, తక్కువ కావడమో ఉంటుంది. కాలిక జ్వరాలలోకూడా లక్షణాలు యివే. మసూచికము, పొంగు, ఆటలమ్మ, సవాయి, సర్పి మొదలగు రోగముల లక్షణాలే నాడీవ్యాధులలోనూ ఉన్నవి గనుక ఆయా వ్యాధులలో రోగాలన్నీ పోగొట్టగలిగిన చికిత్సావిధానమే, నాడీవ్యాధులు, మానసికవ్యాధులను నివారణచేయును. వందలు వేలు నాడీవ్యాధిపీడితులకు తొట్టివైద్యముచేసి రోగనివారణ చేసియున్నాను. ఈ గ్రంథపు చివర అట్టివారు వ్రాసినరోగనివారణ వృత్తాంతముల చేర్చియున్నాను. ఇందువలన నాడీవ్యాధులంటే యేమిటో అవి యెట్లా కలుగుతవో, వానికిచికిత్సయెట్లాచేయాలో మనము తెలిసికొన్నాము. అందువలన నాడీవ్యాధివచ్చినపుడల్లా తమచేత యేమీకాదని చేతులు ముడుచుకునే మంది వైద్యుల వలె కాకుండా మనము ప్రతిరోగములోనూ స్పష్టముగా యేమిచేయాలో చెప్పగలము. చేయగలము, నయముచేసి తీరగలము. అసంఖ్యాకముగా కనుపడే వ్యాధిరూపముల నన్నిటినికూడా నేను యేవిధముగా చూస్తూఉన్నానో, ఆ విధ

ముగా కనుపడేవా కా యెవరూ సరిఅయిన చికిత్స చెప్పలేరు. ఒక సేనావ్యూహములోఉండే కీలకస్థానాలు మనకు తెలిసే దాకా యేవిధముగా ఆ సేనను జయించుటకు సాధ్యంగాదో ఆ విధముగనే రోగాలకన్నిటికీ మూలకారణం తెలిసేవాకా సరిఅయిన చికిత్స చెప్పలేము. వేరు వేరు భాగాలకు ప్రత్యేక ప్రత్యేకంగా చేసే చికిత్సలుకూడా అపజయమునే పొందుతవి. వైద్యమునకు అప్రతిష్ఠ వస్తుంది. మానవదేహానికి సంబంధిం చిన సమిష్టిశాస్త్రము తెలిసేవాకా ఈ ప్రత్యేక చికిత్సకులు రోగనివారణము చేయలేరు. మందు వైద్యములో కనుపడే ప్రత్యేక భాగచికిత్స పురోగమనము చేయుచున్నది. అనవ సరము- సత్యాన్ని మరుగుపరుస్తున్నది. దేహాన్ని సమిష్టిగా ఎవరు చూడగలుగుతున్నారో ప్రకృతిని అవిభాధ్యమైన సంపూర్ణముగా ఎవరు తెలిసికొంటున్నారో వారికి మాత్రమే ప్రకృతియొక్క నిజస్వభావము, అందలి నిర్వికల్పమైన నియ మాలు తెలుస్తవి. ఒకే నీరు వేరు వేరు శీతోష్ణాలలో యే విధంగా నీరుగాను మంచుగను, మేఘముగను, వర్షముగను, మంచుగడ్డలుగను, వడగండ్లుగను కనపడుచున్నదో, మనము చూచినపుడు మనదేహములో యుండే రోగపదార్థము కూడా, వేరు వేరు శీతోష్ణ ధర్మములలో వేరు వేరు వ్యాధులుగా పరిణమించుచున్నది.

నాడీవ్యాధులను నిదానం చేయడంలోకూడా మందు వైద్యులు సఫలత నొందుటలేదు. చాలా విషయాలలో అది నాడీవ్యాధి అనేమాటకూడా కొందరు వైద్యులు కనిపెట్టలేకున్నారు. వారి

అసలు దేహంలో ఎక్కడా రోగమే లేదని, కారణం లేకుండానే వారు తమకు రోగం ఉన్నట్లు భ్రాంతి పడుతున్నారని, వైద్యులు చెప్పిపంపితే వారు చేయునది లేక నావద్దకు వచ్చేవారు. ముఖనిదాన శాస్త్రముతో వారి దేహములలో ఎంతెక్కడ రోగపదార్థము ఉందో కనిపెట్టి వారికి చికిత్స చేసేవాడను. నాచికిత్సలో తొందరగా వారు ఆరోగ్యమును పొందేవారు. వారి దేహంలోయుండే రోగపదార్థము ఎంత తగ్గితే వారి కంత ఆరోగ్యము కలుగుతున్నట్లు గుర్తించేవారు ఒక్కసారి యీ సంగతులన్నీ చూడగల్గినవారికి నా ముఖనిదానశాస్త్రము ఎంత సత్యమైనదో, నాచికిత్సావిధానము ఎంత నిరపాయము సులభతమమైనదో తెలియును. నానిదానశాస్త్రము నేర్చుకుని, నాచికిత్సాపద్ధతులను ప్రయోగించే ప్రకృతివైద్యులకు చాలా లాభమున్నది. ఒకరోగంరాకపూర్వమే సంవత్సరాలు ముందుగానే రోగం ఫలానిస్థితిలో ఉన్నదని వారు చెప్పగలరు. అప్పటికి ఆరోగికి తనకురోగము ఉన్నదనే తెలియదు. అప్పటికే వైద్యుడు కనిపెట్టగలడు. రోగపదార్థము, వెనుకవైపుగా చేరిన ప్రతిరోగికి తప్పకనాడీవ్యాధులుండును. ఈసంగతినేనురచించిన ముఖనిదాన శాస్త్రములలో స్పష్టముగా తేల్చి చెప్పినాను.

# ౨. మానసిక వ్యాధులు

ఇదివరకు చెప్పిన విషయాలన్నీ కూడా, మానసిక వ్యాధులకూ వర్తించును. మానసిక వ్యాధులను గురించి కూడా, మందు వైద్యులకు సరిగా తెలియటం లేదు. వారు చెప్పే కారణాలవల్ల మతిభ్రమణం కలుగుటలేదు. అయితే సంవత్సరాల కొలదీ, దేహంలో చేరిన రోగపదార్థము మెదడులోనికి పోయినపుడు, రోగగ్రస్తమైన స్థితిలో వారుచెప్పిన కారణాలవల్ల వ్యాధి ప్రత్యక్షమైనట్లు కన్పడుతుందేగాని వారుచెప్పిన కారణాలు రోగపదార్థము లేనివారిని, ఏమీ బాధించవు. సహజము కాని జీవితము వలన జీర్ణక్రియ ఎంతగానో చెడిపోయిన తరువాత క్రమక్రమముగా రోగపదార్థము కాలికముగా పెరిగి దేహములో ఉన్న తరువాత కుదర్చవీలుగాని చిట్టచివర దశగా మాత్రమే ఉన్మాదము, పక్షవాతము అనే వ్యాధులు తటస్థించుచున్నవి. సామాన్యముగా అందరూ ఒకే మోస్తరుగల అస్వాభావిక జీవనమునవలంబించరుగనుక, చేరే రోగపదార్థపుపరిమితి తీరు ఒకే మోస్తరుగా ఉండదు. రోగపదార్థము వెనుకగా చేరి అది తలలోనికి చొచ్చుకొనిపోయినపుడే మానసిక వ్యాధి వస్తుంది. ఇప్పటి నాగరికతలో అనుల్లంఘనీయమైన ప్రకృతినియమాలు పాటించటానికి వసతులు తగ్గియుండుటవలన, మానసిక రోగులసంఖ్య, నానాటికి వృద్ధిపొందుచున్నది. ప్రకృతినియమాలకు ప్రత్యక్ష విరుద్ధమైన సిద్ధాంతాలు కలిగి ప్రకృతికి విరుద్ధమైన ఆరోగ్య శాస్త్రమును బోధించే ఇప్పటి మందువైద్యులు మానసిక వ్యాధులయొక్క పెంపకానికి కారకులైయున్నారు. మంచి

సీళ్ళు త్రాగుతే దేహానికి అనారోగ్యమంటారు. సోడా, బీరు, వైను, బ్రాంది, లిమ్‌నెడ్, ఆరంజి, ద్రాక్ష త్రాగుతే దేహానికి ఆరోగ్యం వస్తుందంటారు. ఫ్యాక్టరీ గొట్టాలనుండి వస్తున్నట్లుగా మనుష్యులు చుట్టలు త్రాగి పొగ వదులుతూ వుంటారు. సారాపీపాలో యేవిధంగా సారాయము పోస్తారో ఆదేవిధంగా సారాయి త్రాగేవారు కూడా ఉన్నారు. వీరికి ఎప్పుడూ ఏదో ఒక ఉద్రేకకరమైన ఘాటుగలపదార్థం త్రాగకపోతే, దౌర్బల్యము, నిరుత్సాహం ఉంటుంది. జనసమ్మర్దన గల ఫ్యాక్టరీలు, గాలి తగలని ఇరుకైన గదులు, ప్రజల ఆరోగ్యమును ఎక్కువగా పాడుచేయుచున్నవి. ఏదేశంలో జనులు యింకా సహజజీవనాన్ని వదలిపెట్టలేదో ఆధునికులైన మందు వైద్యులు నిర్ణయించిన అసహజమైన ఆరోగ్యనియమాలు ప్రజలు పాలించుట నేర్చుకోలేదా? ఆదేశములో మానసిక వ్యాధులు తక్కువగా ఉంటున్నవి. అయితే అక్కడ కూడా త్రాగుబోతుల బిడ్డలు, మానసికవ్యాధులతోనూ, యితరవ్యాధులతోనూ బాధలు పడుచున్నారు.

శ్రోత్రీయంగా సంక్రమించిన రోగపదార్థభారమువలన, వీరి కిట్టి వ్యాధులు కలుగుచున్నవి. త్రాగుడువలన వీరి దేహాలన్నియు జీర్ణక్రియయందే వ్యయమై పోవును. అందువలననే త్రాగుబోతులు నిద్రమత్తుగానుందురు. త్రాగిన పదార్థాలు జీర్ణమైనపుడు వాయురూపమును పొంది, శిరస్సువరకంట వ్యాపించి, వదరుబోతుతనము, మతిలేనితనమును కలిగిస్తుంది. ఇట్టి ఉన్మాదస్థితిలో గర్భధారణమైన యెడల, ఆశిశువు పుట్టకమునుపే

చనిపోవును. లేదా ఉన్మాదస్థితియైనను కలుగును. పితృత్రీయముగా సంక్రమించిన, స్వార్జితముగ వచ్చిన మానసికవ్యాధులన్నియు, జీర్ణక్రియ చెడుటచేతనే కలుగును. అందువలన అన్నివ్యాధులకు వలెనే మానసికవ్యాధులకును ఉదరమే మూలకారణము. మానవుడు సహజంగా జీవిస్తూ ఉన్నంతవరకూ ఆరోగ్యంగానూ సౌఖ్యంగానూ ఉంటాడు. అందువల్లనే ఆనిసతనంలో నున్న స్త్రీలు మితాహారమును తింటూ యెక్కువగా పనిచేస్తూ ఉంటారు. గనుక వారియందు మానసిక వ్యాధులు లేవు. స్వాతంత్ర్యము వచ్చినతరువాత వారిజీవిత పరిమాణం పెరిగి నాగరికత యొక్క సహజఫలాలైన మానసికవ్యాధులుకూడా నాగరికిదాపురించినవి.

పురుషులలో కంటే స్త్రీలలో మానసికవ్యాధులు తక్కువ. దీనికి కారణమేమనగా వారు భోగత్యాగరు. త్యాగుడు లేరు. పురుషులకంటె నియమంగా జీవిస్తారు. స్త్రీలలో మానసిక వ్యాధులు వచ్చినపుడు వారికి పితృ యంగా సంక్రమించిన రోగపదార్థమే కారణము. మానసిక వ్యాధులు వచ్చుటకు ముందువారు దైహికముగానుమానసికంగాను యెక్కువ చలాకీగా ఉంటారు. దీనికి కారణమేమిటో మందువైద్యులకు తెలియకేను. రోగపదార్థము చేరేకాలములో అది మెదడుమీదను,నాడులమీదను, వత్తిడినిగలిగించి అందు ఉద్రేకమును పుట్టించును. అందువలన పిచ్చి రావడానికిముందే వారి దేహాలలోని అవయవములుయెక్కువ చురుకుగా పనిచేయును. నాడీవ్యాధులలోకూడయిల్లే తటస్థించుచున్నది. ఎంతపనిచేసినా వారికి తృప్తి, శాంతి, కలుగక,

యుండకనూ యెక్కువగా పనిచేయుచుందురు. ఇట్లు చిన్నతనములో చురుకుగానుండేవారి తెగిని తేటలూ చిరకాలము నిలువక కొంతకాలము జరిగేటప్పటికి నాడీవ్యాధులుగాను, మానసిక వ్యాధులుగాను ప్రత్యక్షమగుచున్నవి.

మానసిక వ్యాధులలో రోగపదార్థము రోగియొక్క వెనుకవైపునచేరి నాడులను పీడించును. ఏదైనా పెద్ద తరుణవ్యాధి వచ్చి అందు చేరిన రోగపదార్థము వెడలిపోకున్నయెడల ఆ రోగపదార్థము కాలికమై శిరస్సుకంట వ్యాపించి మానసిక వ్యాధిని కలిగించుచున్నది. మానసిక వ్యాధులలోకూడా ఒక్కొక్కప్పుడు రోగంలేకుండాఉండి వేరొకప్పుడు రోగం యెక్కువగుచుండుట కద్దు. రోగపదార్థము మెదడును పీడించినపుడు మానసిక వ్యాధులు కలుగును. రోగపదార్థము ఒకింత వెనుకకు మరలినంతనే మానసిక వ్యాధులు తగ్గుటయు జరుగును.

## పక్షవాతము

మానసికవ్యాధియొక్క తరువాత రూపమే పక్షవాతము. మంచి ఆరోగ్యముగా నున్నవారికే పక్షవాతం వచ్చుచున్నదని, మందు వైద్యు లంటారు. దీనినిబట్టి వారికి నిజమైన ఆరోగ్యమంటే యేమిటో తెలియదని తేలిపోయినది. మనకు అంతకంటె యెక్కువ తెలియును. పక్షవాతంవంటి వ్యాధి అకస్మాత్తుగా రాదనియు, ముఖనిదానశాస్త్రము తెలిసినవారు పక్షవాతం రావటానికి, అనేకసంవత్సరాలు ముందుగానే, పక్షవాతం రాబోవుచున్నదని చెప్పగలరు. పరిపూర్ణ ఆరోగ్యవంతులు మానసిక వ్యాధికి గురియగుదురనుట సరిఅయిన మాటకాదు, మానసిక

వ్యాధికి కారణమైన రోగపదార్థము పోతేనేగాని మానసిక వ్యాధులు పోవు. స్వానుభవములో యిట్టివ్యాధులు అనేకము నేను నయముచేసియున్నాను. అందు ఒకటియిక్కడ వివరించుచున్నాను. ఒక ఆడపిల్ల. ఆమెవయస్సు 23 సంవత్సరాలు. అనేక సంవత్సరాలనుండి ఆమెకు పిచ్చి. తల్లిదండ్రులకు ఆమెను గురించి ఆందోళనగా వుండేది. ఆమెను నావద్దకు తెచ్చిరి. నేను పరీక్షించితిని. రోగపదార్థము అనుకూలమైన చోట ఉన్నదని తెలిసికొని మనవైద్యము చేయవలసినదని సలహా యిచ్చినాను. అప్పటికి ఆమె స్వయముగా తొట్టిస్నానమైనా చేసుకోలేదు. ఆమె తల్లి ఆమెకు చేయించేది. నాలుగు వారాల తరువాత రోగియే తొట్టివైద్యము చేసుకోగలిగినది. ప్రవర్తన కూడా మారినది. ఆరునెలలలో ఆమెపిచ్చి నయమైనది. ఇంటిలోని ఆరోగ్యవంతులందరివలెనే ఆమె ఆరోగ్యముగా నున్నది. రోగపదార్థము అనుకూలమైన స్థలమున ఉండుటవలన ఆమె జీర్ణక్రియ వెంటనే బాగుపడినది. అందువల్లనే, ఆమె ప్రలాపము చేయకుండా మనము చెప్పిన చికిత్స సక్రమముగా చేయగలిగినది.

రోగపదార్థము అనుకూలమైన చోటలేనపుడు, వారు మనచికిత్సకు లొంగరు. చికిత్స జరగదు. గనుక రోగము నయముకాదు. ఒక్కొక్క రోగిచేత తొట్టిస్నానము చేయించడమే అసాధ్యమవుతుంది. అట్టివారికి రోగము యేలా నయమగుతుంది? రోగాలు ముదిరిపోతేగాని క్షయరోగమేలా రాదో, ఆవిధంగానే ఉన్మాదంకూడా రోగము చాలా కాలికమయితేగాని రాదు. అందువలన రోగము ముదరకమునుపే, చికిత్స చేయాలి. పూర్వ

కాలంలో రోగంవచ్చేదాకా రోగమున్నదని తెలిసేదే కాదు. యిప్పుడు ముఖనిదాన శాస్త్రమువలన రోగంరావడానికి కొన్ని సంవత్సరాలు ముందుగానే కనిపెట్టవచ్చును. అందువలన యిప్పుడు ఆ రోగులను నయముచేయడం తేలికగాఉంటుంది.

ఎన్నో మానసికవ్యాధులు కుదరనే కుదరవనుచున్నారు. ఈసంగతి సరికాదు. నేను కుదిర్చిన ఒకరోగి వృత్తాంతము చెప్పుచున్నాను. ఒక సవాయిరోగికి, తీవ్రమగు పక్షవాతం వచ్చినది. అనేక సంవత్సరాలనుండి అతనికి అజీర్ణము. అనేక మందులు తిన్నాడు. వర్తకు డగుటవలన ఆమందు లేమీపని చేయకపోగా వర్తక సంబంధమైన మానసిక ఉద్రేకమువలన అతని అజీర్ణము వృద్ధి పొందినది. 1891 సంవత్సరము జూలై నెలలో అనేకమంది వైద్యులసలహామీద లోహాలు గలసిన నీరుగల చోటికి పోయి నివసించినాడు. లోహజలాలు అతనికి మేలుచేయకపోగా అతని స్థితి మరింత పాడయినది. అతను తిన్నగా మాట్లాడశక్యకపోయి నాడు. తాను మాట్లాడేది ఏమిటో అతనికి తెలియకుండా పోయింది. వైద్యులను పిలిపించి, పరీక్ష చేయించిరి. ఆవుడు పాదరసంతో చేసినమందు అతనికి మర్దన చేసిరి. ఇది రెండు సారులే చేసిరి. ఇప్పుడేదైనా రోగిని ప్రశ్నిస్తే ఆరోగి జవాబు చెప్పలేదు. వారువేసిన ప్రశ్నే తిరిగి అప్పచెప్పుతాడు. వియన్నాలో ఒక సుప్రసిద్ధ వైద్యుడున్నాడు. అతనిదగ్గరకు ఈ రోగిని తీసుకు పోయిరి. అతను పరీక్షించి మెదడు స్తంభించి పోయిన దనియు వ్యాధి కుదరదనియు వెంటనే పిచ్చిఆసుపత్రికి చేర్చ వలెననియు, సలహా యిచ్చెను. ఆ వైద్యుని సలహా ప్రకారము,

ఆ రోగికి వ్యాధి నయముకాదు; అని వారు తెలిసికొని, ఆ రోగిని నావద్దకు లిప్‌జిగ్ తీసుకువచ్చిరి. చిట్టచివరి చికిత్సగా మన వైద్యము చేయదలచిరి. వైద్యము మొదలు పెట్టినపుడు ఆ రోగి యెవరితోను మాట్లాడుటలేదు. యేమైనా ప్రశ్నలు వేసినకూడా జవాబు చెప్పడు. తన దేహానికి కావలసిన అవుసరములైనా తాను చూచుకొనలేదు. తొట్టిస్నానములవలనను, సామాన్యమును సహజమును అగు పథ్యమువలనను, అతనిస్థితి బాగుపడినది. 3 రోజులలో ఆకలిపుట్టినది. ఒక వారము రోజులలో అతని జ్ఞానేంద్రియములు పనిచేయ నారంభించినవి. క్రమక్రమముగా వ్యాధి నయమై 8 వారాలలో అతనికున్న వ్యాధి నయమైనది. పై రెండు వృత్తాంతాల వలన అన్నిరోగాలకు మూలకారణము ఒకటే అనే సిద్ధాంతము ఋజువైనది. ఇదివరకు వివరించిన దేహసంబంధమైన రోగాలవంటివే మానసిక వ్యాధులు అని, వానికి మూలకారణమైన రోగపదార్థము వీనికీ కారణము గనుక వాని కేచికిత్సతో నయముచేసినామో వీనికికూడా అదే చికిత్సయని ధ్రువపడుచున్నది.

# 3. శ్వాసాశయ వ్యాధులు

## శ్వాసాశయదాహము క్షయ ఉబ్బసము (మొదలగునవి.)

మొండి వైద్యులకు అంతుచిక్కక చీకాకుపెట్టే వ్యాధులలో శ్వాసాశయ వ్రణమనే పేరుగలక్షయ ఒకటి. ఇది మానవ జాతికి బీభత్సము కల్గించుచున్నది. ఈరోగానికి చిన్నలు పెద్దలు కూడా బలిపడి పోతారు. అన్ని వృత్తులవారికి ఈవ్యాధి వసుంది. మానవజాతిని హతమార్చే వ్యాధులలో క్షయరోగం ఒకటి. వివిధ లక్షణాలతో వివిధ దశలలో, మానవులనందరిని, ఇది బాధించుచున్నది. ఏ ఇద్దరి రోగులకూ, ఒకేమాదిరి లక్షణాలుండవు. ఒకని కిశ్వాస చాలాకఠినముగా ఆడును. ఇంకొకని తలనొప్పి, వేరొకనికి అజీర్ణము, ఇంకొకనికి మృతివచ్చేముందు 15 రోజుల కి దటివరకు, వ్యాధి ఉందనే తెలియక ఊపిరితిత్తులలో మంటలుపుట్టి, చనిపోతాడు. ఇంకొకనికి గుర్రపు గేపవలె శ్వాసఆడి దానితోనే చనిపోతాడు. ఇంకొకనికి పిప్పిఎముక. అదియు క్షయయే. శ్వాసకోశాలు చెడిపోయిన వారికి భుజాలలో పోట్లుపుట్టును. కొందరికి చెవులోను, కంటిలోను జబ్బుకన్పడి, దానిచాటున క్షయ దాగి ఉంటుంది. మొదట్లో గొంతునొప్పో, శ్వాసాశయదాహమో, స్వరపేటికయందు మంటో, శ్వాసనాళాలలోనుండి కఫమురావటమో, జలుబో వస్తుంది. వీనితరువాతనే క్రమముగా క్షయరోగం వస్తుంది. కొంతమందికి కాలికమగు పాదవ్యాధులు, ఇంకొకరికి పాదములమీద, కాళ్ళమీద, బహిరంగవ్రణములు, కొంతమందికి పైత్యపుగడ్డలు. కొంతమందికి దద్దురులు, మొదలగునవి కలుగును. ముఖనిదానశాస్త్రము తెలి

యని వారికి ఈ వ్యాధులకు మూలమేదో తెలియదు. శ్వాసాశయరోగులకు ఒక సామాన్య లక్షణము ఉన్నది. వారు పగలంతా నోరు తెరుచుకొని యుందురు. రాత్రిపూట నిద్రపోవునప్పుడు కూడా నోరు తెరిచికొనే పరుండురు. వారి దేహాలకు కావలసిన చల్లదనమును ముక్కుతో పీల్చిన గాలి ఇవ్వలేదు. అందువలన నోటితో కూడా గాలి పీల్చెదరు. వారి ఊపిరితిత్తులు నిరంతరము కాలుతూండి చల్లని గాలికోసము తపిస్తూండవి. దేహములో అభిసరిస్తూండే రక్తాన్ని బైటిగాలిని, చేర్చి శ్వాసకోశములు రక్తాన్ని శుద్ధిచేస్తూ ఉంటవి. అవి ఇదివరకే రోగపదార్థముతో నిండియుండుట వలన శుద్ధిక్రియను సక్రమముగా చేయజాలవు. అందువలన రక్తమునందలి మాలిన్యములు ఊపిరితిత్తుల్లో క్రమక్రమముగా పేరిపోయి అవి ఇంకా రోగగ్రస్తమైపోతవి. ఇందువలన రక్తములోని మలినములు రక్తములోనే యుండి దేహములో అమితముగ వేడిని కలిగిస్తవి. చర్మము ఎండిపోతుంది. అమితముగ లోపలనుండే వేడివలన ఊపిరితిత్తులు ఉడుకెత్తి పుండు ఏర్పడుతుంది. అవి క్రమంగా చైతన్యమును కోల్పోయి అందుండి కఫమువంటి పదార్థము వస్తుంది. దానిని వెలువరించేటందుకు దగ్గు పుట్టుతుంది.

ఈ వ్యాధిని గురించి వైద్యులంతా భయపడుచున్నారు. దీనికి సరియైన కారణమున్నది. శోధించీ, ధ్యానించి విసీ కూడా రోగము ముదిరి నివారణకు అసాధ్యమయ్యేదాకా క్షయవ్యాధి వస్తున్న సంగతి వారు కనుపెట్టలేకుండా ఉన్నారు. క్షయవ్యాధివంటి చెడ్డవ్యాధి తీరా రాకపూర్వమే దేహమంతా

రోగపదార్థముతో నిండిపోతుంది. ముఖనిదానశాస్త్రము ఎరిగిన వారు తప్ప, మందు వైద్యులు తమ సందిగ్ధమైన నిదానశాస్త్రముతో వానిని ముందుగా కనిపెట్టలేకపోతున్నారు.

క్షయవ్యాధి నయముచేసేటందుకు ట్యూబర్కులిన్ ఇంజక్షనే కాకుండా ఎన్నో నవీనమగు చికిత్సావిధానములను కనిపెట్టినారు. అవి యేవీ కూడా ఊపిరితిత్తులలోని క్షయను పూర్తిగా ఆపలేకపోతున్నవి. అనేక సంవత్సరాలుగా క్రమక్రమముగా వృద్ధిపొందుచున్న రోగపదార్థమువలన వచ్చిన క్షయవ్యాధినైనా మన చికిత్సలో నెమ్మదిగా వెనుకకు మరలించి, క్షయతో శ్వాసాశయాలు నశించిపోకుండా కాపాడగల్గుతాము. క్షయ వ్యాధి ముదిరిపోకమునుపే చికిత్స ప్రారంభించాలి. ఇది ఒక్క ముఖనిదానశాస్త్రమువలననే సాధ్యమగుతుంది. కొన్ని సంవత్సరాలు ముందుగానే క్షయవ్యాధి వస్తుందని చెప్పటకు ముఖనిదానశాస్త్రమునకు ఒక్కదానికే సామర్థ్యము ఉన్నది. అందువలన మన వైద్యములో యీ వ్యాధిని నయముచేయటానికి సాధ్యమవుతుంది. యితర విధానాలలో రోగమువచ్చే ముందుగా గుర్తుపట్టలేరు గనుక వారికి యీ రోగమును నయము చేయడానికి దుస్సాధ్యమవుతుంది. మన నిదానశాస్త్రానికి కూడా కొన్ని చిక్కులు ఉన్నవి. ముందుగానే కనిపెట్టి నీకు క్షయ రోగం వస్తుందని చెప్పినా వారు నమ్మి చికిత్సచేసుకోరు. నా వద్ద ఒక యింటిపనికత్తె బలముగా లావుగా ఉండేది. ఆమెకు అప్పటికే క్షయవ్యాధి అంతర్గతముగా ఉన్నది. వెంటనే చికిత్స చేయకపోతే చనిపోతుందని నాకు తెలియును.

కాదువల్ల ఆమెతో ఆమె దేహములో తీవ్రమైన క్షయవ్యాధి ఉన్నదని, వెంటనే చికిత్సచేసుకుంటే నయమవుతుందని, లేకపోతే ఒక సంవత్సరములో ప్రాణాపాయం వస్తుందని చెప్పినాను. నేను చెప్పినమాట ఆమె నమ్మలేదు. తాను పరిపూర్ణ ఆరోగ్యముగా ఉన్నాననియు, తనకు వైద్యముచేసుకోవాలసిన అవసరము లేదని చెప్పినది. ఆమెయింకా నాలుగుమాసాలకు చనిపోతుందనగా, తిరిగి హెచ్చరికచేసినాను. అప్పుడుకూడా వినలేదు. తరువాత 3 నెలలకు జబ్బుపడినది. జబ్బుపడిన 4 వారాలలో గుర్రపు గేంప్పవలె శ్వాసతోకూడిన క్షయవ్యాధివచ్చి దానితోనే ఆమె మరణించినది.

ఇప్పుడు క్షయవ్యాధి యెందుకువచ్చేది చెప్పుతాను. అదివరకే వచ్చిన ఏదో ఒక తరుణవ్యాధికి చేసినమందు చికిత్సలవలన రోగపదార్థము దేహములోనే నిలువచేరి ఆ రోగపదార్థము ఊపిరితిత్తులలోకి పోవుటచేత క్షయరోగం వస్తుంది. సామాన్యముగా సుఖరోగములకు చేసిన మందులు ఇంజక్షనుచికిత్సల వలననే క్షయవ్యాధి వచ్చుచుండును.

సుఖరోగాలున్న తల్లితండ్రులకు కలిగిన బిడ్డలు పుట్టుపుతోనే క్షయరోగబీజాలను సంపాదించుకొనుచున్నారు. ఆబిడ్డః దేహములో సంచితమయిన రోగపదార్థము, గండమాలరోగంగా తయారైన తరువాత క్షయవ్యాధిగా పరిణమిస్తుంది. తండ్రి యొక్క వీర్యబిందువునందే తండ్రియందలి లక్షణాలన్ని యిమిడి ఉన్నవి గనుక, తండ్రియొక్క దుర్లక్షణాలు ఈ వీర్యముద్వారా బిడ్డకు సంక్రమించుచున్నవి. గండమాల రోగులు అందరికి

కూడా కొంత వయస్సు రాగానే క్షయవ్యాధి రాగలదనే సంగతి ఇదివరకే చెప్పినాను. క్షయవ్యాధి రాకముందు గండమాల వ్యాధిగా ఉన్నప్పుడే చికిత్సచేస్తే దేహములో ధాతుశక్తి ఉంటుంది గనుక క్షయవ్యాధి నయమవుతుంది. ఇంకా కొంత కాలం గడిచేసరికి దేహములోని శక్తి తగ్గిపోయి అంతరావయవములు నశించిపోతవి గనుక అప్పుడు నయముచేయుడం చాలా కష్టము. పరిపూర్ణారోగ్యవంతులకు ఎన్ని క్షయ సూక్ష్మజీవులను పీల్చినా, అంతమాత్రములో క్షయరోగం రాదు. దేహములో యింతో రోగపదార్థము ఉండి, అందు తీవ్రమగు మండమువలన వేడి యెక్కువగా నున్నప్పుడే సూక్ష్మజీవులు జీవిస్తవి. సామాన్య ఆరోగ్యవంతుల దేహములలో అంత వేడి వుండదు గనుక అవి అచట నశించిపోవును.

తేలినదేమనగా అన్ని యితరవ్యాధులకు వలెనే క్షయవ్యాధి మూలకారణము ఉదరంలోనే యున్నది. అది అజీర్ణముచేతనే కలుగుతుంది. పిత్రియముగా క్షయవ్యాధి వచ్చినప్పుడుకూడా భూమిమీద పడేటప్పుడే ఊపిరితిత్తులనిండా రోగపదార్థము ఉన్నదని అనుకోరాదు. వారి ఊపిరితిత్తులు దుర్బలములుగా ఉంటవి. అందుచేత క్రమక్రమంగా వారి దేహాలలో ఉండే రోగ రోగపదార్థము దుర్బలముగానున్న ఊపిరితిత్తులదరిని చేరుతూ ఉంటుంది. ఎందువల్లననగా వానియందు ఆటంకము తక్కువగానే ఉంటుంది. అందువల్ల పిత్రియముగా శ్వాసాశయ రోగ బీజములు ఉన్నవారు కొత్తగా రోగపదార్థము చేరకుండా జాగ్రత్తపడాలి. ఉష్ణమండలాలల్లో నుంచి తెచ్చిన కోతులు మన

జంతుప్రదర్శనశాలల్లో ఆహారముయొక్క మార్పువలన జీర్ణక్రియ చెడి క్షయవ్యాధితో మరణించటం చూస్తూ ఉన్నాము. చల్లని దేశాలు క్షయవ్యాధికి కారణమని చెప్పెదరు. ఇది కొంతవరకే నిజము. చలిదేశాలలో జీర్ణక్రియ బాగుగా జరుగదు. ఆ కోతులు సహజంగా తినవలసిన ఆహారం లభించదు. ఉండవలసిన ఉష్ణమండలాలల్లో కాకుండా, శీతల మండలాలల్లో జీర్ణక్రియ చెడిపోతుంది. ఈ రెండు కారణాల వల్ల వాటికి క్షయవ్యాధి వస్తుంది. ఉష్ణమండలములోని మనుష్యులు శీతలమండలములకు పోయినపుడు వారి ఆరోగ్యము కొంతవరకు చెడిపోవుట నిజమేకాని కొలదికాలమునకే వారా దేశస్థితిగతులకు సరిపుచ్చుకొందురు. కనుక క్షయవ్యాధికి మనము తినే ఆహారము మనము నడచే జీవితసరళి మూలకారణంగా చెప్పవచ్చు. క్షయరోగులకు యెంత జాగ్రత్తగా ఆహార పదార్థములను యేరిపెట్టినా వారి దేహాలలోఉండే అమిత వేడి వలన ఆ యా పదార్థములు దేహమునకు ఈయవలసిన పోషక శక్తిని యిచ్చుటలేదు. ఒక మనిషి యే పదార్థములను సులభముగ జీర్ణము జేసికొనగలడో ఆ పదార్థములే దేహమునకు బలము నిస్తవి.

జీర్ణక్రియ సరిలేనివానికి, బలకర ఆహారములు యిచ్చినప్పుడు అవి దేహానికి బలమును కలిగింపకపోగా రోగాన్నే పెంచును. రోగులను గురించి ఎరిగినవారికే జీర్ణక్రియయొక్క తారతమ్యాలు తెలియును. అదివరకే దేహమంతా రోగపదార్థముతో నిండియుండి యింకా క్రొత్త రోగపదార్థము తలవైపుకు నెట్టుకుపోతున్నపుడు, ఆపదార్థమునూ ఊపిరితిత్తుల లోకుండా పోవాలి.

గనుక ఊపిరితిత్తులు పాడైపోవటానికి యెక్కువగా వీలున్నది. తలలో అదివరకే రోగపదార్థము నిండియుంటే ఊపిరితిత్తులే తరువాత పాడయిపోతవి. రోగపదార్థమునందు మండము పుట్టినపుడు అది ఊపిరితిత్తులయొక్క పైభాగమువరకూ నెట్టుకుపోయి అక్కడ పైకిపోవటానికి మార్గము కానరాక పీడనము వలన గట్టిపడి ఊపిరితిత్తులయొక్క పైభాగము ముందుగా పాడైపోతుంది. అందువల్లనే క్షయవ్యాధి రావడానికి పూర్వమే, భుజములయందు మంటలు, పోట్లు పుట్టును.

## ౪. గండమాలకు కారణము చికిత్స

ఇకముందు గండమాలవ్యాధి యెందుకు గలుగు తుందో వ్రాస్తాను. మొలలు, విద్రధులు, గ్రంధులు, కాయలు, కణుతులు, చివరకు పులిపిరికాయలు యేకారణముచేత పుట్టునో ఆకారణము చేతనే గండమాల రోగమునూ కలుగును. ఇక్కడ కొంచెము వివరించెదను. ఆరోగ్యవంతుని చర్మము మెత్తగాను తడిగాను ఉంటుంది. కాలిక రోగిచర్మము యెండిపోయి చైతన్యము తగ్గిఉంటుంది. ఆరోగ్యవంతునిచర్మము చేతో వంతముగా ఉంటుంది. గనుక చర్మ గతములైన మాలిన్యములను వెలువరించే సామర్థ్యము కలిగిఉండును. రోగియొక్క చర్మము నందు చురుకు ఉండదు. గనుక దేహమునందలి మాలిన్యములు వెడలిపోక అందే నిలచిఉండును, చాలా

మందికి అప్పుడప్పుడు పిర్రలమీదను మెడమీదను బాహువుల మీదను కురుపులు లేస్తూఉండటం కద్దు. అదివరకు దేహములో ఏదోబరువె త్తి ఉన్నట్లు తలచే వారికి కురుపు తేలి పగిలిన తరువాత బరువుదించినట్లు అనిపిస్తుంది.

అదివరకు లేని ఆరోగ్యము వచ్చినట్లు నూతనశక్తి ఉద్భవించి నట్లు, అనిపిస్తుంది. ఈ కురుపులు యెందుకుపుట్టునో, ఆలో చిద్దాము. ఒక కురుపు పుట్టేముందు ఆ చోటు ఎర్రగాను, గట్టి గాను ఉంటుంది. తరువాత క్రమముగా లావు బారి, వాపు యెక్కువగుతుంది. గడ్డ కడుతుంది. నొప్పి మంటలు ఉంటవి. చర్మము పెళుసుయెక్కుతుంది. తీవ్రమైన బాధ పుట్టుతుంది. పెరగవలసినంత పెరిగిన తరువాత, ఆగడ్డ మెత్తపడి బద్ద లయి, చీము కారుతుంది. ఆగడ్డా కరిగిపోతుంది. రోగపదా ర్థాన్ని వెలువరించేటందుకు దేహమే యిట్టి ప్రయత్నంచేసింది. అందరిలోను యిట్టి కురుపులు: యెందుకురావని అడుగవచ్చు. కొందరకు తొందరగా చెమట పోస్తుంది. కొందరకి త్వరగా పోయదు. వారి దేహాలలో ఉండే ధాతుశక్తి తారతమ్యము లనుబట్టి యీలా జరుగుతుంది. దేహములో బాగా ధాతుశక్తి ఉండి ఇతర మార్గాల రోగపదార్థము వెలువరించటానికి సాధ్యం కానపుడు దేహము, కురుపులద్వారా, రోగపదార్థాన్ని, వెలువ రిస్తుంది.కురుపులవంటి తరుణవ్యాధిని గలిగించేటందుకు,తగినంత ధాతుశక్తి శరీరములో లేనపుడు, రోగపదార్థము నిలువచేరి, చర్మమువరకు రాలేక నిలచియుండును. అందువలన నొప్పి లేకుండా కొంత రోగపదార్థము గడ్డలుగా తయారవుతుంది.

కురుపులకు బదులుగా గడ్డలుంటవి. ఆగడ్డలలో రోగపదార్థము చేరుకొని ఉంటుంది. పక్వముగాని అవస్థలోవున్న కురుపే యీగడ్డ. మన చికిత్సచే దేహములోని ధాతుశక్తిని వృద్ధిజేస్తే తిరిగి గడ్డలన్ని, కురుపులుగా, తేలి పగిలి రోగపదార్థము వెడలి పోతుంది. ఇక కంఠము చుట్టూ యేర్పడినపుడు కంఠమాలఅనిగాని, గండమాలఅనిగాని, పిలుతుము. దేహములోపలి ఊపిరితిత్తులలోకూడా యిట్టి గడ్డలు ఉండవచ్చును. కర్కటవ్రణము లకు మూలముగా యిట్టి గడ్డలు వుంటవి. మూలవ్యాధిలోకూడా గడ్డలుంటవి. స్వాభావిక చికిత్సా నియమముల నవలంబించి దేహములోని ధాతుశక్తిని, వృద్ధిచేస్తే యీగడ్డలలోకూడా మార్పువస్తుంది. తొట్టివైద్యము చేసినపుడు, కురుపులు, లేచి యెంతోమందికి నెత్తురు చీము కారిపోతుంది.జాగ్రత్తగా చేసిన తొట్టివైద్యమువలన, యిట్టి కురుపులుకూడా, పుట్టకుండా, రోగ పదార్థమంతటిని, మలమూత్ర స్వేదములుగ, వెలువరించి వేయ వచ్చును. అప్పుడు కురుపులయొక్క, బాధ, తీపు, సలుపు, పోటు, మంట అనుభవించకుండా పోతుంది. చికిత్సాకాలము లోను, తర్వాతనుకూడా, తీసుకునే పథ్యపానీయాలు, దేహములోఉండే రోగపదార్థాన్ని, పెంచేవిగాక, ధాతుశక్తిని వృద్ధి నొందించేవిగా, యేర్పాటు చేసుకోవాలి. ఇతర విధములైన కణుతులు కాయలను, కరిగించినట్లుగనే, గండమాల గ్రంధులను, వెలువరించివేయవచ్చును. వివిధ రోగులయందలి, రోగపదార్థముయొక్క పరిమితి ననుసరించి, యీగడ్డలు, వేరు వేరు చోట్ల పుట్టుచున్నవి.

వేరు వేరుచోట్ల పుట్టే గ్రంధులూ, క్షయకు కారణమైన గండమాల. ఊపిరి తిత్తులలోని గడ్డలు మొదలగునవన్నియు యెందుకు పుట్టుతున్నవో మనకు తెలిసినది, గనుక వానికి చేసే చికిత్సకూడా స్పష్టముగ తెలియుచున్నది. ఇట్టి గడ్డలకు మందు వైద్యులుచేసే శస్త్రచికిత్స రోగనివారణకు పనికిరాదని మనకు తెలియును. శస్త్రచికిత్స వలన పై చిహ్నమే పోతవి. గాని మూలకారణము నిలచియే యున్నది. దేహమునందలి ధాతు శక్తిని వృద్ధిజేసి రోగపదార్థమును వెలువరింపగల సామర్థ్యమును పెంచినట్లయితే దేహమే కాయల, కణతుల, కరిగించి మలముగను, మూత్రముగను, చెమటగను, వెలువరించి వేయును. గడ్డగట్టి పోయినస్థితిలోకూడా జాగ్రత్తగా జేసిన, చికిత్సలవలన రోగపదార్థమును మెత్తపరచి కరగించి వెలువరించవచ్చును. అయితే మన చికిత్స కొన్ని సంవత్సరములు వరుసగా చేయువలసి ఉంటుంది. రోగపదార్థములో మండము పుట్టే పద్ధతికూడా అందరిలో ఒకే మోస్తరుగా నుండదు. కనుక ఒక్కొక్కరికి, ఊపిరితిత్తులయొక్క పై భాగములోను, కొందరికి మధ్యభాగములోను, కొందరికి ప్రక్కభాగములోను, కొందరికి దిగువభాగములోను, ఇట్టి గ్రంధులు యేర్పడును. చాలా మంది క్షయరోగులకు, శ్వాసనాళికలలో, మంట లుంటవి. కాలికమై, అంతర్గతమైన, రోగపదార్థము, ఊపిరి తిత్తులలో చేరినప్పుడు, వివిధ రకములైన శ్వాసకోశ వ్యాధులు వచ్చుచున్నవి.

పుప్పుసమునందు మంటలు, ఊపిరితిత్తులలోని మాలిన్యములను, వెలువరించుటకు దేహము చేసే ప్రయత్నమే ఈ పుప్పుస

దాహము. లేక జ్వరము. చేయవలసిన చికిత్సయేదో సరిగా తెలియక, చేసిన అపభ్రంశపు చికిత్సల వలన ప్రాణాపాయం కూడా సంభవింపగలదు. కాని మన వైద్యము చేస్తుంటే యిందులో అపాయమేలేదు. తొట్టివైద్యము వలన, ఉదరము సంబంధి రోగపదార్థ మండము తగ్గిపోయి, ఆ యా అవయవాలకు ప్రమాదము లేకుండా పోతుంది.

రోగనివారణము గూడా, ఆశ్చర్యకరముగా కొద్దికాలములోనే అగుతుంది. నేను చికిత్సచేసి, నయముచేసిన కొన్నిరోగ నివారణ వృత్తాంతాలు, యిచట చేర్చుచున్నాను. నన్నొకయింటి వారు పిలిచిరి. ఒక తొమ్మిది ఏండ్ల బిడ్డ శ్వాసాశయ దాహముతో పడియున్నది. వారి యింటి వైద్యుడు రెండు మాసములనుండి క్రియోసోట్‌తో చికిత్సచేసినాడు. నయము కాలేదు. ఆబిడ్డ జీర్ణక్రియ ఆవిషంతో బాగా చెడిపోయినది. ఆబిడ్డ బ్రతుకుతుందని తల్లితండ్రులు నిరాశను, చేసుకొన్నారు. నన్ను పిలిచినది. యీ ఆఖరుస్థితిలోనే వారి యింటి వైద్యుని సలహా వదలివేసి సొంతంగా నాసలహామీద వైద్యము నడిపితేనే ఆబిడ్డ బ్రతకటానికి వీలు ఉన్నదని చెప్పితిని. వారట్లే చేసిరి. రెండవదినముననే సుగుణము కనుపడినది. ఒకవారంలో ప్రమాదము తప్పిపోయినది. కొలది వారములలోనే ఆ బిడ్డ బైట పరుగెత్త గలిగినది. 2 మాసాలు క్రియోసోటుతో వైద్యము చేయకుండా, మొదటినుండియే మనవైద్యము చేసి ఉంటె రోగనివారణ కావటానికి, యింతకాలం గడువకుండా కొలదిరోజులలోనే నయమయ్యేది.

శ్వాసకోశ వ్యాధులన్నిటియందును, ఊపిరితిత్తులలోపల అమిత మగు వేడిమిఉంటుంది. గాలిని లోనికి, పీల్చినప్పుడు, దేహము నందలి, మాలిన్యములతో, ఆగాలిచేరి, బొగ్గుపులుసు గాలిగా బయటకు వస్తుంది. బొగ్గుపులుసు గాలితోచేరి నత్రజని, కొద్దిగా ప్రాణవాయువు, బయటకువస్తుంది. కొంత ప్రాణవాయువు ఊపిరితిత్తుల్లో నిలచియుండి, మాలిన్యములను దహించు చుండును. సహజముగా యీక్రియవలన, ఊపిరితిత్తులు వేడిగా ఉంటవి, రోగపదార్థము, ఊపిరితిత్తుల్లోనే, ఉండి దానిని కూడా దహింపవలసి వచ్చినప్పుడు, ఊపిరితిత్తులయందు, ఉపద్రవమగు వేడిఉండును. ఊపిరితిత్తులలోని, మాలిన్యము లందుకలిగిన వేడివలన, సూక్ష్మజీవులుపుట్టి వృద్ధిపొందుచున్నవి. వేరు వేరు ఉష్ణపరిమితులందు, వేరు వేరు జాతిసూక్ష్మ క్రిములు పెరుగుతవి. ఒకేరకము పక్షి, వేరు వేరు శీతోష్ణములుగల దేశములందు రూపమునందును, పరిమాణమునందును మారినట్లే, సూక్ష్మ జీవులుకూడా వేరు వేరు ఉష్ణధర్మాలలో వేరు వేరు రూపముల లోను, పరిమాణములలోను కాన్పించుటలో ఆశ్చర్యములేదు. ఇంతవరకు నేనుచెప్పిన రోగకారణము తెలిసికొన్నవారికి చికిత్స చేయడంలో నేను చెప్పేపద్ధతి సులభంగానే తెలుస్తుంది. దేహమునందలి అమితమగు వేడిమిని తగ్గింపవలెను. దేహము నందలి ప్రాణశక్తులను బలపరచవలెను. అప్పుడు రోగపదార్థము వెనుకకు మరలి ఆరోగ్యము కలుగుతుంది. ఇందుకు యుక్తమగు పథ్యపానీయముల నవలంబింప వలయును. తొట్టి స్నానములను విధిగా చేయుచుండవలయును. రోగియొక్క—

దేహమునందలి వేడిమినిబట్టి స్నానములయొక్క సంఖ్యను స్నానకాల పరిమితి నిర్ణయించుకొనాలి. మన వైద్యముబాగుగా తెలిసినవారు మాత్రమే స్నానసంఖ్యను పరిమితిని క్రమముగా నిర్ణయింప గలరు. ఇందులోనే చాలా భేదాభిప్రాయములు ఉన్నవి. గనుక తెలిసిన వారిదగ్గరే సలహా తీసుకొనవలెను. పరిశుద్ధమైన గాలిలో తిరుగవలెను.

క్షయరోగులకు ఎండ ఆవిరి బాగా మేలుచేస్తుంది.

## ట్యూబర్ కులిన్, యినాక్యులేషన్, స్వాభావిక చికిత్స.

సూదితో దేహములోనికి యెక్కించే ట్యూబర్ కులిన్ చాలా అపకారం చేస్తుంది. అది రోగాన్ని నయము చేసినట్లు ఎందుకు కనుపడుతున్నదో కొంచెము వివరిస్తాను. ట్యూబర్ కులిన్‌లో ఉండే విషము రోగపదార్థములోని మండమును విడగొట్టును. అందువలన తాత్కాలికంగా మండము, నిలచిపోతుంది. దానితో జ్వర లక్షణాలు కూడా తగ్గిఉంటవి; ఒక ఉష్ణధర్మములో కనుపడుతుండే క్షయ సూక్ష్మ జీవులు, ఆమండము ఆవేడీ లేనందువలన, తాత్కాలికంగా, అదృశ్య మగుతవి. అంతేగాని దేహమునందలి రోగపదార్థము వెడలిపోదు. రోగ కారణము ఆలాగే నిలిచి ఉంటుంది. అందువలన యీ సూది మందు తాత్కాలికంగా రోగ లక్షణాలు కనపడ కుండా కన్నుకప్పుతుందిగాని, రోగ కారణమును నిర్మూలించదు. కాగా దేహములో విషము ప్రవేశపెట్టుటవలన, ధాతుశక్తి తగ్గి, రోగనివారణ సామర్థ్యం పోతుంది. కొలది మాసాల తరు

నాతనే రోగము తిరిగి వస్తుంది. బుద్ధిమంతులైన మందు వైద్యులే యీ విషయాన్ని ఒప్పుకుంటున్నారు. ఇంత పొర పాటు వైద్యము యింకొకటి ఉండబోదు. చాలా ముదిరి పోయిన క్షయవ్యాధి కూడా జాగ్రత్తగా కొన్నిసంవత్సరాలు చికిత్సచేస్తే నయమవుతుంది. మరీ ముదిరిపోయిన క్షయరోగు లకు మాత్రము, నయముకాదు. అయితే మన చికిత్సవలన ఉపశాంతి మాత్రము కలుగుతుంది. జీర్ణశక్తి వృద్ధిఅయ్యే స్థితిలోనుండి ధాతుశక్తి శేషించి యున్న రోగులకు మనచికిత్స వలన లాభము కలుగుతుంది. రోగియొక్క జీర్ణశక్తిని మనము వృద్ధిపరుప గలిగినట్లయితే, బహుకొలది కాలములో, ఆశ్చర్య కరముగ, వ్యాధి నయమవుతుంది. జీర్ణక్రియను, బాగుచేయ లేకపోతే మాత్రం, వ్యాధినయముకాదు. నేను చికిత్సచేసిన, క్షయరోగులలో చాలామందికి, జీర్ణక్రియ తొందరగా బాగు పడుటవలన, నమ్మశక్యము కానంత స్వల్పకాలములోనే వ్యాధి కుదిరినది.

ఇంకా కొంతమందికి, ఊపిరితిత్తులలో, గడ్డకట్టిన చీముగల వ్యాధిగ్రస్తులకును చికిత్సచేసినపుడు, కొన్నిసంవత్సరముల దాకా నయముకాలేదు, రోగపదార్థాన్ని మరల వెలువరించు టలో ప్రతిసారీ చాలాశ్రమ కష్టం కలిగేది.ఎంతోకఫము వెడలి పోయేది. ఆరోగ్యము వచ్చుటకై జరిగే యిట్టి వెలువరింపులు, అపాయకరమైనవి కాకపోయినప్పటికీ,బాధమాత్రం ఉంటుంది. మనము చికిత్సచేసేటపుడు, రోగపదార్థ మండమును, నేర్పుగా తగ్గించి,లోపలివేడినిఅదపులోనుంచుతాము.ఇట్లుజాగరూకతతో

చికిత్సజరిపితే, రోగనివారణము, క్రమముగా అగును. దేహములో త్రాణశక్తి బలమున్నయెడల, ఊపిరితిత్తులనుండియు, ఉదరమునుండియు. రోగపదార్థమును, వెలువరించుటకు, లింగస్నానములు అత్యద్భుతమగు పనిజేయును. ఎండలున్నపుడు ఎండఆవిరియు, ఎండలులేనప్పుడు నీటి ఆవిరియు, తరుచుగా ఉపయోగిస్తూ ఉండుము. నేర్పుగా యేర్పాటుచేసిన పథ్యముయెంతో మేలు చేస్తుంది. క్షయరోగులకు, పరిశుద్ధమగు గాలి యెంతయో అవసరము. క్షయవ్యాధి బాగాముదిరినవారికి దేహమునందు శక్తి తగ్గి ఉంటుంది. గనుక లింగస్నానములుగాని ఆవిరిగాని దేహము భరించదు. అట్టివారికి సౌమ్యమగు కటిస్నానములు చాలును. నీటివేడిమిగూడా మిక్కిలి చల్లగా నుంచక, పోసిన నీళ్ళు పోసి స్నానం చేయింపవలసినది. తొట్టిలోని నీటిపరిమితిని పెంచి, ఆనీరు రోగికూర్చున్నపుడు భుజములవరకూ వచ్చునట్లు కూర్చుండవలయును. మొట్టమొదట 5ని॥ స్నానము మాత్రిముచాలును. అతనిస్థితి బాగుపడిన కొలదిని స్నానకాలమును పెంచవచ్చును. కొద్దికాలము చేసే యిట్టి కటిస్నానాలు ఒక దినములోనే 5, 6 సారులు చేయింపవచ్చును. దేహశక్తులు వృద్ధియైన కొలదిని లింగస్నానములు కూడా చేయింపవచ్చును. ఈలింగ స్నానముల వలనకూడా రోగనివారణము కాకపోయినా బాధ ఉపశమిస్తుంది. జీర్ణక్రియ బాగుపడితే మాత్రిము క్షయవ్యాధి యెంతముదిరినా నయమవుతుంది. ఈ సందర్భములో కొన్ని రోగనివారణ వృత్తాంతాలను యిక్కడ చేరుస్తున్నాను,

ముదిరిన క్షయ. 30 సంవత్సరముల స్త్రీ క్షయవ్యాధి ముదిరిన తరువాత, నావైద్యము ఆరంభించినది. శ్వాస నిద్రలోను, విడి

గాను, నోటితోనే పీలుస్తుంది. ఆమెతల్లి క్షయవ్యాధితో చని పోయినది. ఆమె బిడ్డలకు ఆరోగము సంక్రమించినది. రోగి, ఆమె తోడబుట్టినవారు, చిన్నతనంలో లావుగా ఉండేవారు. ఈరోగి ఆమె 20 వఏట గుండ్రని ముఖము కలిగి లావుగా ఉండేది. ఆమె బుగ్గలు అసహజంగా ఎర్రగా ఉండేవి. శీతకాలం లో మాత్రము బుగ్గలు నల్లబడేవి. 30 వ యేడు వచ్చేసరికి ఆమెలావు తగ్గినది, బుగ్గలు మారినవి. ఎక్కువ సహజంగా దేహమంతయూ మారినది. లావు తగ్గడంతోపాటు క్షయ చిహ్నాలుకూడా ఆరంభించినవి. జీర్ణక్రియ చెడినది. కొన్నాళ్లు మలబంధముంటే, కొన్నాళ్లు అతిసారముండేది. జీర్ణక్రియ బాగా చెడియుండుట వలన మలము దుర్వాసనగా ఉండేది. అప్పుడపుడు వస్తుండే తలనొప్పి, పంటి నొప్పులకు, తోడుగా రొమ్ములలోను భుజములలోను శూలముతో పొడిచినట్లునొప్పు లుండేవి. ఊపిరితిత్తులు చెడిపోతున్నపుడు మాత్రమే యిలాటి బాధలువస్తవి. ఊపిరితిత్తుల్లో కొన్నిభాగాలు బాగాచెడి పోయిన తరువాత బాధలను తెలుసుకొనేసామర్థ్యము తగ్గిపో తుందిగనుకబాధలేవీఉండవు. ఆరోగిఋతుధర్మముకూడాబాగా చెడినది. ఋతుకాలములో బాధలుండేవి. కొన్నినెలలు అసలు ఋతువే కనుపడేదికాదు, వేరుకాలమునందు నెలకాకమునుపే ఋతువు కనుపడేది. ఈకాలాలలోదిగులు,ఆందోళన,అసంతృప్తి ఉండేది. మన నిదానం తెలియనివారికి, మనచికిత్స ప్రారంభించే కాలానికి, ఆమె పరిపూర్ణ ఆరోగ్యవంతురాలుగానే కన్పడు తుంది. నిండైనవిగ్రహము, పచ్చనిరంగు, ఎవరైనా ఆమెను

చూచినయెడల ఆమెదేహములో, దాగియున్న అపాయకర లక్షణాలను, గుర్తుపట్టలేరు'

ఆమెరోగం యెంతతీవ్రమైనదో ఆమె ఎరిగివుండి మనచికిత్స ప్రారంభం చేసింది. శీతలోదక కటి, లింగస్నానములు, నీటి ఆవిరి, ఉద్రేకరహితమైన సౌమ్యమగు పథ్యము, నిరంతరము చల్లగాలి తగిలేచోట నివాసము. ఈ విధంగా యేర్పాటు చేశాను. ఇట్లు ఆరుమాసాలు చేసే సరికి, ఆమె ఆరోగ్యము బాగా వృద్ధి పొందినది. అదివరలో మేడమెట్లు యెక్కినపుడు, దూరము నడచినపుడు ఆయాసం వచ్చేది. ఇప్పుడు ఆపనుల వలన ఎట్టిశ్రమ కలగడంలేదు. జీర్ణశక్తి వృద్ధిఅయినది. అదివర కున్న నిరుత్సాహం పోయింది. తలనొప్పులునూ పోయినవి. రోగపదార్థము పైనుండి ఉదరము వంకకు నడువ నారంభించి నది. సంవత్సరములో 2 సార్లు రోగనివారణకొఱకై బాధలు కలిగినవి. ఈబాధలు తేపకు 2, 3, వారాలు ఉన్నవి.

ఊపిరి తిత్తుల్లో ఉండే పుండ్లు కరిగి, వెడలిపోయినవి. అప్పు డామెకు బలహీనము కనుపడేది. ఆస్థితిలో అంతమాత్రము, బలహీనము కనుపడుతుంది. చికిత్సచేసే రెండవ సంవత్సరంలో, ఆమె ఆరోగ్యము యింకా వృద్ధి అయింది. అపుడు కూడా, రోగనివారణ కొరకై బాధలు వచ్చినవి. ఇట్లు 2 ఏండ్ల తరువాత, తీవ్రమైన ఆమె శ్వాసాశయ వ్యాధి నివారణైనది.

## క్ష య

ఇంకొక ప్రధానమైన, రోగనివారణవృత్తాంతము వ్రాస్తాను. రోగి 40 సంవత్సరాల పెద్దమనిషి. వైద్యులంతా అతనికి క్షయ

వచ్చినదని నిర్ణయించిరి. ఇటలీ దక్షిణభాగానికి పోయి, ఆతనిని శాశ్వతముగా నివసింపుమనినారు. నేను ముఖనిధాన శాస్త్రముతో, అతనిని పరీక్షచేశాను. వెచ్చనిచోటునకుపోయి, జీవించినాఅతను ఒకసంవత్సరముకంటెయెక్కువజీవించడనినేను తెలుసుకొన్నాను. అందువలన వెంటనే మనచికిత్స ప్రారంభం చేశాను. 4 వారాలు మనచికిత్స చేసిన తరువాత నెమ్మదిగా అతని ఆరోగ్యము వృద్ధి కానారంభించినది. అతనికి తొమ్మిది ఏండ్లకు పూర్వము మూత్రము, విరేచనాలు యెక్కువగా అయ్యేవి. ఆవ్యాధి యిప్పుడు చాలా సౌమ్యముగా కనుపడి 15 రోజులుఉండి పోయినది. చిరకాలమునుండి కాలిక దశలో ఉన్న రెండురోగాలు మనచికిత్సా విధానమువలన అతనిధాతు శక్తి వృద్ధిఅయినందున యిప్పుడు తిరిగి దేహము బలపడి యుండుటవలన తరుణరూపములో కనుపడి పోయినవి. ఇదివరకు అతనికి పచ్చసెగ కనుపడి మందులతో అణచిపెట్టబడియున్నది. అదియును 2 వారములలో నయమైనది. ఇన్నివిధముల రోగ పదార్థము వెడలి యుండుటవలన అతనికి యిప్పుడు తేలికగా ఉన్నది. ఊపిరితిత్తుల వ్యాధికూడా చాలా మారింది. రోగి చాలా ఉల్లాసంగా ఉన్నాడు. తరువాత $1\frac{1}{2}$ సంవత్సరములు మనవైద్యముచేసి వ్యాధిని కుదుర్చుకొన్నాడు.

## అస్థి క్షయ

ఈ రోగం కలవారు నావద్ద చికిత్స చేసుకుని, ఆరోగ్యమును పొందినారు. చిన్నతనంలో యెవరికిఅయితే రికెట్సు ఉండేవో, వారికే యీవ్యాధి వచ్చేది. చిన్నతనంలోనే ఎముకలయొక్క

దౌర్బల్యమునవలన వంగిపోయి, విరుగదగిన స్థితిలో ఉన్న వ్యాధినే రికెట్సు అందురు. యుక్తవయస్సు వచ్చేసరికి యింకా కొంచెము ముందుగానే కూడా ఎముకలు పుచ్చి పోవడం, కాలిఎముకలు చేతిఎముకలు మెత్తబడి, వాచి చీము గారడం, ఎముకల సంధులు లావు కావడం, జరుగును. కొందరి విషయములలో నాదగ్గరకు వచ్చేటప్పటికే, రోగం కుదరదని వైద్యులు ఆశవదలుకున్న స్థితిలో వచ్చిరి. అదివరకు తీసి వేసిన అవయవాలు తిరిగి మొలవవుగాని, మనవైద్యము ప్రారంభించినపుడు రోగపదార్థం తేలికగా వెలువడిపోతుంది. రోగనివారణకొరకు చేసే శస్త్రం, యేస్థితిలోనూ గట్టిగా అవసరంలేదనే నా దృఢనమ్మకం. అట్టి శస్త్రచికిత్సవలన యెవరికీ యిప్పటివరకూ రోగం నయముకావడం చూచియుండ లేదు. రోగపదార్థాన్ని అది పైకిపోయినమార్గాన వెనుకకు మరలించితే మనము వ్యాధిని నయముచేయగల్గుతాము. ఒక విషయము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఒక పిల్లవానికి, మోకాలు చీలమండమధ్య రెండుకాళ్ళలోనూ ఎముక పుచ్చి చీముకారుతుండేది. డాక్టర్లు 2 కాళ్ళను తెగ్గోడతామన్నారు. అందువలన భయపడి ఆ బిడ్డను నావద్దకు కొనివచ్చి చూపిరి. శీతలోదక కటిలింగస్నానాలు, సహజమగు పథ్యము, ఆ బిడ్డకు నియమించితిని. 4 వారాలు జరిగినంతనే పుచ్చి బైటికి కను పించుచున్న ఎముకలపైన చర్మము కప్పుకొనడం ప్రారంభించినది. చర్మము తెగిపోయిన చోట కొన్నినాళ్ళకు చెట్లకు కూడా చర్మము ఇట్లాగే కప్పుకుంటుంది. 6 మాసాలు జరిగినది. కాళ్ళు రెండూ నయమైనవి. రెండు చిన్నమచ్చలు మాత్రము

మిగిలినవి. ఇంకా 2 నెలలు చికిత్స చేసేటప్పటికి ఆమచ్చలు కూడా మానిపోయినవి. అదివరకు దిగులుగా వుండే పిల్లవాడు యీవ్యాధి నయమైన తరువాత చాలా ఉల్లాసముగా ఉన్నాడు. చిన్నతనము వానిలో ప్రవేశించినది. యిప్పుడతడు ఇతర పిల్లల వలెనే పరుగెత్తి ఆడుకొనగలడు.

## ఉబ్బసము

ఒకామెకు 65సంవత్సరములు. ఆమెకు ఉబ్బసము. చాలా బాధ పడుతూఉండేది. వైద్యుడు యిచ్చిన క్రియోసోట్ మొదలగు మందులతో ఆమెస్థితి మరీచెడిపోయినది. ఆమె జీర్ణశక్తి మరీ చెడినది. ఇంత ముదిరినస్థితిలో ఉబ్బసానికి వారివద్ద మందులేదు. ఆమెను దక్షిణానికిపోయి వేడిచోట నివసింపుమని వైద్యులు సలహాయిచ్చారు. 10 అడుగులు నడచినా, ఆమెకు ఆయాసము వచ్చేది. ఉష్ణమండలాలకు, పొమ్మని వైద్యుడు చెప్పుట యనిన "నీరోగానికి యేమీ చేయలేను. నీకర్మానికి నిన్ను వదలివేస్తూ ఉన్నాను. ప్రకృతియేమైనా సహాయము చేస్తుందేమో, చూడుము" అని అర్థము. ఆమెకు ఆభావ అర్థమైనది. ముక్కు, మొగము, యెరుగని దేశంలో చావడంకంటే, యింటి దగ్గర చావడమే, మంచిదని తానాదేశం పోనని చెప్పినది. నాదగ్గరకు వైద్యానికి వచ్చింది. డిశంబరు నెలారంభము. బాగా మంచుపడుచున్నది. ఇట్టి అనుకూలంలేని కాలములో చికిత్స ప్రారంభం చేసితిమి. ఆమె దేహంలో ఉన్న రోగ పదార్థము అంతా, ఊర్ధ్వముఖంగా నడుచుచున్నది. మన వైద్యము నాసలహా అనుసరించి, శ్రద్ధగా నడిపింది.

ఊర్ధ్వముఖంగా నడచే మందము తగ్గినది. ఆమె జీర్ణశక్తి బాగా వృద్ధిఅయినది. రోగపదార్థము చెమటగా వెడలిపో సారంభించినది. తరుచుగా నీటిఆవిరి పట్టితిమి. ప్రతిదినము శీతలోదక కటి లింగస్నానములు చేయించినాను. ఇట్లు కొన్ని మాసాలు చేసేసరికి రోగపదార్థము దిగిపోవడం పూర్తి అయినది. రోగము వృద్ధిపొందేటప్పుడు యేయే లక్షణాలుకనుపడుతు వచ్చినవో రోగం దిగిపోయేటప్పుడు అవేలక్షణాలు కనిపించి నయమైనవి. రోగం వృద్ధికావటానికి ఎన్నిసంవత్సరాలుపట్టిందో రోగం నయము కావటానికి అన్నినెల్లలో నయమైనది: చికిత్స తేలికగా ఉన్నది. 12 మాసాల్లో యెంత రోగపదార్థము పెరిగిందో అంత రోగపదార్థము వెడలి పోవటానికి 1 నెలపట్టింది. 3 మాసాలలో సాంతంగా ఆమెవ్యాధి కుదిరినది. ఇంకొక ఉబ్బసపు రోగనివారణ వృత్తాంతము యిక్కడ చేర్చుచున్నాను. అది చాలా చమత్కారమైనది.

60 సంవత్సరాల పెద్దమనిషికి ఉబ్బసము. సంవత్సరాలనుంచీ బాధపడుచున్నాడు. వైద్యులు అతనికి నయముకాదని నిర్ణయించిరి. చిరకాలమునుండి తినియున్న మందులవలన అతని దేహము మరీ బలహీనమైయున్నది. రోగికి మొదటిస్నానంలోనే సుఖము కనుపడింది. అయితే ఆ సుఖస్నానంచేసిన కాసేపటికే అయిపోయ్యేది. అందువల్ల నేను చెప్పిన దానికంటె యింకా తొందరగానే తరుచుగా స్నానములు చేయడం మొదలిడినాడు. రాత్రిళ్ళు దగ్గుతో, . నిద్రపట్టకపోయినప్పుడల్లా తొట్టిస్నానము చేసేవాడు. 1 అరగంటసేపు తొట్టిస్నానము

చేస్తే గంట సేపు, సుఖముగ నిద్రపోగలిగేది. ఇంతలో జ్వరం యొక్కపై దానితో దగ్గు యొక్కనై నిద్రించిపోయ్యేది. ప్రతి స్నానంలోనూ, ఎంతో కఫం పోతూ వడి, వెడలిపోయ్యేది. దీనితో శ్వాస తేలిక అయ్యేది. అనవసరపు జనచ్ఛాదమున్న ఉండే రోగిక మానాన్నా ఇతని వారిజాన్ని బలము ఉత్సాహము వృద్ధి పొందినవి. ఒక సంవత్సరమునకు పైగా కొంచెము యొక్క కాలము చేసినాడు. దానితో అతని ఆరోగ్యము వృద్ధిఅయినది. అతని బట్టతలమీద వెంట్రుకలు మొలిచినవి. స్నేహితులంతా ఆశ్చర్యమును పొందిరి.

## పైత్యగ్రంధి

ఇతర రోగాలన్నీ ఎలా నయమైనవో ఆవిధముగానే పైత్య గ్రంధిని కూడా నయము చేసినాను. దీనివలన అన్నిరోగాలకు యేదే కారణమైనా యీవ్యాధికి ఆరోగపదార్థమే కారణమని తేలినది. నేను నయముచేసిన ఒక రోగనివారణ వృత్తాంతమును యిచట చెప్పుచున్నాను. ఒకామెకు 2 వ ఏట టీకాలు వేసిరి. దానితో చర్మముమీద మొండికురుపులు లేవడం ప్రారంభం చేసినవి. 10 వయేట ఆమె ముఖముమీద పైత్యపు పొక్కులు లేచినవి. 13 సంవత్సరాలు యీ అంటువ్యాధితో బాధపడినది. ఎంతోమంది వైద్యులలో సుప్రసిద్ధులతో సంప్రదించినది. ఎవరూ ఆమెకు సహాయం చేయలేకపోయిరి. ఆమెముఖము భయంకరంగా ఉన్నది. ఆమెను ప్రజలు అసహ్యించుకొను చుండిరి. ఈ దుర్భరస్థితిలో, ఆమె నావద్దకు చికిత్సకై వచ్చెను. అప్పటికే సుప్రసిద్ధవైద్యులంతా, ఆమెరోగం కుదరదని, యేక

[illegible] చెప్పివేశారు. ఆమెదేహములో రోగపదార్థము ము[illegible] చేసినందున, ఆ రోగం తొందరగానే నయమగు [illegible] [illegible]నిదానశాస్త్రమువలన, తెలిసికొంటిని. ఇది అట్లాగే [illegible]నది. 15 రోజులలోనే బీభత్సంగా ఉండే ఆమె ముఖములోని మచ్చలు పల్చబడినవి. వెనుకటిఅంత అసహ్యా [illegible] లేదు. ఇదివరకు ఆమె జీర్ణశక్తిని గూర్చి యెవరూ శ్రద్ధతీసుకోలేదు. అదిఇప్పుడు వృద్ధిబొందినది. ఎక్కువగా మలము వెలువడ [illegible]రంభించినది. దానితో మచ్చలుగూడా క్రమ ము[illegible] [illegible]నవి. ఏడువారములలో ఆమెచర్మానికి సహజ[illegible] రంగు వచ్చినది. ఇంకా చాలా పైత్యదద్దు రులకు, చికిత్స చేసినాను. అవి యింతకంటె తేలిక అయినవి. తొందరలో నయమైనవి. ఎడమ వైపునగాని, వెనుక వైపున గాని, ఛా[illegible]మున్నపుడు చికిత్స చాలా కాలము పడుతుంది. ఇట్టి రోగులకు చికిత్స చేసినప్పుడు కొద్దివారాలలోనే గొప్ప ఫలాలు కనుపడక మధ్యలోనే, చికిత్స విసుగుతో ఆపివేయు చున్నారు. ఇట్టివారికి చికిత్స చిరకాలము ఓర్పుతో చేస్తేనే గాని వ్యాధి నయముకాదు.

ఒక రోగి పైత్యదద్దురుతో 19 సంవత్సరములనుండి బాధ పడుచుండెను. ఆమె ముఖము యెవరికి చూపించటానికి వీలు గానంత అసహ్యముగా ఉన్నందువలన ముఖము యెవరికీ కను పించకుండా మేలిముసుగు వేసుకున్నది. మందు వైద్యులవద్ద వున్న మందులన్నీ యీ 19 సంవత్సరాలు వాడినారు. వ్యాధి యేమాత్రము తిరుగుముఖము కాలేదు. అప్పుడు మన చికిత్స

ఆరంభం చేసినది. వెంటనే గుణం కనుపడింది. రోగం కూడా కుదిరినది. నేను కోరకుండానే నాకు యీ జాబు వ్రాసినది.

" ప్రియమైన కూనేగారికి.

మీ చికిత్సవలన నేను దుర్భరమయిన రోగముతో మేలుపొందితిని. అందుకు హృదయపూర్వక కృతజ్ఞతా నమస్కారములను తెలుపుకొనుట నావిధి అయియున్నది. ఇప్పుడు చాలా బలంగాను ఉల్లాసంగాను ఉన్నాను. నా నిత్యవిధుల కృత్యముల స్వయముగా నిర్వహించుకొనుచున్నాను. 19 ఏండ్లు నేను యెంతోమంది వైద్యులతో సంప్రదించినాను. వారెవరూ నావ్యాధిని, కొంచెమైనా తగ్గించ లేదు. ఇప్పుడు యీరోగం నయమైనందు వల్ల నేను అత్యంతానందమును పొందుచున్నాను. ఏ కారణంచేత యేరోగం వచ్చినా ఆరోగాల కన్నిటికీ మీచికిత్స చేసి లాభం పొందాలని రోగులను కోరుచున్నాను. ఉద్యమాభ్యుదయం కొరకు రోగుల మేలుకొరకు కూడా యీవిషయాన్ని ప్రచురించుటకు మిమ్ములను కోరుచున్నాను.

హృదయ పూర్వకమగు కృతజ్ఞతతో విధేయురాలు ఏ. యస్.

## ౮. లింగ వ్యాధులు

సిగ్గువదలివెయ్యాలి. రహస్యానికి చోటుండరాదు. ఈ తెరల వెనకాలనే కుంటితనము, గ్రుడ్డితనము ఉన్నవి. ఎంతో పాతకముగూడా ఈ తెరవెనకాలనే పుట్టి వృద్ధి పొందుతున్నది. శాస్త్రజ్ఞానం వృద్ధిపొంది ఈ తెరను చించివేస్తే యీ అజ్ఞానం

నశిస్తుంది. ఈ మాయ అంతరిస్తుంది. రహస్యరోగాల యొక్క నిజం తెలుసుకోవాలంటె మనం ఈ తెరను తొలగించుకోనక తప్పదు. దినదినము మానవజాతిని ధ్వంసముచేస్తున్న యీ అంటురోగాల నిజస్వభావమెరిగిన నేను నీతికొఱకుగాని, సిగ్గు కొఱకుగాని, సక్రమంగా వివరించకుండా వదలితే మానవజాతికి ద్రోహముచేసినవాడిని అవుతాను. అందువల్ల యేమీ దాపరికం లేకుండా బహిరంగంగా చెప్పదలిచాను. సుఖరోగాలను గురించి సంపూర్ణముగా ప్రజలకు తెలియకపోవుట వలనను వీనికి చేయవలసిన చికిత్స యేదో సరిగా తెలియక పోవుటచే విషఔషధాలతో చేసిన చికిత్సలవలనను ఈరోగాలు నానాటికి వృద్ధిపొంది మానవజాతిని పీడించుచున్నవి. అందువలననే ఎప్పటి కంటెకూడా యిప్పుడే సుఖరోగాలు పెరిగిపోయినవి. లక్షలాది జనులను పీడించుచున్న ఒక సవాయి రోగమువలన జరిగేకీడు చెప్పటానికి తరముకాదు.

ఒక్క ప్రకృతివైద్యము తప్పితే సవాయి రోగాన్ని నయము చేసే వైద్యవిధానమే లేదు. చర్మముమీదకు పొడుచుకువచ్చిన పొక్కులు, కురుపులు, పళ్ళికలుమొదలగునవి; మందువైద్యము వారు రుద్దిన పాదరసముచేత, తాత్కాలికముగా కానరాకుండా పోతవి. ఇంతకంటె వారు యేమిచేయలేరు. నయమైనట్లు కనుపడే ఈతాత్కాలిక ఉపశాంతి అయినా, యెంతోకాలము నిలువదు. దేహంలో కొంచెము ధాతుశక్తి వృద్ధికాగానే మరల పొక్కులు కనుపడుతవి. ఒక్కసారి సవాయిరోగము నయమైన తరువాత మందువైద్యుని సలహాతో పెళ్ళిచేసుకుని సంగమము

చేస్తే ఆసంగమములోనే భర్తనుంచి భార్యకు సవాయివ్యాధి అంటిన సందర్భములు ఉన్నవి. భర్తదేహంలో రహస్యముగా మందుల చేత దాచిపెట్టబడిన సవాయి రోగము భార్య పరిపూర్ణ ఆరోగ్యవంతురాలు కానికారణంచేత భార్యాభర్తలకు సంగమ క్రియలో అన్యోన్యంగా సంక్రమించే దేహరసాల వలన ఆమె దేహంలోకూడా సవాయిరోగం పుట్టుతున్నది. మందు వైద్యుడిచ్చిన పాదరసపు మందువలన తనకు వ్యాధి నయము కాలేదని దేహములో మందుచే అణచిపెట్టబడినదని అప్పుడు తెలుసుకుంటారు. అట్టివారికి కలిగిన దురదృష్టపు సంతానం అపరిపూర్ణాంగులుగాను అనారోగ్యవంతులుగాను ఉంటారు. అందువలన మందులతో లోపలనే అణచిపెట్టబడిన, సవాయి వ్యాధికంటె కొన్ని చిహ్నాలతో బైటికి కనుపించే సవాయి రోగమే మంచిది.

మందు వైద్యులుకూడా సవాయిరోగం లోపల కొంతకాలము ఉండి తరువాత బైటికి వస్తుంది అంటారు. సవాయిరోగం నయమైన తరువాతకూడా రోగం లోపలనిల్చి ఉంటుందని కూడా వారు చెప్పుచున్నారు. ఒకసారి సవాయిరోగం నయము చేసినతర్వాత తిరిగి సవాయిచిహ్నాలు కనుపడుతూ ఉండటం చేతనే వారు యింతమాత్రమైనా ఒప్పుకున్నారు.

ముఖనిదాన శాస్త్రమువలన ఒక్కసారి అయినా సవాయి లక్షణాలు కనుపడకమునుపే లోపలనున్న సవాయి లక్షణాలను కనిపెట్టగలము. ఆ విధంగానే సవాయిరోగం రావడానికి తగిన స్థితి దేహంలో ఉన్నదని చాలాకాలం ముందరే కనిపెట్ట

గలము. చికిత్సచేసి రోగనివారణ చేయగలము. అన్నిరోగాలకు కారణము ఒకటిగానే ఉంటుందని మనకు తెలుసుగనుక ఆ వచ్చిన వ్యాధి తెల్లబట్టో, పచ్చిసెగో, సవాయో, కొరుకుడో, వడిశెగడ్డలో, యేదైనప్పటికీ వాటివాని వివిధపేర్లతో గాని, కన్పడే లక్షణాలతోగాని, సంబంధములేదు. ఆ యా రోగులలో రోగపదార్థము వ్యాపించిన తీరునుబట్టి చేరిన చోటునుబట్టి లక్షణాలు వివిధరీతులుగా ఉంటవి.

జననేంద్రియాలు బహిష్కారి అవయవాలు కలిసే ఉన్నవి. అందువల్ల రోగపదార్థముకూడా ఆ ప్రదేశాలలోనే యెక్కువగా చేరుతుంది. పురుషుల విషయంలోకంటే, స్త్రీల విషయంలో ఈ మాలిన్యములు, జననేంద్రియాలలో చేరుకొంటవి. స్త్రీ పురుషులు సంగమము చేసినప్పుడు - జననేంద్రియాలలో చేరిన రోగపదార్థమునందు, మండమము కలిగి, స్త్రీ పురుషులకు అన్యోన్యంగా సంక్రమిస్తుంది. ఇట్లా సంక్రమించుటచేత, స్త్రీ దేహములోనికి పురుషుని వ్యాధియును, పురుషుని దేహము లోనికి స్త్రీలకుండే వ్యాధియు సంక్రమించును.

స్త్రీపురుషులకు కలిగే సంగమేచ్ఛనుగురించి స్పష్టముగా చెప్పే గ్రంథాలే లేవు. ఏట్టిది సహజసంగమేచ్ఛ? యెట్టి సంగమేచ్ఛ అసహజము? అని విడదీసి చెప్పే గ్రంథాలు లేవు. తాను జీవించి ఉండాలనే ఆశవంటిదే తనవంటివారిని పుట్టిద్దామని కోరికకూడా ఉంటుంది. అని ఆ యా గ్రంథాలలో వ్రాసి ఉన్నది. తనజీవితం తర్వాత జీవితమంత ప్రాధాన్యము కలిగిన

యీ సంగమేచ్ఛ అసహ్యంగాను, అవినీతికరంగాను యెందుకు ప్రజలు భావిస్తున్నారో నేను ఊహించలేకుండా ఉన్నాను.

దేహములో రోగపదార్థము చేరినప్పుడు యేవిధంగా ఆకలి, నిద్ర, చెడిపోతుందో, ఆవిధంగానే సంగమేచ్ఛ అస్వాభావిక మవుతుంది. సంగమేచ్ఛ సహజస్థితిలో ఉంటే దేహము ఆరోగ్యంగా ఉందని చెప్పవచ్చు.

దేహంలో రోగపదార్థము చేరితే సంగమేచ్ఛ అసహజంగా కలుగుతుంది. సహజమైన సంగమేచ్ఛలో మానవునికి యెట్టి ఉద్రేకము లేకుండా ఉంటుంది. ఆరోగ్యముచేత సహజమైన సంగమేచ్ఛ నిలచి ఉంటుంది. రోగ పదార్థము దేహములో ఉన్నవారికి మొదట కామోద్రేకము ఉండినీ కొంతకాలానికి పుంసత్వము తగ్గిపోతుంది.

దేహములో అదివరకే రోగపదార్థము లేనివానికి సవాయి రోగము ఉన్నవారితో సంగమము చేసినా సవాయివ్యాధి రాదు. సవాయిరోగమున్న ఒకరితో యిద్దరు సంగమము చేసిన నపుడు ఒకరికి రోగము రాకపోవుట-రెండవ వానికి రోగము వచ్చుట జరుగుచున్నది. ఒకస్త్రీతో సవాయిరోగము వచ్చిన పురుషుడు సంగమముచేసినాడు; ఆమెకు సవాయిరోగం అంట లేదు. కాని ఆమెతో సంగమము చేసిన యింకో పురుషునికి సవాయిరోగం అంటింది.

అప్పుడు కలిపిన బియ్యపుపిండిలో పులిసిన పిండిగాని, పుల్లచల్ల గాని కలిపితే, ఆ పిండి త్వరగా పులిసిపోతుందని అందరికీ

తెలుసు. ఆ విధముగానే దేహములో ఉండే మాలిన్యాలలో సవాయిరోగమంటి ఒకకొత్త మాలిన్యమువచ్చి చేరినప్పుడు అందులో మండముపుట్టుతుంది. దేహము ఆ మండాన్ని, ఆ రోగపదార్థాన్ని బైటికి వెలువరించేటందుకు గట్టిప్రియత్నం చేస్తుంది. ఆ చేసేప్రియత్నాలే సవాయి అనిన్ని, పచ్చసెగ అనిన్ని, కొరుకుడు అనిన్ని, వడిశగడ్డలు అనిన్ని, బట్టలంటు అని మనము పిలుస్తాము. తనభార్యతో చిరకాలము సంసారము చేసిన పురుషుడు, కాలము తప్పివచ్చి పరస్త్రీతో సంగమము చేసినప్పుడు, సవాయిరోగం అంటినది. ఈ సందర్భములో దంపతులు సంగమము చేసినప్పుడు వారి దేహాలలో ధాతువులు అన్యోన్యంగా అనుకూలంగా కలిసినవి. పరస్త్రీ సంగమంలో అట్లు కలియక, దేహంలోని రోగపదార్థమందు మండముకలిగి రోగం బైటికి కనుపడింది. ఏవిధంగా సుఖరోగాలు వస్తావో, ఒకరినుండి ఒకరికి రోగాలు యెట్లాసంక్రమించునో, చూపుట కొరకే పై సంగతులు చెప్పితిని. నేను అక్రిమమైన వ్యభిచారాన్ని ప్రోత్సహించే వాడనుకాను. అందువలన ఎన్నో అపాయాలు ఉన్నవి. సుఖరోగంఅంటే యేమిటో, దాని స్వభావము యేమిటో, యెందుకు కలుగుతివో, యెలానయంచేయవచ్చో, మొదలగు విషయాలు స్పష్టంగా తెలుపవలసియుండుటచే, ప్రసంగవశమున కొందరు వ్యభిచారుల వృత్తాంతములుకూడా తెలుపవలసి వచ్చినది.

# ౫. సుఖరోగములు.

దేహానికి భారంగా ఉండే రోగపదార్థాన్ని వెలువరించేటందుకు దేహముచేయు ప్రయత్నాలలో, సుఖరోగాలు ఒకటి. ఒక రోగము వచ్చినప్పుడు, ఆయా లక్షణములకు, మూలకారణంగా ఉండే రోగపదార్థాన్ని, మనము వెలువరింప వీలిచ్చినప్పుడు, రోగలక్షణాలు తమంతనే అంతరించిపోవును. ఈ రోగాలను, మందువైద్యులుచేసే చికిత్సా విధానములో చాలా పొరపాటు ఉన్నది. పాదరసము, అయోడిన్, పొటాషియం అయొడైడ్, సాల్వర్సన్, అండ్ న్యూ సాల్వర్సన్, సల్ఫా సిలమైడ్, పెన్సిలిన్, మొదలగు విషపుమందులను నోటివెంటను, సూది గుండాను దేహములోనికి ఎక్కించినప్పుడు, రోగం తాత్కాలికముగా కనబడకుండా పోతుంది.

మందు వైద్యుడు రోగాన్ని తాను నయము చేశాననుకుంటాడు. ఈమందులే వాడకుండా ఉంటే దేహంలోఉండే ధాతుశక్తి ఆ రోగాలను నయముచేసేది. ఎప్పుడయితే విషపు మందులను వాడినారో రోగాన్ని బైటికి గెంటివేయుచున్న ధాతుశక్తి అణగారి పోతుంది. దేహములోనుండి బైటికివస్తూవస్తూ ఉన్న మురికిని గెంటేశక్తి అణగారిపోవుటవలన దేహంలోనే మురికి ఉండిపోతుంది. దేహంలోఉన్న ధాతుశక్తి దేహంలోనికి ఎక్కించిన విషము దేహాన్ని నశింపచేయకుండా కాపాడుకునేందుకు ప్రయత్నం చేస్తుంది. ఒకరోగము వచ్చినపుడు కలిగే అపకారముకంటే ఆరోగాన్ని కుదర్చటానికి మందు వైద్యులు వాడిన విషౌషధములవలన మరింత అపకారం జరుగుతుంది. రోగముయొక్క లక్షణాలు తాత్కాలికంగా కనబడకుండా

పోయి బాధలుకూడా తాత్కాలికముగా ఉపశమిస్తవి. ఈ మాయ వైద్యముచేత రోగపదార్థము దేహములోని లోపలి అవయవాలను పీడించి కాలికమైపోతుంది. అంతర్గతమునన్నా, అవుతుంది. మొదటిదశ లక్షణాలు కనుపడకపోవటంవలన, రోగం నయమైనదని ఒక భ్రాంతి కలుగుతుంది. ఇది మాయ వైద్యమని రోగం నయముకాలేదని నేను సకారణంగా రుజువు చేస్తాను.

సుఖరోగాలకు మందువైద్యము చేసినపుడల్లా యే విధంగాను ఆరోగ్యము వృద్ధికాలేదు, సరిగదా స్థితి మరింత పాడయినది. మనవైద్యముతో దేహమునందలి ధాతుశక్తిని వృద్ధిచేసినపుడు ఇదివరకు మందులతో అణిచిపెట్టిన రోగలక్షణాలన్నీ ఒకటొకటే బైటికివచ్చి తగ్గిపోతుంటవి. మనవైద్యములో ఇట్టి విషయములు అనేకతూరులు తటస్థించినవి. మనముచేయించే తొట్టివైద్యమువలన రోగాల్లో ఉండే తీవ్రలక్షణాలు అదుపులోనికివచ్చి రోగం సౌమ్యమార్గాన నయమవుచున్నది. అందువలన యెంతబీభత్సంగా, కనపడినా ఆరోగ్యాన్ని కలిగించే ఈ రోగలక్షణాలు నిరపాయకరమైనవని తెలిసికొని ధైర్యముగా ఉండవలసినది. రోగాలకు వాడినమందులు రోగపదార్థముకూడా వెడలిపోయేముందు ఆరోగ్యాన్ని కలిగించే యీ బాధలు రాకుండా మానవు.

సుఖరోగాలు చివరకు సవాయిరోగంకూడా యెట్టివైనప్పటికీ మనవైద్యంలో లోబడిపోతుంది. ఇతరవైద్యులెవరూ నయము చేయలేని ఈ రోగాలు అన్ని ఇతరరోగాలను కుదిర్చినటులే,

మనవైద్యములో సులభంగా నయమవుతవి. ఈ వైద్యము చేసిన దంపతులు సవాయివ్యాధి నయముచేసుకున్న తరువాత వారికి కలిగిన సంతానానికి ఈరోగబీజాలు అంటుకోవు. ఈ సంగతులు నేను చెప్పేటప్పుడు ఏమీ అతిశయోక్తులు చెప్పడం లేదు. అయితే సవాయిరోగం అన్నిదశలలోను నయంచేయగలనని కూడా బడాయిచెప్పడం లేదు. ఎవరి జీర్ణక్రియ, మనవైద్యమువల్ల అభివృద్ధిపొందటానికి వీలున్నదో, వారికందరికీ సవాయివ్యాధి తప్పకుండా కుదురుతుందీ అని మాత్రం చెప్పగలను. రోగిదేహములోఉన్న రోగపదార్థము యొక్క పరిమితినిబట్టి ఆ రోగపదార్థము దేహములోచేరిన స్థలమునుబట్టి దేహములో శేషించిన ధాతుశక్తినిబట్టి చికిత్సా కాలము కొంచెము యెక్కువైనప్పటికీ నయముచేయడానికీ వీలున్నది

సుఖరోగము కనబడినపుడల్లా దేహములో బరువైన రోగ పదార్థమున్నదనీ, అదికూడా చిరకాలము కాలికముగా అంత ర్గతముగా ఉన్నదని అర్థము. వెంటనే తొట్టివైద్యముచేసి రోగము నయము చేసుకోక పోయినట్లయితే ఉబ్బసము, శ్వాసాశయ వ్యాధులు, క్షయ, కర్కటవ్రణము, నంజు, గుండెజబ్బు, అను వాతము, మొదలగు దుర్భరవ్యాధులకు మూలమవుతుంది. ఒక వేళ ఈవ్యాధులు అన్నిగాని కొన్నిగాని రోగికికనపడక పోయినా వారికి కలిగే సంతానములోనైనా ఈ రోగబీజాలు ఉంటవి. తన బిడ్డలకు శ్వాసాశయ వ్యాధులు – క్షయ – గండ మాల – రెక్కేట్లు మొదలగు వ్యాధులు కలిగినపుడు, రోగము

యొక్క నిజస్వభావము తెలియని, తల్లితండ్రులు, తమ బిడ్డలకు రోగాలు ఎక్కడనుండి దాపురించినవాలని, తెలుసుకోలేక తికమక పడుచున్నారు. భర్తయందో, భార్యయందో ఉన్న సుఖ రోగాలే తమబిడ్డలకీ రోగాలు రావడానికి, మూలకారణము లైన వని తెలియదు. తల్లితండ్రులు, ఆస్థితోపాటు, వారి దేహములో, ఉండే రోగబీజాలు కూడా, తప్పకుండా బిడ్డలకు సంక్రమిస్తవి. ఒకబిడ్డ దుర్బలముగను, రోగిష్టిగాను పుట్టినపుడల్లా, తల్లిదండ్రుల ఆరోగ్యము యెట్లాఉన్నదీ, మనము గుర్తించవచ్చు. ముఖ నిదానశాస్త్రము, మన కాశక్తి నిచ్చుచున్నది.

స్త్రీపురుషులకు సర్వసామాన్యంగా వచ్చే శ్వేతకుసుమము, పచ్చసెగ, శుక్లనష్టము. మొదలైన వ్యాధులకు కూడా. రోగపదార్థమే మూలకారణంగా ఉంటుంది, అనే విష యము తేటగా రుజువగుచున్నది. జననేంద్రియాలలో వేడి హెచ్చుటయు, అందుండి మురికి వెడలిపోవు చుండు టయు, కనపడుచున్నది. ఈ రోగనివారణకొరకై వెలువ రించే ప్రయత్నమునందు మండమును, వేడిమియు ఉన్నవి. లోపల అవయవాలు చెడిపోకుండా వెలువడిపోతూఉండే, రోగపదార్థాన్ని నిరపాయంగా వెలువరించటానికి మనము సహాయం చేయగలము. అప్పుడు సుఖముగా రోగనివారణ మవుతుంది. అప్పుడు యెంతచీము వెళ్లిపోతే, అంత రోగ పదార్థ భారము యెక్కువగా తగ్గిపోతుంది. ఆరోగ్యము అంత బాగా వస్తుంది. మనము చేయవలసినదల్లా చీము వెళ్లిపోయే టపుడు బాధలు కలుగకుండా చూచుకోవాలి. వెళ్లిపోతుండే

రోగపదార్థానికి మనము ప్రతిఘటన కారణమైనా కలిగించరాదు. క్రమంగా దేహాన్ని శుభ్రపరచే స్నానపద్ధతులు, కాలము, సహనము, నీటితో ప్రయోగాలన్నీ కూడా కావలసినంత తెలిసినా నయమగును. దేహంలో ఉండే రోగపదార్థము ఎక్కువైతే చికిత్సాకాలము ఎక్కువగుతుంది. తక్కువైతే చికిత్సాకాలం తగ్గుతుంది.

జననేంద్రియాలల్లో నుండి బైటికివచ్చే చీమును అరికట్టుటకు మందువైద్యులు స్త్రీపురుషుల మూత్రావయవాలలోనికి సీసము, పాదరసము, తుత్తునాగము, అయొడోఫారం మొదలగు విషపు మందులను ఎక్కించి వచ్చేచీముకిని బైటికిరాకుండా బలవంత ముగా ఆపుచున్నారు. ఆ యా మందుల స్వభావం మనకు తెలిసినట్లయితే, వారుఅవలంబించే వైద్యవిధానం ఎంతఅక్రమ మైనదో మనకు సులభంగానే బోధపడుతుంది. బైటికివస్తూ ఉన్న చీము మందులతో బలవంతాన ఆపివేసినప్పుడు ఆచీము ఎక్కడకు పోతుందో, అసి ఎవరూ ఎందుకు ప్రశ్నించరో? ఆశ్చర్యముగా ఉన్నది. అట్లా శరీరములోనే అణచిపెట్టిన చీము అక్కడనుండి బయలుదేరి గుండెలలోనూ, ఊపిరితిత్తుల లోనూ చేరి, క్షయ, ఉబ్బసము, శ్వాసాశయవ్యాధులను కలిగి స్తుంది. ప్రకృతిచేసే ప్రతిపనికీ ఒకదిట్టమయిన కారణముంటుంది. అందుకు అనుగుణ్యంగా మనము ప్రవర్తించినపుడు మేలు కలుగుతుంది. సంగతి తెలియక మనము అందుకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే అపకారం జరుగుతుంది. అందువలన అట్టి వ్యాధు లలో ప్రకృతివిరుద్ధంగా మందులనువాడరాదు, మందువైద్యులు

చేస్తాడుండే యీ పొరబాటుచేత నెక్కడపడితే అక్కడ పిచ్చి ఆసుపత్రులు, ఔషధాలయాలు మొదలగునవి కుక్కగొడుగుల మాదిరిగా వృద్ధి అవుచున్నవి. మందులు **ప్రజలకు నిజంగా మేలుచేస్తున్నట్లయితే యీ వైద్యాలయాల సంఖ్య క్రమంగా వృద్ధిపొందక తగ్గిపోయ్యేది.** ఈ సందర్భములో నాఅనుభవములో ఉన్న ఇద్దరు రోగులవృత్తాంతము వ్రాస్తాను. కొన్ని సంవత్సరాల క్రిందట 50 ఏండ్ల వయస్సుగల పెద్దమనిషి గుండెజబ్బుకు నాతో సంప్రదించాడు. నా సలహాతీసికొని 15 దినాలు చికిత్సచేసిన తరువాత అతనికి మూత్రపిండవ్యాధివచ్చి నయమైనది. ఇంకొక 15 రోజులు చికిత్స చేసినాడు. 18 సంవత్సరాలకు పూర్వము అతనిని బాధించిన పచ్చసెగ అప్పుడు కనుపడి అదియును నయమైనది. రెండు రకములగు రోగాలు అదివరకు వచ్చిన దానికన్నా చికిత్సాకాలములో చాలా సౌమ్యంగా కనిపించినవి. పచ్చసెగకూడా వారంరోజులు బాధించి, అంతరించిన తర్వాత అతని ఆరోగ్యం క్రమంగా బాగుపడి గుండెజబ్బు కూడా మానినది. చికిత్సాకాలములో అతడు నాకు చెప్పిన దానినిబట్టి తెలిసిన సంగతు లేమనగా:—

అతనికి 18 సంవత్సరములకు పూర్వము పచ్చసెగ వచ్చినది. సుప్రసిద్ధులైన వైద్యులతో సంప్రదించి వారిచ్చిన మందులు పుచ్చుకొన్నాడు. పచ్చసెగ కనుపించకుండా పోయినది. తర్వాత కొన్నియేండ్లకు పచ్చసెగయే మరల కనపడితే, తిరిగి

మందులతో మాన్పుకొనినాడు. అతనికే రెండు సంవత్సరాల తరువాత మూత్రపిండవ్యాధివచ్చి చాలా బాధపెట్టినది.

ఎనిమిదిమంది సుప్రసిద్ధ వైద్యులతో సంప్రదించి వారిచ్చిన మందులు తిని, ఆరోగబాధను మాన్పుకున్నాడు. కొన్నికాలానికే గుండెకు జబ్బు వచ్చినది. ఎన్నిమందు లిచ్చినా తగ్గలేదు. నంజు రావడానికి సిద్ధంగాఉంది. మొదట పచ్చసెగ మందులతో నయముకా లేదని, దానికి సంబంధించిన మాలిన్యములు దేహములోనే యుండి, మూత్ర పిండవ్యాధికి కారణమైనవని, రోగాన్ని మందులతో లోపలికిపంపితే, గుండెజబ్బు వచ్చినదనీ గుండెజబ్బుకు, యిప్పటికైనా, తొట్టివైద్యముచేసి ఉండక పోతే తప్పకుండా నంజువ్యాధి వచ్చేదని బోధించాను. పచ్చసెగ, మూత్రపిండవ్యాధులు మానడం, దానితో గుండెజబ్బు కూడా నయము కావడంవలన నేను చెప్పిన మాటలయందునూ, ఆయారోగాలకు అన్యోన్యంగా ఉండే సంబంధములందును, ఆతనికి విశ్వాసం గలిగింది.

నేను నయముచేసిన సవాయిరోగము ఒకదానిని గురించి యిచట వ్రాస్తాను.

రోగిపేరు బేరన్ వి. ఇ. వయస్సు 47 సంవత్సరములు. పది యేండ్లనుండి సవాయిరోగంతో బాధపడి, నన్ను సంప్రదించెను. అతనికి నాల్గుసారులు సవాయిరోగంవచ్చింది. నాల్గుసార్లున్నూ సుప్రసిద్ధులైన మందువైద్యులు వానికి చర్మముమీద పాదరసపు లేపనముపూసి లోపలికి పొటాషియం అయోడైడ్‌ను

యిచ్చినారు. ఇంతచేసినా ప్రతినారికోగం నయమైనట్లే, నయమై మళ్ళీవచ్చింది. చిట్టచివరకు కాలిమీదను, నోటిలోను పుండ్లు పుట్టినవి. అతని దేహముయొక్క సామాన్య ఆరోగ్య స్థితికూడా చెడిపోయినది. దానితో అతనికి మందువైద్యుల మీద ఉండే విశ్వాసము పోయినది. తుట్టతుదకు తలవేదో బరువెత్తినట్లుండి జ్ఞాపకశక్తి తగ్గిపోయినది. అతనికి దినానికి 2, 3 ఉపశమన స్నానములును, సామాన్యమైన స్వాభావికపథ్యము ఇచ్చేతిని. మంచిగుణము కనుపడినది. 6 మాసాలు చికిత్స చేసేసరికి అతనిజీర్ణశక్తి బాగా వృద్ధిపొందినది. రోగి అంతా మారిపోయినాడు. ఆరోగ్యము వృద్ధిపొందినది. ముఖములో ఉండే ముదిమి పోయినది. రోగకారణము ఎప్పుడు పోయినదో సవాయిరోగం లక్షణాలన్నీ పోయినవి. ఇక ఆరోగం తిరిగిరాదు. ఇంకాకొన్ని రోగనివారణ వృత్తాంతాలు 4 వ భాగములో చూడవచ్చును.

## నపుంసకత్వము

ఈ తరము వారికి తరుచుగా కనబడుతూఉండే, నపుంసకత్వము వలన జాతి నానాటికి దిగనాసిల్లుచున్నదని తెలియుచున్నది. ఈ వ్యాధికి , మందువైద్యులకు, ఇంతవరకూ, చికిత్స ఏమీ దొరకలేదు. రోగస్వభావము వారికి తిన్నగా తెలియనందు వలన, వారీరోగాన్ని నయము చేయలేకుండా ఉన్నారు. దేహములో, రోగపదార్థము నిండుగా, చేరుకుంటేనేగాని ఏరోగం రాదని, మందువైద్యులు ఎరుగరు. దేహానికి భారమై యుండే

రోగపదార్థము వెలువరించి నంతనే, నపుంసకత్వము నయమవు తుంది. ఇంతవరకు తొట్టివైద్యములో నేను గడించిన అను భవమువలన నపుంసకత్వము కూడా అతిసులభంగా నయము చేయవచ్చు అని తెలినది. అసంఖ్యాకములగు నపుంసక రోగ ములు నేను కుదిర్చితిని. జాగ్రత్తగా మనవైద్యాన్ని అవలం బించి, ఓర్పుతో చిరకాలం చికిత్సచేస్తే నపుంసక రోగులు కూడా ఆరోగ్యమును పొందగలరు. రోగకారణము పోయినం తనే జననేంద్రియాలల్లో ఉండే అన్నిరోగాలు నయమైపోవును. నశించిపోయిన పుంస్త్వము తిరిగి సహజస్థితికి వచ్చి రోగం నయ మగును. దానితో వారు సంసార సౌఖ్యమును తిరిగి అనుభ వింపగలరు. ముష్టిమైథునమును గురించి చెప్పెదను. ఎన్ని నీతులు బోధించినా అనేకమంది ఈ దురభ్యాసాన్ని చేస్తూనే ఉంటారు. మనవైద్యమును అవలంబించి రోగపదార్థము తీస్తిన తరువాత జననేంద్రియాలలో ఉన్న అసహజమైన మంటము గుల తగ్గిపోతుంది. దానితో ముష్టి మైథునమును కలిగించు అసహజ పీడనము తగ్గును. తొట్టివైద్యముచేసి తమకున్న వినా శనకరమైన ఈ దురభ్యాసాన్ని పోగొట్టుకొన్న నీతిమంతులైన యువకులు యెన్నోతూరులు నాకు తమకృతజ్ఞతను తెలిపి ఉన్నారు.

పురుషులలో వచ్చే నపుంసకత్వము వంటిదే స్త్రీలలో వచ్చే వంధ్యాత్వమూను. స్త్రీలవ్యాధులను గురించి వ్రాసినచోట దీనిని ఇంకా వివరంగా వ్రాశాను. స్త్రీ పురుషులలో ఉండే సంగమేచ్ఛలో తేడాలున్నవి. పురుషులలో ఉండే నపుంస

సత్ప్రభావము యింకోవిధంగా ఉండవచ్చును. అది కొన్ని సంవత్సరాలు ముందుగానే గుర్తుపట్టి చెప్పవచ్చు. కాలికమగు రోగ పదార్థ భక్షణములవలన చిన్నవయస్సులోనే నాడులయందు ఉద్రేకము కలిగిస్తూ, తోడుగా కామోద్రేకమును ఉంచును. దానివలననే చాలామంది యువకులు ముష్టిమైథున దురభ్యాసానికి లోబడుచున్నారు. పెద్దవారయ్యేటప్పటికి కామోద్రేకము సహజపరిమితిని దాటిపోతుంది. మనస్సుకూడా అసహజమైన కామవాంఛలకు లోబడుతుంది. దానితో స్త్రీలను చూస్తే సిగ్గు, భయము వేస్తుంది. దానితో ముష్టిమైథునమును చేయగా నపుంసకత్వము వస్తుంది. అన్ని వసతులు గల యువకులు ఎంతోమంది వివాహం చేసుకోవడం మానివేస్తున్నారంటే దానికి నపుంసకత్వమే కారణము. ఎంతోమంది ముష్టిమైథునానికి అలవాటై యుక్తవయస్సు లోనే పుంస్త్వాన్ని కోల్పోయి కామసుఖానికి పనికిరాకుండా పోతున్నారు. నపుంసకత్వము వల్లనే ఎంత మందియో ఆత్మహత్యాప్రయత్నం చేస్తూ ఉన్నారు. ఆత్మ హత్యలు కూడా జరుగుచున్నవి. ఈ సందర్భములో ఒక ఆనంద దాయకమైన వృత్తాంతము చెప్పెదను. ఒక ఐశ్వర్య వంతుని కుమారుడు. అతనివయస్సు 23 సంవత్సరాలు. 12 వ ఏటనే ముష్టిమైథునము మొదలిడినాడు. ఆ దురభ్యాసము పోయేటందుకై నాతో సంప్రదించినాడు. రాత్రింబవళ్లు అతనికి అదే ధ్యాస. ఏవిషయము నేర్చుకునేటందుకు అప్పటికే అతనికి సామర్థ్యములేదు. ఎంతప్రయత్నముచేసినా ముష్టిమైథునము ఆపుకోలేకపోయినాడు. చేతగాక ఆ దురలవాటుకు దాసుడయి

నాడు. స్వయముగా దానిని ఆపుకోలేక సరిఅయిన చికిత్స కోసమై ఎదురు చూచుచున్నాడు. గట్టిగ ప్రయత్నంచేసి కొన్ని నెలలు ఆపుకునేవాడు. తిరిగి ఆ కోరిక బలానికి లోబడి తిరిగి అవలంబించేవాడు. మనస్సులో అసంతుష్టి తనంత నిర్భాగ్యుడు ప్రపంచములో ఎవరూ ఉండరనుకున్నాడు. ఆత్మహత్య చేసుకొందా మనుకొన్నాడు. ఇదే సమయంలో అతనికి తల్లి తండ్రులు పెండ్లి చేస్తామన్నారు. నపుంసకత్వము ప్రాప్తియై నందువల్ల అతనికి పెండ్లి అంటే మితిమీరిన అసహ్యము ఏర్పడి నది. చిట్టచివరి చికిత్సగా నా వైద్యము చేద్దామనియు దాని వల్ల పుంస్త్వము రాకపోతే పెండ్లి మానేద్దామని నిశ్చయం చేసుకున్నాడు. నన్ను సంప్రదించినప్పుడు నేను పరీక్ష చేసితిని. కాలక్రమముగ అజీర్ణమువలన అతనికి ఈ వ్యాధి గలిగినదని సుఖనిదాన శాస్త్రమువలన నేను తెలిసికొన్నాను. మొదట అతనికి జీర్ణశక్తిని వృద్ధిచేయాలి. చిన్నవయస్సులో ఉన్నందు వలన మన చికిత్సకు అతని దేహము బాగా అనుకూలంగా ఉన్నది. చికిత్సకూడా బాగా ఉపయోగిస్తుంది. అని అతనితో చెప్పితిని. విషయములు సాంతముగా మనస్సునకు పట్టించు కుని పట్టుదలగా మన వైద్యము చేసినాడు. కొలది మాసాల లోనే అతనిస్థితి చాలా బాగుపడింది. ఇతని విషయంలోకూడా మన సిద్ధాంతం సత్యమైనదని ఋజువైనది. ఉద్రేకమును కలి గింపని పథ్యము, ఉపశమన స్నానములు, అతని రోగాన్ని మూలచ్ఛేదన చేసినవి. అన్నిరోగాలు నయమైనట్లే అతనికుండే ముష్టిమైథునము, నపుంసకత్వముకూడా పదమూడు మాసాలలో కుదిరినవి.

# ౬. మూత్రకోశ వ్యాధులు

## పైత్యపు దద్దురులు

వేరు వేరు లక్షణాలు స్వభావముగలిగిన వివిధములగు వ్యాధులను ఒకచోట గుదిగూర్చి వ్రాయుట సామాన్యులకు అర్థము కాదు. మందువైద్యులకుకూడా పైనవ్రాసినవన్నీ వేరు వేరు రోగాలుగానే కనపడతవి. వేరు వేరుగా చికిత్సలు చేయవలసి వస్తాయని చెప్పెదరు. ముఖనిదానశాస్త్రమనే ప్రతిభావంతమైన అస్త్రంతో చూచినప్పుడు మాత్రము పై రోగములన్నియు అన్యోన్యంగా సంబంధించి యున్నవనియు, దానికన్నింటికికూడా కారణము ఒకటేనని తెలుస్తుంది. తిరిగి అన్నిరోగాలకు మూల కారణము ఒక్క రోగపదార్థమేనని, మూత్రపిండములు, మలకోశము, చర్మము క్రమముగా పనిచేయనందువలన దేహములో రోగపదార్థము చేరినదని మనకు తెలియును. జీర్ణక్రియ యందు పుట్టే దుర్వాయువులవలననే ఈ వ్యాధులు వస్తున్నవనికూడా మనకు తెలియును.

ఉదరములో పుట్టిన వాయువులు ప్రేగులయందలి మలాన్ని బైటికి తీసుకుని వెళ్లేందుకు సహాయపడతవి. ప్రేగులయొక్క దిగువభాగం చోటు యివ్వకపోతే ఆ వాయువులు ప్రేగులయొక్క ఆవరణపు గోడలను తప్పించుకుని, ప్రక్కన ప్రవహించే రక్తపు వాహికలలోచేరి దేహమంతటా వ్యాపిస్తవి. దీనికి ఒక ఉదాహరణ యిస్తాను. దేహములోఉండే రక్తవాహికలవలెనే భూమిమీద ఉన్న సముద్రములు నదులు కాలువలు

చెరువులు యేర్పడిఉన్నవి. మన దేహంలోని రక్తమువలెనే
భూమిమీద ఉండే నదులు వగైరాద్వారా జలము ప్రవహిస్తూ
ఉంటుంది. జలానికి తోడుగా ఆకాశమును గాలిని పంపి కొంత
జలము వాయురూపములోనే ఉంటుంది. మనము తినిన
ఆహారపదార్థములుకూడా రస రక్తములుగా మారి, దేహము
నందలి రక్తవాహికలలోను, రసవాహికలలోను ప్రవహిస్తూ
ఉంటవి. దీనికితోడుగా కొంత ఆహారపదార్థము వాయురూప
ములో తిరుగుతూ ఉంటుంది. సారాయి, బ్రాంది, బీరు వైనా,
తాగిన వెంటనే వానియొక్క ఉద్రేకము, ఉల్లాసము దేహ
మంతటా తెలుస్తుంది. తలలో ప్రధానంగా తెలుస్తుంది.
వాయురూపాన్ని పొందిన మలము కొంతచర్మము ద్వారా
చెమటగాను చర్మము తిన్నగా పనిచేయునప్పుడు శ్వాసద్వా
రాను బైటికి పోతూఉంటుంది. దేహములోనుంచి వచ్చిన
చెమట, వేరువేరు వ్యక్తులలో వేరువేరువాసనలతో కూడివుం
టుంది. కాలికమైన రోగపదార్థముతో కూడుకొని వచ్చిన
చెమట భరించడానికి వీలుగాకుండా ఉంటుంది. ఆరోగ్యమైన
వానినుండి వచ్చినచెమట వాసనే యుండదు. దేహములోపల
వాయురూపమైన మలాలు మూత్రనాళాలలోనుంచి, మూత్రకో
శంలోనికి చేరుతవి. అందువలన చెమట, మూత్రము సమాన
ధర్మములుగ ఉండును. మూత్రకోశము నిండుటతోనే మూత్రిం
చవలెననే కోరిక పుడుతుంది. కోరికగలిగినంతనే మూత్రమును
వేసినయెడల దేహమునకు యెట్టి కీడున్నూ కలుగదు.
ఇది చాలా ప్రధానమైన విషయము. అయినప్పటికిని,
నేటి నాగరికులు మూత్ర మలములను వెంటనే వదలి

పెట్టక, చిరకాలము నిలువ ఉంచుతున్నారు. దీనివల్ల కలిగే కీడు ఏమంటే అనేక అపాయాలు, వివిధ రోగాలు, అనేక దుష్ఫలితాలు వచ్చుచున్నవి. అందువల్ల తల్లిదండ్రులు ఉపాధ్యాయులు, చిన్నపిల్లలకు మలమూత్ర నిరోధము చేసుకొనుటవల్ల కలిగే అమిత కీడును గూర్చి బోధించి వారిని చిన్నతనంనుంచే మంచి మార్గంలో పెట్టవలసిన మలమూత్రములను వదలివేయాలని కోరిక తోచినంతనే వానిని వదలివేయనిచో వానిలో ఉండే జలభాగం యిగిరిపోతుంది. మలకోశ, మూత్రకోశములలో అసహజముగా వేడి పుట్టుతుంది. మలము గట్టిపడిపోతుంది. మూత్రకోశము వేడియెక్కి మూత్రము కొంత భాగం ఆవిరిగా యిగిరిపోతుంది, అందులో ఉండే లవణాలు వెనకాతే మిగులుతవి. తరువాత మూత్రపిండాలలోనుంచి మూత్రకోశములోనికి రావలసిన మూత్రానికి ఆటంకము కలుగుతుంది. సకాలంలో వెలువరించకుండా నిలువ వుంచిన మలమూత్రాదులు తరువాత మన యిష్టంవచ్చినపుడు బయటికి రమ్మంటే రావు. మల మూత్రాలలో కొంతభాగం వాయురూపాన్ని పొంది రక్తములో చేరిపోతుంది. అది దేహమంతటా గూడా వ్యాపిస్తుంది. ఈవిధంగా మూత్రము వాయురూపాన్ని పొందేటప్పటికి అందులోఉండే లవణాలు పచ్చని రేణువులుగానై మిగిలిన మూత్రమువెంట బయటికి పోవచ్చు. ఒకప్పుడు పోకపోవచ్చు, పోని రేణువులు ఒకదానితో ఒకటి కలిసికొని ఎర్రబడుతవి. ఈ రేణువులు సన్నగాఉంటే సికతా (ఇసుక) మేహమని, లావుగానుంటే శిలా (రాయి) మేహమనియు పిలుతుము. వీనికి చికిత్స ముందు వ్రాస్తాను. దేహములో రోగ

పదార్థము యెక్కువగా నుండి అస్వాభావిక పథ్యముతో జీవించేవారికి మాత్రమే శిలాసమూహము వస్తుంది. ఫ్యాక్టరీల తాలూకు బాయిలర్లలో, మంచినీళ్ళు కాక ఉప్పునీళ్ళు పోసినప్పుడు కొంతకాలానికి అడుగున పట్టు చేసుకొంటుంది. ఆ విధంగానే మూత్రపిండములలో ఉండే మూత్రం వాయు రూపాన్ని పొంది అందులో ఉండే మూత్రలవణాలన్నీ కలిసి పోతే సికతామేహం వస్తుంది. అట్లు చేసుకున్న రేణువులు సన్నగా నున్నంతవరకూ మూత్రపిండములనుండి మూత్ర నాళాలగుండా మూత్రం వెంట మూత్రకోశంలోనికి చేరుకొని వెడలిపోవును. కొన్నంత పెద్దవైనతోడనే అవి మూత్రనాళ ములగుండా పోవునప్పుడు వానియొక్క ఆవరణపు గోడలకు నరపిడి కలిగిస్తూ, బాధతోగూడి మూత్రకృచ్ఛ్రవ్యాధిగా నగుచున్నది. మూత్రకోశములో గూడా యిదేక్రియ జరుగుతుంది. ఇదివరకే జీర్ణాశయవాలలో జిన్నకోశములో మాలిన్యములు చేరియుండి మూత్రక యిరుకై ఉంటే మూత్రకోశములోనుండే శిలలు మూత్రమువెంట బయటికి వెడలక మూత్రకోశములోనే ఉండి క్రమ క్రమంగా పెద్దవి అగుతవి. అందు తిరుచుగా తిరుగుచుండటంచేత గుండ్రని ఆకారం వస్తుంది. మూత్రము ఆపినప్పుడెల్లా యీ వ్యాధులు ఏర్పడుతవని అనుకొనరాదు. ఒక్కొక్కప్పుడు ఈ మూత్రము ఇతర ప్రదేశాలకు పోయి అచట గ్రంధులుగాను, కాయలుగాను, శిలలుగాను కణుతులుగాను యేర్పడవచ్చు, క్షయవ్యాధినిగూర్చి వ్రాసినపుడు వీనినిగురించి ప్రస్తావించియున్నాను. కొన్ని సంవత్సరాలకు పూర్వము ఒక పిల్లవానికి చికిత్స చేసినాను. అతని

దేహమంతా కూడా బటానీగింజ పరిమాణంలో సన్నని కాయలు ఉన్నవి. ఒకసారి జలుబుచేసి కొన్నిరోజులు వరుసగా అతనికి మూత్రము కాలేదు. అప్పుడు ఈ కాయలు ఏర్పడినవని వారు చెప్పిరి. ఈ కాయలు యేర్పడటానికి ఈ మూత్రమే కారణమైతే నేను సులభంగానే నయముచేస్తానని చెప్పితిని ఆ కాయలు మూత్రముగా వెడలిపోతుంది. ఇదివరకు వచ్చినవి మూత్రంగా మార్చి వెలువరించితేనే రోగము నయమగుతుంది. అతను మన వైద్యం అవలంబించినాడు. కొలది దినములలోనే మూత్రము అతనికి ఎక్కువగా రానారంభించినది. చాలారోజులు అట్లే జరిగినది. అకస్మాత్తుగా ఆ కాయలన్నీ అంతరించిపోయినవి. వారెట్లో సంతోషించినది. ఆ పిల్లవాని దేహములో ధాతుశక్తి యెక్కువగా ఉండుటవలన అంత తొందరగా కాయలు కరగి వెడలిపోయినవి.

ఏ విధంగా మలబద్ధము, అతిసారము రెండూ కూడా విరుద్ధ లక్షణాలుగా కనపడినా ఒకే కారణముచేత వస్తున్నవో అలాగే మూత్రము యెక్కువ కావడం, కాకపోవడం రెండూ కూడా దేహములోని రోగపదార్థము వలననే వస్తున్నవి. మూత్రము కాక నిలిచి ఉన్నపుడు చర్మము పచ్చగాను, ఎర్రగను ఉండుట, పైత్యదద్దురులు ఉండుట, తలనొప్పి, కంతులు, శిలామేహము, చర్మముమీద పొడలు మొదలైన వ్యాధులు కనుపడుచున్నవి. రాబోయ్యే ఒక పెద్దవ్యాధికి ఇవి పూర్వ రూపాలు మాత్రమే.

## మ ధు మే హ ము

ఈ వ్యాధిలో దేహములోపల అమితమైన వేడి ఉంటుంది. అందువల్ల అమితమగు దాహ మవుతుంది. మలబద్ధకము ఉంటుంది. శిలామేహము, కంతులూ లేకుండా దేహములోని మాలిన్యములు యెప్పటికప్పుడు వెళ్ళిపోతుంటవి. మూత్రము లోపలనే మరిగి వస్తుంది. కనుక తెల్లబడుతుంది. శిలా మేహము, మధుమేహము రెండూ కూడా లక్షణాల్లో తేడాగా గాని ఒకటే కారణముమీద వస్తూ ఉంటవి. రెండు వ్యాధుల లోనూ లోపల వేడి ఉంటుంది. తొట్టిస్నానము చేసినప్పుడు లోపల వేడిమి తగ్గుతుంది. దానితో దాహము కూడా తగ్గి పోతుంది. మన వైద్యమువల్ల మూలకారణము తొలగిపోతుంది. గనుక రెండు వ్యాధులు తొలగిపోతాయి. శిలామేహములో రాళ్ళు పలుచబడి విచ్ఛిన్నమైన రేణువులు మూత్రముతో కొట్టుకుపోతవి. శిలామేహానికి చికిత్స చేసేటప్పుడు యెంతో పరిమి తిగల మూత్రము వస్తుంది. ఇంత మూత్రము యెట్లా వచ్చిందా అని రోగులు ఆశ్చర్య పడతారు. అదివరకు వాయురూపాన్ని పొంది దేహమంతా వ్యాపించిన మూత్రమే మరల చికిత్సా కాలములో మూత్రముగా మారి వెడలి పోవుచున్నది. స్నాన కాలమునందు మాత్రమే క్రమముగా మూత్రము వెళ్ళే రోగులు కొందరుండేవారు. రోగపదార్థము తగ్గిన కొలదీ మూత్రము తెంపుగా అయ్యేది.

ఒకటవ విలియం చక్రవర్తి శిలామేహ రోగి. అతని దేహము లోని రోగపదార్థము అనుకూలమైన చోట ఉండుటవల్ల

ఆ వ్యాధి ఉండికూడా 90 ఏళ్లు జీవించాడు. అతని కుమారుడైన ఫ్రెడరిక్ చక్రవర్తికి శిలామేహము చిన్నవయస్సులోనే వచ్చినది. అతడు యెక్కువ కాలము జీవించలేదు.

## మూత్ర రక్తము

ఈ వ్యాధిలో రోగి దేహములోని రక్తమునందు మూత్రలవణాలు కలిసి వుంటవి. మూత్రాశయ వ్యాధులందును, శిలామేహమునందును, ఈ వ్యాధి వుంటుంది. ఈ రోగము పుట్టే పుట్టకపూర్వము ముఖనిదానశాస్త్రమునందు పండితులైనవారు గుర్తింపగలరు. తమకు రోగమున్న సంగతి రోగులకుకూడా అప్పటికి తెలియదు. దేహమునందలి రక్తమును శుద్ధిచేసి ఆరోగ్యమును గలిగించే చికిత్సా విధానము మన తొట్టి వైద్యమొకటే. ఇతర విధానాలవారికి ఇది సాధ్యంకాదు.

## శయ్యాక్లేదము

ఉదరమునందు రోగ పదార్థ ముండుట వలన మూత్రము వచ్చినపుడు ఆపుకునేందుకు రోగికి శక్తియుండదు. మూత్రకోశములో ఒక స్వతంత్రమయిన రంధ్రమేర్పడి దానిలోనుంచి మూత్రము వెడలిపోతుంది. ఇదివరకువచ్చిన వ్యాధులను మందులతో అణచిపెట్టినపుడు మాత్రమే, ఈరకంవ్యాధి తరచుగా వస్తుంది. ప్రేగుల్లోపుట్టిన భగంధరము మూత్రకోశములో నుండివచ్చిన లూటియు మన వైద్యములో కొన్నివారాలలో రెండూ నయమైనవి. రోగము కాలికమై అదివరకే మందులను తెగదినినపుడు చికిత్సాకాలము యెక్కువ చెయ్యాలిసి వస్తుంది.

## లాలామేహము

ముందురాబోయే శిలామేహానికి ఇది ప్రారంభదశ. ఈ స్థితిలో జననేంద్రియము వెంట జిగురువంటి పదార్థము వస్తూ ఉంటుంది. మూత్రకోశములో మంట లుంటవి. మూత్రాశయములో బాధలుంటవి. తరుణవ్యాధులన్నిటియందు వలె దీని లోను వేడిఉండును. అన్ని తరుణవ్యాధులు నయమైనట్లే ఇది కూడా మనచికిత్సతో సులభంగా కుదురుతుంది.

15 దినాలనుండి లాలామేహముతో బాధపడే ఒకరోగినిచూచి తిని. అతని ఉత్తాపకగ్రంధి వాచియున్నది. మూత్రము వచ్చే టప్పుడు బాధఉండేది. ప్రతి పదినిమిషాలకు మూత్రకోశము నందు ఈడ్పుగలుగుచుండేది. దినదినము మూత్రము వచ్చే టప్పుడు బాధ పెరిగిపోతూ ఉండుటవలన వైద్యుడు కడ్డీవేసి మూత్రము తీస్తానని 14 వ రోజు సాయంత్రం చెప్పినాడు. అప్ప టికే లోపలభాగం అంతా వాచియుండుటచే కడ్డీ వేయుటకు వీలు కలుగలేదు. కడ్డీవేస్తే బాధ మరీ జాస్తి అవుతుంది. అందు వలన వైద్యమహాశయుడు క్లోరోఫారం ఇచ్చి తర్వాత బాధ తెలియకుండా కడ్డీవేస్తానన్నాడు. అందుకు వారు ఒప్పుకొనక ఆరాత్రి నావద్దకు వచ్చినారు. నేను ఒక లింగస్నానం చేయిం చితిని. ప్రతి 10 నిమిషాలకూ వస్తూ ఉండే మూత్రకోశము నందలి యీడ్పు ఆగినది. అరగంట లింగస్నానం చేయించే టప్పటికి బాధలేకుండా మూత్రము వచ్చినది. ముప్పా వుగంట లింగస్నానం చేసిన తరువాత రోగి పరున్నాడు. ఆ రాత్రి అతని దేహానికి చెమటపోసినది. ఆరాత్రే అతనికి బాధ

లేకుండా మూత్రము అనేక తూరులు వెడలిపోయింది. ఈ విధంగా కొన్నిదినాలు చేసేటప్పటికి అతని వ్యాధి సాంతంగా నయమైనది.

## పైత్యకోశవ్యాధి, పైత్యాశ్మరీ, కామిల

దేహములో రోగపదార్థము కుడివైపున జేరినప్పుడు యీవ్యాధులు వస్తున్నవి. పైత్యకోశమునుండి బయలుదేరిన చేదైన పిత్తరసము ఆంత్రమూలమునకు చేరి జీర్ణక్రియకు సహాయము చేస్తుంది. అందు మండము తగ్గిస్తుంది. ఎప్పుడయితే రోగ పదార్థము కుడివైపున చేరి పైత్యకోశము చెడిపోతుందో, అప్పుడు పోసే చెమట ఒక విధంగా ఉంటుంది. ఎడమవైపున రోగపదార్థము ఉన్నప్పుడు పోసే చెమటకంటె కుడివైపున రోగ పదార్థమున్నప్పుడు చెమట ఎక్కువగా పోస్తుంది. ఇందువల్లనే పైత్యాశ్మరీ, పైత్యకోశము గట్టిపడుట మొదలగు వ్యాధులు వస్తవి. అట్టివారి దేహములో నుంచి పోసే చెమట మురికి వాసనగా ఉంటుంది. తరుచుగా పాదాలు చెమట పోయును. పిత్తరసము ఆవిరైపోయి, చెడి మండము పొందుట వలన చర్మము మీద అక్కడక్కడ పచ్చని మచ్చలుంటవి. కొంతకాలము గడచేటప్పటికి దేహమంతా పచ్చబడి పచ్చ కామిలావ్యాధి అగుతుంది. ఇట్టి వ్యాధులను మనవైద్యముతో బహు సులభముగాను తొందరగాను కుదర్చవచ్చును.

## పాదములనుండి చెమటపోయుట.

పైత్యకోశవ్యాధితో దీనికి సంబంధము గలదు. పాదములు చెమటపోసేటప్పటికే కుడివైపున రోగపదార్థము పేరుకొంటూ

ఉందని చెప్పవచ్చు. పైత్యకోశము పసరుతిత్తి బాగా చెడిపోయిన తరువాత ఈ చెమట ఆగిపోతుంది. పాదాలనుండి వస్తావుండే చెమట ఎప్పుడు ఆగిపోతుందో ఆచెమటద్వారా పోయే రోగపదార్థం లోపలికిపోయి దేహమునందలి అంతరవయవములను పాడుచేస్తుంది. చర్మముమీద పొక్కులుగాను దేహములోపల కర్కట వ్రణముగానూ మారుతుంది. ఈ స్థితిలో రోగాన్ని నయము చేయడం చాలా కష్టము. పాదాలకు పోస్తూ ఉన్న చెమటను పోయకుండా, క్రోమికామ్లము మొదలైన మందులతో మందువైద్య శిఖామణులు అణచి పెడతారు. అప్పటికి తాత్కాలికంగా వ్యాధి లక్షణాలు తగ్గినట్లే వ్యాధి కుదిరినట్లే కనపడుతుంది. కొన్నిసంవత్సరములు గడచిన తరువాతగాని ఆమందు చేసిన అపకారము తెలియదు. పాదములవెంట పోవుచున్నచెమట దేహములో యిమిడి దేహస్థితిని నానాటికీ చెడగొట్టుతుంది. దానితో యింకో దుర్భరవ్యాధి వస్తుంది. ఒకపట్నంలో చిన్నచిన్న మురుగుకాలువలు అన్నీ కలిసి ఒకపెద్ద మురుగు కాలువలోనికి పోతవి. ఆ పెద్ద మురుగు కాలువలోని మురుగు బైటకు పోవుచోట చెడుకంపుగా నున్నదని, ఆ మురుగును బైటికి పోనియ్యకుండా కట్టివేస్తే ఆ మురుగు పట్టణంలోనే నిలిచిపోయి పట్టణవాసుల ఆరోగ్యం పాడైపోతుంది. పాదాలలోనుంచి చెమటద్వారావచ్చేరోగపదార్థముయొక్క ఆపుదలయినామోస్తుగానే ఉంటుంది. పటాలములో ఉండే సైనికులకు పాదములు చెమట పోసే రోగము వచ్చినపుడు క్రోమికామ్లము, సాలిసిలికామ్లము వాడుచున్నారు. ఇది సరియైన చికిత్సకాదు. మన

వైద్యము చేస్తే మూలకారణమైన రోగపదార్థము పోతుంది. గనుక పాదాల చెమటకూడా నయమగుతుంది.

## కర్పాణి – చర్మవ్యాధులు

చర్మముమీదపుట్టిన దద్దురు, చిలుకుడు, చిడుము, రోసుగ గజ్జి మొదలగు రోగములకు నామరూపములు భేదములుగా ఉండినా వానికి కారణముమాత్రము ఒకటే. వివిధంగా ఉండే యీరోగాలన్ని నేను నయముచేసినాను. పాదాలలో నుంచి యెక్కువగా వస్తూ ఉన్న చెమట అణచి పెట్టడంచేతనే యీ రోగాలన్నీ కలిగినవి. ఏదైనా ఒకవ్యాధిని మందులతో అణచి పెట్టితే యీచర్మవ్యాధులు వస్తవి. అందువల్ల చర్మవ్యాధులకు చికిత్సచేసేటప్పుడు అణచిపెట్టిన వ్యాధులకు కూడా చికిత్స చేసి నయముచెయ్యాలి గనుక చాలా కాలము పడుతుంది. బిడ్డలకు యీకర్పాణి వ్యాధి వస్తుంది. పిత్రీయంగా సంక్రమించిన రోగపదార్థమువలన రావచ్చు. లేక శిశువ్యాధులకు చేసిన తప్పుచికిత్సలవల్లా రావచ్చు. ఈవ్యాధి తరుచుగా టీకాలు వేసిన బిడ్డలకు వస్తుంది. కర్పాణి రెండు రకాలుగా ఉండును. తడికర్పాణిలో వాసన వచ్చే ద్రవము వస్తుంది. పొడికర్పాణిలో అమితమైన దురద ఉంటుంది. ఈవిషయములను యింకా తెలియ జెప్పుటకుగాను నేను చికిత్సజేసి నయము చేసిన యిద్దరు బిడ్డల వృత్తాంతము యిచట వ్రాయుచున్నాను. ఒకనికి 2 వ సారి టీకాలు వేసిన తర్వాత చర్మవ్యాధి ఆరంభించినది. అది క్రమంగా దేహమంతా వ్యాపించినది. ఆబిడ్డ దురదబాధ పడలేక కాళ్ళుచేతులు మంచానికేసి రుద్దుకునేవాడు. అందుకని

చేతులకు కాళ్ళకు గోక్కునేటందుకు వీలులేకుండా గుడ్డలుగట్టే వారు. చేతి గోళ్ళ లాగులకు పుస్తె చర్మము బద్దలు చేసుకునే వాడు. రోజూ వళ్ళు పులిసిపు కారుతూ ఉండేది. స్నేహితులు ఆటకు రానిచ్చేవారు కాదు. అందువల్ల యింటిలోనే కూర్చుని చదువుకుంటూ ఉండేవాడు. మనస్సులో ఉల్లాసము క్రమంగా తగ్గిపోయినది. తన కెట్లాగో చావు తప్పదని నిశ్చయం చేసుకుని చావు కోసం యెదురు చూస్తున్నాడు. అకస్మాత్తుగా అతను ప్రకృతి వైద్యమును గూర్చి వినినాడు. నేను కనిపెట్టి వ్రాసిన తొట్టి వైద్యమును కూడ ఆతడు చదివి నాడు. తర్వాత అతను నా సలహా తీసుకుని రోజుకు రెండు తొట్టి స్నానములు చేయుచూ ఉద్రేకములేని ఆహారమును తినేవాడు. తగుమాత్రముగా తినేవాడు. దానితో అతని ఆరోగ్యము వృద్ధిపొందినది. ఆకురుపులు కూడా నయమైనవి. ఈ విధముగా కరపాణీ వల్ల పుట్టిన చర్మవ్యాధి సంపూర్ణముగా నయమైనది.

24 సం॥ వయస్సు గలిగిన ఒక పడుచువానికి యేనుగ గజ్జి వచ్చినది. మెడ, తల, చర్మమంతయు బిరుసెక్కి పోయినది. మందువైద్యమువారు అనేక మందులు యిచ్చినారు. పై పూతలు పూయించినారు. వాని రోగం నయము లేదు. అతనికి మందు వైద్యులమీద నమ్మకము పోయినది. అందువల్ల నా సలహా తీసుకొని వైద్యము ప్రారంభించినాడు. అతనికి రోగ పదార్థము ముందు పైపునకు చేరినది. కొలది దినములలోనే అతని జీర్ణశక్తి వృద్ధిపొందినది. యేనుగ గజ్జికూడా తగ్గ నారం

తగ్గినది. మూడవ నాటికే చీముకారుట ఆగినది. 16 రోజుల నాటికి వ్యాధి నిమ్మళించింది. మెడయొక్క వలయము అంగుళాలన్నర వెడల్పు తగ్గింది. యీనుగగజ్జికి మెడయొక్క వాపుకు మూలకారణమైన రోగపదార్థము మలము ద్వారా వెళ్ళిపోయింది.

—

# ౭. హృద్రోగము - నంజు

హృదయకోశానికి సంబంధించిన వ్యాధులు అనేక రకాలుగా ఉంటవి. మందువైద్యులు ఒక్కొక్క రకపు రోగానికి ఒక్కొక్క రకపు మందులను వాడతారు. హృదయకోశపు ఆవరణలలో కవాటాలకు సంబంధించిన వ్యాధులు హృదయ కోశపుకండలకు సంబంధించిన వ్యాధులు అని రెండు రకాలు. రోగాలు యెన్నిరకాలైనా, మన శాస్త్రముతో నిదానము చేసినప్పుడు అన్నిరకాల రోగాలలోకూడా హృదయ కోశము నకు లోపలనో, వెలుపలనో, రోగపదార్థము చేరుటయే కారణము. అందువలన ఆరోగములను వేరువేరు శీర్షికలకింద విడదీయటము మనపనికాదు. చేరిన రోగపదార్థము వలన హృదయకోశము యెంతగా చెడిపోయినదో మనకు తెలిస్తేచాలు. రోగపదార్థము యెడమవైపుగా ప్రవేశించినపుడు హృదయ కోశము యెక్కువగా చెడిపోతుంది. రోగపదార్థము కుడివైపుగా ప్రవేశించినపుడు హృదయకోశ మంతగా చెడిపోదు. పిత్రియంగా సంక్రమించిన రోగపదార్థముచేత హృదయము దుర్బ

లముగా సన్నపుడు రోగపదార్థము యింకా వడిగా సంక్రమిస్తుంది. హృదయకోశములో రోగపదార్థము చేరినపుడల్లా దేహమంతా రోగపదార్థంతో నిండి ఉంటుంది. హృదయకోశముచుట్టూ ఉండే భాగాలు కూడా హృదయకోశపు ఆవరణచుట్టూ ఉండే కండరాలుకూడా క్రొవ్వుతో నిండి యుండి హృదయ కోశపుగతిని నిరోధిస్తూ ఉంటవి. ప్రతిస్థితిలోను హృదయకోశముయొక్క వైశాల్యము పెరుగ నక్కరలేదు. ఉన్న హృదయకోశము గట్టిపడి పెరిగి సక్రమంగా కదల లేకపోతుంది. ఈస్థితిలో హృదయకోశ కండరాలు తిన్నగా పని చేయలేకుండా ఉంటవి. చర్మము వాచినప్పుడు దేహక్రియలు తిన్నగా జరుగక పోవటం అందరికి తెలుసు. ఆవిధంగానే హృదయకోశం వాచినప్పుడు హృదయకోశముచలనములో క్రమము తప్పుతుంది. హృదయకోశమునుండి యెక్కువపని జరుగవలసినపుడు అనగా మనము యెక్కువగా శ్రమచేయ వలసినపుడు హృదయకోశము తదనుగుణంగా పనిచేయలేదు. గుండెదడగావుండటము, గుండె బరువుగా ఉండటము రక్తాభిసరణము తిన్నగా జరుగకపోవటం, ఆయాసము మొదలగునవి కనుపిస్తవి. ఎక్కువబాధ కనుపడక పోయినా గుండెమీద యేదో బరువెత్తినట్లు తోస్తుంది, ఒత్తుకున్నట్లు కనుపడుతుంది. ఈ విధంగానే హృదయకోశ కవాటాలలోకూడా వ్యాధులు వస్తవి. హృదయకోశపు కవాటాలలోకూడా రోగపదార్థము చేరి అవి ఆ యా ద్వారములను మూయుటలో తిన్నగా ఇమడక, యెక్కువతక్కువ లవుతవి, అందువల్ల కవాటాలకు

సంబంధించిన, వ్యాధులు వస్తవి. ద్వారాలకు కవాటాలు ఉన్నా అవసరకపోతుంటేకూడా యితర హృదయకోశ వ్యాధులు వస్తవి. ఏమైనప్పటికీ కారణముమాత్రము ఒకటే. హృదయకోశానికి సంబంధించిన నాడులు మాత్రమే రోగగ్రస్తము లగును. నేను నాడీవ్యాధులనుగురించి వ్రాసినప్పుడు, ఏ అవయవమైనా రోగగ్రస్తమైనప్పుడు దానికి సంబంధించిన నాడులుకూడా చెడ ఉంటవి అని వ్రాశాను. ఏ అవయవమైనా. రోగగ్రస్తమైనపుడు దానికి సంబంధించిన నాడులు మాత్రము ఆరోగ్యంగా ఉన్నవి అని చెప్పటము పొరపాటు, దేహమంతా ఆరోగ్యంగా ఉన్నదిగాని, నరాలు మాత్రము అనారోగ్యముగా ఉన్నవని చెప్పుట తప్పు. ఈ సంగతులన్నీ పూర్వకాలపు మాటలు. హృదయకోశానికి సంబంధించిన వివిధ వ్యాధులు అందుకుసంబంధించిన వందలాది లక్షణాలు అందువల్ల పైకికనబడే వేరు వేరు బాధలు వీనికన్నిటికి ఒకే కారణము. అది దేహములో రోగపదార్థము చేరుటయే.

అందువలన హృదయకోశములో వ్యాధివచ్చినపుడు దేహమును పీడించే, రోగపదార్థాన్ని వెలువరించియే తీరాలి. అట్లాగాక మందుమాకులతో, హృదయకోశవ్యాధుల నయంచేద్దామని ప్రయత్నించితే హృదయకోశము మరింత దుర్బలము అయిపోవును. వేరువేరు రోగాలను మందులతో అణిచిపెట్టినపుడు చివరిదశగా ఈ నంజువస్తుంది. ఇందువలన దేహములో శుద్ధరక్తము తయారు కావటం లేదని అదివరకున్నరక్తములోని మాలిన్యములను తొలగించలేక పోతున్నదని మనకు స్పష్టము

రోగగ్రస్తములయినవి. దాని తర్వాత హృదయకోశము క్రొన్వెక్కి లానైనది. తర్వాత హృదయకోశకవాట రోగము వచ్చింది. తర్వాత గుండెనంజును, వచ్చింది. దేహముసహావస్థ నంజుచూపినది. అన్ని దశలలోను, అన్ని మందులూ వాడినారు ఏమందూ పనిచేయలేదు. రోగం అంతా బాగా ముదిరిపోయిన తర్వాత, చిట్టచివర ప్రయత్నంగా మనచికిత్సాలయానికి వచ్చి నాడు. అతనికి ఉపశాంతిమాత్రమే కలిగినది.

దేహములో నీరుమెప్పుడుచేరినా అది ఉదరములోనె మొదట్లో చేర నారంభిస్తుంది. అది నెమ్మదిగా వృద్ధిపొందుతుంది గనుక యెవ్వరికీ తెలియదు. ఆనీరు హృదయమును బాధించి గుండె బరువై శ్వాస అవరోధ మేర్పడినప్పుడే మొదటిసారి గుర్తిస్తుంటాము. రోగి వెంటనే చికిత్స ప్రారంభంచేస్తే దేహము వెంటనే చికిత్సను స్వీకరిస్తుంది. రోగి దేహశక్తులను కాపాడు కుంటే కాలిక వ్యాధి ఉదరమునందు తరుణవ్యాధిగా తయా రగుతుంది. అప్పటికే రోగపదార్థము మరీ యెక్కువైయుంటే ఉదరమునందలి నీరు వెలువడుటలో అతని దేహము తట్టుకొన లేక చనిపోతాడు. దేహములో సరిపోయినంత ధాతుశక్తి ఉంటే ఉదరమునందు చేరి కుళ్ళుచున్న రోగపదార్థము నెమ్మదిగా వెడలిపోయి ఆరోగ్యము కలుగుతుంది. మా చికిత్సాలయములో నేను కుదిర్చిన యిద్దరు రోగుల వృత్తాంతములను యిచటచేర్చు చున్నాను. ఇతర దేశాలనుంచి నంజుతో బాధపడుతూ అల్లో పతిక్ వైద్యములో రోగము కుదరక సలహాకొరకై నావద్దకు వచ్చినాడు. అతనికాళ్ళు దేహముకూడా ఉండవలసిన పరిమితి

కన్నా హెచ్చింపు లావైనవి. అయినప్పటికీ అతను నడువగలిగి ఉన్నాడు. అతనికాళ్లు బరువైనవి, శ్వాస కఠినముమీద ఆడుతుంది. ఇంతకన్నా నాకేమీ వ్యాధిలేదని అతను చెప్పినాడు. నరోగం చాలా ముదిరిపోయినది. ఈ స్థితిలో చికిత్స చేసినా లాభములేదు. నీవు ఈ వైద్యమును ఆరంభింపవద్దు అని చెప్పినాను. అయినప్పటికీ, తనరోగం తప్పకుండా నయమవుతుందని సలహాచెప్పమన్నాడు. మొదటి రెండు వారాలు అనుకున్నదానికంటే బాగానే జరిగింది. చెమటలు బాగాపోసినవి. విరేచనాలు వెళ్లినవి. వాంతినంజు తగ్గినది. రోగి హాయిగా ఉన్నదని అనినాడు. ఇంతవరకు తయారైన నంజునీరే పోయినదిగాని, ఆ నంజునీరు తయారగుటకు కారణమైన రోగపదార్థము పోలేదు. ఉదరమునందలి మురిగేపుండు రావాలి. ఇదివరకు యీ సంగతి యెవరూ చెప్పలేదు. లోపల మురుగుతూఉండే మురుగు తీక్షణమగు జ్వరముగా మారాలి. అప్పటికింకా దేహములో ధాతుశక్తి మిగిలిఉంటె దేహము ఆ జ్వరమును తట్టుకుని మురికిపదార్థాన్ని వెలువరిస్తుంది. దేహములో ధాతుశక్తి తగినంత లేకపోతే మండుతూఉండే అంతర్గతమగు ఉష్ణముతోడనే దేహము నశించి కృశించి పోతుంది. ఈ రోగికి రెండవగతే పట్టింది. అది నేను ముందే తెలుసుకున్నాను. 3 డవ వారములో అతనికాలిమీద కుళ్ళు పుండు పుట్టినది. కాలివేళ్ళనుండి మోకాలువరకూ ఒకటే బహిరంగవ్రణమై మర్నాటికే ఆ వ్రణమంతా నల్లబడినది. అదివరకు దేహములో ఉండి బాధించే పుండు బైటికివచ్చింది

రోగి చాలా బాధపడుచున్నాడు. 4 వ వారములో ఆ నల్లని పదార్థమంతా అట్టకట్టినట్లు ఊడిపోయి చర్మముమీద వ్రణము మానుపట్టినది. రోగి యింకా లావుగా ఉన్నాడు. లోపలిపుండు యింకా మానలేదు కాబోలు. జ్వరము యెక్కువైనది, ప్రతిరోజూ, ఎక్కువగుచున్నది. దాహముకూడా యెక్కువగుచున్నది. లోపలిపుండును బాగు చేయుటకు గలిగిన జ్వరాన్ని మనం చేయించిన ఉపవాస స్నానాలకు లొంగలేదు. రోగి నానాటికి నీరసపడుతున్నాడు. తొట్టిస్నానాలు కూడా చేయలేక పోయినాడు. 29వ రోజు మగతవచ్చినది. 30వ రోజున చనిపోయినాడు. అతనికిగల అంతర్గత జ్వరమువలననే రోగి క్రమంగా క్షీణించి పోయినాడు. నేను యీసంగతి మొదటనే చెప్పినాను.

మనవైద్యముతో రోగము నయముచేసుకున్న యింకొకవృత్తాంతము వ్రాస్తాను. ఒకనికి చిరకాలంనుంచి నంజువ్యాధి. అతని స్థితి కూడా చాలా తీవ్రమైనదే. అదృష్టవశాత్తు అతను అలోపతీ మందులు యేమీ పుచ్చుకొనలేదు. అంతవరకు హోమ్యోపతీ మందులే పుచ్చుకొనినాడు. మనవైద్యము ప్రారంభంచేసిన 3వారాలలో నేవాని దేహములో ఉండే నంజు అంతా తీసిపోయినది. 4వ వారములో జ్వరము ఆరంభము చేసినది. 2 వనరోజుననే దుర్గంధముతోకూడిన నల్లని మలము వెడలిపో నారంభించినది. నీళ్ళ విరేచనములు బంకవిరేచనములుకూడా వెళ్ళినవి. రోగికి అప్పుడు ఆహారము కొద్దికొద్దిగానే యిస్తున్నారు. ఇన్ని విరేచనాలు కావటానికి పదార్థము యెక్కడనుంచి వస్తుందో

మొదటి అర్థముకాలేదు. రోగిభార్య నావద్దకువచ్చి యీసంగతి ఆదుర్దాగా నాతో చెప్పినది. దేహములో అదివరకే నిలువవున్న మాలిన్యములు అన్నియు స్వాస్థ్య సంకటముగా వెడలిపోవుచున్నవని అందువల్లనే ఇతని దేహములోపల ఉన్నకుళ్ళు కాసంతా దానికి మూలకారణమైన రోగి దార్ఢ్యముకూడా వెడలిపోవుచున్నదనీ అనేక సంవత్సరాలనుండి దేహములో చేరిన రోగమంతయు నయము కాబోవుచున్నదని ఆమెతో చెప్పితిని. ఈ 35 రోజుల విరేచనాలతోను రోగి బాగా చిక్కినాడు. నీరసించినాడు. తర్వాత రోగికి తొందరగానే బలము చేరనారంభించినది. ఆరోగ్యం కలిగింది. 20 సంవత్సరాలకు పూర్వము అతనెంత బలముగా ఉన్నాడో యిప్పుడంత బలముగాను ఆరోగ్యముగాను ఉన్నాడు. ఈ 20 సంవత్సరాలలోను అతనికి తిరిగినంజు కనుపించలేదు. ఇతని విషయములో కాలికమైన రోగము తరుణస్థితిలోనికి వచ్చి వెడలిపోవుటకు అదృష్టవశాత్తు అతనికి తగినంత బలము ఉండుటచేతనే నయమైనది.

ఏ రోగికి మనవైద్యము చేస్తున్నపుడు నంజుగల భాగాలలో, చర్మమునుండి సులభంగా చెమటవస్తుందో, అతని నంజు తప్పకుండా నయమగుతుంది. అట్టివారి దేహమునందలి మాలిన్యములు సులభంగా వెడలిపోతవి. జీర్ణశక్తికూడా త్వరలో సహాజస్థితికి వస్తుంది. ఎవరికి ఆవిరిపట్టినా, చెమటపోయదో రోగపదార్థాన్ని వెలువరించేటందుకు యెవరి దేహములో ధాతుశక్తి బాగా తగ్గిపోయిఉంటుందో, వారి జీర్ణశక్తి సహాజస్థితికి రాదు. రోగమూ నయము కాదు.

దేహములో నంజు రాదగిన లక్షణాలను ముఖనిదానశాస్త్రము వలన, కొన్ని సంవత్సరాలు ముందుగానే గుర్తుపట్టవచ్చును. ఈ నిదానము వలన రోగము కనుపడి ముదిరి నయముకాని స్థితికి వచ్చేదాకా వేచిఉండక రోగం దర్శనమివ్వకమునుపే నయముకాదగిన స్థితిలో ఉండగనే చికిత్స చేసి రోగము నయముచేయవచ్చును. ఈ విషయాన్ని కావలసినవారికి చేసి చూపింపగలము. తీవ్రమగు హృద్రోగము, నంజు, కుష్ఠు, కలిసిఉన్న ఒక రోగికి నేను నయముచేసిన విధము, ఈ క్రింద వివరించుచున్నాను.

ఆ పెద్దమనిషిది జావాదీవులలో [illegible]. అతను 24 వ సంవత్సరంవరకూ యెగుమతీ వ్యాపారం చేసేవాడు. ఆ రోజుల్లో తన ఆరోగ్యం అయితే బాగానే ఉండేదిగాని అప్పుడప్పుడూ జ్వరము, కాళ్లమీద కురుపులు, కఫ వాంతులు ఉండేవి అని చెప్పినాడు. పై లక్షణాలనుబట్టి అతడు ఆరోగ్యవంతుడు కాడనియు, అతని దేహములో రోగపదార్థము ఉండేదనియు, మనకు సులభముగానే తెలియుచున్నది. జావా ఉష్ణమండలములలో ఉండుటవలన అతని దేహములో కొంత రోగపదార్థము చేరుటతోనే, అందు మంటముపుట్టి జ్వరము వచ్చేది. శీతల దేశాలలో యింత తొందరలో జ్వరాలురావు. అతనికి 1879 సం॥ నవంబరు నెలలో యెడమచెవికి సమీపములో తలవెనుక భాగమున పెద్దవాపుగలిగినది. దానిని మందులతో అణచి పెట్టినారు. కొద్దికాలమునకే వాని వ్రేలు వాచి చీముపట్టినది. ఆవ్రేలుకు సంబంధించిన యెముకకూడా బైటికి

వచ్చింది. ఇది నయమైనదో లేదో వెంటనే నెత్తురుతో కూడిన విరేచనాలు ఆరంభించినవి. అతనికి మొలలు పగిలి ఈ నెత్తురు వచ్చినది అని కనపడుచున్నది. కొద్దిరోజులకే యెడమపాదము మీద బహిరంగ వ్రణము లేచినది. అది చిరకాలముదాకా చీము కారుతూఉంది. అతనిపాదాలు, చేతులు, చల్లగాఉండేవి. తరుచుగా జ్వరమువస్తూ ఉండేది. చలి, చెమటలు పోసేవి. వీని అన్నిటివల్లా అతని దేహములో కాలికమైన రోగపదార్థము చిరకాలమునుండీ నిలువవున్నదని తేలుచున్నది.

1882 సం॥ ఫిబ్రివరిలో మామూలుకంటె పెద్ద జ్వరము వచ్చింది. అది యెన్నిరోజులకూ తగ్గలేదు. చికిత్స చేస్తూ ఉన్న యింటివైద్యుడు అది కుష్ఠురోగమని నిదానము చేసినాడు. జావా వదలిపెట్టి యూరపు యాత్రచేయమనినాడు. 1882 సం॥ ఏప్రియల్ 13 న తేదీన అతడు బటేవియానుండి బైలుదేరెను. యూరపువచ్చిన తరువాత అతడు ప్రొఫెసరు జే అనువారిని సంప్రతించెను. రక్తములో ఉడుకు ఉన్నదని అతడు నిదానం చేసి, ఉత్తరబల్గేరియాలో ఉన్న డాక్టర్ హెచ్ గారి వద్దకు చికిత్సకొరకై పంపెను. అతని చికిత్సలో నుండగా రోగి కుడి ముంజేతిమీద యెర్రనిమచ్చ పుట్టినది. కరోసివ్ సబ్లిమేట్ యెంతరుద్దినా ఆమచ్చ మాయలేదు. ఈ చికిత్సావిధానము పూర్తిఅయ్యేసరికి రోగికి కొంచెము కులాసాగా ఉన్నది. అక్టోబరు నెల వచ్చేసరికి దేహముమీద ఉన్న యెర్రమచ్చల సంఖ్య పెరిగినది. కాలికమగు జ్వరము యెక్కువైనది. 1883 వ సంవత్సరం యేప్రియల్ నెలలో అతడు తిరిగి జావా వెళ్ళి

నాడు. వేడిదేశ మగుటవలన అతనికి బాగా చెమటపోసినది. ఎఱ్ఱమచ్చలు కనపడకుండా పోయినవి. అతనికి హృదయము వ్యాధికి సంబంధించిన జ్వరము వచ్చినది. వైద్యులను సంప్రదించినాడు. వారతనిని యూరపు పోయి చికిత్స చేయించుకో మన్నారు. తదనుగుణంగా 1889 సం॥ మే నెలలో అతడు తిరిగి యూరపు పోవలసివచ్చింది.

అతడు బళ్ళేరియాలో పొందిన చికిత్స నిరుపయోగం అయిందనే సంగతి అతడు బళ్ళేరియా రావటంతోనే జ్వరము తిరగబెట్టడం వల్ల రుజువైనది. వేడిదేశమునుండు శీతలదేశానికిపోతే, రోగం అంతర్గత మవుతుంది. అందువల్లనే అక్కడ అతనికి జ్వరాలు వచ్చేవికావు. ఎప్పుడైతే అతను వేడిదేశానికి వచ్చినాడో అతని దేహములో నుండే రోగపదార్థమునందు మంటముగలిగి జ్వరము ఆరంభించినది. దేశము మార్పువల్ల జ్వరము తాత్కాలికముగా నయముకావటంకూడా చాలా మేలే అన్నాడు యింటివైద్యుడు.

అతడు తిరిగి యూరపు పోయినప్పుడు బేడెన్ దేశములో ఉండే వాడు. రాజవైద్యుడైన డాక్టర్ యన్. గారి సలహాప్రకారము తన ఆరోగ్యము కొరకై అతడు ప్రత్యేకముగా శ్రద్ధతీసు కొంటూ ఆ దేశములోనే ఉండిపోయినాడు. 1882 వ సం॥ లో కనుపడినదానికంటే యింకా యెక్కువగా అతని దేహమంతా తిరిగి యెఱ్ఱమచ్చలు పుట్టినవి. దీనినిబట్టి 1882 వ సం॥ లో కంటె 1885 వ సం॥ లో అతని దేహము నందలి రోగపదార్థ ము యెక్కువయినట్లు కనుపడు చున్నది. ఆ యెఱ్ఱమచ్చలు

యెందుకు వస్తున్నవో వైద్యులకు అర్థముకాలేదు. ఎర్రమచ్చలు మందులతో నయముకావు. ప్రకృతియే వానిని నయము చెయ్యాలి అన్నారు. 1886 వ సం॥ వారి సలహా తీసుకొని రీమ్‌స్ప్రింగ్సు అనే చోటికి వెళ్ళినాడు. అక్కడ యితనిస్థితి మరింత పాడైనది. రోగం మరీ కాలికమైపోయినది. వంట్లో వోపిక లేదు. మనస్సులో ఉత్సాహము నశించినది. దానితో దిగులు, నిరుత్సాహము, అధైర్యము, పిరికితనము, ప్రారంభించినవి. మందులతో రోగాలు నయము చేసుకుందాము అనుకునే వారి కందరికీ యీస్థితులు వచ్చేవే. అతనికి క్రమంగా జీవితంమీదనే అసహ్యం పుట్టినది. 1879 వ సంవత్సరంనుంచి 1889 సం॥ ఆఖరువరకు ప్రపంచకంలో ఉండే సుప్రసిద్ధవైద్యులందరు, సలహాలిచ్చి చికిత్సచేసినారు. రోగము నయముకాకపోగా, నానాటికి ముదిరిపోయినది. ఈ స్థితిలో యెవరికైనా నిరుత్సాహ మేర్పడుతుంది. మంచి ఉత్సాహంగా ఉండవలసిన పడుచుతనంలో 33 వ యేటనే అతనికి అకాలవార్ధక్యము, విసుగు, నిస్పృత్తువ, నిరాశ, దాపురించినవి.

1889 వ సం॥జనవరి 19వ తేదీ నాటికి పని తొందరలవలన అతను జావాకు వెళ్లినాడు. అతని రోగం చాలా కాలికమైపోయి నది. 3 సం॥లబట్టి చెమటపోయని అతని దేహము వేడిదేశము వచ్చిన తర్వాత కొద్దిగానే చెమటపోస్తూ ఉండేది. రోగం తిరిగి తరుణావస్థకు వచ్చినది. తిరిగి హృద్రోగం యెక్కువైనది. దానితో వచ్చిన జ్వరము మూలకముగా అతనిశక్తి ఉడిగి పోయి, నంజుపుట్టి కాళ్ళువాచినవి. యూరపియన్ వైద్యు

లంతా పరీక్షచేసి అతని దేహములో అసంఖ్యాకంగా కుష్ఠు సూక్ష్మజీవు లున్నవని నిర్ణయించిరి. అతని రోగానికి కుష్ఠు అని పేరుపెట్టినారు. బటేవియాలో కుష్ఠురోగమంటే చాలా భయము. అతడు తిరిగి యూరపు పోకపోతే, బటేవియాలో అతనిని వెలివేస్తామన్నారు. వెంటనే బటేవియానుంచి వెడలి పోమన్నారు. లేకపోతే యేవిధమైన సౌకర్యములు అందకుండా చేస్తామన్నారు. వారిబాధపడలేక 1889 సం॥ డిశంబరు 19 వ తేదీన అతడు యూరపుకు ప్రయాణమైనాడు. ఓడలో తోడుగా ప్రయాణంచేసినవారు, అతడు ప్రాణంతో జనీవా చేరడు అను కున్నారు. చల్లని సముద్రపుగాలి అతని ధాతుశక్తిలో ఉజ్జీవనము గలిగించినది. అతనివ్యాధి తరుణస్థితిలోనుంచి యింకా కాలికమైనది. అతనికి చికిత్సచేసే వైద్యులు రోగం నయము కాదన్నారు.

అతనికి లీప్‌జిగ్‌లో ఒక స్నేహితు డున్నాడు. ఆ స్నేహితుని వలన మనవైద్యాన్ని గురించి తెలిసికొనినాడు. 1890 సం॥ మార్చి 20 వ తేదీన అతడు లీప్‌జిగ్‌చేరి నిరాశతోనే మన వైద్యము ఆరంభంచేసినాడు. ఇతని విషయంలో ముఖనిదాన శాస్త్రముయొక్క నిజాయితీయును మనచికిత్సయొక్క ప్రభావ మును యింకొకసారి రుజువైనది. చికిత్సారంభమునందును రోగము నయమైనతర్వాతను, అదృష్టవశాత్తు అతని ఫోటోలు తీసి వుంచాను. అతని దేహమంతయు రోగపదార్థముతో రూపాంతరము పొందినది. కంఠము పూడిపోయినది. గంగ డోలు యేర్పడినది. గంగడోలు ఉరములోనికి దిగినది. గడ్డము

యెక్కడో, కంఠము యెక్కడో, ఉరము యెక్కడో, కనిపెట్ట డానికి హద్దులులేకుండా పోయినవి. నుదురు అంగుళం వాచినది. కన్నులు చుట్టూ ఉబ్బినవి. తలంతా రోగపదార్థముతో నిండి నది. కుడికాలు వాచి నల్లబడిపోయి కదిలించటానికి, ఏలు కలుగ లేదు. తల, కంఠం యే విధంగా రోగపదార్థపూరితమై యున్నవో, ఆ విధంగానే కబంధమంతా రోగపదార్థముతో నిండి యున్నది. జీర్ణక్రియ బొత్తిగా చెడిపోయినది. మలమూత్రాలు సరిగా కావు. పగలు రాత్రి యెడతెరిపి లేకుండా గుండెదడ ఉండేది. ఆబాధకు అంతములేదు. అతని కాళ్ళు చేతులు చల్లగా ఉండేవి. నల్లగా ఉండేవి.

మన చికిత్స ప్రారంభించినప్పటినుండియు సుగుణ మీయ నారంభించినది. జీర్ణక్రియ బాగుపడినది. అదివరకు యెనిమా చేస్తేనేగాని విరేచన మయ్యేదికాదు. ఇప్పుడు యెనిమా లేకుండానే విరేచనము అగుచున్నది. మూత్రము కూడా తెంపుగా అగుచున్నది. అదివరకు మూత్రము తెల్లగాఉండేది. చికిత్స మొదలుపెట్టిన 3 వ నాటినుండి మూత్రము మడ్డిగాను మురికిగాను అవుచున్నది. దీనిని బట్టి దేహములోని మురికి పో నారంభించినదని చెప్పవచ్చును. చికిత్స మొదలుబెట్టిన రెండవనాటినుండియే రోగికి తేలికగాను, సుఖముగాను ఉండ

నారంభించినది. రోగపదార్థము వెడలిపోవుచుండుటవలన అతనికి కొంచెము నీరసముమాత్రముండెను. చెమటకూడా బాగుగాపోయ నారంభించినందున రోగనివారణకు అది ఎంతో తోడుపడినది. దేహమునందలి రోగ పదార్థము వడిగా వెడలి పోవుచున్నందున దేహముయొక్క లావుకూడా వడిగా తగ్గి పోయినది. పిక్కమీద నల్లని కమిలిపోయిన మచ్చ వుండేది. అది అదృశ్యమైనది. మొదట నల్లగా ఉండేది. తర్వాత ఊదా రంగుకువచ్చి 4 అంగుళాల వెడల్పు అయినది. క్రమముగా అది నీరుగా కరిగిపోయినది. కాలుకూడా క్రమముగా వృద్ధి పొందినది. కుడికాలు వాచినది. అనగా అందలి రోగపదార్థము మండమై వికటి చెందినది. ఈ స్వాస్థ్యసంకటము చాలా తీవ్ర మైనది. వాని దేహమునందలి ధాతుశక్తి దానిని తట్టుకొన గలిగెను. అతడప్పుడు నడువలేకుండెను. నరంజుతో వాచిన చోటులందెల్ల మనచికిత్సా ప్రక్రియలతో బాగుగా చెమట పోయ నారంభించినది. అందువలన 4 వారములలోనే దేహము నందలి నీరంతయు తీసినది. ఇప్పటినుండియు వడిగా ఆరో గ్యము రా నారంభించినది. ప్రతిదినమును అతనికి ముసలి పోయి చిన్నతనము రా నారంభించుచున్నట్లు తోచెను. దేహములో నూతనశక్తి సామర్థ్యములు కాన్పించెను. మధ్య మధ్య స్వాస్థ్య సంకటములు వచ్చుచుండెను. ఈ క్రింద రెండు పటములలో చూపినట్లు అతని దేహములో మార్పు గలిగెను.



1 వ పటము నంజురోగి
కూనేవైద్యమునకు పూర్వము.



2 వ పటము నంజురోగి
కూనేవైద్యమునకు తరువాత.

వానినిపోగొట్టి గుర్తుపట్టటానికే వీలులేకుండా ఉన్నవి. హృద్రోగము, నంజు నయమైనవి. అదివరకున్న నిరుత్సాహం, నిరాశ పోయి - ఉత్సాహము, ఆశ, వృద్ధిపొందినవి. బటేవియాకు ఈ సంగతి తెలియజేసినప్పుడు కుష్ఠువాడగుటవలన అతనిని బటేవియాకు రానియ్యమన్నారు. అతని దేహములో కుష్ఠు సూక్ష్మజీవులు లేవని రుజువయ్యేదాకా, అతనిని బటేవియాకు రానియ్యరు. అందువలన అతడు హ్యాంబర్గులో నున్న ప్రసిద్ధ వైద్యులచేత పరీక్ష చేయించుకొన్నాడు.

4 వారములు పరీక్షచేసి వారతని దేహములో కుష్ఠు సూక్ష్మజీవులు యేమీలేవని స్థిరపర్చినారు. 1892 వ సం॥ తిరిగి అతడు జావా ప్రవేశించినాడు. ఇప్పటికీ ఆరోగ్యముగా నున్నాడు. పాతరోగాలు యేమీ తిరుగ రాలేదు.

ఇతని చరిత్ర వినినతరువాత మందువైద్యమువారి నిదానపద్ధతి చికిత్సావిధానములు యెంత నిరుపయోగములో సులభముగనే తెలియుచున్నది. ఇతని విషయములోకూడా ప్రసిద్ధులైన మందువైద్యులు యితని రోగం నయముకాదని నిశ్చయించేసినారు. అట్టివానికి మనవైద్యము సహాయము చేసినది. చనిపోతా డనుకున్నవాడు బ్రతికి బంధువులకు, స్నేహితులకు, దక్కినాడు.

# ౭. వెన్నుపాము వ్యాధులు

## కశేరుకాక్షయ, మూలవ్యాధి.

వెన్నుపాముకు సంబంధించిన రోగము రావడానికి ముందు చిర కాలమునుండియు కాలికవ్యాధులు ఉంటవి. ముఖనిదాన శాస్త్రమువలన అనేక సంవత్సరాలు ముందుగానే, గుర్తుపట్టి వెన్నుపాముకు సంబంధించిన వ్యాధి రాబోవుచున్నదనియు, ముందుగానే చెప్పవచ్చును. నాడులుకూడా రోగగ్రస్తమగుతవి. వివాహము అయినవారికి కానివారికి కూడా రాత్రులయందు వీర్యము పోతూ ఉంటుంది. దీనినిబట్టి అతని నాడులలోను, వెన్నుపాము మూలుగులోను, స్వతంత్రి నాడీమండలములోను కూడా ఉజ్జ్వలమయిన తాపమున్నదని అర్థము. ఈ తాపము రోగపదార్థము దేహములో వెనుకవైపున చేరుటచేత వచ్చును. నాడులయందలి తాపము క్రమక్రమంగా వృద్ధిపొందుటవలన దుర్బలమైపోతవి. దేహావయవాలలో మొట్టమొదట కాళ్ళు స్వాధీనము తప్పుతవి. వీర్యనష్టముతో యింకా యితర వ్యాధులకు దారి తీస్తవి. కటిప్రదేశము బిగదీస్తుంది. రోగపదార్థము యెక్కువైనకొద్దీ యిది కొంచెము బిగదీస్తూ ఉంటుంది. ఇందు తరుచుగా చీలికూడా ఉంటుంది. ఈ ప్రదేశాలలో పొడిచినట్లు, లాగినట్లు, మెలివేసినట్లు, నొప్పు లుంటవి. తిమ్మిరు లుంటవి. మెడ తెగకుండా బాధించే నడుమునొప్పి ఉంటుంది. వెన్నుపాముకు సంబంధించిన వ్యాధులు రకరకాలుగా ఉంటవి. వెన్నుపాములో రోగపదార్థం చేరినవారిలో కొందరు నాట్యము చేస్తారు.

రోగం బాగా ముదిరిన తర్వాత, వెన్నుపాములోని మూలుగు చెడిపోతుంది. అప్పుడిక రోగమునకు సంబంధించిన బాధలు ఉపశమించుకొనుట తప్ప పరిపూర్ణ ఆరోగ్యం కలుగదు. మన వైద్యముతో నిద్రాహారాలు బాగుపడినయెడల రోగ నివారణకు సాధ్యమవుతుంది. మనకు ముఖనిదానం తెలుసు గనుక రోగం ముదిరిపోక మునుపే చికిత్సచేయగలము. వెన్ను పాముకు సంబంధించిన రోగాలుకూడా, ముదిరిపోకమునుపే చికిత్సచేస్తే యితర స్వల్పవ్యాధులకువలెనే, యిది కూడా నయ మవుతుంది. రోగము చిరకాలము, ముదిరిపోయినా, మందులు పుచ్చుకొన్నా రోగం అణగిపోయి నయము కావడం కష్ట మవుతుంది. ఒక యిల్లు అంటుకోగానే చూస్తే చల్లార్పటానికి సాధ్యపడుతుందిగాని, యిల్లు నాల్గువైపుల అంటుకొన్న తర్వాత యేంచేస్తారు? వెన్నుపాము రోగాలతో బాధపడే చాలామందికి చికిత్స చేశాను. వారికి మన వైద్యమువలన తాత్కాలిక ఉపశాంతి మాత్రమే గలిగినది. చిరకాలం మందులు తిన్నందువలన వారి దేహాలు చచ్చుబడిపోయి ఉండి, నేనెంత జాగ్రత్తగా చికిత్స చేయించినా వారికి పరిపూర్ణా రోగ్యము చేకూరలేదు. పైని చెప్పిన విషయాలను రుజువు చేయునట్టి కొన్ని రోగనివారణ వృత్తాంతములను యిచట వ్రాసినాను.

ఒక పడుచువానికి, వెన్నుపాము రోగగ్రస్తమై, 2 కాళ్ళు పడి పోయినవి. అనేకమంది మందు వైద్యులు చికిత్స చేశారు. గాని ఫలము కలుగలేదు. కాళ్లు అటు యిటు కదలవు. నుంచో

లేడు. అతనికున్న వయస్సు 24 యేండ్లయినప్పటికీ, అతను మంచముమీదనే పడియుండవలసివచ్చినది లేకపోతే చక్రాల-కుర్చీలో అటూ యిటూ త్రిప్పేవారు. అతని జీర్ణక్రియ బొత్తిగా చెడిపోయినది. కృత్రిమసాధనము లేకుండా విరేచనమే కాదు. అతనికి తెలియకుండానే మూత్రమవుతుంది. అతను కుర్చీలో కూర్చున్నపుడు అతనికాళ్ళు స్థానంలో పెట్టాలంటే అతనికి సాధ్యంకాక యెవరన్నా పెట్టాలిసివచ్చేది.

మన వైద్యము ఆరంభించిన తర్వాత, దినమునకు 4 ఉపశమన స్నానాలు చేయించేవాడను. సహజమైన ఆహారం, దాహము కలిగింపని పథ్యము పెట్టితిని. జీర్ణక్రియ చెడిఉన్నందున మొదటి మాసములో, యేమాత్రమును సుగుణం కనుపడినా, రెండో మాసంలో చెప్పదగినంత సుగుణం కనుపడినది. తర్వాత, 2 మాసాలకు మూత్రము స్వాధీనానికి వచ్చింది. కాళ్ళు తానే అటూ యిటూ త్రిప్పగలడు. ఇతరుల సహాయము లేకుండా కొలదికాలము స్వయముగా నిలువబడును. 9 మాసాలు మన చికిత్స చేసిన తర్వాత యితరుల సహాయం లేకుండా అతడు గదిలో తానున్నచోట అటూ యిటూ తిరుగ గలిగెను. ఇంకొక 2 మాసాలు చికిత్స చేసేటప్పటికి అతడు స్వతంత్రముగా నడిచే సామర్థ్యం వచ్చింది. వెనుకవైపున చేరిన రోగపదార్థము, దానివలన గలిగిన అంతర్గతమగు వేడిమి ఇతర రోగములు యేవిధంగా కుదురుతయ్యో, యే విధంగా మన వైద్యంతో నయమవుతయ్యో ఆవిధంగానే నయమైనది.

దీనినిబట్టి రోగం ముదిరిన తర్వాత చికిత్సచేస్తే నయము కావటం చాలా కష్టమని తెలియుచున్నది. మొదట్లో యితని రోగం తగ్గుతుందనే నమ్మికలేదు. నయమవుతుందనే నమ్మకం అసలేలేదు. అతని జీర్ణశక్తి అంతగా చెడిపోయినది. ఎంత కాలం చేసినా అది బాగుపడలేదు. రోగి అమితమైన ఓర్పుతో చికిత్స చేసినాడు, గనుక రోగము కుదిరినది. అతను మొదట లోనే మందులు పుచ్చుకొనక మనవైద్యము ప్రారంభించి నట్లయితే అతనికాళ్ళు యింత చచ్చుపడేవికావు. అప్పుడు రోగం కూడా తొందరగాను, తేలికగాను, నయమయ్యేది.

ఇంకొక వృత్తాంతము చెప్పెదను. ఒకని వయస్సు 47 సంవత్సరములు. అత డనేక సంవత్సరములనుండి వెన్నుపాము క్షయతో బాధపడుచుండెను. ఎన్ని వైద్యాలు చేసినా నయము కాలేదు. దేహమంతయు రోగపదార్థముతో నిండియుండెను. ఎంతో కష్టముమీద నడువగలడు. నడుమునొప్పి మొదలగు తీవ్రబాధలు మధ్య మధ్య వచ్చుచుండెను. నిద్ర సరిగాలేదు. కొన్ని రాత్రులు అసలే నిద్రలేదు. జీర్ణక్రియ బొత్తుగా చెడినది. మిగతా దేహస్థితియు చెడినది. మన వైద్య మారంభించిన మొదటి నెలలోనే మంచినిద్ర కలిగినది. ఇతర బాధలు తగ్గినవి. జీర్ణశక్తి బాగుపడినది. కాళ్ళలో సత్తువ చేరలేదు. తన రోగం నయముకాదని అతడు నిరాశపడెను. నిద్ర, బాధలు, జీర్ణశక్తి అవైతే నయమైనవి, కాని తన అసలువ్యాధి నయముకాలేదని, అతని ఊహ; వెన్నుపాము జబ్బుకు వీనికీ సంబంధం ఉన్నదని, అతనికి తెలియదు. నేను

చెప్పిన పథ్యము కూడా అతనికి అమితకష్టమైనది. 10 నెలలు చేసి మన వైద్యము వదలిపెట్టినాడు. అతనిస్థితి మరింత చెడి పోయినది. మనము చికిత్స చేసినకాలములో, అతనికి జరిగిన మేలు అతనికి తెలిసి ఉంటే అతను ఓర్పుతో మన చికిత్సను చేసి నయముచేసుకునేవాడు.

మూలవ్యాధి :

రోగపదార్థము వెనుక వైపున చేరి ఉన్నపుడు వెన్నుపాము వ్యాధితో, కలిసి మూలవ్యాధి కూడా ఉంటుంది. వెనుక రోగ పదార్థము చేరటానికి, కూడా ఉదరములో, అమితమగు వేడిమి ఉండుట కారణము. దానికి గూడా అజీర్ణమే కారణము. దేహము నందలి ధాతుశక్తి లోపించి రోగనివారణ శక్తి తగ్గి ఉన్నపుడు ఉదరమునందు కణతులేర్పడి, అందు తీవ్రమగు మండమును, మంటలును ఉండును. ఇట్టి కాలికస్థితి యందే, ఈ వ్యాధులు కలుగును.

ఒక ఉదాహరణ ద్వారా దీనిని తెలియ జేసెదను, 17 యేండ్ల కుర్రవాడు. చిన్నప్పటినుండి అజీర్ణము. నాతో సంప్రదించి నాడు. అతనికి 11 వయేటినుండి మూలవ్యాధి. రక్త మొలలతో యెక్కువ బాధపడుచుండెను. 15వ యేడు వచ్చేటప్పటికి అతని మొలలుపోయి తీవ్రమైన తలనొప్పి బాధింప నారంభించినది. దానికి యేమందూ పనిచేయలేదు. చివరకు శిరస్సుయొక్క వెనుకభాగమున జీడికాయలంత కణుతులు యేర్పడినవి. అవి చేతికి తగులుచున్నవి, తల రూపము మార నారంభించి పెద్ద దైనది. అదివరకులేనిది అప్పుడు తలలో యేదో చేర నారంభిం చినదని అందరికీ తెలియుచున్నది. కాని యెవరికీ యిట్లా

యెందుకు అయినదో కారణము తెలియదు. నయమైన దను కున్న మొలలు గట్టిపడి ఆద్వారాన కిందికిపోతూఉన్న రోగ పదార్థము తలలోచేరి క్షయ గ్రంథులవంటి గ్రంథుపేర్పడినవి. ముఖనిదాన శాస్త్రమెరిగిన వారికి ఈ కార్య కారణాలు సుల భంగా బోధపడతవి. తీవ్రమగు తల నొప్పి వచ్చునప్పటికే రోగం చాలా ముదిరిపోయినది. అప్పు డాసంగతి యెవరూ గుర్తు పట్టలేదు. అతని తండ్రి యిదేవ్యాధితో తన 39 వ యేట పోయినాడని తెలిసినది. తల్లికి యిదే దిగులు. ఇదివరకు యెన్నో చికిత్సలుచేసినారు. మందులు యేవీ పనిచేయలేదు. రోగము క్రమక్రమముగా ముదిరిపోవుచున్నది. తీవ్రమగు తల నొప్పితో అతను యేమీ పని చేయలేకపోయినాడు. మధ్యమధ్య మూర్ఛలుకూడా వస్తున్నవి. ఈ దురవస్థలో వాని తల్లి నా వద్దకు తెచ్చినది. రోగపదార్థము వెనుక చేరి ఉన్నందున యెప్పుడైనను వానికి పిచ్చి పుట్టవచ్చును. కఠినమైన పథ్యము ఉపశమన స్నానాలు పూర్ణమైన వ్యాయామమును నిర్ణ యించితిని. అందువలన మంచి సుగుణము కలిగినది. మొదటి వారములోనే తలనొప్పులు తగ్గినవి. తలలోని కంతులు కరిగి వెళ్ళిపోయేటప్పుడు మాత్రము తలనొప్పి తిరిగి వచ్చేది. తలలోని గ్రంథులు క్రమంగా కరిగిపోయినవి. తలలావు తగ్గి నది. ఇంకొక రెండు మాసాలలో ఆ గ్రంథులు, యింకా తగ్గి నవి. ఇంకొక 6 మాసాలనాటికి అసలే, లేకుండాపోయినవి.

ఇంతలో ఒక మార్పువచ్చినది. అనేక సంవత్సరాలకింద కన పడకుండా పోయిన మూలవ్యాధి తిరిగి మొదలుపెట్టినది. ఈ

తూరి యీవ్యాధి వెనుకటంతా తీవ్రముగాను వచ్చింది. వాని తల్లికి బోధించినాను. తలలో ఉండే గ్రంథులు, కరిగి దేహము లోనికి దిగినవి. ఈ మూలవ్యాధితో ఆ గ్రంథులు సాంతము వెళ్ళిపోతవి దానితో మూలవ్యాధి కూడా నయమవుతుందని చెప్పినాను. ఆమె సంశయము తీరినది. చికిత్స శ్రద్ధగా చేసి నాను. ఇంకొక సంవత్సరానికి మూలవ్యాధి, కూడా నయమై ఆ కుర్రవానికి ఆరోగ్యము కలిగినది.

# ౬. ర క్త క్ష య ము

## పా ం డు వ

అన్ని తరగతుల వారిలోను యీ రోగము వచ్చుచున్నది. వైద్యశాస్త్రములో, చెప్పినవి, చెప్పనివి యెన్నో మందులు వాడుకలో ఉండినా, బీద భాగ్యములుగాని, పడుచూ, ముసలి తనములుగాని, భేదములేకుండా అందరికీ యీ వ్యాధులు వస్తున్నవి. సంపూర్ణంగా వైద్యసహాయం గల భాగ్యవంతులు అతిబలకరములైన మాంసము, కోడిగుడ్లు, మాంససారములు, సారాయి, బీరు, మొదలగునవి తినగలిగినవారిలోనే, యీవ్యాధి తరుచుగా వచ్చుచున్నది. మందులను వాడుచున్నారు. మందు వైద్యము యెంతో అభివృద్ధి అయినదని, ఆపద్ధతివారు డంబములు చెప్పుచున్నారు. ఒక్కొక్క వస్తువులో యెంత

ఆహారపు విలువ ఉన్నదో, రసాయనశాస్త్రమువలన కనిపెట్టితి మనియు, ఒక్కొక్క వస్తువు దేహానికి యెంత సత్తువనిచ్చేది, నిశ్చయింపగలిగితిమనియు వారందురు. శాస్త్రము ఇంత అభివృద్ధి అయినప్పటికీ రోగముల సంఖ్య తగ్గకపోగా అవి నానాటికి అసంఖ్యాకములుగా వృద్ధిపొందుచున్నవి. బలకరములని చెప్పబడే ఆహారాలు బలాన్ని యివ్వకపోగా జీర్ణశక్తిని చెడగొట్టి దౌర్బల్యాన్ని, నిస్సత్తువును, పిరికితనమును, అసహజమగు సంగమేచ్ఛను కలిగింప కలుగుచున్నవి. తల్లులయందు పాలు లేకుండా చేయుచున్నవి. దేహములోను, మనస్సులోను ఉన్న శక్తిని తగ్గించి వేస్తున్నవి. విసుగు, చికాకు, కాళ్ళు బరువుగా ఉండటము, కండలలో నొప్పులు, ఆకలి లేకపోవటం, మలబద్ధకము ఈ ఆహారములవల్లనే వస్తున్నవి.

పై సంగతులు చెప్పినతరువాత మందువైద్యము ఆహార విషయములోను, చికిత్స విషయంలోను చెప్పినది తప్పులకూడిక అని తెలిసినది. రసాయనశాస్త్రము వేరువేరు వస్తువులలో ఉండే ఆహారపు విలువలను నిర్ణయిస్తుంది. ప్రాణము గల దేహాలలో ఆ యా వస్తువులు యెలా పనిచేస్తవో దానికేమి తెలుసు? ఆహార సారాలుగాను, కృత్రిమంగా తయారుచేసినవి దేహానికి బలమిస్తవనే యే యితరవస్తువులుగాని జీర్ణము కావటం చాలాకష్టమని అసలే జీర్ణముకావని మనకు అనుభవ పూర్వకముగా తెలుసును. వండి మసాలాలు చేర్చకుండా సహజంగాఉండే వస్తువులు అన్నిటికన్నా తేలికగా జీర్ణమగు తవి. రక్తక్షయానికి పాండువుకు తోట్టివైద్యము సరిక్రొత్త

చికిత్సా పద్ధతిని బోధించుచున్నది. ఈ వ్యాధులు పైకిచూస్తే లోపలకారణము తెలియదు. ఆరోగ్యవంతుని దేహము, చర్మము మెత్తగా వేడిగా ఉంటుంది. తెల్లబడి, పచ్చబడి కాకుండా ఉంటుంది. శుద్ధమైనరక్తము పలుచగను, యెర్రగను ఉంటుంది. సిరలలో ఉండే రక్తముకూడా నీలికాంతి ఉంటుందేగాని చిక్కగా నల్లబడిగాని, గడ్డకట్టిగాని ఉండదు. జిగురుగా ఉండదు. దేహములో రోగపదార్థము చేరినకొలదిపీడనము యెక్కువై రక్తవాహికలు క్రమక్రమముగా విరివి చెంది, అందులో తిత్తులేర్పడి వానిలో రక్తసంబంధమైన మురికి చేరును. రక్తక్షయము పాండువు గల రోగుల చర్మము తెల్లగా ఉండటమే కాకుండా చర్మములో నుంచి బైటికి కనుపడే సిరలు లావుగానూ, నల్లగాను; కనుపడుతవి. ఆరోగ్యవంతుల దేహములోనుంచి కనుపడే సిరలు సన్నగా ఉండి, తేలిక నీలపురంగు గలిగి, కనుపడి కనపడనట్లు ఉంటవి. పాండురోగుల చర్మము చైతన్యము తగ్గి తెల్లగాను, మైనపుముద్దవలెను కనుపిస్తుంది. కొంతమంది పాండురోగుల్లో ముఖం ఎర్రగాను నిర్మలముగానూ ఉంటుంది. అయితే వారివంటిలో ఓపిక ఉండదు. నిస్సత్తువ ఉంటుంది. ఇట్టి రోగులు కొంచెము లావుగాకూడా ఉంటారు. వీరి దేహములో రసం రక్తముగా మారదు. ఇట్టివారిని చూచి మందు వైద్యులు వీరికి రోగభ్రాంతేగాని నిజంగా రోగములేదంటారు. ఈ వ్యాధులలో లోపల అమితమగు వేడిమియు, చర్మము మీద చల్లదనమును ఉంటవి. కాలిక వ్యాధులన్నిటియందును

యిట్లుండునని యిదివరకే చెప్పినాము. తిన్న అన్నము సరిగా జీర్ణము కాకపోవటం, చర్మమునుండి చెమట బాగా రాక పోవడం, ఊపిరితిత్తులు కూడా తిన్నగా పనిచేయకపోవటం, ఈ వ్యాధులకు కారణము. జీర్ణక్రియ తిన్నగా లేక దేహములో మురుగు చేరుతుంది. అందువల్ల పీడనము యెక్కువగు తుంది. దానితో దేహములోపలి వేడికూడా యెక్కువగు తుంది. అప్పుడందు, దుర్వాయువులు పుట్టుతవి. అవి చివరల కంట వ్యాపించి, చర్మముకింద చేరుకుంటవి. చర్మములోనికి వ్యాపించి యున్న రక్తవాహికలు యీ మురికితో నింపుతవి. అందువల్ల చర్మమునకు శుద్ధరక్తము అందదు. కాన చర్మము నకు కాంతి తగ్గుతుంది. చల్లగా కూడా ఉంటుంది. రక్త క్షయానికిగాని, పాండువ్యకుగాని, అజీర్ణమే కారణమని తెలి నది. వైద్యులు పెట్టే భయమువల్ల యెంతోమంది చల్లగాలిలో తిరగటానికిగాని, తాము పరుండే గదులలోనికి మంచి చల్లని గాలి రానిచ్చుటకుగాని, యెంతమందికో తటస్థపడుటలేదు. అందు వల్లకూడా, వారు మురికిగాలినే పీల్చి రోగగ్రస్తులవుచున్నారు. నిజానికి పరిశుద్ధమగు గాలి పీల్చినపుడు అది దేహములోఉండే సర్వధాతువులను, శుద్ధిజేసి దేహానికి ఆరోగ్యాన్ని కల్గిస్తుందని మందువైద్యులకు తెలుసు. అయితే రోగంవచ్చినపుడు మాత్రం రోగికి చల్లగాలి తగిలితే అపకారం జరుగుతుందనీ వారట్టి రోగులను మూతగదులలో పక్కమీదనుంచి లేవనీయకుండా అట్టే ఉంచుతున్నారు. మందు వైద్యమువారి విజ్ఞానము లోటుగా ఉన్నదని యిందువలనకూడా నిర్ణయించవచ్చు.

వారికి నిజమైన రోగకారణము తెలియనందున పైపై లక్షణా లకు మాత్రమే చికిత్సచేసి రోగాన్ని లోపలనే అణచిపెట్టు చున్నారు. తెలియనివారు యిదే రోగనివారణము అనుకుంటు న్నారు. రోగముమాత్రము అప్పటికి అణిగి క్రానికవ్యాధిగా మారుచున్నది. ఇదివరకు యీ నివారణయొక్క మాయ యెవ రికీ అర్థమయ్యేది కాదు. ముఖనిదానశాస్త్రము వచ్చినదిగాన రోగము నిజంగా నయమైనదో లేదో యిపుడు మనము స్పష్ట ముగా చెప్పగలము.

రక్తక్షయము, పాండువ, కృత్రిమమైన మందులతో నయము చేసినపుడు ఇదివరకకున్నా జీర్ణకోశము యింకా చెడిపోతున్నది. అటిస్థితిలో మందులతో చికిత్సచేయకుండా దేహమునందలి రోగపదార్థము మనపద్ధతిలో వెలువరించుట సరియైనమార్గము. ఈ రోగములందు మందువైద్యమువారు తరుచుగా వాడే లోహామండూరాలు జీర్ణశక్తిని యింకా పాడుచేస్తవి. ఆకలి కూడా బాగా చెడిపోతుంది. బాగా మసాలాలువేసిన పదా ర్థాలుగాని నాలుకకు రుచింపవు. అంతమసాలాలు చేసిన పదా ర్థాలు అసలే జీర్ణము కావని అవి దేహమును ఉద్రేకపరుస్త వని కొంతకాలానికి యెంతరుచిగా చేసిన పదార్థమైనా రుచి లేకుండా పోతుందని రోగికి అసలే ఆకలిలేకుండాపోతే నీరసము వస్తే వైద్యుడు యింకా యింకా బలకరమైన ఆహారాలు తిన మంటుంటాడు. రోగికి యేమీ సయించవు అందువల్ల అతనికి నిరాశకలుగుతుంది. అతడు తినమన్న మాంసము, కోడిగుడ్లు మొదలైనవి తినలేక, మనసలహాకొరకు వస్తాడు. ఒకవారం

మనచికిత్సచేసేసరికి మందువైద్యుల పొరపాటు అతనికి బాగా తెలుస్తుంది. అప్పటికే మనవైద్యములో ఉండే మేలుకూడా తెలుస్తుంది. ఉత్సాహంగా చేస్తారు.

ఆవిరి ఉపశమన స్నానాలు చేయుటవలన బాగా చెమట పోస్తుంది. చర్మములోని రక్తవాహికలయందలి మాలిన్యములు తొలగిపోతవి. దానితో చర్మమునకు శుద్ధరక్తము తిరిగి లభిస్తుంది. కాంతిహీనమైన చర్మములో తేజస్సు కనుపడుతుంది. సహజమైన రంగు వేడిమి తిరిగి చేకూరుతుంది. ఉద్రేకముకలిగించని తేలిక జీర్ణపదార్థాలు రక్తక్షయ రోగులకు సులభంగా వొంటికి పట్టును. మనదేహములో ఉండే మాలిన్యాలను వెలువరించేటందుకు రాతగిన తరుణములగు రోగములు మంచి నీటితో యేవిధంగా వస్తవో ఆవిధంగానే నిర్మలమైన చల్లని గాలి పీల్చుటవలనకూడా తరుణములగు శ్వాసకోశసంకటాలువచ్చి దేహమునందలి మాలిన్యములు తొలగిపోవుచున్నవి. జలుబు రాకుండా ఉండుటకొరకు చల్లగాలి చన్నీరు వాడరాదని మందు వైద్యులు నిర్ణయిస్తారు. జలుబుచేయటం అంటే దేహములో ఉండేమాలిన్యములు వెడలిపోవుట అనేసంగతి వారికి తెలియక నీటిని గాలిని అందకుండాజేసి యిట్టి శ్వాసకోశసంకటాలు రాకుండా చేస్తున్నారు. తొట్టివైద్యానికి సంబంధించిన మన శాస్త్రము చదివినవారికి జలుబు యెంతమంచిదో, బాగా తెలుస్తుంది. రోగపదార్థం దేహములో లేనివారికి జలుబనేదిరాదు. ఎవనిదేహములో రోగపదార్థ ముంటుందో వానికి జలుబుచేసి నపుడు చన్నీటిని సరిగావాడి మంచిగాలిని పీల్చి ఉద్రేకము

కలిగింపన్ని తేలికపథ్యము పెడితే, ఆ జలుబు సులభంగా నయమవుతుంది. అతని ఆరోగ్యము వృద్ధిపొందును. అతని దేహము కూడా గట్టిపడుతుంది. అదివరకుకంటే దేహములోపలిభాగాలు యింకా నిర్మలములుగా ఉంటవి. బైట వాతావరణములో ఆకస్మికముగా కలిగే అమితమగు శీతోష్ణాల మార్పువలన దేహధాతువులు బలపడి రోగపదార్థాలను వెలువరించే యీ స్వాస్థ్యసంకటాలు వస్తవి. అట్టిదే జలుబు. దానితో దేహములో మాలిన్యాలు వెడలిపోతవి. ఈ జలుబు అపకారం చేయదు. ఉపకారమే చేస్తుంది. ఆరోగ్యము వృద్ధిచేస్తుంది.

రక్తక్షీణము పాండువ వచ్చిన రోగులకు వారివారి దేహము యొక్క ధాతుశక్తి పరిమితినిబట్టి చికిత్స తీవ్రముగాను నెమ్మదిగాను చేయవలసి వుంటుంది. ఆ వివరాలన్నీ గ్రంథస్థం చేయుంట సాధ్యముకాదు. అయినప్పటికీ యీక్రింది రోగనివారణ వృత్తాంతమువలన యీరోగానికి చికిత్స యెట్లాచేయవలసిందీ సామాన్య నియమాలు దానివలన తెలియును. ఒకామెకు 15వ సం॥ నుంచి పాండువ. ఆమె 4 సంవత్సరాలు మందువైద్యము చేసినది. యేమీ నయము కాలేదు. ఆమెకు వైద్యుడు లోహ సంబంధము అయిన మాత్రలు యిచ్చాడు. తర్వాత పెప్సిన్ కలిపి యితరమందులు వాడినాడు. బాగా బలమువచ్చేటందుకు మాంసం కోడిగ్రుడ్లు మాంససారము యిచ్చేవారు. ఇదిగాక హంగరీ దేశంనుంచి తెప్పించి 2 గ్లాసులసారాయి యిచ్చేవారు. కాఫీ, టీలను మాని చిక్కని కాచినపాలు యిచ్చేవారు. మంచి నీళ్ళు తాగితే అందులో సూక్ష్మజీవులుండి జబ్బు చేస్తుందని

దాహముతీరే టందుకు యనలతో పోసినసారాయి యిచ్చేవారు. నెలలు సంవత్సరాలు ఆ వైద్యుడు చెప్పినట్లు చేసినారు. రోగం నయము కాలేదు. ఆమె ఆరోగ్యము నానాటికి దిగనాసిల్లి పోయినది. ఆమె జీర్ణశక్తి దుర్బలమై పోయినది. ఇంతబలమైన ఆహారాన్ని యిచ్చిన ఆమెబలము నానాటికి ఉడికిపోయినది. శక్తి సన్నగిలినది. ముఖము తెల్లబడిపోయినది. మనస్సులో వుత్సాహము నశించినది. వైద్యునిసలహా తనకేమీ వుపయోగించలేదని ఆమె తెలుసుకొన్నది. తన దేహములో సరిఅయిన స్థితిగతులు లేనందువలన వైద్యుడిచ్చిన మంచి మందులన్నీ ఆమెకు ఉపయోగింపలేదని అనుకున్నది. తనరోగము ముదరటానికి వైద్యుడే కారణమని ఆమె యెప్పుడూ నిందింపలేదు. బలమైన ఆహారాలు తింటున్నది. మలబద్ధకము ఉన్నప్పటికీ ఆపదార్థాలు కిందికి వెళ్ళి పోతున్నవి. అయినప్పటికీ ఆపదార్థాలవల్ల ఆమెకు బలం రావడములేదు. జీర్ణకోశము బలహీనము కావడమే యిందుకు కారణము. ప్రథమ రజస్వలఅయినది మొదలు ఋతుధర్మము ఎప్పుడూ సక్రమంగా లేదు. 4సం॥ మందు వైద్యము చేసేసరికి ఆమెస్థితి మరింతచెడినది. దిగులు, విసుగు, భయము, అవిశ్వాసము ఆమెలో ప్రవేశించినవి. ఆత్మహత్య చేసుకుందామనుకునేది. తనకు తనవారికికూడా భారమై యీామె నావద్దకు వచ్చినది. వెంటనే పథ్యము శాకములను పెట్టినాను. (మాంసాహారములు మానిపించినాను) మంచినీరు తప్ప యింకేమీ త్రాగనీయలేదు. ఆరుబయిట గాలిలో ఓపినంత వ్యాయామము చేయించాను. కిటికీలు తీసి గదిలో

రాత్రిళ్ళు పరుండజేసినాను. దినానికి 3 లింగస్నానాలు, వారానికి 2 ఆవిరిస్నానాలు చేయించేవాడిని. మొదటివారంలోనే ఆమెకుండే నిరాశతగ్గిపోనారంభించినది. 4 మాసాలు మన వైద్యం చేసేటప్పటికి ఆమెజీర్ణశక్తియు, ఋతుధర్మమును దాదాపు సహజస్థితికి వచ్చెను. నూతన ఉజ్జీవనము కలిగెను. అదివరకు చర్మము ఆర్చుకొనిపోయి ఉండేది. యిపుడు మెత్త పడి సహజోష్ణమునకు వచ్చినది. ఇంకొక 6 మాసాలు చేయించే సరికి ఆమె ఆరోగ్యము ఆశ్చర్యకరముగా వృద్ధి పొందినది. ఒక్క సంవత్సరములో ఆమెకు పరిపూర్ణారోగ్యము కలిగినది. తల్లితండ్రులకు అంటిన సవాయి మొదలగు సుఖరోగములు వారిని బాధించుచుండగనే గర్భస్థమైనవారికి ఈమూర్ఛ రోగము వస్తుంది. అనేక వ్యాధులను వరుసగా మందులతో అణచిపెడుతూరాగా పర్యవసానంగా కూడా మూర్ఛవస్తుంది. తల్లితండ్రులకు వచ్చిన సవాయిరోగానికి చేసిన మందుచికిత్స వలన ఆరోగము వారిదేహములలోనే జీర్ణించిపోయి వారినుండి గలిగిన సంతానానికి బిడ్డలు పుట్టునప్పటికే అట్టిరోగపదార్థము సంక్రమించి మూర్ఛలకు మూలమగుచున్నది. ఈ వ్యాధిలో రోగి గిలగిల తన్నుకొనడం, చేతులు కాళ్ళు సాగతీసుకొనడం, నోట నురుగు రావటం, స్మృతిలేకపోవటం, మొదలైన లక్షణములుంటవి. ఇట్టి రోగులకు మనవైద్యముచేసి అద్భుతముగా రోగనివారణము చేసిఉన్నాను. మొదట ఉదరములో ఉన్న రోగపదార్థములో మండమేర్పడి అది పొంగి పాదములవంకకు వ్యాపించును. అందువలన కాళ్ళువణికి స్వాధీనముతప్పి రోగి క్రిందపడతాడు. ఇట్లు కొంతకాలం జరిగిన తర్వాత రోగ

పదార్థమండమునందు పుట్టిన వాయువులు శిరస్సులోనికి పోయి మతిభ్రమ స్మృతితప్పటయు కలుగును. అందువల్లనే మూర్ఛలో ఇంద్రియములు అవశములై రోగికి తెలియకుండగనే కొట్టుకొనును.

మూర్ఛను ఒక అగ్నిపర్వతముతో పోల్చవచ్చును. భూమిలో ఉండే సూర్యకారము, లోహములు, జలము కలిసి ఉడికి అందు నిముడజాలక భూమిని బ్రద్దలుచేసుకుని అగ్నితోకూడి భూమిమీదకు వచ్చును. తర్వాత కొంతకాలము నెమ్మదిగా నుండి తిరిగి భూమిలో ఉన్న సూర్యకారము మొదలగునవి యెక్కువై విరివిచెందినపుడు అది భూమిలో నిలువజాలక తిరిగి అగ్నిపర్వతమువలె బైటకు వచ్చును. ఆవిధముగానే దేహము నందు మిక్కుటముగా జేరియున్న రోగపదార్థము ఉదరము నందు పొంగిపొంగి అది మెదడువంకకు వ్యాపించును. అప్పుడు మూర్ఛవస్తుంది. ఆ మూర్ఛ పొయ్యేటప్పటికి ఉదరమునందలి పొంగుకూడా అణగిపోవును. కాని దేహము ఆ మూర్ఛతో దుర్బలమైపోవును. దానితో తాత్కాలికముగా కొంతకాలము మూర్ఛ లుండవు. కాని ఉదరమునందు తిరిగి రోగపదార్థ మందు మండముపుట్టినతోడనే అందుండి వాయువులు బైలు దేరి మెదడులోనికి పోవును. దానితో మూర్ఛవస్తుంది. ఇట్లు నిరంతరము జరుగుతుంటుంది. మందువైద్యములో దీనికి చికిత్స లేదు. అసలు ఈ రోగముయొక్క స్వభావమే వారికి తెలియదు. ఇది నాడీవ్యాధి యని నమ్మిక. అందుకని పొటాసియం బ్రొమైడ్ వంటి అపకారమైన మందులను వారీ వ్యాధికి వాడుచున్నారు.

మూర్ఛరోగియొక్క దేహమునందు చేరిన రోగపదార్థము యొక్క రీతిని బట్టియు, పరిమితిని బట్టియు మనచికిత్స చేసినపుడు ఫలితాలు మొదట వేరు వేరుగా ఉంటవి. కొందరికి చికిత్స చేసినప్పటి నుండియు మూర్ఛలు తగ్గితగ్గవస్తవి. మరికొందరికి చికిత్స మొదటలో మూర్ఛలు తరచుగా వస్తవి. రోగపదార్థము వెడలిపోవుటకు దేహములో కలుగుతూఉండే. మూర్ఛలనుబట్టి మొట్టమొదట నిట్టి తాత్కాలిక లక్షణములు చిహ్నములు ఉంటవి దేహములో ఉన్న రోగపదార్థము తగ్గినకొలదినీ యీమూర్ఛలు క్రమంగా తగ్గిపోతవి. రోగపదార్థము వెడలి పోవటానికి అనుకూలమైనచోట ఉంటే మూర్ఛలు ఆకస్మికంగా ఆగిపోతవి. మూర్ఛలయొక్క బలముతగ్గి క్రమక్రమముగా తాత్కాలిక స్మృతిభ్రంశముగను తలదిమ్ముగను ఉండును. ఇట్లు యింకాకొంతకాలం చికిత్సచేస్తే మూర్ఛలు అసలే లేకుండా పోతవి. దేహములో రోగపదార్థము వ్యాపించినరీతిని బట్టి వెడలిపోతుంది. కనుక ముఖనిదాన శాస్త్రమువలన మనము ముందుగానే కనిపెట్టి రాబోయే స్వాస్థ్య సంకటాలను రోగికి చెప్పినట్లయితే స్వాస్థ్యసంకటాలు వచ్చినపుడు వారుధైర్యముగా ఉందురు.

మనవైద్యములో యీరోగాన్ని అన్నిదశలలోను నేను కుదిర్చితిని. కొంతమందికి అదివరకే రోగపదార్థము అమితముగా చేరియున్నందువలన రోగనివారణము కావటానికి చిరకాలం పట్టింది. బ్రోమిన్ మొదలగు మందులతో జీర్ణక్రియ బొత్తిగా పాడై దేహమునందలి ధాతువులు అమితముగా చెడిపోయి

నపుడుమాత్రం రోగనివారణము కాదు. వారియందలి నాడీ మార్గములు చెడిపోయినందున రోగపదార్థమును వెలువరించుటకు అసాధ్యమవును. మన వైద్యములో మొండిమూర్ఛ వ్యాధులు చిరకాలము ఓర్పుతో చికిత్సచేసి కుదిర్చియున్నాను. మూర్ఛలు రావటం మానినంతనే దేహములోనున్న రోగపదార్థము అంతాపోయిందని యెవరూ భ్రాంతిపడరాదు. మూర్ఛలుపోయిన తర్వాతకూడా చిరకాలం చికిత్స చేస్తేనే గాని మూర్ఛలు యికయెప్పటికీ రాకుండా పోవు. బడిలో చదివిన పిల్లలుకూడా చాలమంది యీ మూర్ఛవ్యాధి ప్రవణతగలవారున్నట్లు వైద్యపు పరీక్షచేసినపుడు వెల్లడియగుచున్నది. అందువల్లకూడా యీ తొట్టివైద్యము యెక్కువ వ్యాప్తికావలసియున్నది. నేను కుదిర్చిన ఒక మూర్ఛరోగి వృత్తాంతము యిచట చేర్చుచున్నాను.

ఒకామెకు 13 వయేటనుండి, 19 వయేటివరకు మూర్ఛలు. వారమునకు 2 తూర్లకు తక్కువగా రావటంలేదు. ఆమె జీర్ణక్రియ బొత్తిగా చెడిపోయినది. ఋతుధర్మము క్రమముగాలేదు. ప్రథమ రజస్వల అయినతర్వాత ఆమె ఋతుధర్మమెప్పుడునూ సహజముగాలేదు. ఒకొక్కప్పుడు కొన్నిమాసాలు ఋతువు సరిగా కాదు. కొన్నినెలలు అమితముగను, తరచుగను అవుతుంది. ముఖనిదాన శాస్త్రమువలన ఆమెదేహములో రక్తము క్షీణించి పాండురోగము వచ్చినదనియు, క్షయరోగం రావటానికి సిద్ధముగా నున్నదనియు, నేను కనుగొంటిని. ఆమెతల అమిత లావుగా ఉన్నది. ఆమె దేహములో ఉండే రోగపదార్థము

అనుకూలమైనచోట ఉన్నదనియు, అందువలన ఆమె మూర్ఛలు నయమగుననియు ముందుగానే అభయ హస్తమిచ్చితిని. చికిత్స మొదలుపెట్టినపుడు మూర్ఛలు మొదటిలో తరుచుగా వస్తవని ఆమెకు చెప్పి ఉంచితిని. అవి క్రమక్రమముగా తగ్గి చివరకు లేకుండా పోతవని కూడా చెప్పితిని. మూర్ఛవ్యాధులలో నీటిఆవిరిని పట్టరాదు. వానిని మాని కటి లింగ స్నానములు మాత్రమే చేయించితిని. ఉచితమైన పథ్యము పెట్టితిని. 3 వారాలలోనే ఆమెకు మూర్ఛలు పూర్తిగా పోయినవి. నేను చెప్పినట్లే మొదటి 15 రోజులలోనూ దినమునకు 2,3 తూరులు మూర్ఛలు వచ్చేవి. తర్వాత కొంతసేపు ఒడలు తెలియక తల దిమ్ముగా నుండుట మాత్రం వస్తూఉండేది. తర్వాత 3 వారాలకు క్రమంగా మూర్ఛలు నయమైనవి. దేహములో తగినంత ధాతుశక్తి నిలిచియున్నందువలనను, ఆమె చిన్నదగుటవలనను, జీర్ణక్రియ వెంటనే బాగుపడుటవలనను, యింతతొందరగా రోగనివారణమైనది. నేను చికిత్సచేసిన యితరరోగులలో యింతకు యిబ్బడి ముబ్బడికాలం పట్టినది. ఇంతకు యెక్కువకాలం కూడా పట్టినది.

---

# ౧౦. నిష్కారణభయము

కొంతమంది మనుష్యులు ఆరుబైట నడువలేరు. దీనికి కూడా దేహములోని రోగపదార్థమే కారణము. ఆ రోగులకు దేహ అవయవాలలో ఉండే వత్తిడికిని ఆరుబైట గాలిలో ఉండే వత్తిడికినీ తేడా ఉండుటవలన వారు ఆరుబైట గాలిలో నడిచి నపుడు దేహము లోపలికో బైటికో వత్తినట్లు కనిపిస్తుంది. ఆ బాధచేత వారు ఆరుబైట గాలిలో సుఖముగా నడువలేరు. ఇండ్లమధ్య ఉండేగాలి బైటకాలికంటె పీడనము తగ్గిఉండును. గనుక అట్టిచోట వారు సులభంగా నడువగలరు. ఈ రోగం కూడా క్షయ, కర్కాటవ్రణము, మొదలగు వ్యాధులవలెనే యెన్నో రోగాలకు చివరిదశగా వస్తుంది. కొంతమందికి మాత్రం పితృయంగా సంక్రమించిన ప్రబలమైన రోగపదార్థం చేత, యీవ్యాధి వస్తుంది. రోగి దేహములో చేరిన రోగపదార్థముయొక్క పరిమితిని బట్టియు, చేరిన రీతినిబట్టియు రోగం నయముకావటం ఆధారపడి యుంటుంది. ఏమైనప్పటికీ రోగనివారణ కావటానికి మాత్రం చిరకాలం చికిత్స చేయ వలసి ఉంటుంది.

---

# ౧౧. నేత్రవ్యాధులు - కర్ణవ్యాధులు.

ఈ రెండు జ్ఞానేంద్రియాలు అనేకతీవ్రమైన వ్యాధులకు గురి యగుచున్నవి. వానికి కారణము వేరే వెతకకుండా కంటిలోను చెవిలోను మందువైద్యులు వెతుకుచున్నారు. కంటివ్యాధులు నేత్రవ్యాధులుఅవి యేయేపేరుతో ఉన్నా వానియందులక్షణము లెట్టివి ఉన్నప్పటికీ దేహమందలి కాలికవ్యాధి వలననే వచ్చు చున్నవి. నిరంతర పరిశీలన వలననూ, చిరకాలానుభవము వలలనునాకీవిషయంలో సంశయములేకుండా పోయినది. మాంస, సంతానిక, సర్పి, ఆటలమ్మ, పొంగు మొదలగు తరుణవ్యాధు లను దేహమునందు మందులతో బలవంతముగ అణచిపెట్టి నప్పుడును, టీకాలు వేయుటవలన ధాతుశక్తి నశించినపుడును నేత్రవ్యాధులు, కర్ణవ్యాధులుకలుగుచున్నవి. ప్రతికర్ణవ్యాధియు నేత్రవ్యాధియు దేహమునందు మిక్కుటమగు రోగపదార్థము లేకుండా రాదనే సంగతి ముఖనిదానశాస్త్రము వలన ప్రత్యక్షముగ చూపించ గలము. అందువలననే నేత్ర కర్ణవ్యాధులకు రోగపదార్థమే ప్రత్యక్ష కారణము. నేత్ర వ్యాధిగాని కర్ణవ్యాధిగాని వచ్చినవారు, యితరవిధంగా ఆరోగ్యంగా ఉండటం సాధ్యంకాదు. దేహములో రోగపదార్థ ముండి అది కంటిలోనికిగాని చెవిలోనికిగాని వ్యాపించినపుడే ఆయాఅవయవములు రోగగ్రస్తము లగుచున్నవి. ముఖనిదాన శాస్త్రమువలన కంటి, చెవి, వ్యాధులు రాకపూర్వమే సంవత్సరములకు ముందుగానే మనమిట్టిసంగతులు కనిపెట్టిచెప్ప

గలము. ముందు కర్ణవ్యాధులను గురించి విచారిద్దాము. మెదడులోనుండి ఒకనాడి చెవిలోనికి వ్యాపించి ఉన్నది. దానికి కర్ణనాడియని పేరు. దేహములో రోగపదార్థము ఉదరము నుండి పైకి తలలో వ్యాపించునపుడు మొదట కర్ణనాడికి దెబ్బ తగులుతుంది. కర్ణదుందుభిమీదనుండే పొర బొక్కపడుతుంది. లేదా మొద్దుబారి శబ్దతరంగములను, మెదడులోనికి చేర్చడం మానివేస్తుంది. అప్పుడు చెవులోనుంచి చీమన్నా కారుతుంది. పోటయినా పుట్టుతుంది. కిందనుంచి రోగపదార్థముయొక్క వత్తిడి యెక్కువైతే యీ చీము నిరంతరముగా కారుతుంది. ప్రకృతివైద్యముతో యీ చీమును వెంటనే తగ్గించుకోకపోతే చెవి యింకా చెడిపోతుంది. చెముడు కూడా వస్తుంది. మందులతో యీరోగాన్ని అణచిపెడితే స్థితి మరింత పాడై పోతుంది.

ఇంతదూరము వివరంగా మన శాస్త్రము చదివినవారికి చెవులో నుండి చీము కారటం, జలుబు మొదలైన శిరోసంబంధ వ్యాధు లున్నూ, పచ్చసెగ, శ్వేతకుసుమ, మొదలైన జననేంద్రియ సంబంధమైన వ్యాధులున్నూ ఒకే ఒక కారణముచేత వచ్చునని తెలుసుకోగలరు. దేహములో అంతర్గతముగా చేరియున్న రోగ పదార్థము మండము నొంది; తరుణంగా వెడలిపోవటానికి జరిగే ప్రయత్నం, యీచీము, శ్లేష్మము మొదలగునవి. రోగ పదార్థము, మండమైనపుడు ముదిరి పులుస్తుంది. ఆపులుపు వలన వేరు వేరు అవయవాలల్లో ఉండే ఆమత్వచపుపొర తెగి పోతుంది. మరీ ముదిరిపోతే, చీము గారే పుండ్లుగాను, చిన్న

రణాలుగాను తయారవుతుంది. బైటిగాలితో సంబంధములేని లోపలి పొరలలో యిట్టి మంటలు కన్పడతవి. ఇట్టి మంటలు కన్పడి, చీముకారుటయనగా దేహములో రోగపదార్థము మిక్కుటముగా ఉన్నదని దేహములో ధాతుశక్తికూడా తగినంత ఉండబట్టే దానిని బలముగా బైటికి గెంటుచున్నదని అర్థము.

నేత్రివ్యాధుల సంగతీ యింతే. కంటిలో నుండే స్ఫటికబింబానికి రోగపదార్థము అడ్డువచ్చి చూపును తగ్గిస్తుంది. దీనికే దగ్గర చూపు అంటారు. ఇంకా కొన్ని సందర్భాలలో రోగపదార్థము లోపలి పొరలలోనికి ప్రివేశించి కాచబింబాన్ని, దానికి సంబంధించిన నరాలను వాటిస్థానంలో లేకుండా చేస్తుంది. అప్పుడు చూపు కనపడదు.

స్ఫటికబింబము మీద తెల్లని పొరవేసి దృష్టిమీదికి బైటి బొమ్మ పడకుండా అడ్డువస్తుంది. దీనికి శుక్లమని పేరు. చిరకాలము దేహములో రోగపదార్థము చేరి చేరి చివరకు యీ శుక్లము వస్తుంది. పడుచువారికి కాకుండా వృద్ధులకు యీ వ్యాధి ఆకారణము చేతనే వస్తుంది. కంటిలో చేరిన రోగపదార్థము విరివిజెంది కనుగ్రుడ్డు లావు అవుతుంది. అప్పుడు నీలవర్ణపు పొర అడ్డమువచ్చి చూపు తగ్గిపోతుంది. దీనికి నీలపుపొర అని పేరు. శస్త్రవైద్యులు కనీనికలో బొక్కపెట్టి యీవ్యాధిని నయముచేయటానికి ప్రియత్నిస్తారు. తత్కాలంలో ఉపశాంతి కల్గునుగాని మూలకారణమైన రోగపదార్థము, కదలింపనందున రోగం తిరిగి వస్తుంది. ఈ సంగతులన్నీ మనకు తెలిసినపుడు

కంటికి చేసే శస్త్రవైద్యమంతా, మూలకారణాన్ని వదలి తత్కాలంలో కనపడే బైటిలక్షణాలను పోగొట్టటానికి చేసే ప్రయత్నములేను. తిరిగి దేహములోనుండే రోగపదార్థము నందు మండముపుట్టి అదే రోగముగాని యింకొక రోగముగాని తప్పకుండా వస్తుంది. అప్పటివరకు శస్త్రము జయప్రదముగ జరిగినదని సంతోషిస్తారు ఈకారణముచేత నేత్రమునకు చేసిన శస్త్రచికిత్స యెంత నిరుపయోగమైనదో తెలియుచున్నది.

## కండ్లకలకలు

ఈవ్యాధి చిన్నపిల్లలకు తరచుగా వస్తుంది. తల్లితండ్రులనుండి బిడ్డకు సంక్రమించిన రోగపదార్థమునందు దేశ కాల పాత్రము లందు కలిగిన మండమువలన యీవ్యాధివస్తుంది. అందువల్లనే చికిత్స చేసేటపుడు చిరకాలము ఓర్పుగా చేయవలసి ఉంటుంది అప్పటికి కంటిలోనుండే మంటలు పోట్లు యెరుపులు తగ్గుతవి. దీనికి మనవైద్యము అద్భుతంగా పనిచేస్తుంది. నేను కుదిర్చిన రోగులవృత్తాంతము వ్రాస్తాను. 8 సంవత్సరాల పిల్లవానికి యీవ్యాధి వచ్చింది. ఆకంటిలో యట్రోపిన్డ్రాపుమందు వేశారు. నయముకాలేదు. వేరువేరు చికిత్సాలయాల్లో 4 సంవత్సరాలు రకరకాల మందులువాడి శస్త్రచికిత్సలుకూడాచేసినారు. నయముకాలేదు. చిట్టచివరకు ఆపిల్లవానికి తలలో నంజునీరు ఉన్నదని అందువలన ఆ కన్ను యిక కుదరదని నిర్ణయించిరి. అప్పుడు తల్లి పిల్లవానిని నావద్దకు తీసుకువచ్చినది. అప్పటికే తలకాయ లావుగా నున్నది. కన్నులు యెర్రగా నున్నవి. ఇదివరకు మందులకు నయముకాక దేహములో నిలిచి

యున్న రోగపదార్థమువలననే యీస్థితివచ్చినదని ముఖనిదాన శాస్త్రమువలన నేను నిశ్చయించినాను. ఎంతో ఓర్పుగా చికిత్స చేస్తే ఈ రోగం నయమవుతుందని అతనితల్లితో చెప్పినాను. దానికి కారణము ఆ బిడ్డదేహములో చేరిన రోగపదార్థము వెనుకవైపున చేరియుండుటయే. ఉద్రేకములేని పథ్యము పెట్టినాము. దినమునకు 3-4 ఉపశమన స్నానములు చేయించినాము. వారం చికిత్స జరిగేటప్పటికే అతని కంటిమంటలు కొద్దిగా తగ్గినవి. అతను కన్నులు తెరచి నెమ్మదిగా చూడగలిగెను. ఇదివరకు యెన్ని మందువైద్యాలు చేసినా అతనికింతమాత్రము సుగుణమన్నా కలుగలేదు. అతని జీర్ణశక్తి కూడా దాదాపు సహజస్థితికి వచ్చినది. ప్రతిదినము ఆటంకము లేకుండా విరేచనము అవుచున్నది. పక్షము దినములు జరిగిన తర్వాత కన్నులలో మంటలు తగ్గినవి.

వెలుతురును బాగా చూడగలుగుచున్నాడు. 4 వ వారములో ఆపిల్లవానికి 4 వ సంవత్సరములో కనుపడి, మందులతో అణచి పెట్టబడిన వేపపూత (పొంగుజ్వరము) తిరిగి కనపడినది. ఈ నాలుగు వారాలలోను దేహమునందలి ధాతుశక్తి వృద్ధి అయినందున శరీరమునందలి రోగపదార్థమును బైటికి వెళ్లగొట్ట గలిగినది. జ్వరము నయమయ్యేటప్పటికి కంటి మంటలు మెరుపులు తగ్గటమే కాకుండా, మెదడులో జేరిన నంజునీళ్లుకూడా దీనితో నయమైనవి.

జంటదృష్టి:— దేహమునందలి రోగపదార్థము కంటిలోనికి వ్యాపించుటచే స్ఫటిక బింబానికి కాచబింబానికి మధ్యగాని,

స్ఫటిక బింబముమీదగాని, కాచబింబముమీదగాని ఒకచుక్క యేర్పడును. మన వైద్యము చేసేటపుడు దేహములోని రోగ పదార్థము పూర్తిగా పోతుందిగనుక, జంటదృష్టి కాకుండా కంటిలో ఉండే మకిలమాంద్యము పోయి దృష్టి నిర్మల మవుతుంది.

మెల్లచూపు:—దీనికే తిర్యక్ దృష్టిఅనికూడా అంటారు. కనుగ్రుడ్డును కదలించే కండరములలో మాలిన్యములు చేరుటచేత యీవ్యాధి వస్తుంది. రోగపదార్థము కంటిలోని కనుగ్రుడ్డును కదలించే కండరాలల్లో చేరి వానిని మొద్దుబారించును. అవి లావై బిగసెక్కి కనుగ్రుడ్డును కదలింప లేకపోవును. ఆకండర ములో ఉండే సాగునట్టి గుణము తగ్గిపోవును. అందువలన అది పొట్టిదగును. అప్పుడు కన్ను యిటుఅటు సమముగాతిరుగక ఒకవైపునకు యెక్కువగా తిరుగుతుంది. అపుడు యెదుటిచూపు ఉండక ప్రక్కకు ఉంటుంది. అప్పుడు కంటిశస్త్రవైద్యుడు యేమిచేస్తాడు?. బిగబట్టిన కండరాన్ని కోసి తీసివేస్తాడు. దీనిని బట్టి కంటివైద్యులకు యేమీ కంటివ్యాధులను గూర్చి తెలియ దని తేలుచున్నది.

మెదడులో బైలుదేరిన దృజ్ఞాడులు కుడివైపున బైలుదేరి నది యెడమకంటిలోనికిని మెదడులో యెడమభాగమున బైలు దేరిన దృజ్ఞాడి కుడికంటిలోనికిని వ్యాపించి ఉన్నది. అందు వలన ఒకని దేహములో రోగపదార్థము కుడివైపున చేరిఉంటే అతని యెడమకన్ను జబ్బుపడుతుంది. అతని దేహంలో రోగ పదార్థము యెడమ వైపున చేరిఉంటే కుడికన్ను జబ్బు పడుతుంది.

నేత్రవైద్యములో నిపుణులైనవారు కంటిరోగాలను అసంఖ్యాకంగా గుర్తుపట్టి నామకరణము చేసిరి. అన్ని కంటిరోగాలకు కూడా కొద్దో గొప్పో దేహములో చేరిన రోగపదార్థమే కారణమై యుండుటవలన, కంటిరోగాలలో వచ్చే వివిధములగు నామరూపాలను గణింపకుండానే నేను చికిత్స చేస్తాను. దేహములో చేరిన రోగపదార్థము వేరువేరు పరిమితులలో ఉండుటవలననూ, వేరువేరు మార్గాలచే రోగపదార్థము కంటిలోనికి చేరుటవలననూ, కంటిరోగాలు వివిధలక్షణములుతో వస్తుంటవని చెప్పవచ్చును. మానవులందు చేరిన రోగపదార్థము కాలక్రమముగా వృద్ధిపొందుచుండుటచేత యిదివరకు లేని కంటి రోగాలు కూడా కొత్తగా రావచ్చు. అందువలననే నేత్రవైద్యులు నేత్రరోగాల జాబితాను యిప్పటికీ ముగింపలేదు. కొత్తకొత్త రోగాలకు కొత్తకొత్త మందులను వారు కనిపెట్టవలసివచ్చినది.

వివిధలక్షణాలతో కనుపడే నేత్ర కర్ణ వ్యాధులలో ఉండే భేదాలతో మనకు ప్రసక్తిలేదు. దేహములో చేరిన రోగపదార్థాన్ని వెలువరించితే అన్నిరకాల నేత్ర కర్ణవ్యాధులు నయమవుతవి. యిదివరకు వేరువేరు రోగాలకు చెప్పిన చికిత్సే వీనికి కూడా చికిత్స. స్వాభావికమైన మల మూత్ర స్వేద శ్వాసల ద్వారా దేహములోని మాలిన్యములను వెలువరించుటయే చికిత్స. కటి లింగస్నానాలు, ఉద్రేకములేని సహజమైన ఆహారము, తరచుగా వాడుతూఉండే దైశిక బాష్ప స్నానాలవల్ల, యీ నేత్ర కర్ణ వ్యాధులు నయమవుతవి. అదివరకే నేత్ర కర్ణ

వ్యాధులచే వివిధభాగాలు శిథిలములుకాకుండా ఉంటే తత్కాలంలో బాధించే మంటలు, పోట్లు, దురదలు నీరుకారటం, పుసులురావటం, మెరుపులు మొదలగునవి కొలదిదినాలలోనే ఉపశమిస్తవి. దానితర్వాత శాశ్వతముగా జరుగతగిన అపాయము తప్పిపోతుంది. కొలదివారాలలో పరిపూర్ణ ఆరోగ్యము కలుగుంది. కంటిలోని భాగాలు కొన్ని కొద్దిగా శిథిలమైయుండినా, మనవైద్యములో పరిపూర్ణ ఆరోగ్యము కలుగక పోయినా, ఉన్నఅవయవాలే బాగుపడి అంతకంటె చెడిపోకుండా నిలిచి ఉంటవి.

కొంతవరకు చూడటానికి అవి ఉపయోగిస్తవి. మందులతో అదివరకే కంటిరోగాలు కాలికమైనపుడు మనచికిత్స యెక్కువ ఓర్పుతో చిరకాలం ఆచరించవలసివస్తుంది. చిన్నతనములో కంటికివచ్చిన వ్యాధులను ప్రకృతివైద్యముతో కాకుండా మందు వైద్యముతో అణచిపెట్టినపుడే యీ కాలికవ్యాధులు రావటము. ఇట్టి కాలికవ్యాధులు నయముకావటానికి సంవత్సరాలు పడుతుంది. నెలలలోనూ నయముకావచ్చును. ఒకే మోస్తరు రోగం యిద్దరికివస్తే వారివారి దేహములయందుండే రోగపదార్థపు పరిమితినిబట్టి, అదిచేరియుండు వైపునుపట్టి ఒకనికి కొన్ని మాసాలలోనే కుదరవచ్చు, ఒకనికి సంవత్సరాలు పట్టవచ్చును. ఇంకా కొన్ని కంటిరోగాలకు నేను చేసిన చికిత్సలు వ్రాయుచున్నాను.

1. ఒక వర్తకునికి ఒక కుమారుడుండెను. అతనికి 9 దవ యేట నుండి సవాయివ్యాధితో బాధపడుచున్నాడు. వాని యెడమ

కన్ను మంటలు పోట్లు దురదలు మొదలగు బాధలతో శిథిలము అగుటకు సిద్ధముగా ఉన్నది. అమితముగా లావైన అతని తలకాయను చూచినపుడు అతని దేహములో రోగపదార్థము మిక్కుటముగా చేరినట్లు తెలియుచున్నది. దీనివల్లనే అతనికి పిత్రీయంగా సంక్రమించిన సవాయిరోగమును, తరుణమగు నేత్ర రోగమును కలిగినది. మందువైద్యవేత్తలు కంటిరోగానికి మెట్రోపియా అనే మందు అమితముగా వాడినారు. ఈమందు సుతరాంవాడతగినది కాదు. ఈ మందులో చాలా విషపుమూలికలు చేరిఉన్నవి. పైకివాడినమందు కంటిని మరింత చెడగొట్టినది. ఆరువారాలు మెట్రోపియా వాడినతరువాత కన్నుఅసలే పోయినది. విధిలేక వానితండ్రి అతనిని నావద్దకు తెచ్చినాడు. కంటికి నేనేమి చికిత్స చేయలేదు. కటి లింగ స్నానాలచేత ఉదరానికి నీటిఆవిరిపట్టి ఉద్రేకములేని సహజమైన పథ్యము పెట్టి అతనికి చికిత్స చేసినాను. ఒకవారములోనే కొంతఉపశాంతి కలిగినది. ఆరువారాలు అయ్యేటప్పటికి అతని సవాయిరోగం నయమైనది. దానితో కన్నునయమైనది. ఇప్పుడు అతనికన్నులను చూచినవారు యిదివరకు యేకన్నుగుడ్డిదో గుర్తుపట్టలేరు.

కంటిలో శుక్లము:— 60 సంవత్సరాల ముసలి ఆమెకు యెడమకంటిలో శుక్లము వచ్చినది. శస్త్రముచేసి శుక్లమును తీసివేసినారు. శస్త్రము జయప్రదముగా ముగిసినది అన్నారు. కాని అప్పటినుంచి కన్ను కనబడటం మానివేసింది. కుడికన్నులోకూడా శస్త్రము చేసేవారే. శుక్లము యింకా ముదరలేదని ఆపినారు. మందువైద్యమువారి అజ్ఞానము యెంత

యెక్కువగా ఉందో దీనినిబట్టి తెలుసుకొనవచ్చును. ఇల్లు నాలుగు మూలల అంటుకుంటేనేగాని మందువైద్యులు ఇల్లా ర్పటానికి నీరు తేరల్లేవుంది. రోగం లేతలో ఉండగానే, చికిత్స చెయ్యాలి అనేసంగతికూడా వారు కొత్తగా నేర్చుకోవలసి ఉన్నది. ఎప్పుడైతే ఆమెకు ఒక కన్ను పోయినదో దానితో మందువైద్యులమీద ఆమెకు విశ్వాసము పోయినది. అందు వలన వైద్యము చేయించుకునేందుకు మనవద్దకు వచ్చినది. ఉన్న కన్ను కూడా చాల దుర్బలమైపోయింది. దగ్గరగా కూర్చున్న మనిషి ఆడుదో మగవాడో కూడా చెప్పలేదు. చిన్నతనములో గొంతులో పెట్టిన టాన్సిల్సుకి మందు లతో చేసిన వైద్యమువలన కాలికమై ఆమెకీవ్యాధి కలిగినది. అప్పటినుండి ఆమెకు దగ్గరచూపు యేర్పడినది. అదే క్రమంగా ముదిరి శుక్లాలు వచ్చినవి. మన వైద్యము ఒక నెలరోజులు చేసిన తర్వాత ఆమె పెద్ద అక్షరాలు చదువ గలిగినది. మిగతా దేహారోగ్యము కూడా అభివృద్ధిపొందినది. అదివరకు దిగులుగాను నిరుత్సాహంగాను ఉండేది. మన వైద్యము చేసిన తర్వాత ఉల్లాసముగాను, విశ్వాసముతోను ఉంటున్నది. ఆమె దేహమంతా ఉజ్జీవనము పొందినది. కొలది దినాలలోనే ఆమె జీర్ణశక్తి వృద్ధిపొందినది. చికిత్స చేసిన కొలదినీ కన్ను నానాటికి నిర్మలమై క్రమక్రమముగా బలపడి ప్రకాశింప నారంభించినది. క్రమంగా ఆరునెల లయ్యేటప్ప టికి, కన్నంతా నయమైనది. దేహానికి ఆరోగ్యము కల్గినది. ఆమె దేహములో చేరిన రోగపదార్థము ముందునైపున చేరుట వల్లనూ వెనుకభాగములో రోగపదార్థము లేకపోవుటవలనను

నాడీమండలము బాగుగా పనిచేయుచుండుటవలనను, ఆమెకంత తొందరగా రోగనివారణమైనది. రోగపదార్థము వెనుక వైపున చేరియుండగా ఆమె కీవ్యాధి కలిగి ఉన్నట్లయితే వ్యాధి ఆమెను 6 మాసాలకుబదులు 6 సంవత్సరాలు పట్టేది. మనము వైద్యముచేసిన ముసలమ్మ యెడమకన్ను కూడా, కుడికన్ను తోపాటు నయమయ్యేదే. శస్త్రవైద్యుడు ఆకన్ను శాశ్వతంగా పనికిరాకుండా చేసినాడు.

ఎడమకన్ను గుడ్డి-ఎడమచెవిలోనుంచి చీముకారుతూ ఉన్నది. చెవిలో ధ్వనులున్నవి:—ఆరోగి 37 సంవత్సరాలవాడు. అనేక సంవత్సరాలనుండి చెవిలో చీముకారుతూవుంది. ఎడమచెవి 6 నెలలనుండి వినపడుటలేదు. ఎన్నిమందులు వాడినా ఉపయోగించని కారణముచే, మన వైద్యములోనికి వచ్చినాడు. ముఖనిదాన శాస్త్రమువలన కేవలము అజీర్ణమువలన అతనికి రోగము వచ్చిందని తెలుసుకున్నాను. స్వాభావికమైన పథ్యము పెట్టి దినమునకు 2_3, కటి లింగ స్నానాలు చేయించే వాడను, ప్రతిదినము వ్యాయామము చేసిగాని, దుప్పటులు, కప్పుకొని పరుండి - ని చెమట పట్టించుకొనేవాడు. కిటికీలు తెరచిపెట్టిన గదిలో పండుకొనేవాడు. 17 దినాలల్లో అతని చెవులో చీము కట్టినది. ఎడమచెవి, వినపడ నారంభించినది. ఇంకొక పక్షము దినములలో చెవులలోని మోతలు కూడా మానినవి. వైద్యము చేసిన మొదటిరోజునుండియు - తని జీర్ణశక్తి వృద్ధి పొందినది. అందువలననే చికిత్స మొదలుపెట్టిన తరువాత 31 రోజుల్లోనే అతని రోగంఅంతా నయమైనది.

చెవుడు:— 24 సంవత్సరముల రోగి. అతనికి చిన్నతనములో పొంగుజ్వరము వచ్చినది. దానికి మందు వైద్యము చేసినారు. అందువల్ల లోపల అణగిపోయి అది కాలికమై క్రమక్రమముగా మేహ తము, దౌర్బల్యము వచ్చినవి. ఆ రోగపదార్థము తల లోనికికూడా చేరుటవలన ఒకచెవి వినపడదు. ఎన్నోమందులు వాడినారు. ప్రయోజనము కనుపించలేదు. అనేకమంది బంధువుల ప్రోద్బలమువల్ల మన వైద్యము నవలంబింప అతను నిశ్చయించుకున్నాడు. ఉద్రేకములేనిపథ్యము, ఉపశమన స్నానాలు, ముఖమునకు నీటిఆవిరి పట్టుట మొదలగునవి చేసినారు. అతి స్వల్పకాలములో అత్యద్భుతముగా రోగం నయమైనది. అన్ని మందులు వాడినతర్వాతకూడా మన వైద్యములో అతనిరోగం నయముకావటం యింకామెచ్చుకోతగ్గవిషయము. అతడుపడుచు వాడై యుండుటవల్లనూ, చికిత్స మంచి ఋతువులో జరుగుట వల్లనూ, అన్నిమందులతో దేహశక్తులు దెబ్బతినిఉన్నా రోగం నయమైనది. తన చెవుడు నయమగుటయేగాక పల్చపడుచున్న తలవెంట్రుకలుకూడా యిప్పుడు చిక్కపడి, దట్టముగా మొదుగుచున్నవని, అతను నాకు ఉత్తరమువ్రాసియున్నాడు. అతనికి అది వరకు తరచుగా జలుబుచేస్తూఉండేది. ఇప్పుడు ఋతువులు మారినను కనుకటివలె జలుబు చేయుటలేదు. మనముచెప్పిన పథ్యము ఖుప్పు డతడు శ్రద్ధగా చేయజాలకపోయినను, మునుపటిలావుపోయి సన్నపడినను, అతడు చాలా ఆరోగ్యముగా నున్నాడు. తనపనులను నిరాటంకముగా చేసికొనగలడు. అతని దైహిక మానసిక శక్తులు వృద్ధిపొందినవి. అదివరకు లేని నిద్ర యిప్పుడు చక్కగా పట్టుచున్నది.

అన్నిరోగాలకు కారణము ఒకటే అవుటవలన మందు శస్త్రాది చికిత్సలేమీ లేకుండానే యీ రోగాలుకూడా తొట్టివైద్యము తోనే నయమైనవి.

## ౧౨ దంతవ్యాధులు - శిరశ్శైత్యము - ఇన్ఫ్లుయంజా - గొంతువ్యాధులు - గంగడోలు.

దంతవ్యాధులు:— దంతవ్యాధుల కారణమును గూర్చి యిదివరకు అనేకతూరులు చెప్పియున్నాను. మిక్కుటమైన రోగ పదార్థము దేహమునందున్నపుడే వివిధములైన దంతవ్యాధులు వచ్చును. కుడియెడమలందుగాని ముందువైపునగాని, దేహములో చేరియున్న రోగపదార్థము శిరస్సున కంటా వ్యాపించినప్పుడు అది దంతములమీదుగా పైకిపోవును. నిరంతరము జరుగుతూ ఉండే రోగపదార్థపు వత్తిడికి దంత సంబంధమైన యెముకలును, దానిమీద ఉండే పింగాణియు, మెత్తబడి తుంపులైపోవును. రోగపదార్థమునందు, పుట్టిన మండమువలనను, దానివలన కలిగిన, ఘర్షణవలనను, దంతములయందు పోటు పుట్టును. మన చికిత్స చేసినప్పుడుకూడ దంతములలో పోటుపుట్టుట కలదు. దీనికి కారణము, అదివరకు శిరస్సునకట వ్యాపించిన రోగ పదార్థము క్రిందికి దిగిపోవునపుడు, దంతములమీదుగా దిగవలసియున్నది. అప్పుడు తాత్కాలికముగా దంతములలో పోట్లు బాధలు వస్తవి. రోగపదార్థము పూర్తిగా

దిగిపోయినతర్వాత, దంతవ్యాధులు పోవును. దంతములను తీసివేయుట బుద్ధిమాలినపని. బాధవచ్చినపుడు పన్నులను పీకి నప్పటికీ మూలమైన రోగం అక్కడున్నంతవరకు రోగబాధ నయముకాదు. తొట్టివైద్యముచేస్తే మిగతా అన్నిరోగాల వలెనే పన్నుపోటుకూడా కుదురుతుంది.

ఒక్కసంగతి చెప్పవలసియున్నది. దేహమునందు రోగపదార్థము చేరియున్నవారి జీర్ణశక్తి చెడిపోయియుండును. లోపలి నుండి వచ్చేవాయువులు మలినముగా నుండుటవలన అట్టివారి దంతములమీద పచ్చని పాచిపేరుకొనును. సహజముగా జీవించే జంతువుల దంతములును, కష్టపడి పనిచేసుకునే జానపదుల దంతములును తెల్లగా నిర్మలముగా నుంటవి. అజీర్ణరోగులగువారు యెన్నితూరులు దంతములను శుద్ధిచేసుకొనినను తిరిగితిరిగి పాచి పేరుకొనుచునే యుండును. దేహమునందు అజీర్ణములేకుండా చేసుకొనినవారి దంతములు శుద్ధిచేసుకోకపోయినా తెల్లగా ఉంటవి. అందువలన దంతములు ధవళముగాను నిర్మలముగాను ఉంచుకో దలచినవారు ఆమందు యీమందుకలసిన దంత చూర్ణాలు దంతలేపాలు రుద్దక, జీర్ణశక్తిని వృద్ధిచేసి సులభముగా జీర్ణమయ్యే తేలిక ఆహారమునే తీసుకొనవలయును.

అదివరకే శిథిలమైపోయినవి, తొర్రలు పడినవగు దంతములు బాగుపడవు. మిగతా అన్నిరకములయిన దంతవ్యాధులలోను ఉపశమనస్నానములు, ముఖమునకు పట్టిన నీటిఆవిరి, వ్యాయామము, ఉద్రేకము కలిగింపని సహజమైన పథ్యమును బాగుగ పనిచేస్తవి. కదిలివూడిపోవటానికి సిద్ధముగా ఉండి నమిలేటపుడు

బాధకలిగే తేపన్నులను తీసివైచి పెట్టుడుపండ్లు కట్టించుకొనడం మంచిది.

శిరశ్శైత్యము:—వాయునాళములలో దాహముపుట్టి అందులోనుండి శ్లేష్మము బైటికి వస్తుంటే దానిని శిరశ్శైత్యము అంటారు. ఆరోగ్యవంతులకు ఈవ్యాధిరాదు. శరీరములో రోగపదార్థమున్నవారికే యీవ్యాధి వస్తుంది. ఊపిరితిత్తుల్లో చేరి యున్నమాలిన్యములు వెడలిపోవుటకు చేయు ప్రియత్నమే యీ జలుబు. ఇది శుద్ధిక్రియ వంటిది. మన చికిత్స చేస్తూ తరచుగా చల్లనిగాలి పీలుస్తూ రాత్రులయందు కిటికీలు తెరచిన గదులలో పరుండుట అభ్యాసం చేసినయెడల తరచుగా వస్తూ ఉండే శిరశ్శైత్యము రావటం మానివేస్తుంది.

ఇన్ఫ్లూయంజా;—1890 వ సంవత్సరములో దేశములలో యిన్ఫ్లూయంజా వ్యాధి వచ్చినది. అప్పుడు దానికి మన వైద్యము చేసినవారు, రోగం యేదశలో ఉన్నా నయమై ఆరోగ్యము పొందినారు దానికి కటి లింగ స్నానాలు దేహమునకు అంతటికి పట్టిన నీటిఆవిరి బాగుగా పనిచేసినవి. ఈవ్యాధిలోనూ జీర్ణక్రియ చెడియుంటుంది గనుక వారికి ఉద్రేకములేని సహజమైన ఉచితమైన పథ్యముపెట్టినాను. మందువైద్యమే యీ రోగానికి ఉపయోగిస్తే యెన్నో కష్టమైనబాధలు వస్తవి. ఆబాధలు యేమీ మనవైద్యములో రావు. రోగం కూడా తొందరగానే నయమగుతుంది.

గొంతువ్యాధి:— దేహములో రోగపదార్థమున్నపుడే ఊపిరి తిత్తులు కూడా చెడి దానితో గొంతునొప్పి వస్తున్నది. చిన్న పిల్లలకు యీవ్యాధి పిత్రీయంగా సంక్రమించిన రోగపదార్థము చేతనే వస్తుంది. ఈ వ్యాధులు కూడా గడచిన సంవత్సరాల్లో విరివిగా పెరుగుచున్నవి. దీనికి మందు వైద్యులు గొంతుదగ్గరనే చికిత్సచేస్తారు. ఉదరమునందు చేరిన రోగపదార్థమునందు పుట్టిన మండము, ఊర్ధ్వముఖముగా వ్యాపించుటలో కంఠమునుండియే పైకిపోవలయును. కంఠము యిరుకైనదగుట వలన ఆ ఘర్షణవలన గొంతువ్యాధులు పస్తవి. ఎలుగునాపు- గొంతులోమంట- స్వరపేటికలోను సప్తపథలోను మంటలు మొదలగునవి యీవ్యాధిలోనివే. మనవైద్యముచేసినపుడు వెంటనే తాత్కాలిక ఉపశాంతి కలుగును. కొన్నిమాసాలు వరుసగా చికిత్సచేస్తే దేహములో నిలిచియున్న మూలకారణమైన రోగపదార్థము వెడలిపోయి పరిపూర్ణ ఆరోగ్యము కల్గుతుంది. రోగపదార్థము పిత్రీయంగా సంక్రమించిఉంటే దానిని వెలుపరించుటకు కొన్ని సంవత్సరాలు పడుతుంది.

గంగడోలు:— ఈవ్యాధి అందరికీరాదు. కొండప్రదేశములో నివసించేవారిలో యీవ్యాధి కనుపడుచున్నది. అక్కడకూడా కొన్నికొన్ని ప్రదేశాలలోనే యీవ్యాధి వచ్చుచున్నది, అమితమైన బరువులెత్తుకుని కొండలు యెక్కుతూ దిగుతూఉంటే యీవ్యాధి వస్తుందని చాలామంది నమ్మకం. ఇది కొంతవరకు నిజమేకాని దీనికి యింకొక కారణముకూడాఉన్నది. కొండ మీదకురిసినవర్షము కొండచరియలలోనుండి ప్రవహించేటపుడు

దానివెంట, సీసము, తామ్రము, మొదలగు లోహసంబంధమైన ధాతువులుకూడా కొట్టుకు వస్తవి. నిరంతరము అట్టి నీటినే త్రాగుచుండుటవలన గంగడోలు వ్యాధి వచ్చును. ఆ నీటిని ఎండలో కొంతకాలము నిలవ ఉంచితే నిర్మలముగా కనబడే ఆనీటి అడుగున కొంతసేపటికి మకిల పేరుకుంటుంది. ఈ మకిలయే మానవదేహములో ఒకానొక అవయవములో చేరి గంగడోలు అవుతుంది. దేహములో చెమటపోసే స్వభావము ఉండి మిగతా బహిష్కార్య అవయవములయందు మాలిన్యములను వెలువరించే శక్తి తరగకుండాఉంటే, ఆనీరు త్రాగినవారికికూడా గంగడోలురాదు కాని అక్రమ జీవితము వలన జీర్ణక్రియ చెడిపోతుంది. దానితో మలమూత్ర స్వేదములను వెలువరించే అవయవాలు క్రమంగా దుర్బలమవుతవి. అపుడు దేహములో రోగపదార్థము చేరి గంగడోలువ్యాధి వస్తుంది. ఇతర అంతరవయవములకు సంబంధము లేకుండా, వెలుపటికి పెరిగే గంగడోలు వలన, బాధలులేవు. ప్రమాదములేదు. కాని యీ గంగడోలే శ్వాసావరోధము కలిగిస్తే ప్రాణాపాయం వస్తుంది. రక్తములో చేరిన మాలిన్యాలు ఒక్కొక్కపుడు నాడులను బాధించి మానసిక వ్యాధులకు కారణమవుతవి. ఇదియును ప్రమాదకరమే. మంచుగడ్డతో తుల్యంగా ఉండే చల్లని నీరు త్రాగితే ఆరోగ్యము వృద్ధిపొందుతుందని కొందరికి అపోహ ఉన్నది. సూర్యకాంతిచే వెచ్చపడి ప్రవాహవేగానికి చల్లపడిన నీరు మనము త్రాగటానికి

యోగ్యమైనది. వర్ష జలముకూడా నేలమీద పడకముందే జాగ్రత్తపడితే త్రాగటానికి యోగ్యమైనదే.

చెట్లు చేమలుకూడా ఉప్పనివి చప్పనివి అగు నీళ్లుపోసి పెంచే కంటే తీయని ప్రవాహోదకముపోసి పెంచుతూఉంటే బాగుగా పెరుగుతవి. నీటిలో ఉండే దోషాలను రసాయనిక శక్తితో కూడిన సూర్యకాంతి యొక్కటియే పోగొట్టగలదు. మానవుడు సహజంగా నీరు త్రాగవలసిన పనిలేదు. ఉద్రేకరహితమైన సహజాహారమును తీసుకునేవారికి దాహము కానేకాదు. రసముగల 1, 2 పండ్లను తింటే ఆ దాహముకూడా తీరుతుంది.

ఒకామెకు చిన్నప్పుడు కడుపులో నొప్పి ఉండేది. కొంతకాలమైన తర్వాత ఆమెకు గంగడోలు వచ్చింది. కొంతికాలానికి అది పెద్దదై శ్వాసావరోధాన్ని కలిగించినది. మనవైద్యము చేసినారు. లింగస్నానాలు చేసినందువలన ఆమె శ్వాసలో ఉండే ఆటంకము తీరిపోయింది. ఇంకొక వారంలో రోగ పదార్థము దిగిపోనారంభించినది. వాపు సడలి మెత్తపడి లావు తగ్గనారంభించినది. ఇంకొక వారములోసాంతముగానయమైనది.

# ౧౩ తలనొప్పి - పార్శ్వపు తలనొప్పి మెదటిలో క్షయ - మేదస్తాపము.

మందువైద్యులు పైవ్యాధుల నొకదానినుండి యొకటి బహు జాగ్రతతో భేదముజేసి చికిత్సింతురు. కానిపై వానికన్నింటికిని శిరస్సు కాక ఉదరమే మూలపీఠమని మనకు తెలియును. గాన మనము వీనికన్నిటికి మూలకారణము ఒకటేఅని అందుము. పైవ్యాధులు కాన్పించుటకు చిరకాలమునకు పూర్వమే జీర్ణాశయరోగములుండి మలబంధమును మూలవ్యాధియు నుండును. ఉదరముమీద గడ్డలు లేచును. ఇవి మండవశమున కరిగి వాయురూపమున శిరస్సున కంట అనిరోధముగా వ్యాపించి శిరస్సునందును నిరోధము జరుగునేని మెడలమీదను, యెదురు రొమ్మునను గటి సన్నని గడ్డలుగా పేరుకొనును. పార్శ్వపుతల నొప్పియందు అన్యపదార్థము కుడియెడమ పార్శ్వములందు చేరి మండమై తుదలకంట వ్యాపించి కుడి యెడమ పార్శ్వపు తల నొప్పులను కలిగించును. రోగపదార్థము వెనుకభాగమున వ్యాపించి మెదటికంట తగిలి యచట గ్రంధులుగానై వ్రణ శిలీంధ్రములుగానై మేదస్సు యొక్క-క్షయను, తరువాత మేద స్తాపమును కలిగించుచున్నది. వీనికన్నిటికిని అజీర్ణమును ఉదర వ్యాధులును, మూలకారణమని మనకు తెలియుచున్నది. కాన దైశికమగు చికిత్సలతో నిమిత్తములేకయే ఉపశమనస్నాన ములచేతను, బాష్పస్నానములచేతను, రోగపదార్థమును ఉద రమువంకకు, మరల్చి బహిష్కరించి రోగనివారణమును చేయగల్గుచున్నాము, ఇట్టివ్యాధులకుఅన్నింటికి మూలకారణము

ఉదరమునందే గలదని, ముఖనిదానశాస్త్ర సహాయమున మనము ముందుగనే గుర్తింపగలము. కాన మనకు చికిత్సయు కరతలామలకమే. కాని రోగపదార్థము వెనుకకుండా వ్యాపించిన రోగులకన్నా ముందు భాగము వ్యాపించిన రోగులకు సులభముగను తేలికగను కుదురుట స్వాభావికము గాన యొకానొకప్పుడు, ఒక ఉపశమనస్నానము తోడనే ఉపశాంతి కలుగుచున్నది. ముందు భారముగలవారికి సులభతరముగను,కుడి భారము గలవారికి సులభముగను, ఎడమ భాగమున రోగ పదార్థము వ్యాపించినవారికి కఠినముగను, వెనుకగా రోగపదార్థము వ్యాపించినవారికి కఠినతరముగను కుదురుచున్నది. చికిత్స చేయుటలో మొదట శిరస్సునందలి గ్రంథులు కరిగి ఉదరమునందు కాన్పించి స్వీకరింపబడి, వెలువడిపోవుచున్నవి. కాని చికిత్సాకాలమున స్వాస్థ్యసంకటములు తప్పవు గాన తలనొప్పి, పార్శ్వపునొప్పి మొదలగునవి మరల కాన్పించి బాధించిన తరువాత కాని శాశ్వతముగా కుదరవు. కాన శిరోవ్యాధులన్నిటికిని – మూలకారణము, అన్నివ్యాధులకు కారణమైన రోగ పదార్థము అజీర్ణము అని తేలుచున్నది.

ఆయాప్రదేశాలకు ప్రత్యేక చికిత్సలేవీ చేయకుండానే కేవలము ఉపశమనస్నానాలు పథ్యములోనే రోగములయొక్క మూలకారణమైన రోగపదార్థము వెడలిపోవుచుండుటచే,తలలో పుట్టే రోగాలన్నీ కూడా నయమవుచున్నవి. ఒక్కొక్కరికి 20,30 నిమిషాల పరిమితిగల, ఒక కటిస్నానంగాని, ఒక లింగ స్నానంగాని చేయించినంతనే చిరకాలమునుండి బాధించుచుతూ

వున్న పార్శ్వపుతలనొప్పియును,నిండుతలనొప్పియును,నయమగు చున్నవి. ఈసంగతి ఒక్కొక్క రోగికి నేను చెప్పినపుడు వారు నామాట నమ్మక నవ్వేదరు. కాని అట్టి ఉపశమనస్నానంచేత వారికున్న బాధ నయమగుటచే నామాట నమ్మక తప్పుట లేదు. చిరకాలంనుంచి బాధిస్తూఉన్న కాలికవ్యాధులలో శిరో వ్యాధులు ఇంత తొందరలో నయముకావు. తెలలోచేరిన రోగపదార్థమంతా ఉదరమువంకకు దిగిపోవటానికి చాలా కాలము పట్టును. ఈలోపల తలనొప్పులుకూడా తీవ్రముగా వస్తూఉంటవి. తలలో రోగపదార్థము చేరిఉన్నవారికి తొట్టి వైద్యము చేయించినపుడు అదివరకు తలనొప్పి లేనివారికైనను చికిత్సాకాలములో తలలోని రోగపదార్థము క్రిందికి దిగిపోతూ కపాల నరములను పీడించుటచే క్రొత్తగా తలనొప్పులు రావటం కద్దు. పై సంగతులకు ఉదాహరణంగా ఒకరోగినివారణవృత్తాంతాన్ని యిచట చేర్చుచున్నాను. ఒకనికి మెదడునకు సంబంధించిన క్షయ అని మందువైద్యులు పేరిడిరి. వివిధ రకములైన మందు చికిత్సలను అతడు అవలంబించినాడు. రోగము నయము కాలేదు సరిగదా! అది మరింత ముదిరిపోయినది. అతనికి మొదట తీవ్రమగు తలనొప్పి ఉండేది. దానిని మందువైద్యులు తమ మందులతో అణచివేయ ప్రయత్నించిరి. అందువలననే అతనికి మెదడు సంబంధమయిన క్షయ వచ్చింది. ఈదుర్భరస్థితిలో అతడు మనవైద్యము నవలంబించెను. అతనిజీర్ణక్రియ అప్పటికే బాగా చెడిపోయినది. ఉద్రేకము కలిగింప సహజమైన పథ్యము యిచ్చి దినానికి 3,4, ఉపశమన స్నానముల చేయించే

వాడను. చెమట పోసేటందుకు నీటిఆవిరి పట్టేవారము. తరుణ ములగు స్వాస్థ్యసంకటములు తప్పించుకొనుటకు వీలులేదుగదా! తలలోని గ్రంధులు కరగినప్పుడెల్లా యిట్టి స్వాస్థ్య సంకటాలు వచ్చేవి. ప్రతిస్వాస్థ్య సంకటముతర్వాతను రోగికి సుఖముగా నుండేది. 2 నెలలు యీవిధంగా చికిత్సచేసిన తరువాత వానికున్న దుర్భరవ్యాధి నయమైనది.

# ౧౪ విషజ్వరము - గ్రహణి, కలరా - అతిసారము.

విషజ్వరము:—నడివయస్సులో ఉన్న బలముగల పసుచువారికే యీ వ్యాధి తరుచుగా వస్తుంది. జ్వరము చాలా తీవ్రముగా ఉంటుంది. అందువల్లనే రోగపదార్థాన్ని, వెలువరించటానికి వచ్చే స్వాస్థ్యసంకటాలల్లో,. బలమైనదని కూడా చెప్పవచ్చు. మామూలు మందు వైద్యములో, యీ రోగం వచ్చినవారు చాలామంది చనిపోతూవుంటారు. అందువల్లనే యీ రోగం అంటే చాలామందికి భయము. తొట్టివైద్యము మాత్రము యీ వ్యాధిలో ఉండే తీవ్రతను, అందువల్ల వచ్చిన భయాన్ని పోగొడుతుంది. ఎంతో రోగపదార్థము యెక్కువ ఉంటే తప్ప మిగతా అన్ని తరుణ వ్యాధులకు వలెనే యీవ్యాధి నయ మవుతుంది. ఉపశమనస్నానాలు చేయించిన తరువాత, రోగి దేహానికి సహజముగ చెమటపోయిస్తే మాత్రము అపాయమేమీ

రాదు. మామూలు మందు వైద్యములో కొన్ని నెలలకు కాని నయముకాని యీవ్యాధి మన చికిత్సలో కొలదిదినములకే స్వాధీనములోకి వస్తుంది. రోగి అప్పుడు ప్రతిదినము క్రమంగా ఆరుబయిట ఉచితమైన వ్యాయామము చేయగలిగి ఉంటు న్నాడు. తరుణములైన విషజ్వరము యిన్ఫ్లూయెంజా మొద లగు జ్వరాలలో నీటిఆవిరి యెంతో మేలుచేస్తుంది.

రోగియొక్క శక్తిననుసరించి మాత్రము అదేపనిగా ఆవిరి పట్ట కుండాను, చాలాకాలము జరుగకుండగను ఉచితమైనటువంటి భరింపగలిగిన ఆవిరి పట్టవలెను. మిగతారోగాలు అన్నింటికి వలెనే విషజ్వరముకూడా ఒకదానితర్వాత ఒకటిగా చేసిన కటి లింగ స్నానముల వల్లనే నయమగుతుంది. ఏస్నానం యెన్ని దఫాలు చేయవలెనో యెంతెంతసేపు చెయ్యాలో అనే విష యము మాత్రము రోగియొక్క స్థితినిబట్టి, రోగముయొక్క తీవ్ర తనుబట్టి, కాలభేదము ననుసరించి నీటిభేదము శీతోష్ణములలో మార్పులు చేసుకుంటూ చికిత్స చేయింపవలసి యుండును. మనచికిత్స నవలంబించిన ఒకఆమె తాను యిద్దరికి విషజ్వరము కుదిర్చితిననియు, ఒక మసూచికవ్యాధి నయముచేసితిననియు వ్రాసెను. ఒక ఆవిరిస్నానము, 3 దీర్ఘములగు కటిలింగస్నా నాలు ఆమె వారిచేత చేయించెను. దానితోనే వారు మంచము మీదనుండి లేవగలిగిరి. ఆరురోజులలోనే వారిరోగములు నయ మైనవి. మసూచికపురోగి దేహముమీద మచ్చకూడా కనుపడ కుండా పోయినది. చిరకాలము మందులతో దేహముచెడిపోకుండా ఉంటే, ప్రకృతి వైద్యమువలన తరుణవ్యాధులు తొందరగానే నయమవుతవి. నా అనుభవములో కూడా యిట్లాగేజరిగింది.

కలరా గ్రహణి:—ఈ రెండువ్యాధులలోనూ జీర్ణక్రియ మిక్కిలిచెడిపోతుంది. దేహములో అమితమగు వేడి ఉంటుంది కలరాల్లో ప్రత్యేకముగా అంతర్గతమైన వేడి చాలాయెక్కువగా వుంటుంది. అందువలననే కలరాతో చనిపోయిన వారి పెదవులు,ముక్కు,కన్నులు, నల్లబడిపోవటం చూస్తూవున్నాము. దేహములో మిక్కుటమగు రోగిపదార్థము లేని రికి కలరా గాని, గ్రహణిగాని రావు. అనుభవమును పట్టిచూచిన చిర కాలంనుంచి మలబద్ధకముతో బాధపడుతున్నవారికితప్ప, కలరా వ్యాధి యింకొకరికి రాదు. ఈ రోగాలు రాకపూర్వమే రోగి దేహములో బరువుగా ఉన్నట్లు, అస్వస్థగా నున్నట్లు అనిపి స్తుంది. అంటే అప్పటికే దేహములో ఉండే రోగపదార్థ ములో మండము పుట్టినదీ అనిఅర్థము. దేహాన్ని శుద్ధిచేసే స్వాస్థ్య సంకటాలల్లో కలరా చాలాతీవ్రమైనది. దేహము నందలి రోగపదార్థము గాలిమార్పువల్లనూ, భయమూ, ఉద్రే కము మొదలగు కారణాలవల్లనూ రోగపదార్థములో మండ మేర్పడును. అట్లు మండముపొందిన రోగపదార్థము చర్మము తిన్నగా పనిచేయక పోవటంచేత చెమటగా వెడలక ప్రబల వేగంగా ఉదరమువంకకు దిగిపోతుంది. పెద్దపరిమితిలో భేదులు అవుతవి. వాంతులుకూడా అవుతవి. ఈస్వాస్థ్య సంకటపు వేగాన్ని తట్టుకునేశక్తి దేహములో నిలిచిఉంటే యీరోగం నయమయ్యేటప్పటికి పరిపూర్ణ ఆరోగ్యం వస్తుంది. తర్వాత అతనికి సరిపాశ్యే బలముకూడా వెంటనే వస్తుంది. అదివరకే వేరువేరు కారణాలచేత, మందులశేఖకవల్ల దేహము దుర్బల

ముగా ఉంటే కలరావంటి ప్రబలమైన తరుణ గప్రవేగాన్నిరో
దేహము భరింపజాలదు. కలరాకంటె తేలిక అయినది గ్రహణి.
యీ రెండు వ్యాధులలోకూడా ఉదరమునందలి జీర్ణావయవా
లల్లో అమితమగు వేడి పుట్టుతుంది. అందువలననే లోపల
దహించుకుపొయ్యే వేడివుంటే చర్మముఅంతా చల్లబడి
ఉంటుంది. చికిత్స చేయటంలో ఉదరములోని వేడిమియొక్క
ఉగ్రతను తగ్గించటమే మొదటిపని. చెమట పోస్తే కొంతరోగ
పదార్థము రోమకూపాల ద్వారా వెళ్ళిపోతుంది. మృదువగు
వేడినీటి ఆవిరివల్లగాని సొమ్యమగు యెండఆవిరివల్లగాని రోగికి
చెమటపోయించవలయును. ఉదరమునందలి అమితమగు వేడిమిని
తగ్గించుటకు తగినధాతుశక్తి దేహములోనివిచి యుంటే రోగం
కూడా తొందరగానే నయమవుతుంది. కొంతమంది కలరా
రోగులు అమితమగు లోపలితాపముతో బాధపడుతూ, బైట
యెన్ని శైత్యోపచారములుచేసినా వారితాపం తీరటములేదు.
యీస్థితి మిక్కిలిప్రమాదకరమైనది. లీప్‌జిగ్ నగరంలో 1849
సం॥ లోను 1866 వ సం॥ లోను కలరా యెతిపోతలుగా
వచ్చింది. అప్పుడు నేను కొందరురోగులను చూచుట తటస్థిం
చినది. అప్పటి నాఅనుభవములు యేవనగా - లోపల
దహించేవేడి, యెవరిచర్మము మీందికి వచ్చిందో వారెల్లా బ్రతి
కినారు. లోపలవేడి లోపలనే యెవరికున్నదో యెవరి చర్మాలు
వెచ్చబడలేదో వారికి నయము కాలేదు. వారు మరణించినారు.
ఒక ఉదాహరణము వినండి, ఒకామె తనబిడ్డను యెతుకొని
పచారుచేస్తూ ఉండటం పగలు 11 గం॥ చూచితిని. ఒక్క

ఝాములో-అనగా 2 గంటలకు ఆమెశవాన్ని బైటికి తీసుకు వెళ్లుచున్నారు. కలరావేగాన్ని ఆమెదేహము బొత్తిగా భరింప లేకపోయిందని అర్థము. ఆమెదేహము అప్పటికే రోగపదార్థ ములో నిండియున్నది. ఆమె ఉదరమునందు అదివరకే రోగ పదార్థము కుళ్లిపోతూ ఉండవలెను. అందువలననే ఆమె చని పోవునప్పటికే ఆమె పెదవులు కన్నులు ముక్కు-చివర కమిలి నట్లు నల్లపడిపోయినవి. ఇట్టి దుర్భరవ్యాధులందు లింగస్నాన ములు, తొందరగాను నమ్మకంగాను సుగుణము యిస్తివి. ఉదరానికి పట్టిన ఆవిరివల్ల కూడా చాలా లాభముంటుంది. ఉదరానికి ఆవిరిపట్టినప్పుడల్లా, ఒకలింగస్నానమో కటిస్నానమో చేయవలసి యుండును. కటిలింగస్నానాలు చేసిన తర్వాత దేహము వెచ్చబడేందుకు తిరిగి ఆతపస్నానం చేయిస్తే మంచిది. అపుడు రోగిదేహము చెమటకూడా పోస్తుంది. ఎండ లేనపుడుగాని రాత్రిళ్లుగాని యిట్టి చికిత్సలు చేయవలసివస్తే, రోగిని దుప్పట్లుకప్పి పరుండబెట్టి ఆవిధంగానైనా చెమట పట్టించవలెను. చాలామంది కలరారోగులకు, కటి లింగ స్నానాలు, కొలదిగా చేయించినా అపాయం తప్పిపోతుంది. ఆకాలంలో ఉద్రేకములేని, సహజాహారమునే యివ్వవలెనని మరువరాదు. గ్రహణి, అతిసారము యీ రెండు రోగాలకుకూడా నీటిఆవిరి, కటి లింగ స్నానాలు అద్భుతముగా పనిచేస్తవి. మరీ తీవ్రముగానున్న రోగులలో యీ క్రిందిపద్ధతి చేయవలసి వుంటుంది. ఒకయిటుకముక్క బాగుగా వెచ్చపడునట్లు కాలనిచ్చి యేదైనా గుడ్డలోచుట్టి ఆసనముకింద పెట్టవలయును. ఇటుక ముక్క పెట్టినపుడు అది సుఖముగా భరింపగలిగినంత వేడిగా

మాత్రము ఉండాలి. దీనితో అద్భుతంగా విరేచనములు ఆగి పోతవి. తర్వాత కొన్ని గంట లాగి లింగస్నానము. చేసి వెనుకటి వలెనే వేడియిటుకతో కాపడము పెట్టవలయును.

కలరావచ్చినపుడు దేహమునందలి రోగపదార్థము మిక్కిలి వేగముగా వెడలిపోవును. అందువలన కలరా నయమైనరోగులు యెంతో బరువుదింపుకున్న వారివలె తమదేహములు ఉన్నవని యు, తమకు ఆరోగ్యముగా నున్నదనియు చెప్పుచున్నారు. ముఖనిదాన శాస్త్రమువల్లకూడా మన కీసంగతి ఋజువగు చున్నది. ఇంతతొందరగా ఆరోగ్యము రావటం అద్భుతమే. కలరా ప్రాణోపద్రవమైన వ్యాధియగుటవలన అదివచ్చిన తర్వాత నయముచేయటం సాధ్యంకావచ్చు, కాకపోవచ్చు. అందువల్ల ముందుగానే ఆరోగం దేహమునకు రాకుండా కాపాడు కొనడం మంచిది. అందుకు ఉద్రేకములేని సహజమైనపథ్యము ఉపశమన స్నానాలు చేసి, దేహమునందలి రోగపదార్థమును తగ్గించుకొనవలసినది. ఈ విధంగాచేస్తే ఒక కలరాకాకుండా,- అన్నిరకాల జ్వరాలు రాకుండాపోవును. ఈపథ్యము చేయటం కష్టములేదు. అలవాటుచేసుకుంటే చేయవచ్చును.

అతిసారముకూడా కలరావంటిదే, అయితే దానికన్నా తేలిక అయినది. బలముగలవారికి యిట్టి తరుణవ్యాధులు అప్పుడప్పుడు వస్తూ ఉండటంకద్దు. దేహములోనున్న రోగపదార్థాన్ని వెలు వరించటానికి, దేహముచేసే అనుకూల ప్రయత్నమే అతి సారము. మితిమీరకుండా ఉంటే అతిసారం రావడం ఒక విధంగా మంచిదే. వాతావరణంలో అనుకూలమైన మార్పులు

వచ్చి, దేహము బలపడినప్పుడే యీ అతిసారము కల్గుతుంది. ఒక్కసారి అతిసారము వచ్చి నయమైన తర్వాత, దేహము తేలికగాను, ఆరోగ్యముగాను ఉంటుంది. ఈ విధంగా దేహములోని రోగపదార్థము వెడలిపోతూ వుంటుంది.

విరుద్ధ లక్షణాలుగా ఉన్నట్లు కనపడినప్పటికీ అతిసారము, మలబద్ధకముఒకే కారణమువల్ల వస్తవి, రెండును అజీర్ణము వల్లనే వసవి. రెండింటిలోనూ తిండిపోతుతనం, ఉదరములో వేడి వుంటుంది. ఒకే రోగపదార్థమువలన, కొంతమంది లావుగాను కొందరు సన్నగాను యెలాఉంటున్నారో, ఆ విధంగానే దేహములోని రోగపదార్థమువలన, మలబద్ధకం ఒకరికి, అతిసారం వేరొకరికి వస్తూవుంటుంది.

మలబద్ధకపు రోగాలుకటిలింగస్నానాలంగో నయముకాని యెడల దూరంనడచి ఆరుబైటగాలిలో బైలుకు కూర్చుంటే మలబంధము తగ్గుతుంది.పాకీదొడ్లలో తలుపువేసుకు కూర్చుంటే మలబంధము తగ్గదు.

---

# ౧౫. ఉష్ణమండల జ్వరములు

వేరువేరు నామరూపములతో కనపడుతూ ఉండే జ్వరములు దేహమునందు చేరిన రోగపదార్థమునందు మాడము పుట్టుట వలననే కలుగుచున్నవి. ఉష్ణమండలాలలో పగటివేడిమికిని రాత్రి చల్లదనమునకును వ్యత్యాసము ఎక్కువగా ఉండును. రోగపదార్థము రాత్రులందు ముడుచుకొని పగటియందు విరివి చెందుటలో శీతోష్ణాల వ్యత్యాసము ఎక్కువగా ఉండుటచేత అందు తీవ్రమగు మాడము కలుగును. అందువలన ఉష్ణమండలాలలో వచ్చే జ్వరాలు చాలా తీవ్రమైనవిగా ఉండును. దేహములో రోగపదార్థము కొద్దిగా ఉన్నాకూడా పెద్దజ్వరమే వస్తుంది. సమశీతోష్ణ మండలాలలో రాత్రింబవళ్ళకు శీతోష్ణములలోని తేడా తగ్గివుంటుంది. గనుక ఆచోట యిట్టిజ్వరాలు రావు. ఉష్ణమండలాలల్లో వచ్చేజ్వరాలుకూడా చాలా రకాలుగా ఉంటవి. చర్మములంతా పచ్చపడి వచ్చేజ్వరము కామిలా జ్వరమంటారు. ఇది చాలా ప్రమాదకరమైనది. మనవైద్యము చేస్తే యిదికూడా సులభముగా నయమవుతుంది. అయినప్పటికీ ఉద్రేకములేని సహజపథ్యముతోను కటిబింగ స్నానాలతోను రోగము రాకుండా చేసుకోవటమే మంచిది.

ఉష్ణమండలాలల్లో, సమశీతోష్ణమండలాలల్లో దొరికినంత చల్లని నీరు లభింపదు. అయినప్పటికీ గాలికిని, నీటికిని, ఉష్ణమండలాలల్లో శీతోష్ణాలలో యెంత తేడా ఉంటుందో సమశీతోష్ణమండలాలలో ఉండే తేడాకూడా అంతే ఉంటుంది. గనుక శీతలదేశములో శీతలోదకముతో ఆ దేశవాసులకు

ఎంతమేలు చేస్తుందో, ఉష్ణమండలాల్లో ఉండే జనులకు ఆ దేశంలో లభించేటంత శీతలోదకమే తుల్యంగా సుగుణాన్ని యిస్తుంది. ఉష్ణమండలాల్లో ఉండే వేడిమివలన తరుచుగా తరుణవ్యాధులు వస్తవని వ్రాశాను. ఆ దే వేడిమి రోగాలను నయముచేయటానికికూడా యెక్కువ సహాయపడుతుంది. సమశీతోష్ణమండలాల్లో వచ్చిన రోగాలు ఉష్ణమండలాల్లో వచ్చిన రోగాలంత తొందరగా నయముగావు. క్వయినా, యాంటిపైరిన్, నాభి, పాషాణము మొదలగు విషౌషధాలతో జ్వరాన్ని పోగొట్ట ప్రయత్నించటంకంటె బుద్ధిమాలిన పని యింకొకటిలేదు. మొదటిలో చిన్నమోతాదులు రోగాన్ని నయముచేసినట్లు కనుపడుతవి.

ఆమందుయొక్కశక్తి దేహము భరిస్తుంది. ఇంతలో యింకొక సారి జ్వరము వస్తుంది. అప్పుడు వెనుకటికంటె పెద్ద మోతాదులో మందు యివ్వాలి. ఈవిధంగా విషౌషధాలను పెద్ద పెద్ద మోతాదులలో యిస్తూ పొయ్యేటప్పటికి నాడులు నానాటికి క్రమంగా చచ్చుపడి పోతవి. అప్పుడు యికయేవైద్యమువలనా ఆరోగ్యం నయముకాదు. ఈగ్రంథములో వ్రాసిన నియమముల ననుసరించి చికిత్సచేసి ఉష్ణమండలాల్లో ఉన్నవారు విషమ జ్వరములను పోగొట్టుకుంటున్నారు.

"నేను ఈ గ్రంథాన్ని బటేవియా పంపించాను. అక్కడ నాభార్య, గుమాస్తా. అందులో నియమములజూచి జ్వరాలకు చికిత్స చేసుకొన్నారు. ఆసంగతి యిప్పుడే నాకు చేరిన ఉత్తరములో వ్రాసినారు." బటేవియా దేశస్థుడు ఆర్.

"నాకు ఉష్ణమండలజ్వరాలు ఉండేవి. అజీర్ణము ఉండేది. వానికి మీా గ్రంథములో చెప్పిన కటిలింగ స్నానాలుచేసి కొద్దికాలము లోనే పోగొట్టుకున్నాను. ఈ దేశంలో జర్మనీ దేశములో వలె గోధుమలు దొరకవు. అయినప్పటికీ యిక్కడ మొక్కజొన్నరొట్టె తింటాము. వరిబియ్యపు అన్నము వాడతాము. జర్మనీ దేశములో దొరికేకూరలు దొరుకక పోయినా యీ దేశములో దొరికే చిక్కుడు మొదలగు కూర లను తింటున్నాము మీా దేశములో దొరికినట్లుగా యాపిల్సు, పియర్సుప్లమ్సు దొరుకవు. ఇక్కడ దొరికే అరటిపండు, చిరు గడము, ఫచ్చకాయలు, నారింజలు, అత్తిపండ్లు, ఖర్జూరపు కాయలు మొదలగువానితో వైద్యము చేసుకొన్నాము. అయి నప్పటికి గుణమిచ్చినది." అని బ్రెజిల్ దేశస్థుడు రివరెండ్ యమ్ అనువారు 1898 సం॥ 16 డిశంబరు లేఖలో నాకు వ్రాసినారు. 1891 టవ సం॥ గోల్డ్ కోష్టునుండి నా అనుయాయులలో ఒక రైన జె. యస్. అనువారిట్లు వ్రాసిరి, ఈ "దేశములో వ్యాప్తిగా ఉండే పైత్యజ్వరాలకు తాము వ్రాసిన గ్రంథ ములో చెప్పినట్లు వైద్యముచేసినాము. ఈ వైద్యము ఆజ్వరా లను పోగొట్టటానికి చాలా అద్భుతముగా పనిచేసినది అని చెప్పుటకు సంతోషముగా ఉన్నది.

మధ్య అమెరికాలోఉన్న బ్రిటిష్ హాండురాన్ నుండి 1890 సం॥ జులయి 3వ తేదీన యమ్. హెచ్. అనువారు వ్రాసిన జాబులో నుండి యీ క్రింది భాగాలు ఎత్తి వ్రాయుచున్నాను. తాము దయతో పంపించిన తొట్టివైద్యము పుస్తకమునూ వ్రాసి

పంపిన సలహాయునకా చేరినవి. నాకు ప్రతిసంవత్సరము, చలిజ్వరము వచ్చేది తమసలహాను అనుసరించటం వలన, యీ సంవత్సరము మాత్రము చలిజ్వరము రాలేదు. ఇంకే బాధలు లేవు." ఆఫ్రికాలో నైఋతీ మూలనున్న హెరిరోల్యాండ్ నుండి యఫ్, యం, అనువారు వ్రాసిన దీర్ఘలేఖనుండి. తనభార్య యొక్క దీర్ఘరోగమును గురించి వ్రాసినాడు. వైద్యులు ఆరోగము నయముకాదన్నారు. "30 సంవత్సరాలు అనేకరకముల మందులు వాడినాను. నాభార్య రోగము నానాటికి ముదిరినది. కాని తగ్గలేదు. జీర్ణశక్తి పాడయినది. మీజాబు చూచి పెన్నులు తెంచినాను. ఇప్పుడు నాభార్య కటి లింగ స్నానాలు చేయుచున్నది. ఈ సంధ్య గాఢమైన చలిజ్వరముతో సహా ఆమెకు వచ్చిన అన్నిరోగాలు, నయమైనవి. కాలివాపు తగ్గినది. వేళ్ళవాపు తగ్గి సన్నబడుచున్నవి."

తూర్పు ఆఫ్రికాలో మతబోధకుడుగా ఉన్న జ. హానుసెను బెర్లిన్‌లో ప్రచురించే ప్రకృతివైద్య పత్రికలో యీక్రింది విధంగా 1895 సం॥ సెప్టెంబరులో వ్రాసినాడు. "1890 సం॥ జూన్ 22 ఆదివారము కిందటి వారము మాదాయాదికి తీవ్రమైన చలిజ్వరము వచ్చినది. క్వయినాగాని అంటిపేబ్రిన్‌గాని అంటిపైరిన్‌గాని పిప్రమెంటు కషాయముగాని చివరకు పూర్వపుప్రకృతి వైద్యుల కట్లుగాని యేమియు గుణమీయలేదు. నిన్నమధ్యాహ్నం జ్వరము వెనుకటంత తీవ్రముగా నున్నది. ఇంకా కొన్ని డిగ్రీలు యెక్కువగా కూడా ఉన్నది. స్థలము మారుద్దామంటే వీలులేదు. గాలి మారుద్దామా అంటే అంతకన్నా వీలులేదు. రోగి

దేహము జ్వరముతో కాలిపోతున్నది. చెమటపోయదు. ఈస్థితిలో కూనే నిర్దేశించిన కటిస్నానము 3 నిమిషాలు చేయించి నాము.జ్వరము కొంచెము తగ్గినది. మళ్ళీ జ్వరము 102 డిగ్రీలు రాగానే మళ్ళీ కటిస్నానం చేయించినాము. జ్వరము తగ్గినది. జ్వరము పెరిగినప్పుడల్లా కటిస్నానము చేయించినాము. ఇట్లు రాత్రింతా చేయించేటప్పటికి ఉదయానికి సహజంగా చెమట పోసినది. యీ విధంగా చికిత్సతో అతని జ్వరము తగ్గినది. కటిస్నానాలు 3 నిమిషాలకు బదులుగా 20 నిమిషాలు చేసి ఉన్నట్లయితే యింకా తొందరగా రోగనివారణము అయ్యేది. హెచ్చుజ్వర మున్నప్పుడు స్నానకాలము పెంచి యింకా తరు చుగా చేయింపవలసి ఉండును."

డా. యస్. సలాంనుండి ఒ. అనువారు యిలా వ్రాస్తున్నారు. "నేనిదివరకు నాకువచ్చిన ఉష్ణమండల జ్వరాలకు నేను వైద్యము చేసి మేలుపొందినాను. ఇప్పుడు యీదేశస్థులకు మీవైద్యము చేస్తున్నాను. సుగుణములు కలుగుచున్నవి. కిందటి జూన్ నెల నుండి నేనుగాని నాకుటుంబములోనివారుగాని, జలచికిత్స తప్ప యితర మందులు వాడుటలేదు. ఈ దేశములో వస్తూఉండే జ్వరాలు మాకెవరికీ రావటంలేదు. పశ్చిమాఫ్రికాలో వస్తూ ఉండే పచ్చజ్వరముకూడా మీవైద్యముతో నయమవు తుందా?"

జి. అనువారికి అన్నిరోగాలకు-రోగపదార్థము ఒకటే కారణ మని అర్థము కాలేదు.ఆసంగతి అర్థములయి తేఆయనయీమాట వ్రాయడు. బోర్నియో దేశస్థుడు ఏఅనే మతబోధకుడు 1892

సం॥ 20వ జనవరిని యీవిధంగా వ్రాసినాడు. "ప్రియమైన కూనేగారికి నావద్ద తొట్టివైద్యపు ప్రతులు మీరు రచించినవి 2 ఉన్నవి. నేను ఈబోర్నియో ద్వీపములో ఉండే కొంతమంది కలిసి ఆగ్రంథములో చెప్పిన ప్రకారము నడచుకుని ఆరోగ్యముగా ఉన్నాము. నేను మీగ్రంథముచూచి సంవత్సరమైనది. అప్పుడునేను ఒకస్నేహితుని యింటికి వెళ్ళినాను. అక్కడనాకు జ్వరము తగిలినది. నాకుశక్తిలేకుండా పోయినది. అప్పుడు మీ వైద్యము చేసినాను. ఒకపేముకుర్చీమీద కూర్చొనిఒంటికిఆవిరి పట్టినాను.మీగ్రంథములోచెప్పినట్లుతొట్టివైద్యమునుచేసినాను. మంచి సుగుణము కలిగినది. ఇదివరకు యిలాంటి జ్వరము వస్తే ప్రక్కమీదనుంచి లేవలేను. ఇప్పుడు స్నానము చేసిన తర్వాత సులభంగా లేవగలిగినాను. ఈ సంగతి నాస్నేహితుడు ఆయన భార్యచూచి ఆశ్చర్యపోయినారు. అప్పటినుంచి మావైద్యాన్ని శ్రద్ధగా చేస్తున్నాము. దయ్యులు చిరకాలంనుంచి ఆవిరి పట్టుకుంటారు. మందులులేవు. వైద్యులులేరు, చిరకాలంనుంచి ఆరోగ్యంగా ఉంటున్నారు. వారినుంచి ప్రకృతివైద్యాన్ని నేర్చుకున్నాను. నేను యెవరెవరి రోగాలు ప్రకృతి వైద్యముతో నయము చేసితినో ఆ చరిత్రలన్నీ వ్రాస్తే గ్రంథము పెరిగిపోతుంది. దూరప్రదేశములో ఉన్న నాబోటి మతబోధకులకు మీగ్రంథము చాలాఉపయోగకరమైనది. మీగ్రంథమునావద్ద ఉన్నందున చాలా ఉపయోగకరముగాఉన్నది.ఇక్కడఒకపూరి గుడిశలో ఒక ఆడమనిషి నివసిస్తూ ఉన్నది. ఆగుడిశకునిప్పు అంటుకున్నది. ఒడలుకాలేదాకా ఆమెకు మెలకువ రాలేదు.

ఆమెచేతులు, ముఖము కాలిపోయినవి. ఉదయమునుండి సాయంకాలంవరకూ తడికట్లను కట్టించినాను. సాయంత్రం మీ గ్రంథములో ఉన. మాస్తరు కట్లు కట్టించినాను. మర్నాడు తిరిగి అట్లే కట్టించితిని. ఒకవారం రోజులలోనే ఆమెపుండం తయు మానినది. పాతనైద్యములో విలేపనాలుచేసి నైద్యము చేస్తే యెన్నివారాలో నెలలో పట్టేది. కొన్నివారాలకిందట నా యెడమచేతిమీద పొడపుట్టినది. అది వలయములు ఉంటుంది. దానిని యిక్కడివారు కిహీస్ అంటారు. దానికి పూర్వము యేదో మందు రాచేవాడను. అప్పుడు నయమై సర్లుండి, మళ్ళీవచ్చేది. ఒకప్పుడు కాలిమీదలేస్తే ఒకప్పుడు ముఖాన లేచేది. ఒకప్పుడు వీపుమీద లేస్తే ఒకప్పుడు చేతి మీద లేచేది. ఈ నారి పొడపుట్టినప్పుడు తొట్టివైద్యములో దీన్ని మాతపర్చుదాం మనుకున్నాను. మొదట ఆవిరి పట్టినను. తరువాత కటిస్నానము చేసినాను. మర్నాడు 2 లింగస్నానాలు చేసినాను. 3వరోజు చికిత్స చేసినప్పుడు ఆపొడ వాడియున్నది. పొడపోవటానికి సిద్ధముగా ఉన్నదనుకున్నాను. చేతిమీదపొడకు ఆవిరి పట్టినపుడల్లా ఒకలింగస్నానం చేసే వాడను. ఇప్పుడు నా యెడమ చేతిమీద 2పుండ్లు పుట్టినవి. దేహములో ఉన్న మురికిఅంతా యిక్కడికి చేరుతున్నది. ఈపుండ్లు మానేటప్పటికి నాపొడ కుదురుతుంది. ఇంతకంటె కిహీస్ పొడను పోగొట్టేటందుకు ఉపాయములేదు. నేనెప్పుడూ తొట్టి వైద్యాన్నే వాడతాను. దీనికి సాటిఅయినదిలేదు. నాస్నేహితులకుకూడా తొట్టివైద్యమును చేయమని బోధిస్తున్నాను.”

ఈవిధంగా పశ్చిమాఫ్రికా, ఆస్ట్రేలియానుంచీ, ఉత్తర యిండియా కేఫ్, అనే వెస్టిండీస్ మొదలైన దేశాలనుంచి మనవైద్యము యొక్క గొప్పతనాన్ని గురించి మెచ్చుకొంటూ కృతజ్ఞతా పూర్వక వందనాలతో అనేక లేఖలు వచ్చినవి.

---

## ౧౬. కుష్ఠు

వేడిదేశములలో ప్రబలే యీకుష్ఠుయొక్క తీవ్రత సమశీతోష్ణ మండలాల్లో వారికి తెలియదు. ఉష్ణమండలాల్లో, ఒకసారి కుష్ఠురోగం వచ్చిందంటే, దానిని న్యాయంగా నయముచేసే వైద్యవిధానము లేదు. కుష్ఠురోగం వచ్చిన వారిని, మిగతా వారితో కలియనీయకుండా వేరే ఒక చికిత్సాలయములో ఉంచుతారు. చచ్చినదాకా అట్లా ఉండవలసినదే. కుష్ఠురోగం మిగతా వారికి అంటిపోతుందని భయముచేత వారిని బంధుమిత్రాదులలోనుంచి విడదీసి వేరుగా ఉంచుతారు. అక్కడ వారికి అన్నంపెట్టటానికివచ్చే మనిషి తప్ప వేరేమనిషి కనబడడు. సమశీతోష్ణ మండలాల్లో కుష్ఠురోగం రానేరాదు. అక్కడి వారికి ఆమవాతము- సంజు మొదలైన వ్యాధులు వస్తవి. వేడిదేశంలో ఖర్జూరంచెట్టు పెరిగితే సమశీతోష్ణ మండలాల్లో ఓక్ చెట్టు పెరుగుతుంది. అదేభూమి, అదేసూర్యుడు, అదే వాతావరణమైనప్పటికీ వేరు వేరు శీతోష్ణములు ఉన్నచోట వేరువేరు చెట్లు పెరిగినట్లు, వేరు వేరు వ్యాధులు కూడా

వస్తవి. అందులో కుష్టురోగం, ఉష్ణమండలాలల్లో వస్తుంది.
కుష్టు 2 రకములు. చీముకారుతూ నీళ్ళువస్తూఉండే కుష్టును



1 వ పటము.
15 యేండ్లవాడు.

తడికుష్టు — లేక ఆర్ద్రికుష్టు అని పిలుస్తారు. ఇది క్రిమక్రిమంగా వృద్ధిపొందుతూ చిట్టచివరకు మృతివస్తుంది. శుష్క-కుష్టులో తడికుష్టులోవలెనే అజీర్ణరోగ· ముంటుంది. కాళ్ళుచేతుల

చివరవేళ్లు కుళ్లుతూ ఉంటవి. చివరల నల్లనిమచ్చ లుంటవి అనగా లోపల మండిపోయేవేడిమి ఉందని అర్థము. వేళ్ళ చివరఉండే కండంతా ఊడిపోయి యెముకలు బైటపడుతవి.



2 వ పటము.

13 యేండ్లవాడు.

చావబోయేచెట్టు యెండిపోయినట్లుగానే క్రమక్రమంగా దేహం కూడా యెండిపోతుంది. సంధులు మిగతాయెముకలు బైట పడతవి. ఎముకలు సంధులు లావవుతవి. రోగికృశించి చనిపో

తాడు. మిగతాఅన్నిరోగాలకువలెనే కుష్టురోగానికికూడా దేహములోచేరిన రోగపదార్థమే కారణము. ఈరోగపదార్థము తల్లితండ్రులనుండిఅయినా సంక్రమించవచ్చు లేదాఅసహాజమైన



3 వ పటము.

9 ఏండ్లవాడు.

జీవనముచేతనైనా చేరవచ్చు. చిన్నరోగాలకు తెలివితక్కువగా చేసిన పెద్దవైద్యాలవల్ల రావచ్చు. ఈరోగానికిపీఠము ఉదరమే. ఇందులోకూడా జీర్ణక్రియ చెడిఉంటుంది. జీవనక్రియలో తీవ్ర పరిణామాన్ని కలిగించే ఉష్ణ మండలాలల్లోని అమితవేడి మానవ

దేహములో ఉండే రోగపదార్థములో తీవ్ర పరిణామాన్ని కలిగిస్తుంది. అందువలన అక్కడఉన్న రోగపదార్థము ప్రచండ వేగముతో దేహముయొక్క చివరలకంటు వ్యాపించి అక్కడ నుంచి గెంటివేసే సామర్థ్యం లేనందున పాదములయొక్క హస్తములయొక్క చివరలందుచేరి కుళ్ళిపోవును. అందువల్లనే కుష్ఠ రోగులకు మొట్టమొదట స్పర్శజ్ఞానము లేకుండా పోతుంది. చివరలు చల్లగా నుండిగాని లోపల మండిపోయే వేడిఉంటుంది. శుష్క కుష్ఠులో యీ అంతర్గతమగు వేడిమివలన దేహము యొక్క చివరలు ప్రత్యేకముగా మండిపోతవి. లోపలి జీర్ణ క్రియ బొత్తిగా చెడిపున్నందున యెంతో బలకరమైన ఆహారాలు యిచ్చినా రోగికి బలముచేకూరదు. ఎంత ఆహారము తిన్నా దేహములోనుంచి జారిపోతుందిగాని దేహానికిబలాన్ని యివ్వదు. రసాయనిక శాస్త్రము యొక్క ఆహారములో యెంతెంత ఆహారపు విలువ ఉందని చెప్పినా, యెంతెంత ఆహారము తిన్నా, అదియేమీ దేహానికి బలము యివ్వదు. ఎంతఆహారము నిజంగా, దేహముతో సారూప్యాన్ని పొందునో, ఆదే దేహమునకుబలాన్ని యిచ్చేది. తడికుష్ఠులో సంజురోగములోవలెనే దేహములోపల రోగపదార్థము మురుగుతూ ఉంటుంది. లోపల సంజురోగ ములోవలెనే, కుళ్ళు యెప్పుడూ ఉంటుంది. ఇట్లు అనేకసంవత్స రాలు జరుగుతుంది. మానవదేహములో కలుగవలసిన చెడ్డపరి ణామాలల్లో యిది చిట్టచివరి దశ. సంజురోగములలో ఉండే నీరువంటిది కాకపోయినా యింకొక విధమైన మురుగునీరు యీ కుష్ఠురోగములో ఉంటుంది. హృద్రోగాన్ని గురించి వ్రాస్తూ బహువియా రోగి చరిత్ర వ్రాశాను. ఒకరోగికి గుండెజబ్బు

నంజ కుష్ఠు. ఒకేకాలములో అతనికి వచ్చినట్లు వ్రాశాను, ఉష్ణమండలాలల్లో వచ్చినట్లుగా సమశీతోష్ణమండలాలల్లో కుష్ఠురోగం రాదు. అయినప్పటికీ, దానికి తుల్యమయిన లక్షణాలుగల రోగాలు వస్తూనేఉంటవి. సమశీతోష్ణ మండలాలల్లో వచ్చే వ్యాధుల్లో క్షయరోగము ముఖ్యతరగతిలోనిది. దేహములో చేరిన రోగపదార్థమునందు మండము పుట్టి అది ఊపిరితిత్తులను దహించినపుడు క్షయరోగం వస్తుంది. ఈవిధంగానే ప్రేగులను పీడించినపుడు అంత్రక్షయ వస్తుంది. క్షయరోగం నయము చేయటం తమచేతకాదని మందువైద్యులు ఒప్పుకున్నారు. కుష్ఠుకూడా ఒక జ్వరవిశేషమే. మందువైద్యులకు జ్వరచికిత్స యెప్పుడయితే తెలియలేదో కుష్ఠురోగాన్నికూడా వారు నయము చేయలేరు. దేహములోని రోగపదార్థాన్ని వెలువరిస్తేగాని దేహములోని వేడిమి తగ్గదు. దేహమునందలి అంతర్గతమగు వేడిమి తగ్గితేనేగాని కుష్ఠురోగం నిజముగా నయముకాదు. కుష్ఠురోగానికి చేసిన మందువైద్యమువల్ల కుష్ఠురోగం నయముకాదు. పైగా వారిచ్చే విషపు మందులవలన చర్మము మరీ పెళుసెక్కి ఆరోగ్యం మరింత చెడిపోతుంది. వెనుకవర్ణించిన బటేవియా రోగి చరిత్రకంటె, యింకా రుజువుచేసే విషయము యేమున్నది ? అతని దేహములో ఉన్నవని వైశేషికులు కనిపెట్టిన సూక్ష్మజీవులు వారు వాడిన విషపుమందులను తప్పించుకుని చావకుండా బ్రతికేయున్నవి. ఆ రోగికి మన వైద్యము చేసినపుడు, అతని దేహములో ఉండే కుష్ఠు సూక్ష్మజీవులు నశించిపోతవి. ఈసంగతి బటేవియా రోగిని పరీక్షచేసి

వైశేషికులు నిర్ధారణ చేసిరి. మనవైద్యముచేస్తే మందు వైద్యానికి లొంగని కుష్టు తప్పకుండా నయమవుతుంది. ఉద్రేకము లేని సహజాహారము పథ్యముగా యిస్తూ, కటిలింగ స్నానాలు చేయిస్తే, యీ కుష్టురోగము నయమవుతుంది. దేహములో తగినంత ధాతుశక్తి ఉండి జీర్ణక్రియ బాగుపడి చెమటపోసే స్వభావము వృద్ధి అవుతే యీ రోగం తప్పకుండా నయమవుతుంది. ఎవరు సహజాహారముతోనూ కటిలింగస్నానాలతోనూ, వ్యాయామముతో నూ, తమ దేహమును శుద్ధి చేసుకొని, ఆరోగ్యాన్ని బాగుచేసుకుంటారో వారికి యీ కుష్టురోగం అంటుకోదు. అంతేకాకుండా, ప్రపంచమునందలి యే యితర రోగాలు వారికి అంటుకోవు. మందు వైద్యులు తమరోగులను కిటికీలు మూసినయింట్లో, గాలి తగులనిచోట పరుండబెట్టి వారినిరక్షించుచున్నామనుకొంటారు. వారికి సహజ ప్రక్రియలలో ఉండే శక్తి తెలియదని దీనివలన తెలియుచున్నది. రోగులను గదులలోపెట్టి మూసియుంచుట వలన కురుపులలోనుంచి వచ్చినవాసన వారిగదులలో వదలిన నిశ్వాసములవాసనయు కలిసి, ఆగదిలోగాలిఅంతా చెడిపోయి ఉంటుంది. అందువలన ఆగదులలోనిగాలి పీల్చినపుడు రోగము అంటుకొనటానికి వీలున్నది. కుష్టురోగనివారణ వృత్తాంతాలు చెప్పేముందు కుష్టురోగంనుండే కాకుండా మిగతా అన్ని వ్యాధులు అంటకుండా కాపాడుకునేందుకు యేమిచెయ్యాలో వ్రాస్తాను. బలమైన రోగపదార్థము దేహములో లేనివారికి కుష్టురోగం అంటుకొనదు. దేహములో యిదివరకే మిక్కుటముగా రోగపదార్థ మున్నపుడు అందులో కొత్తగా

మండాన్ని పుట్టించే మురుగు చేరినప్పుడే యిట్టి రోగము వస్తుంది. అనేకసంవత్సరాలు ముందుగానే ముఖనిదానంచేసి యెవరికి



4 వ పటము.

2 న పటములోని వాని చేతులు.

కుష్టురోగం వస్తుందో, యెవరికిరాదో చెప్పవచ్చును. దయామయి అయిన ప్రకృతికూడా యీసంగతి తెలుసుకునే సామర్థ్యం సహజపరిజ్ఞానంద్వారా మనయందు పనిచేయుచున్నది. ఎవరి దేహములో రోగపదార్థము యెక్కువగా ఉండి, కుష్టురోగం రాతగియున్నదో వారికి కుష్టురోగం చూస్తే, భయమూ అసహ్యమూ పుట్టుతుంది. ఎవరి దేహములో యెక్కువ రోగపదార్థములేదో, వారికి కుష్టురోగం చూస్తే జాలి, దయపుట్టుతుంది. బర్లిన్‌లోనూ యితరచోట్లందునూ, వివిధమందులను వాడిన, ముగ్గురు పిల్లలకు, కుష్టురోగం నయముకాదని మానివేసిరి. వారివయస్సు, వరుసగా 15, 13, 9 సంవత్సరములు. వారివి

**1, 2, 3,** పటములు. వీరికి చికిత్సచేసి కుదిర్చినాను. అందువలన మిగతా వైద్యాలకంటే మనవైద్యము గొప్పదని యింకొక సారి రుజువైనది. వీరివృత్తాంతాలు ప్రజల కుపయోగిస్త య్యానే నమ్మికతో వారిచరిత్రను చిత్రపటములతో సహా యిచట



**5 వ పటము.**

3 వ పటములోనివాని చేతులు.

వివరించుచున్నాను. మనవైద్యము ఆరంభించినపుడు వారిస్థితి చాలా దుర్భరముగా ఉండెను. చేతులమీదను చేతివేళ్ళచివరలను మధ్య కణుపులు బాగా కుళ్ళియుండెను. వ్రేళ్ళయొక్క మిగిలిన భాగాలు వాచి ఊడిపోవటానికి సిద్ధముగా ఉండెను.

**4,5,** పటములను చూచునది. చిన్నపిల్లవాని కుడిచేతి పెద్దవ్రేలు అదివరకే కుళ్ళివున్నది. పెద్దవాండ్రి యిద్దరి కాలివేళ్లు చూడ

టానికే భయంకరముగా ఉన్నవి. 6,7, పటములను చూచునది. అవి కుళ్ళినమాంసము ముక్కలవలెవున్నవి. చర్మము ఊడిపోయి ఉన్నది. ఎముకలు బైటపడినవి. వానిలోనుంచి చీము వస్తున్నది.



6 వ పటము.

1 వ పటములోనివాని పాదము.

మోకాలు మోచేతులకు దిగువనుండే భాగాలల్లో స్పర్శజ్ఞాన మేమీ లేకుండా పోయినది. బెర్లిన్‌లో ఒకవైద్యుడు వారిచేతు లలో ఉన్న స్పర్శజ్ఞానపుమితిని తెలిసికొనుటకై ఒకపొడుగాటి సూదిని చేతిలోనికి దించిచూచినాడు. ఆబిడ్డకు ఆబాధ తెలియలేదు. మోచేతివద్ద మాత్రమే నొప్పి తెలిసినది. ఈ పిల్లలను ఫోటోలు తీయిదామనుకుంటే 3 వారాలు చికిత్సచేసి వారిస్థితికొంచెము బాగుపడేదాకా ఫోటోగ్రాఫరు భయముతో రాలేదు. ఆబిడ్డల



**7 వ పటము.**

2 వ పటములోనివాని పాదము.

స్థితి అంతదుర్భరముగా ఉన్నది. ఆ బిడ్డలకు దినమునకు 2, 3 కటిలింగస్నానములు చేయించుచుంటిని. సహజాహారమును పథ్యముగా నిచ్చుచుంటిని. ఆరుబైట వ్యాయామముచేసి, చెమటపట్టించుచుంటిమి. వీరికి బాగా సుగుణము యిచ్చినది. వారికి మొదట సమీపించుటకు వీలుగానంతవాసనకొట్టుచుండెను. తొట్టిస్నానములు చేసేటప్పుడు యీవాసన మరింత యెక్కువగుచుండెడిది.

వారికి ఉదయంపూట పొట్టుతీయని గోధుమపిండితో చేసిన రొట్టె, యాపిల్‌ను యిచ్చేవారము. మధ్యాహ్నం పీచుగల కూరలు, ఉడుకపెట్టినపప్పు యిచ్చేవారము. అందులో నేయి గాని, ఉప్పుగాని చేర్చేవారముకాదు; మాంసాహారము వారికి యివ్వలేదు. ఉడుకపెట్టిన కూరగాయలు, పొట్టుతీయని గోధుమ రొట్టె మాత్రము తినేవారు. మంచినీళ్ళుమాత్రము త్రాగేవారు. కురుపులలోనుంచి కారే చీము మొదటి 15 దినాలలోనే కట్టుకున్నది. లోపలనుంచి పుండ్లు మాననారంభించినవి. పెదపిల్లలు యిద్దరికి, పెద్దపుండ్లు ఉండి, వానిలోనుంచి చీముకారుతూ ఉండెను. ఆపుండ్లు మానుటకు యింకొక నెలరోజులు పట్టెను. చేతివ్రేళ్లు వాపు తగ్గి సన్నపడనారంభించెను. 2 వ మాసములోనే, చేతివ్రేళ్ళ ఉబ్బు తగ్గుటచే ముడుతలు స్పష్టముగా కన్పించుచున్నవి. చివరలకంటా వ్యాపించిన రోగపదార్థము, తిరిగి ఉదరమువంకకు దిగిపోవ నారంభించెను. చేతివ్రేళ్ళలోను, కాలివ్రేళ్ళలోను కణుపులలోను, లాగుచున్నట్లు బాధ పుట్టెను.

మన చికిత్స ఆరంభించినపుడు పెద్దపిల్లవాడు అతనికొరకై, కుట్టించిన పాదరక్షలు ధరించలేకపోయెను. 4 వారాలు అయ్యేటప్పటికి పోయిన స్పర్శ జ్ఞానము అరికాళ్లల్లో తిరిగి చేరుకున్నది. అప్పుడతడు తనకొరకై చేయించిన చెప్పులను తొడుకుకొన గలిగెను. అతని జీర్ణక్రియ వృద్ధి పొందెను.

మనవైద్యము ఆరంభించేటప్పటికి వానికి ఆకలి లేదు. 1 వారం మనవైద్యము చేసేటప్పటికి వానికి ఆకలి వృద్ధిఅయినది. ఇంత దుర్భర స్థితిలో ఉన్న యీపిల్లకాయలు రోగం నయమై యిప్పుడు సుఖముగా ఉన్నారు. కుష్ఠురోగం సాధారణంగా నయము కాదంటారు. కాని మనవైద్యములో కుష్ఠు నయమౌతుంది. ఇప్పుడు అన్నిరోగాలకు మూలకారణమైన కారణంచేతనే కుష్ఠు వస్తుందని ఆరోగ్యశాస్త్రాన్ని మనము వెలువరించ గలిగితే కుష్ఠురోగం కూడా నయమవుతుందని ఋజువు అయినది. పూర్తిగా శక్తి బొత్తిగా చెడిపోయి రోగం బాగా ముదిరినవారికి మనవైద్యములో కూడా రోగనివారణ కాదు. కాని జీవించి ఉన్నంతవరకూ బాధలు తగ్గును. ప్రాణోత్క్రమణము సుఖముగా జరిగిపోతుంది.

# ౧౭ అ మరక్రిములు - బద్దెపురుగు - పరాన్న భుక్కులు - పెరుగుజారుట.

వేరువేరు నామరూపాలలో ఉన్న వివిధరోగాలను, ఒక్క ప్రకరణములో గుదిగ్రుచ్చినాను అన్నిరోగాలకు కారణము, ఒక్కటిగా ఉండుటవలన యిట్లుచేసితిని. వానికి చేసిన చికిత్సలు కూడా ఒక్కటిగానే ఉండి, అన్నిరోగాలను నయముచేయ గలుగుట వలన యీ విషయము మరింత ఋజువైనది. తామర, తీట, చుండు, కర్పాణి, మొదలగు వ్యాధులు, యెలాపుట్టేది విశదించెదను. ఒకశరత్కాలములో పొగాకు ములగచెట్టు ఉంటే, ఆచెట్టుకు యెన్నో గొంగళిపురుగులు పడతవి. ప్రతి ఆకుమీద ఒకపురుగు కనపడుతోంది. చెట్టునున్న ఆకుల నన్నిటిని, ఆపురుగులు తింటవి. మనము వానిని చపలేము. ఇలా ఉండగా ఒకరోజున చల్లనిగాలి కొడుతుంది. ఆగాలికి అన్ని పురుగులు చచ్చి పడి ఉంటవి. దేహములోకూడా యీపనే జరుగుతుంది.

తలలోపుట్టే పేలు, కురుపులలో పుట్టే క్రిములు, దేహములో రోగపదార్థముండి, అది మురిగినప్పుడే పుట్టుచున్నది. ఆమురుగు కూడా యెట్టిక్రిములు జీవించటానికి వీలుగా ఉంటుందో, అట్టి క్రిములు పుట్టుటకే కారణమవుచున్నది. దేహములో రోగపదార్థమునందు పుట్టిన మండము వేడికికూడా కారణంగా ఉంటుందీ అని వ్రాశాను. ఆవేడి ఉంటేనేగాని యీక్రిములు పుట్టటానికి వీలులేదు. అందువలననే అంతర్గతమగు వేడిమియందే యీపురుగులు పుట్టుచున్నవి. దేహమునందున్న రోగపదార్థము వెలువరించుటవలన మండమును వేడిమియు తగ్గ

చర్మవ్యాధులును, వానితోపాటు క్షయరోగము నయించి పోవుచున్నవి. ఇదివరకు నేనిచ్చిన విధానముల ననుసరించి కటిలింగస్నానములును, సహజపథ్యమును వ్యాయామము మొదలగు యితర ప్రక్రియలును రోగపదార్థమును పోగొట్టుటకు ఉపయోగ పడగలవు. ఏరోగికి యేయేచికిత్సలు యెంతకాలము చెయ్యాలి అనేది ఆయారోగులను చూచి సమర్థుడయిన వైద్యుడు నిర్ణయింపగలడు. చిత్రవిచిత్రమైన యీవ్యాధులన్ని ఒకే కారణముచేత వచ్చుచున్నవి. ఒకేచికిత్సతో నయమవుచున్నవి. వీనికే మందులతో వైద్యముచేస్తే రోగము నానాటికి ముదిరిపోతుంది.

నేను చికిత్సచేసి నయముచేసిన రోగాలను గురించి వ్రాస్తాను. ఒక పెద్దమనిషికి నులిపురుగు వ్యాధి. దీనితోపాటు అజీర్ణము, నాడీవ్యాధి ఉండేది. ఆరోగాలతో అతను చావుకు సిద్ధమయినాడు. లోపల దహించుకుపోతున్నట్టు ఉండేది. మొలలలో నులిపురుగులుపడేవి. అయినప్పటికీ మందువైద్యము అతనికి ఉపయోగించేది. వైద్యము మొదలిడిన 2వ మాసములోనే నులిపురుగులు పడటము ఆగిపోయినది. ఇంకా కొంతకాలము చికిత్స చేయునప్పటికీ ఆకాలికవ్యాధి నయమై పరిపూర్ణ ఆరోగ్యము కలిగినది. దేహములో ఉన్నరోగపదార్థాన్ని వెలుపలించి మంటవ్యాప్తిని తప్పి అంతర్గతమగు వేడిమిని తగ్గించుటకును, ఆవిధంగా రోగమును నయముచేయుటకును, కటిలింగస్నానాలు దేహమునకు చెమట పట్టించుట, వండని ఆహారమును పథ్యముగా యిచ్చితిమి. తామరకు మందువైద్యులుచేసిన చికిత్సయు, మనచికిత్స

విధానమును తెలుపు వృత్తాంతము. ఒకనికి 17 సం॥ అనేక చికిత్సాలయాలల్లో, చర్మవ్యాధికి చికిత్సచేసినారు. లాభము లేకపోయినది. తనవద్ద మందులేదని చెప్పటానికి బదులుగా ఆ రోగిని నావద్దకుపంపినారు. అత్యవసరముగా ఉండటంచేత మందు లేఖ పనిచేయకపోవటంచేత ఆ రోగి నా సలహా విన్నాడు. అతని చేతులు, కాళ్ళు ఘోరముగా కనిపించుచున్నవి. ముఖ నిదానశాస్త్రమువలన అతడు అనేకసంవత్సరములనుండి అజీర్ణ రోగిముతోను ఉదరవ్యాధులతోను బాధపడుతున్నాడు. అని తెలుసుకున్నాను. ఇందువలన రక్తము చెడినది. ఆముదుగులో మెన్నో సూక్ష్మజీవులు పుట్టి వృద్ధిపొందుతున్నవి. ఇతనికి కూడా కటిలింగస్నానాలు చేయిస్తూ ఆవిరిపట్టుతూ ఉద్రేకము లేని సహజాహారాన్ని యిచ్చాను. ఇందువలన జీర్ణక్రియ వృద్ధిఅయినది. మురుగు లేకపోవుటవలన క్రిములుకూడా తగ్గి చర్మవ్యాధి మాసినది. రక్తపరీక్షచేసిన రుకూడా యీ సంగ తినే స్థిరపరచినారు. చికిత్స మొదలుపెట్టిన 3 వ వారములో యింకా అక్కడక్కడ చర్మదోషము ఉన్నది. 4 వ వారములో అదికూడా పోయినది. రోగియొక్క స్థితిగతులు దేహము అంతా మార్పుచెందినది. అతనిని యెవరూ గుర్తు పట్టలేనంత ఆరోగ్యంగాఉన్నాడు. అతనికి మందులు వాడలేదు. శస్త్రమూ చేయలేదు. ప్రభుత్వమువారి చికిత్సాలయాల్లో పనిచేస్తూ ఉండే సుప్రసిద్ధ వైద్యులు మందు శస్త్రము స్వాధీనములో ఉండికూడా రోగాన్ని నయము చేయలేకపోయినారు. మనము అందరికీ చేయించిన కటిలింగస్నానాలు సహజపథ్యముతోనే వ్యాధిని కుదిర్చినాము.

పేగుజారుట, ఉదరమునందు రోగపదార్థము చేరి అందు వత్తిడి పుట్టుటవలన పేగు జారుతుంది. అది పేగులను ఆవరణగా ఉండే ఆంత్రవేష్టనమును భేదించుకుని క్రిందికి దిగిపోవును. ఏదో దూకితేనో పరుగెత్తితేనో ప్రేగు జారుతుంది అనటం చాలా పొరపాటుమాట. పేగులలో రోగపదార్థముండి అందులో వత్తిడియెక్కువ అవుతేనే యీపని జరుగుతుంది. ఉదరమునందలి రోగపదార్థము వెడలిపోతే అక్కడి వత్తిడి తగ్గుతుంది. అప్పుడు ప్రేగు జారటంకూడా లేకుండాపోతుంది. ఇందుకు పటకాలు పెట్టటం వలన ప్రయోజనములేదు. అది తాత్కాలికముగా ఉపశాంతి యిచ్చినట్లు కనుపడుతుందిగాని, నయముకాదు. ఈ రోగానికికూడా తొట్టివైద్యము బాగా పని చేసింది. అయితే యెంతకాలానికి యీ రోగము నయమవుతుందని చెప్పటానికి సాధ్యంకాదు. రోగపదార్థము చేరిన పరిమితిని, గతిని పట్టి, అదిచేరిన కాలాన్నిపట్టి, చికిత్సాకాలము కూడా పెరుగుట, తరుగుట, ఉంటుంది. ఏమయినప్పటికీ దేహములో ధాతుశక్తి తగిపోయిన ముసలివానికి చేసిన వైద్యము కంటే బాగా ధాతుశక్తికలిగి ఉన్న పడుచువానికి వైద్యములో తొందరగా నయమవుతుంది. పూర్తిగాను నయమవుతుంది.

# ౧౮ క్షుద్రవ్రణము

దీనిని యింగ్లీషులో, కేన్సర్ అంటారు. ఈ వ్యాధిపేరు చెపితే అందరికీ హడలే. పైనుంచివచ్చిన కారణాలచేత యీరోగము రాదు. ఇంతిసర్వనాశకమైన వ్యాధి రావాలంటే దీనికి మూల కారణము దేహములోనే ఉన్నది. క్షయ కుష్టు మొదలగు వ్యాధులవలెనే అణచిపెట్టిన అనేకరోగాల పర్యవసానంగా యీక్షుద్రవ్రణము వస్తుంది. అంతులోనూ సవాయి మొదలైన సుఖరోగాలను అణచిపెట్టడానికి వాడిన మందు వైద్యమువలన యీ వ్యాధి వస్తుంది. ఏమైనప్పటికీ దేహములో మిక్కుట మయిన రోగపదార్థముండుటయు, ఆరోగపదార్థాన్ని బైటికి గెంటుటకు దేహముచేసే ప్రయత్నములలో కాయలు, గడ్డలు, అర్బుదములు, వ్రణములు పుట్టును. సుఖనిదానశాస్త్రమువలన కొన్నిసంవత్సరముల ముందుగానే క్షుద్రవ్రణము పుడుతుందని తెలియును. ఇట్టివ్రణము పుట్టటానికి చాలాకాలమునకుముందు గానే మెడమీద కాయలు కణతులు పుట్టుతవి. అప్పటికే దేహము నందంతటను యిట్టికాయలు పుట్టిపెరుగుతుంటవి. ఆసనములో మొలలు పెరుగుతుంటవి. మలము సరిగా రాకుండా పేరిగి యిని అడ్డుకుంటవి. భేదికౌషధములు, యెనిమా మొదలగునవి వాడితే గాని విరేచనము కాదు. ఇట్టి మాత్రలు వాడుటవలన ప్రేగు లలో పుండుపుట్టి అది కుళ్ళుతూ ఉంటుంది. చాలా సంవత్స రాలు వాడిన మాత్రలయొక్క విషాన్ని ప్రేగులు వానికి సంబంధించిన నరాలు భరించును. వానివాడుక మితిమీరి నప్పుడు యిట్టి పుండు పుట్టును. ఈ స్థితియొక్క చివరి పరిణామమే

క్షుద్రవ్రణమనే పేరుగల ఈ అంతర్ వ్రణము (అనగా లోపల పుట్టుపుండు.) నంజు, కుష్టు, మొదలైన వ్యాధులన్నింటికి కారణమైన అసహజమైన జీవనము, తిండిబోతుతనము, అవివేక భోజనము, ఉద్రేకపదార్థాలతో నాడులను రెచ్చగొట్టే మాదక ద్రవ్యాలవాడుక, మొదలగునవియే యీ రోగానికి కూడా కారణము. నంజు. క్షయ మొదలైన వ్యాధులను నేవిధంగా మందు వైద్యులు నయముచేయలేకుండా వున్నారో ఆవిధంగానే క్షుద్రవ్రణానికి వారివద్ద చికిత్స యేమీ లేదు. (లో×తు) యక్సురే రేడియం మొదలైన చికిత్సావిధానాలు తత్కాలంలో రోగాన్ని పోగొట్టినట్లు కన్పడినా నానాటికిరోగం మరింతముదిరి యెందుకూ కొరగాని స్థితి యేర్పడుతుందని ఋజువైపోయినది. అదివరకు చేస్తూఉండేశస్త్రము నిరుపయోగమైనదని యిదివరకే వారికి తెలిసిఉండటం చేతనే యీ రేడియం కాల్పులు మొదలు పెట్టినారు. ఫ్రెడరిక్ చక్రవర్తి అంత వానికి శస్త్రచికిత్సచేస్తే అది ఉపయోగం లేదు. ఒకచెట్టు వేళ్లను వదలి చివరకొమ్మలను నరుకుతుంటే యేవిధంగా చెట్టు నిలిచి యుంటుందో ఆవిధంగానే రోగం యొక్క మూలకారణాన్ని వదలి పర్యవసానంగా వచ్చిన చివరలక్షణాలకు వైద్యము చేస్తే ఆవిధంగానే నిరుపయోగం అవుతుంది. రోగమూలకారణమేదో కనిపెట్టి దానికి చికిత్స చేయవలెననే సంగతి వారికి యిప్పటికి తెలిసి ఉండవలసినది. ఇట్టి క్షుద్రవ్రణములందు దేహము లోపల కుళ్ళుఉంటుంది. దానికితోడు భరింపరాని బాధలు కూడా ఉంటవి. మందువైద్యులు మార్ఫియా యింజక్షను చేస్తారు. దానితో బాధ తాత్కాలికముగా కనపడకుండా

ఉంటుంది. దేహము మాత్రము మందువాడుకవలన దుర్బలమై పోతుంది. నాడులు శక్తిహీనము లవుతవి. నెత్తి మీద యీాగవాలినదని సుత్తితో కొడితే యేవిధంగా తల పగిలిపోతుందో, అదేవిధంగా యీా వైద్యము ఉన్నది. కటిలింగ స్నానాలతో దేహము గట్టిపడి, దేహావయవాలు బలపడతవి. మార్ఫియా వాడినప్పటివలె దేహము దుర్బలము కాదు. అదేసమయములో దేహములో ఉండే బాధలు కూడా తగ్గిపోతవి. అందువలన మార్ఫియాతో మనకు పనిలేదు. అదివరకు అభ్యాసము చేసిన మార్ఫియా దురలవాటుకూడా, మనవైద్యములో అంతరించి పోతుంది. ఇట్టి రోగాలకు చేసిన చికిత్స యేవిధంగా ఫలప్రదమవుతుందో కొన్నిమాటలు చెప్పెదను. వచ్చినవ్రణము, లోపలనా, నాలుకమీాదనా, భగములోనా, ఆసనములోనా, అనే విషయముతో మనకు ప్రసక్తి లేదు. వేరు వేరుచోట్ల పుట్టిన వ్రణము ఆస్థానాన్నిబట్టి నయముకావటం, కాకపోవటం ఉండదు. దేహములో చేరిన రోగపదార్థముయొక్క మితి, అందులో పుట్టిన మందముయొక్క వ్యాప్తి వీనిపై ఆవ్రణము నయమయ్యేదీ, లేనిదీ ఆధారపడి ఉంటుంది. దేహములో ధాతుశక్తి శేషించి యుండి, జీర్ణక్రియ బాగుపడే అవకాశము ఉంటే, తప్పకుండా ఈ క్షుద్రవ్రణము నయమవుతుంది. దేహములో మిక్కుటముగా రోగపదార్థముంటేనేగాని, యీా కేన్సర్ రాదు. ఆ రోగపదార్థమంతా వెళ్ళిపోతేనేగాని ఆకేన్సర్ నయముకాదు. ఈ రోగపదార్థాన్ని వెలువరించే సామర్థ్యం దేహములో వైద్యము

మొదలు పెట్టేటప్పటికి శేషించియుంటే ఈ రోగం నయమవుతుంది.

50 సంవత్సరముల పెద్దమనిషికి ముక్కులో కేన్సర్ పుట్టినది. సుప్రసిద్ధులైన వైద్యులను అతడు సంప్రతించినాడు. అది ముక్కు కేన్సర్ అని వారు చెప్పినారు. దానికారణమేదో తమకు తెలియదని తాము ఆ రోగాన్ని నయము చేయలేమని కూడా చెప్పినారు. ముక్కుచివర పుండు పోగొట్టటానికు తీవ్రమైన విషపుమందులను వాడినారు. ముక్కుచివర పుండు పుట్టేటప్పటికే దేహమంతా రోగగ్రస్తమై యుండుటవలన ఆమందులు పని చేయలేదు.

ఈ రోగి అనేక యేండ్లనుంచి అజీర్ణముతో బాధ పడుచున్నాడు. మందువైద్యులు ఎన్నిసార్లు పరీక్షచేసినా ఈసంగతి గుర్తించనే లేదు. వారిపరీక్షలన్నీ, ముక్కుచివర పుండుమీదే కేంద్రీకరించినారు. ముఖనిదాన శాస్త్రము వారి కేమాత్రమైనా తెలిసిఉంటే, ముక్కులో పుట్టినపుండే దేహమంతా ఉన్నదని వారికి తెలిసేది. ఇప్పటికి మందులు నిరర్థకమైనవని అతనికి తెలిసినది. అతడు నిరాశావాదికాడు గనుక సంపూర్ణమగు విశ్వాసముతో నావద్దకు వచ్చినాడు. ముక్కు, పై పెదవి అదివరకే కొరుక్కుపోయినవి. ముక్కుచివర మాయము కావటానికి సిద్ధముగా ఉన్నది. ముక్కుచివర చర్మము అప్పటికే యెండి నల్లబడినది. ప్రబలమగు మలబద్ధక మున్నది. మూత్రము తెంపుగా రావటంలేదు. తీవ్రమగు బాధలుంటేవి. ఇన్ని ఉన్నా ఆరోగి నిరుత్సాహపడలేదు. అతని దేహములో ధాతుశక్తి

యింకా శేషించి యున్నందున, మనవైద్యము అతని దేహము నకు అనుకూలముగా పనిచేసినది. అందువలన తొందరగా గుణముకలిగినది. ముక్కుమీద యేమీ చికిత్సలు చేయకుండానే, అతనిప్పుడు క్రమంగా నయమైనది. మొదట యెర్ర పుండుపడి తర్వాత మానినది. ముక్కుమీద సహజమైన రంగుతో చర్మము కప్పుకున్నది.

కొరుక్కుపోయిన ముక్కుపై పెదవి లోపలినుంచి కండపెట్టుకు వచ్చి బాగుపడినది. ఇప్పుడక్కడ మచ్చకూడా లేదు.

ఉద్రేకము కలిగింపని పౌష్టికపదార్థములను రోగికి యిచ్చేవారము. ఆపదార్థములు మాత్రమే అతనికి జీర్ణమయ్యేవి. వారానికి 1,2, తూరులు దేహమునకంతకూ ఆవిరి పట్టేవారము. ముక్కు బాధగా ఉన్నపుడు తలకు వేడినీటి ఆవిరి పట్టేవారము. ప్రతి 2 గంటలకు ఒకతూరి కటిలింగస్నానాలు చేయించేవారము. ఈస్నానాలు చేయించేటప్పుడు రోగి దేహములో యుండే బాధలు ఉపశమిస్తూ ఉండేవి. 2వ దినమునకే పైనున్నపుండు కిందికి దిగనారంభించినది. లింగస్నానము చేయించేచోట అనగా శిశ్నపుచివర మిక్కిలి బాధతోకూడిన పుండుపడినది. దీనితో రోగిక భయము కలిగినది. అతనికి నేను నెమ్మదిగా బోధించితిని. ఈస్వాస్థ్య సంకటాన్ని ఓర్చుకోనన్నా ఓర్చుకోవాలి, లేకపోతే చావనన్నా చావాలి. నీకుయేదిఇష్టమో అదిచేయమన్నాను. చివర యెంతబాధపుట్టినదో అంతబాధ ముక్కుదగ్గర తగ్గినది. చూచుకోమన్నాను. అతని అనుభవానికి అది సరిపోయినది. మనవైద్యమును అతడు చేయుటకే నిశ్చయం చేసుకున్నాడు.

ఆతనికి బాధకలిగినప్పుడల్లా, లింగస్నానమో, కటిస్నానమో చేస్తే ఆబాధ తగ్గేది. చికిత్సకాలములో, అదివరకు అతనిని బాధించిన మూత్రపిండవ్యాధి కనపడిపోయినది. ఇంకొక సుఖరోగముకూడా, సౌమ్యరూపముతో కనపడిపోయినది. ఆరోగములు వచ్చినపుడు, వాడిన మందులు ఆరోగములను నయము చేయలేదు. రోగములు లోపలనే అణగిపోయినవి. అందువలననే అవి తిరిగి కనపడినవి. ఆరోగములే ముక్కుమీద వచ్చిన వ్రణానికి పూర్వరూపములు. వైద్యము చేసేటప్పుడు ముక్కునుండి వచ్చిన ద్రవము యీసంగతిని యింకా ఋజువు చేసినది. మూత్రపిండ వ్యాధులకు సుఖరోగాలకు వాడిన మందులు, యేవాసన కొట్టినవో, ఆవాసనతో ముక్కులో నుండి ద్రవము వచ్చేది. అనగా యీమందులు శ్లేష్మము చేత చుట్టబడి, దేహములో ఘనీభవించియున్నవి. మనవైద్యము చేసినపుడు ఆశ్లేష్మము పల్చబడి ఆ వాసన బైటికి వచ్చుచున్నది. ఈ సంగతి నేను చికిత్సచేసిన వేలాది రోగుల విషయములో ఋజువైనది. ఈమందులు బైటికి పోవటానికే దేహములో యెక్కువబాధ కలుగుతుంది. మందులువాడిన రోగులకే రోగం నయముకావటానికి చాలాకాలము పడుతుంది. ఈరోగి ఆబాధలన్నీ పడ్డాడు. క్రమక్రమంగా రోగం నయమవుతూ ఉండటంచేత అతడు వైద్యాన్ని అపక సాగించినాడు. చిట్టచివరకు యిట్టిదుర్భర వ్యాధినుండి విముక్తిపొంది అతడు పరిపూర్ణారోగ్యమును పొందినాడు.

ప్రతిరోగి లింగస్నానము చేసినపుడు శిశ్నముచివరన పుండుపడుతుందని అనుకోవద్దు. ఇట్టి క్షుద్రవ్రణాలకు చికిత్స చేసేటపుడే

అప్పుడప్పుడూ యిలా జరుగుతుంది. లోపల అంతర్గతమగు వేడిమి లేనప్పుడుగాని ఉన్నమాలిన్యములు వేరుమార్గమున పోవుటకు అనుకూలముగా నున్నయెడల గాని శిశ్నము చివర పుండు పుట్టదు. దినమునకు 1½ గంట 2 గంటలు పరిమితిగల లింగ స్నానములు 1,2, సంవత్సరములు చేసిన రోగులున్నారు. అట్టివారికి యిట్టిపుండ్లు పుట్టలేదు. కొందరికి రోగపదార్థము కాలిక స్థితిలోనుంచి తరుణస్థితిలోనికి మారేటప్పుడు మిక్కిలి స్వల్పకాలము మాత్రమే యిలాంటి బాధలు కన్పడిన వారున్నారు. అది ఆస్నానం చేస్తూవుంటేనే మానిపోతుంది. దానికి ప్రత్యేక చికిత్సలు యేమీ చేయనక్కరలేదు. ఇంకా కొందరికి లింగస్నానం చేసేకాలములో వేరొకచోట పుండుపుట్టి దానిలోనుంచి మంటలతో చీము వెళ్లిపోవటం కద్దు. లింగాగ్రంమీద పుండుపుట్టటం చాలా అరుదే. అది కలిగినవారు స్నానముచేయని వేళలందు ఆపుండుపైని ఒక తడిపాత్తివైచి దానిని తరుచుగా తడుపుతూ ఉండవలసినది. పుండును తడిగాను చల్లగాను ఉంచ వలసినది. ఇంకొకవ్రణాన్ని గురించి చెప్పెదను. ఒకామెకు చంటివ్రణము. ఫ్రెడరిక్ చక్రవర్తికి శస్త్రముచేసిన సుప్రసిద్ధవైద్యులే యీమె వ్రణానికి శస్త్రముచేసినారు. బాగుగా జయప్రదమైన దనుకున్నారు. వారిశస్త్రచికిత్సతో ఆమెస్థితి మరింత పాడయినది. ఆవ్రణము తిరిగి పెరిగినది. అదే వైద్యులకు ఆమె తిరిగి వ్రణాన్ని చూపినది. దీర్ఘపరీక్షచేసి ఆమె యెడమచన్నుకు తోడుగా కుడిచన్ను కూడా శస్త్రముచేయవలెనని చెప్పినారు. అయినప్పటికీ ఆమెదేహము దుర్బలముగా నున్నందున శస్త్రము

చేస్తే ఆమె బ్రతుకదన్నారు. జర్మనీదేశానికి మకుటాయమానంగా ఉన్న వైద్యులే యీ విధంగా చెప్పితే, యేమి చెయ్యాలో ఆమెకు దరిదిక్కు తోచలేదు. అందువల్ల నావద్దకు వచ్చినది. కడుపంతా లోపల కుళ్ళిఉన్నది. అందులో చాలా గట్టి కణుతులు యేర్పడి ఉన్నవి. అందులో కొన్ని కోడిగ్రుడ్డంత లావుగా నల్లగా కమిలిపోయి ఉన్నవి. చన్నునుండి చంకవరకు అవి వ్యాపించికూడా ఉన్నవి. ఉదరములో కూడా యిలాంటి కాయలే ఉన్నవి. అందువల్ల ఉదరము గట్టిగను లావుగాను కూడా ఉన్నది. జీర్ణశక్తి బొత్తిగా చెడిపోయినది. 3, 4 దినాల కొకసారి యెనిమాచేస్తే విరేచనమవుతుంది. లేకపోతేలేదు. విరేచనములో గట్టిపడి నల్లని గోలికాయలవంటి పదార్థము వస్తున్నది. మూత్రము చాలా స్వల్పము. తీవ్రమయిన తలనొప్పులతో దిగులు యెక్కువయినది. అది నానాటికి అధిక మవుతొన్నది. ఆమె మన వైద్యాన్ని యెక్కువ ఓర్పుతో చేయ నారంభించినది. వెంటనే తలనొప్పులు తగ్గినవి. వారంవారం జీర్ణశక్తి వృద్ధిఅవుచున్నది. రోగియొక్క స్థితిగతులను బట్టి, ఆమె బలాన్నిబట్టి ప్రతిదినమూ స్నానముల సంఖ్య కాలపరిమితి జాగ్రత్తగా నిర్ణయిస్తున్నాను. మొదటి [illegible] వారాలు ఆమె చికిత్సను కష్టముగా చేసుకొనవలసి వచ్చినది. బెర్లిన్‌లో జయప్రదంగా జరిపిన శస్త్రము అప్పుడు బైట పడినది. మన వైద్యము మొదలుపెట్టే టప్పటికి యెడమచంటిమీద మచ్చ వైద్యకాలములో పుండుగా మారినది. అదే క్రమక్రమంగా లోతు అవుతూ అందులోనుండి చీము కారుతూఉండేది. మొదటి 4 వారాలు దీనితోనే సరిపోయినది. ఆ పుండు ఒక

ప్పుడు 16 చదరపు అంగుళములు వైశాల్యమును ఆక్రమించు చున్నది. ఎడమచంటిమీద పుండు. కుడిచంటిలోని పుండు కూడా తగ్గినది. శస్త్రమువలన పుండును మూసివేసినారే కాని లోపలి రోగపదార్థము అలాగే మిగిలిపోయినది. అందువలననే యెడమచంటిలో పెరగటానికి వీలులేక కుడిచన్నులో పెరగ నారంభించినది. మన వైద్యమువలన రోగపదార్థము తరిగిపో నారంభించినది. శస్త్రచికిత్స కాలములో ఉన్నపుండు తిరిగి యెడమ చంటిలో కనపడినది. మందు వైద్యులు చేసిన శస్త్రానికి రోగం లోబడలేదనియు, అది దేహము లోపల అణగియున్న దనియు. దీనివలన తెలుచున్నది. శస్త్రవైద్యులు చేసిన అత్యాచారములకు ప్రకృతి లొంగ దనియు దీనివలన తేలినది. మందువైద్యులకు రోగనిదానాన్ని గురించి యెంత జ్ఞానదారిద్ర్యము ఉందో దీనినిబట్టి తెలుచున్నది. మందులే అసహజమైనవి. అంతకంటె అసహజమైనది శస్త్రము. అందువల్లనే నా శాస్త్రాన్ని గురించి వ్రాస్తూ నిరౌషధమనియే కాక నిశ్శస్త్రమనికూడా వ్రాసితిని.

ఇక రోగినిగురించి చెప్పెదను. అల్లు పుట్టినప్పుడు బాధకరంగా యుండేది. కటి లింగ స్నానాలు చేస్తే ఆ బాధ భరించటానికి వీల య్యేది. చంటిమీద నున్నపుండుకు తోడుగా స్నానం చేస్తే ప్రదేశములో కూడా పుండుపుట్టినది. గట్టిగ ఉన్నగడ్డలు చంక లోనివి మెత్తపడి క్రమంగా అదృశ్యమైనవి. ఇదే కాలములో యీ రోగపదార్థముతో ఉదరము నిండిపోయినది. మొదటి రెండు నెలలు పొట్టుతీయని గోధుమపిండితో చేసిన రొట్టెయు.

పండ్లుమాత్రమే తినేది. ఈవిధంగా 3మాసాలుకటిలింగస్నానాలు చేయుచూ పథ్యము చేసేటప్పటికి ఆమె యెడమచంకక్రిందవ పుండు దాదాపుగా మానినది. ఆమె అప్పుడు యింటికి వెళ్ళగలిగినది. ఈవిధముగానే చాలా మందికి కేన్సరుకు వైద్యము చేసినాను. ఒకరికి నాలుకమీదాది పుండు. యింకొకరికి గొంతులో పుండు. ఇవేసాధారణంగా వస్తూ వుంటవి. మన వైద్యమువల్ల వారికికూడా రోగనివారణ మైనది.

గొంతులోవుండే గట్టిగడ్డలు కరిగి మొత్తముమీద కొలది వారములలోనే చీము కారిపోయినది. అప్పుడు రోగి బాధ లేకుండా మ్రింగగలిగినాడు. నాలుకమీది కేన్సరు వచ్చినరోగి విషయములలో ప్రతి లింగస్నానం తరువాతను నాలుకమీది ఒక గోధుమరంగు పొర అదృశ్యమయ్యేది. చిన్న చిన్న గడ్డ తొందరగా కరిగినవి. దేహము లోపలిగడ్డ మాత్రము కొంచెము ఆలస్యముగా కరిగినవి. ఈలోపుగానే నాలుక కొత్తబడి పల్చబడినది. పై రెండు విషయాలలోను మూలవ్యాధి వున్నది. దానికి సంబంధించిన గడ్డలు ఉదరములో నున్నవి. రోగులు గట్టిపదార్థము తినటానికి వీలుగానంతగా, నోరు గొంతుబాధ పెట్టినప్పుడు, తినకుండుట రోగికి మేలే అయినది. ఏమనగా అప్పటిను బాధ క్రమముగా తగ్గుచుండెను. దేహంలో ఆహారము వలన క్రొత్తగా మురుగుపుట్టుట ఆగిపోవుచుండెను. అందువలన రోగికి వర్ణిమూర్ఛ రాకుండా ఆగిపోవుచుండెను. ఈ విధముగా మనము గడ్డలను కరిగించగలము. ద్రవాహారము నస సగా పుచ్చుకుంటూ ఉంటే సరిగా విరేచనము కాదు. అందువల్ల ఆకాలములో యేమీ తినకుండుటయే మంచిది.

కేన్సర్ వ్యాధి తీవ్రమైనప్పుడు, ఊపిరి ఆడక ప్రాణముపోవుట కద్దు. దీర్ఘకాలము లింగస్నానములుచేసి, యీ అపాయము నుండి తప్పించుకొనవచ్చు. శ్వాసావరోధముతో ప్రాణము పోవటానికి, సిద్ధముగా ఉన్నరోగులు, లింగస్నానము చేసిన కొలదినిమిషములకే, ఆబాధనుండి విముక్తి పొందుచున్నారు. గొంతులో ఉండే గడ్డకరిగి పగిలి, ఆచీము వాయునాళమునకు అడ్డము వచ్చినపుడు, యీబాధ వస్తుంది. కటి లింగ స్నానాలతో యీబాధ తప్పిపోతుంది. సర్పిరోగమునందు యిట్టి శ్వాసావరోధము వస్తుంది. దానికికూడా యీ కటి లింగ స్నానములు చికిత్స. మందువైద్యులకు యీ వ్యాధులలో శస్త్రము తప్ప వేరే వైద్యములేదు. సర్పిరాకుండా చీము మందు యింజక్షన్ చేస్తారు. దానివలనకూడాయేమీ ప్రయోజనములేదు.

కొయ్యగండలు:— శస్త్రముచేసినచోట చీము గూడకట్టి కొయ్య గండపెడుతుంది. దీనికి శస్త్రముచేస్తే కిందనుంచి మరొకటి యిందులోచేరి ఆకొయ్యగండ మళ్ళీ పెరుగుతుంది. అట్లాగా కాకుండా తొట్టివైద్యముచేస్తే అందులోఉండే రోగపదార్థమంతా కరిగి చీముగా వెడలి పోయి సులభంగా కుదురుతుంది. కొయ్యగండలుకూడా అనేకమందికి కుదిర్చినాను అందులో ఒకరి వృత్తాంతము వ్రాయుచున్నాను.

30 సంవత్సరముల స్త్రీకి కుడిచూపుడు వేలు చాలాకాలము అనారోగ్యముగా ఉన్నది. వేలిచివర దెబ్బతగిలి చాలా రోజులు పుండుగానే యుండి తర్వాత కొయ్యగండ పెట్టినది. ఆమెకు చికిత్సచేస్తున్న వైద్యుడు ఆభాగమును శస్త్రముచేసి లునార్ కాస్టిక్‌తో కాల్చినాడు. తిరిగి వాపువచ్చింది. మెన్ని

నాయుడు శస్త్రముచేసినా తిరిగి కొయ్యగంత పెరుగుతూనే ఉన్నది. చిట్టచివరకు వేళ్లు కుళ్లిపోయినది. ఆకుళ్లు మిగతా భాగాలకు వ్యాపించకుండా ఉంచుటకు పైభాగమువరకూ తీసివేయాలన్నారు. రంగనైకల్యానికి యిష్టతలేక ఆమె నావద్దకు వచ్చినది. వైద్యుడు నిర్ణయించిన శస్త్రము అనవసరమనియు, ఆశస్త్రమువలన ఆమె ఆరోగ్యము యింకా చెడిపోతుందనియు బోధించినాను. నిష్కారణంగా వేళ్లు నాయులేవనియు, దేహములో ఉండే రోగపదార్థమంతా పోవటంతోనే వ్రేలువాపు నయమవుతుందనియు బోధించినాను.

ఒక్కొక్కటి అరగంట పరిమితిగల లింగస్నానములను దినమునకు 3, 4 చేయించితిని. ప్రతిదినము లింగస్నానములకు ముందు వాచినవేళ్లునకు నీటిపట్టి కట్టించితిని. ఉద్రేకము లేని సహజాహారమును యిప్పించితిని. ఆమె అప్పుడు గర్భిణిగా నుండెను. అందువలన లింగస్నానముచేయుటకు ఆమె సంకోచించెను. అయితే లింగస్నానముచేయకపోతే వేళ్లు వాపుతగ్గదు. శస్త్రము చేయించుకోవలసి వస్తుంది. శస్త్రభయముచేత నేను చెప్పినట్లు ఆమె చేసినది. రోగంకూడా తొందరగానె నయమైనది. మొదటిస్నానంతోనే వేళ్లు వాయటం ఆగినది. 3 వ నాటికి వేళ్లు వాపులోనుండి చీము రానారంభించినది. కుళ్లుకూడా ఆగిపోయినది. ఎముకలు పోతవి అనే భయము కూడా తీరిపోయినది. 14 దినములలో వేళ్లు సహజస్థితికి వచ్చినది. ఇప్పుడక్కడ మచ్చ కూడా కనపడదు.

# మూడవ భాగము.

## ౧. వ్రణాలకు నిశ్శస్త్ర నిరౌషధ చికిత్స

దెబ్బలు తగిలినప్పుడు వెలుపలగాని లోపలగాని కలిగే ఆఘాతములకు శస్త్రమే చేయవలెననీ మురుగు పుట్టకుండా కషాయాలనే మందులను వేయవలెనని మందువైద్యులు బోధించుచున్నారు. సామాన్య జనముకూడా యీవిషయములో గాఢమైన నమ్మిక కలిగి ఉన్నారు. ఈనమ్మికను పోగొట్టుట చాలకష్టము. మన వైద్యముచేసి యిట్టి ఆపదలందు ఆఘాతములను సులభముగాను తేలికగాను కుదిర్చి మనముచూపగలిగి ఉన్నాము. అందువలన మందువైద్యులు బోధించే శస్త్రచికిత్స యెంత నిరుపయోగమైనదో యిప్పుడు ఋజువైనది. అట్టి ఆపదలలో మన జలచికిత్స మందువైద్యముకంటె యెంత తేలిక అయినదో యింకా బాగా ఋజువైనది. వ్రణములకు జలచికిత్సయు ప్రకృతివైద్యమును పెట్టినదిపేరని వేరే ప్రచారము చేయనక్కరలేదు.

శస్త్రముతోనూ కుళ్ళునాపే మందులతోనూ వైద్యులు యిట్టి ఆపదలలో వ్రణాలను నయము చేసే కాలములో మూడవవంతు కాలములోనే మనము నయముచేయగలము. అంతేకాకుండా శస్త్రమువలన కలిగే అదనపుబాధ మన వైద్యములో కలుగదు. ఆపదలు వచ్చినవారి దేహము బాగా చురుకుగా ఉంటుంది. గనుక మనవైద్యము తప్పకుండా వారందరికి ఉపయోగిస్తుంది. నూటికి నూరు కేసులు నయ మవుతవి. శస్త్రచికిత్స చేసినప్పుడు

కలిగి అంగవైకల్యము కలుగును. మనవైద్యము చేస్తే, పుండు పడినచోట కూడా మచ్చ ఉండదు.

దెబ్బ, కత్తిపోటు, నలుగుట, కాలుట, మంచుగడ్డవలన బిగుసుకుని పోవుట, మొదలగు ఆపదలు జరిగినంతనే దేహము దానిని మాన్పనారంభించును. ఆపదవలన అనవసరంగా రక్తము ఆప్రదేశానికి వస్తుంది. అక్కడ చెడిపోయిన దేహభాగాన్ని రక్తము పూరిస్తుంది. ఈ రాకపోకలవలన నాడులు వేడెక్కి మంటలు, పోట్లు పుట్టుతవి. ఆ ప్రదేశము నాడి వేడెక్కి ఉంటుంది. చితికినప్పుడును, కాలినప్పుడును యీబాధ మరీయెక్కువగా ఉంటుంది. దేహము పుండును మాన్పటానికి యెలాగో ప్రయత్నిస్తున్నది. ఉచితరీతిని మనము దానికి తోడుపడితే అప్పుడు యింకా తొందరగా మానుతుంది. బాధకూడా తగ్గిపోతుంది. పుండును మాన్పుటకు దేహము ప్రయత్నించినప్పుడే బాధ కలుగుచున్నది. అప్పుడు వ్రణములందు పుట్టిన వేడిమివలననే ఆబాధ వస్తుంది. జ్వరములకు చికిత్సచేసినట్లు వ్రణములకు కూడా, చికిత్స చేయవలసి ఉంటుంది. ఈ సంగతి మనకు తెలిసినప్పుడు చికిత్స యెలా ఉండాలో మనము నిర్ణయించుకొనగలము.

మొట్టమొదట వ్రణముల బాధకు, మూలమైన వేడిని మనము తగ్గింపవలయును. వ్రణము పెద్దదైతే అందులో పుట్టిన వేడి దేహమంతా వ్యాపిస్తుంది. ఆప్రదేశమునందలి వేడిమిని మనము తగ్గింపగలిగితే బాధకూడా తగ్గిపోతుంది, వేడిమివలన దేహములో ఉండే మాలిన్యములు వెడలిపోవుచుండుట, వ్రణచికిత్సలో, మనము బాగా చూస్తున్నాము. వ్రణమునందు వేడిమి

యెక్కువగుటయు, ఆవేడిమి దేహమంతటికిని వ్యాపించుటయు, వ్రణము నయము కావటము ఆలస్యమగుటయు, మనము యిప్పుడు తరుచు చూస్తున్నాము, దీనికి కారణముకలదు. ఆరోగ్యవంతునికి వ్రణము కలిగినా, అది త్వరగానే మానుతుంది. దేహములో రోగకారణము మిక్కుటముగా ఉండి, అది వరకే అంతర్గతముగా వేడిమి కలవానికి, వ్రణము కలిగితే అది నయమగుటకు చిరకాలము పడుతుంది. అదివరకున్న అంతర్గతముగా వేడిమికి, వ్రణ సంబంధమైన వేడిమి తోడై, బాధకూడా యెక్కువగానే ఉంటుంది. ఈ విధంగా లేకపోయినా కూడా. ఆలస్యముగా నయము అవుటకిక్కు. దేహములో యేమాత్రము రోగకారణమున్నా, దానిని బైటకి గెంటుటకు దేహము నిరంతరము యెదురు చూస్తూ ఉంటుంది. ఎప్పుడైతే దైవికముగా ఒక అఘాతము కలిగి ఒకదోవ యేర్పడినదో ఆదోవనే, దేహములో ఉండే మాలిన్యములను నెట్టివేయుటకు ప్రయత్నిస్తుంది. అందువలనకూడా వ్రణము నయము కానటం ఆలస్యమవుతుంది.

ఏ చికిత్సయు లభించని జంతువులకు యిట్టి అఘాతము జరిగినప్పుడు ఆఘాతం చుక్కిలి తొందరగా నయము అవుట నేను చూచి యున్నాను. అతి సహజమైన వానిప్రవర్తన చూచినప్పుడు ఆఘాతములకు మనము చేసే చికిత్స యెంత మార్చుకోవాలో తెలుస్తుంది. ఈ స్వాభావిక రహస్యాలను తెలిసికొనేటందుకు నాకు యెక్కువ యిష్టముంటుంది. నిస్సహాయంగా ఉండే జంతువులకంటె, అఘాతము జరిగినప్పుడు బంధుమిత్రులను శస్త్ర శాస్త్రములను సహాయముగా గల మానవులు

యెంతో అదృష్టవంతులని పూర్వము యెప్పుడో అనుకునేవారు. చికిత్సాలయాలల్లో మందులైన్యాల సమక్షములో చికిత్సపొందుతూ ఉండే రోగులకన్నా నిస్సహాయంగా ఉండే జంతువులే తమ రోగాలను తొందరగా నయముచేసికొనుచుండుట నేను చూచియున్నాను. ఇందులో ప్రకృతికి సంఘటన యేమీలేదు. సర్వమూ సకారణము. ఈసంగతి ఋజువు చేయుటకు ఒక చిన్న వృత్తాంతమును చెప్పెదను. ఎలుకకు పెట్టిన బోనులో ఒకపిల్లి కుడికాలు యిరుక్కున్నది. బోనులోనుండి తప్పించుకునేందుకు, ఆబోను కింద మీద వేసి కొట్టింది. కాలు ఎముక తునుకలు ముక్కలు తెగింది. ఎముకమీద మాంసం దుమ్ము పడినది. బోనులోనుంచి దానిని తప్పించి బయటవేసినాను. అది గోలు కుంటూ, కూలుకుంటూ వెళ్లింది. చాలా రోజులనాటా తిరిగి కనపడలేదు. చచ్చిపోయినదనుకున్నాను. ఒక నాటి రోజుల తర్వాత, ఆదగ్గరలో, నా చెవుల్లో ఒక గోగిస్తపిల్లి నిలుకుని ఉంది. దానికుడికాలు అప్పటికి బాబాపుగా మూసి ఉంది. బోనులోపడ్డ భాగము మాత్రముగాని ఉన్నది. పిల్లి ఆవారం అంతా యేమీ తినసందువన బాగా చిక్కిపోయి ఉన్నది. ఈవారము లోనూ, చివరకు నీరుకూడా త్రాగలేదు. రుచికరమైన పదార్థాలు దానిముందర పడవేసినా అది వాసనైనా చూడలేదు. కాలు అటూయిటూ కదలకుండా చాపి అట్టిపెట్టింది. మధ్య మధ్య బోనులోపడ్డ భాగము నాలుకతో నాకుచున్నది. ఈ నాకుటవలన దానిబాధ తగ్గుతున్నది. తిరిగి బాధ కలిగినప్పుడల్లా తిరిగి నాకుకొనుచున్నది. పిల్లి ఉపవాసానికి కారణమున్నది. ఏపదార్థముతిన్నా లోపలనేడిపట్టకుండా మానదు.

దానితో బాధ యెక్కువగుతుంది. అందువలన అది ఆహారము మాని వేసినది. వ్రణమును నీటితో చల్లబరిస్తే కొంతబాధ తగ్గు తుంది. అయితే దానికి నీరు యెవరు అమరుస్తారు? అందువలన అది ఆహారాన్ని బొత్తిగా మానివేసినది. దాని సహజ పరిజ్ఞానము దానికట్లు బోధించినది. ఇట్టిస్థితిలో యెవరైనా చేయవలసిన చికిత్స యిదే. ఇంకా కొన్నిదినాలకు ఆపిల్లి తిరిగి కనబడింది. అప్పటికది యెముకలుతప్ప యింకేమియు కనిపించనంతగా చిక్కియున్నది. కొంచెము పాలుపోస్తే త్రాగి కన్ను తెరచినది. ఒకనెలతర్వాత చూడాముగదా పిల్లిబాగా బలిసిఉన్నది. బోనులోపడ్డచోట అదనంగా కండ పెట్టినది. అదిదానినడకకు అడ్డమురాలేదు.

ఇట్టి ఘాతే ఒక మనిషికి వచ్చిందనుకోండి, మందువైద్యులు దీనికేమి చికిత్స చేసేవారు? కాలును నరికి తీసివేయమనేవారు. అదినయము కావటానికి, అనేక నెలలు పట్టేది. ఆరోగి జీవితాంతమువరకూ కుంటికాలితో బ్రతకవలసి వచ్చేది. కాలు నరకకుండా ఆపినాకూడా మందువైద్యములో ఆకాలు బిగిసిపోయ్యేది.

ఒకకుక్క తనవ్రణాన్ని మాన్పుకున్న వివరమును యిచ్చుచున్నాను. ఒకరు తుపాకీ కాల్చుతుంటే దోవనపోతూ ఉండే ఒకకుక్క, ముందుకాళ్ళలో నుండి వెనుకకాళ్ళలో నుండి కొన్ని రవ్వలు లోపల జొరబడినవి. మెడలోకుండా కుడివైపు నుండి రెండు రవ్వలు జొరబడి అవి లోపలనే ఉండిపోయినవి. (రవ్వలంటే చిన్న గుండ్లు) శ్వాసనాళము అన్నవాహిక ప్రధానమైన రక్తవాహికలు అదృష్టవశాత్తు తెగిపోలేదు, ఆకుక్క

తడిగలనీడను వెతికికొని అచ్చట పడుకున్నది. నేలనున్న తేమతో తనపుండ్లను చల్లబరుచుకునేది. ఆవిధంగా పుండ్లలో బాధ తగ్గుతూ ఉండేది. పుండుకు అనిన మన్ను వేడి యెక్కినప్పుడల్లా వేడియెక్కిన మన్ను నేలమీదనుంచి గోళ్ళతో గీకివేసేది. పై మన్ను పోగానే కిందిమన్ను చల్లగా ఉండేది. ఆమన్నుమీద పుండు ఆనించి పడుకునేది. ఈ విధంగా చేస్తూ పుండ్లను అదే పనిగా నాకుతూ ఉండేది. దినమునకు రెండుమూడుసార్లు నీటి వాగుదగ్గరకుపోయి నీరు త్రాగివచ్చేది. ఈ నీరే రెండురోజుల్లో దానికి ఆహారము. యింకేమీ తినేదికాదు. ఈ తుపాకి దెబ్బలు చాలా తొందరగా మానినవి. అయిదురోజుల్లో ఆకుక్క నాకిన పుండ్లన్నీ కొంచెము వాపుగా ఉన్నా, మానినవి. నాకుటకు వీలుగాని మెడమీది పుండుమాత్రము మానుటకు చాలాకాలము పట్టినది. దెబ్బలుతగిలిన తర్వాత ఆకుక్క వారంరోజుల వరకూ యేమీ తినలేదు. మెడమీద పుండుతోసహా అన్నిపుండ్లు గా లోపల మానినవి. లోపలచేరిన సీసపురవ్వలు చర్మానికి కండకు మధ్యలోపలనే నిల్చిపోయినవి.

పాఠకులకు ఉపయోగించే యింకొక విషయాన్ని చెప్పెదను. ఒక బొగ్గుబండిచక్రము ఒక పెద్ద న్యూఫౌండ్‌ల్యాండ్ కుక్కయొక్క కుడికాలుమీదుగా దొరలిపోయినది. పైనున్న చర్మము నలిగి అందున్నయెముక బైటబడినది. ఆకుక్క నడవలేక పోయినది. దానిని యింటికి తీసుకునివెళ్ళిరి. అక్కడ చల్లనిచోటు వెతుక్కొని అది పడుండి, దెబ్బతిన్నకాలు నిరంతరము నాకు కొనుచున్నది. ఇట్లు నాలుగు దినములు నాకిన తర్వాత అది మూడు కాళ్ళమీద నడువ గలిగెను. ఆపుండు అంతవరకు మానినది.

ఈ నాల్గుదినములలోనూ ఆకుక్క యెట్టి ఆహారమును తినలేదు. 20 దినములలో ఆకుక్క కాలిమీద పుండు పూర్తిగా మానినది.

మనుష్యులకు యిట్టిఅపాయములు సంభవించినప్పుడు యేవిధంగా చికిత్స చేసుకోవాలో, పైఉదాహరణలనుండి మనకు కొన్ని సూత్రములు లభించుచున్నవి. పుండునకు చల్లదనము కలిగించుట, పుండుగల కాలమున యెట్టి ఆహారమును తినకుండుట, ఒకవేళ ఆహారమును తింటే, అది వేడిచేయనిదిగా ఉండాలి. ఇదేవ్రణములకు సహజమైన చికిత్సలు. శస్త్రచికిత్సాలయాల్లో చేస్తూఉండే చికిత్సలు అనర్థకమైనవి. రోగియొక్క ధాతుశక్తిని పెంచుటకు వారు బలకరములైన మాంసము, మాంససారము, గుడ్లు, పాలు, సారాయమునూ, యిచ్చుచున్నారు. ప్రకృతి సూత్రముల ననుసరించి చూచినచో యింతకంటే పాడు చికిత్స ఉండదు. పుండ్లకు చికిత్సచేసేటప్పుడు యెట్టి యాహారమును యీయరాదు. ఆహారము తినుటవలన పుండు మానటం ఆలస్యమవుతుంది. దేహశక్తులు జీర్ణక్రియయందే వినియోగపడి, పుండును మాన్పలేక పోవును. మానవదేహములో యేమి జరుగుచున్నదో తెలియనందువలన శస్త్రవైద్యులు, కార్బాలికామ్లము, అయోడీన్, కరోసిల్ సబ్లిమేట్ - కొక్కేన్, మొదలగు మందులు (పుండ్లపైన) రుద్దుతున్నారు. జలచికిత్సవలన యిట్టి వ్రణములను, సులభముగ కుదుర్చవచ్చునను సంగతి వారికి తెలియనందున నానాటికి సహజమైన మార్గానికి చాలాదూరముగా పోవుచున్నారు. ఇంతదూరము చెప్పిన తర్వాత వ్రణ, ములు యెన్నిరకాలుగా వస్తవో, వానికి నేను యేవిధముగా

చికిత్సచేసి కుదిర్చితినో ఉదాహరణలతో, వివరించుచున్నాను.
ఛిద్రములు:- వేధ, నలుగుట, చిదుగుటవలన కలిగిన పుండ్లు, కత్తితో తెగినపుడుగాని, శూలముతో వేధ కలిగినపుడుగాని, నలిగినపుడుగాని, చిదకినపుడుగాని రక్తవాహికలలో - కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి, బద్దలయి రక్తము బైటికి వచ్చును. బైటి వాతావరణమునందలి వత్తిడివలన రక్తవాహిక మూసు కునేదాకా రక్తము స్రవించుచునే ఉంటుంది. మనకీ సందర్భములో కొన్నిసంగతులు తెలిసిఉంటే చికిత్సచేసేటపుడు తేలికగా ఉంటుంది. ప్రతి అంగుళము ప్రదేశముమీదా వాతా వరణపువత్తిడి 15 పౌన్లు ఉంటుంది. ఈ వత్తిడికి సమానమైన వత్తిడి మనదేహములో లేకపోతే మన మీ వాతావరణములో బ్రతకలేకనే పోవుదుము. వాతావరణములోని వత్తిడిలో ఉండే తేడా కొండలు యెక్కేవారికి తెలుస్తుంది. యెత్తైన కొండల మీదికి పోవునపుడును, విమానంలో ప్రయాణము చేసేటప్పు డునూ వాతావరణపు వత్తిడి తగ్గిపోవుటచేత, కొందరకు, ముక్కునుండి, కన్నులనుండి, చెవులనుండి, నోరునుండి రక్తము స్రవించుచుండును. బైటివాతావరణమునందలి వత్తిడికి తుల్య మయిన వత్తిడి దేహములో కలిగించినంతనే రక్తం స్రవిం చుట, ఆగిపోవును. దేహముమీద పుండుపడినపుడు, రక్త వాహికలను కప్పుకొనియున్న చర్మము పోవుటచే రక్తవాహి కలయందలి పీడనము యెక్కువై, రక్తస్రావము కలుగును. అందువలన మొట్టమొదట పుండులోనుండి రక్తముకారకుండా ఆపవలసినది. దేహముమీద పడినపుండు పైపదిగాను లోతు గానూఉంటే రక్తవాహికలలోని పీడన యెక్కువవుతుంది. అదే

విధంగా తెగినరక్తవాహిక పెద్దదవుతే రక్తము యెక్కువగా స్రవించును. తెగిన రక్తవాహిక చిన్నదవుతే స్రవించే రక్తము కొద్దిగా ఉంటుంది. రక్తముకారకుండా కట్టుకట్టి ఆపే ప్రయత్నం సహజమైనదికాదు. దానివలన రక్తాభిసరణకు ఆటంక మేర్పడుతుంది. ఇంతకంటే రక్తవాహిక కట్టు పడేందుకు మంచిఉపాయ మున్నది. చిన్న రక్తవాహికలలోనుంచి వచ్చే రక్తమువలన ప్రాణాపాయము కలుగదు. పెద్దధమని తెగి రక్తముయొక్కవడిని ఆపకపోతే ప్రాణాపాయం సంభవించ వచ్చును. తడిపొత్తి సమీపంలో లభించి దానితో కట్టుకట్టితే రక్తస్రావము ఆగుతుంది. అట్టి పొత్తి లభించనప్పుడు పొత్తిమీద రక్తవాహికనుకట్టివేయవచ్చును. తడివస్త్రము దొరికేయెడల రక్తము స్రవించే ధమని యొక్క చిన్నపెద్ద పరిమితినిబట్టి అనేక మడతలగా వస్త్రమునుమడచి నెత్తురు కారేచోట అడ్డముపెట్టి గట్టిగాబిగించవలసినది. దానితో రక్తస్రావము ఆగిపోతుంది. వ్రణముమీదకట్టిన తడిపొత్తి వేడి యెక్కినప్పుడల్లా వ్రణబాధ యెక్కువగుతుంది. అప్పుడాపొత్తిని తిరిగి తడిపివేస్తే వ్రణబాధ తగ్గుతుంది. ఇట్లు కొన్నిగంటలు వరుసగా పొత్తి వేడియెక్కకుండా చల్లదనము కాపాడవలసినది. వ్రణముమీద వేసికట్టిన తడిపొత్తి యెన్నిమడతలు వెయ్యాలి? అనేసంగతి పడిన వ్రణమునుబట్టి ఉంటుంది. పడినవ్రణము చిన్నదయితే 2,4,6,8, మడతలు సరిపోతవి. వ్రణముపెద్దదయితే మడతలు యింకా యెక్కువగా వేయవలసిఉంటుంది. 12,16,20,30 మడతలుకూడా వేయవలసి ఉంటుంది. పెద్దవ్రణముమీద చిన్న మడతవేస్తే రక్తము తొందరగా కట్టుకొనదు. వ్రణమూ త్వరగా

మానదు. చిన్నవ్రణముమీద పెద్దమడతవేస్తే వ్రణము మానటానికి ఆలస్యమవుతుంది. ఎన్నిదినాలకు యెర్రవ్రణముకే రాకపోవచ్చు. ఒకవ్రణముమీద తడిపొత్తివేస్తే ఆ వ్రణముయొక్క వెలుపలిఅంచును ఒకఅంగుళము మాత్రమే కప్పిఉంచాలి. అంతకంటే పెద్దపొత్తివేయరాదు. తడిపొత్తి పెద్దదయితే వ్రణముకన్నా యితరమైన భాగములలో రక్తాభిసరణమునకు ఆటంకము యేర్పడుతుంది. వ్రణముమీద వేసిన తడిపొత్తిని కప్పుతూ దానిపైన 1, 2, మడతలు ఉన్నిగుడ్డను వైచికట్టును బిగించవలయును. ఈ ఉన్నిగుడ్డ, కిందనున్న తడిపొత్తి జారకుండా కాపాడుతుంది. తడిపొత్తిలోని తేమను చాలాకాలము నిలువ ఉంచుతుంది. దేహములోపల ఉండే రక్తపు పీడనము, బైటిగాలిలోని పీడనమునకు అనుకూలంగా యీపొత్తివలన సర్దుబాటు అవుతుంది. వ్రణముమీద యేమీ మందులు వేయనక్కరలేదు. దానిమీదవైచే తడిపొత్తి తియ్యని ప్రవాహోదకముతో తడుపవలసినది. ఈపొత్తి చల్లగా ఉన్నంతసేపూ వ్రణముబాధ తగ్గి ఉంటుంది. పొత్తివేడెక్కినప్పుడల్లా కట్టు ఊడదీసి, తడిపొత్తి తడిపి, వ్రణముమీదవేసి దానిమీద ఉన్నిగుడ్డను వేసి కట్టవలయును. ఇట్లు క్రొత్తగా తడిపొత్తినివేసి కట్టుకట్టినప్పుడల్లా బాధతగ్గుతూ ఉంటుంది. బాధ యెన్నిసార్లు కనపడితే అన్నిసార్లు తడిపొత్తి మార్చి కట్టవలెను. వ్రణముమీదికట్టు మార్చుటకు ఉచితము కాదని తోచినచో వండ్రుమన్నుగాని, నల్లరేగటి మన్నుగాని, కుమ్మరి మన్నుగాని, బిళ్ళగాచేసి వ్రణము మీదవైచి, కట్టవలయును. తడిపొత్తిలోకంటె, మట్టిలోఉండే,

చల్లదనము యెక్కువకాలము నిలిచిఉంటుంది. అందువలన తడి మన్ను తడిపాత్తికంటె శ్రేష్ఠమయినది.

తడిమట్టి పట్టీవేయుపద్ధతి:— ఒకకుండలో వాసనలేని మన్ను వేసి కొద్దిగానీళ్ళుపోసి నానిసమన్నును ఒక వస్త్రము మీదవేసి మన్నుపై పుష్పంసుమీద ఆనునట్లుగావేసి కట్ట వలసినది. కొయ్యకండలకును కుళ్ళినవ్రణములకును యిట్టి మట్టి పట్టీలు వేయవచ్చును. జలచికిత్స యెరుగనిశస్త్రవైద్యులు యిట్టికట్లను కనిపెట్టినారు. వారు వ్రణముమీదవేసే తడిపాత్తికిసీ పైనవేసే ఫ్లానలుగుడ్డకును మధ్య రబ్బరుపట్టీ వేయుచున్నారు. దీనివలన కలుగవలసినంత మేలుకలుగదు. ఏమనగా తడిపాత్తి లోని తేమవలనను దేహముయొక్క వేడివలనను చర్మమునుండి బైటికి వచ్చుచున్న దుర్వాయువులతో కూడియున్న చెమటను యీరబ్బరుపట్టీ బైటికి పోనీయదు, అందువలన మనమువేసే పట్టీలు యిచ్చినంతలాభము శస్త్రవైద్యుల పట్టీలవలన రావు. ఇంకొకసంగతి మరచిపోరాదు. వ్రణముగలవానికి సాధ్యమైనంత వరకు యెట్టి ఆహారమును యివ్వకుండుటయే మంచిది. పెట్టిన ఆహారము బహుసులభముగా జీర్ణమవునదిగాను కుళ్ళు కలిగింపనిదిగాను, ఉద్రేక రహితమైనదిగానూ ఉండవలెను. ఇట్లు చేసినపుడు, వ్రణము తొందరగా మానును. పొట్టుతో కూడిన గోధుమపిండితో చేసిన రొట్టె – దీనిలో ఉప్పు, బెల్లము, వెన్న, నెయ్యి, పనికిరావు. ఈ రొట్టెకు తోడుగా 2, 3, రెట్లు వండినట్టివిగాని, వండనట్టివిగాని, సులభంగా జీర్ణమయ్యే కూర గాయలుచేర్చి తీసవలయును. నారింజ, కమలా, బత్తాయి,

ద్రాక్ష మొదలయిన ఫలములుకూడా పుండును తొందరగా మాన్పేటందుకు సహాయపడతవి. తగినన్ని పండ్లు, కూరలు తినే వారికి, దాహముకాదు. అందువలన మంచినీటితో పనిఉండదు. కావలసినయెడల, తీయని ప్రవాహోదకమును త్రాగవచ్చును. బాగా ఆకలి ఉంటేనే గోధుమరొట్టెగాని, జొన్నరొట్టెగాని కొద్దిగా పెట్టవలయును. బలము వచ్చేటందుకు యెట్టి ఆహార సారములు - మాంసాదులుగాని, సారాయములుగాని వ్రణ రోగికి యివ్వరాదు. ఈ విషయంకూడా వ్రణ చికిత్సలో చాలాప్రధానమైనది.

వ్రణచికిత్సలో కూడా నేనుకనిపెట్టిన, కటి లింగ స్నానాలు, అద్భుతముగా పనిచేయును. వీనివలన వ్రణ ప్రదేశములో తీవ్రమగు వేడిపుట్టకుండా ఆగిపోతుంది. ఒకవేళ వ్రణజ్వరము పుట్టినా కటి లింగ స్నానాలతో వ్రణజ్వరము అదుపులోనికి వస్తుంది. కటి లింగ స్నానాలవలన దేహశక్తులు ఉజ్జీవనము పొంది వ్రణాన్ని తొందరగా నయముచేస్తవి రోగపదార్థము అదివరకే దేహములో యెక్కువగా ఉన్నవారు తప్పకుండా కటి లింగ స్నానాలు చేసితీరవలెను. ఎప్పుడైతే బహిరంగమైన ఆఘాతము దేహమునకు జరిగినదో, అప్పుడు తప్పకుండా దేహములోని రోగపదార్థములో మంటమేర్పడుతుంది. ఉచితమైన విధముగా కటి లింగ స్నానాలతో, మంటవ్యాప్తిని తగ్గించితే ప్రాణానికి మోసములేకుండా పుండు మానుతుంది.

45 సంవత్సరాల మనిషి యంత్రాలయములో పని చేయుచుండగా అతని యెడమచేయి రంపపు మరలో చిక్కుకొని

కండ తెగినది. బొటనవేళ్లు, చూపుడు వేలు విడిపోయినవి. ఆదెబ్బతిన్న కొన్ని నిమిషాలదాకా స్మృతి రాలేదు. అట్లు అర గంటసేపున్నాడు. ఒకచొక్కా తడిపి, చేతికి చుట్టబెట్టుటచేత నెత్తురు దాదాపు కట్టుకున్నది. ఇంతలో ఒక డేక్సాలో చన్నీళ్ళుపోసి ఆ చేయి అందులో ఉంచిరి. ఇట్లు ఒక గంట సేపు చేసేటప్పటికి బాధకూడా తగ్గినది. ఒకదినము యిట్లుచేసే టప్పటికి బాధ సాంతం తగ్గినది. 4 దినాలవరకూ కట్టుకట్టిన గుడ్డ తగ్గించి కట్టుచుండిరి. 4 వ నాటికి 2 వేళ్ళుతప్ప మిగతా భాగములో వాపు తగ్గిపోయినది. 20 మడతలు మడచిన తడి పొత్తి పుండుమీదవేసి దానిపైన ఉన్నిగుడ్డవేసి చేతిచుట్టూ కట్టినారు. ఆ యున్నిగుడ్డ వెంటనే వెచ్చబడుచున్నది. రక్తాభి సరణము సక్రమముగా జరుగుచున్నది. మొట్టమొదట ప్రతి అర గంటకు, తడిపొత్తి మార్చేవారు. తర్వాత పుండుమీద వేసి తగ్గుటచేత, ఎక్కువ వ్యవధితో, తడిపొత్తిని మార్చటానికి వీల యినది. 15 దినాలు అయినతర్వాత ప్రత్యేకముగా చికిత్స లేమీ చేయకుండా తప్పింది. 4 వారాలయిన తరువాత ఆయంత్రాలయ ములో తిరిగి పనిచేయగలిగినాడు. దైవవశాత్తు మరలో తెగినపుడు, ఎముకలు యేమీ తెగలేదు. చికిత్స 2వనాటినుండి, అతడు కటి లింగ స్నానాలు చేస్తూ ఉండేవాడు. అందువలన పుండు తొందరగా మానింది. అతని దేహములోని వ్యాధికూడా నయమైనది. మందువైద్యములో అయితే యింక యెంతో బాధ ఉండేది. నయముకావటానికి చాలాకాలం పట్టేది. వైద్యుడు మొదటగా పుండును కలిపికుట్టేవాడు. అనేక పెద్ద బాధ ఉండేగి. అయోడిన్,అయిడోఫారంవేసి కట్టుకట్టితే కొయ్యి

గండపెట్టి వేర్లు మొద్దుబారి పొయ్యేది. మనవైద్యములో యీబాధలేమీ లేకపోగా తెగినచోట మచ్చకూడా లేకుండా నయమైనది. మొదట పుండు ఎంత వెడల్పుగావున్నా కింద నుంచి కండకట్టుకు రావడముచేత, పైపొరలన్నీ ఒకటొకటే రాలిపోయి మచ్చలేకుండా పోయినది. తెగినప్పుడుకొన్నినాడులు కూడా తెగిపోయినవి. అందువలన పుండు మానిన కొంతకాలము వరకూ సన్ననివస్తువులను పట్టుకునేందుకు సామర్థ్యం ఉండేది కాదు. ఇంకా కొంతకాలము మనచికిత్స చేసినందుచేత నాడీ వాహికలు కలిసికొని తిరిగి ఆ శక్తికూడా పుట్టినది.

చిదుగుట, నలుగుట:- పై చెప్పినచికిత్సే చిదికినప్పుడు కూడా చేయవచ్చు. చిదికినప్పుడు, నలిగినప్పుడు, ఆయాప్రదేశాలలో చెడురక్తము కూడుకొని గడ్డగట్టి దేహమంతటినీ బాధిస్తుంది. లోపలచేరిన రక్తపు కూడికకు బైటనుంచి చికిత్స చేయటానికి వీలుండదు. కటి లింగ స్నానాలు చేయించినప్పుడు ఆరక్తపు గడ్డలు అద్భుతముగా నయమవుతవి. ఈ స్నానములవలన లోపలి నరములు బలపడి దేహమునందు అధికముగా చేరిన వేడి తగ్గిపోతుంది. లోపలనున్న రక్తపు కూడిక సూటిగా కటి లింగ స్నానాలతో తగ్గకపోయినా ఆవిరివల్ల క్రమముగా అద్భుతముగా తగ్గిపోతుంది. దానితో రోగపదార్థమునందలి మందముకూడా తగ్గిపోతుంది. ఆవిరిపట్టిన ప్రతిసారి దాని తర్వాత కటిస్నానమో, లింగస్నానమో విధిగా చేయించవలసి ఉంటుంది. ఆవిరిపట్టినపుడు గడ్డకట్టియున్న రోగ పదార్థము పలుచబడి తేలికగా వెలువరింప వీలవుతుంది.

ఒక కుట్టుమరదగ్గర పనిచేసే ఒక ఆడపిల్లకు చూపుడు వ్రేలు నలిగి బొక్కపడినది. మందు వైద్యుడు ఆవ్రేలుకు మామూలు వైద్యముచేసి చూచెను. యెన్నిమందులు యిచ్చినా మొదటి వారములో యేమీగా గుణము కనపడలేదు. ఆ పుండుకు ఐడో ఫారం, కార్బాలిక్ యాసిడ్, సల్ఫ్యూరికాసిడ్, వేసి కట్టుకట్టి నాడు, పుండు మాన లేదు. పైగా బాధయెక్కువైనది. వైద్యుడు వ్రేలో, తప్పితే చెయ్యో తీసివేస్తే గాని ఆబాధ తగ్గదన్నాడు. బాధ యెక్కువగుతున్నది. చేయి కమిలివాచియున్నది. వైద్యుడు వ్రేలును కోసితీసివేయాలన్నాడు. 3 వ వారము వచ్చేసరికి, చేయి అంతావాచి కమిలిపోయినది. చేయి తీసివేస్తామంటే ఆమెకు భయముపుట్టినందువలన, నావద్దకు వచ్చినది. వాచిన చోట నీటిఆవిరి పట్టించినాను. తడిపొత్తులువేసి కట్టుకట్టించి నాను. దీర్ఘములగు లింగస్నానములు చేయించినాము. 2 గంటలు చికిత్స చేసేసరికి, బాధలు దాదాపుగా ఉపశమించినవి. చికిత్సాకాలములో ఆబాధలు తిరిగిరాలేదు. గంట గంటకు చేతి వాపు తగ్గిపోవుచున్నది. 2 దినము లయ్యేటప్పటికి చేతివాపు, వ్రేలివాపుకూడా క్రమముగా తగ్గిపోయినవి. సహజమగు రంగు కూడ కలిగినది. 3, 4 వారములలో ఆమె తిరిగి పనిచేసుకో గలిగెను, స్పర్శజ్ఞానం మంచిస్థితికి రావటానికి యింకా కొంతకా లము పట్టినది. ఈవిధంగా శాస్త్రీయముగా నిర్దేశింపబడిన అవ యవచ్ఛేదము తప్పింది. జీవితములో శాశ్వతముగా అంగవైక ల్యము రాకుండా తప్పిపోయింది.

ఒక వడ్రంగి ఎడమ చేతిమీాద నలిగి పుండయినది. ఇదివరకు శస్త్రచికిత్సలో ఒ తనికి అపకారము జరిగిఉండటంచేత ఆ

వైద్యములో అతనికి నమ్మకము పోయినది. అప్పటికే అతని యెడమచేయి అంతా భుజమువరకు ఎ చినది. చేతిని అటుయిటు కదలించలేడు. మనవైద్యముచేసిన 8 గంటలలో బాధ ఉపశమించినది. 18 గంటలలో వాపు తగ్గినది. 15 దినములలో అతడు తిరిగి నడక్రంగము చేసుకో గలిగినాడు.

ఒకేమరలో పనిచేస్తుండే యిద్దరు ఆడపిల్లలను చూపుడువేళ్లు దెబ్బతగిలినది. మొదటిదానికి పై భాగమునవున్న ఎముక విరిగినది. మిగతావేళ్లు తిన్నగా ఉన్నది. ఇద్దరి ఆరోగ్యము, వయస్సు, తత్త్వము దాదాపుగా సమానముగా ఉన్నవి. అందులో ఒకతె మందువైద్యము చేయించుకున్నది. రెండవ వారు మనవైద్యము చేసినారు. మందువైద్యుడు విరిగిపోయిన యెముక శస్త్రముచేసి తీసివేసినాడు. అయిడోఫారము వేసి కట్టు కట్టినాడు. కొన్నాళ్ళకున్నట్లుగా పుండుమానినది. తీసివేసిన వేళ్లు లేకుండానే ఆమె వైద్యం నాపని చేసుకోవాలసివచ్చింది, ఆవేళ్లు అందవికారముగానూ ఉన్నది. వేళ్లులేకపోవడం చేత ఇబ్బందిగానూ ఉన్నది. పైగా అయిడోఫారం పుండులో ఉండుటవలన గాలి మారినప్పుడల్లా ఆవేళ్లు తీపు పుట్టేది. మనదగ్గరికి చికిత్సకువచ్చిన రెండవపిల్ల మనచికిత్సలో బాగుపడినది. మొదటిరోజుననే బాధలేకుండా పోయినది. దేహములో రోగపదార్థ ముండుటచేత కటి లింగ స్నానాలు చేయించినాను. బాధ తగ్గేటందుకు వెనుకచెప్పినట్లుగానే తడిపట్టివేసి కట్టు కట్టించేవాడను. ఇంకా యితర చికిత్సలేమీ చేయకుండానే బాత్తిగా నలిగిపోయిన యెముకముక్క బైటికి వచ్చినది.

మిగతా ముక్కలు కలుసుకొని వేలుపుండు మానినది. అక్కడ యిప్పుడు ఒకమచ్చకూడాలేదు గాలి మార్పువలన మెట్టి బాధయును ఆమెకు వచ్చుటలేదు. ప్రకృతివైద్యము గొప్పదా? మందువైద్యశస్త్రచికిత్స గొప్పదా? ఇందువలన మందువైద్యము చేసినప్పుడు నిజంగా నయము కావటమనేదే జరుగదని, రోగాన్ని లోపల దాచిపెట్టటమే జరుగునని స్పష్టముగా తేలినది.

ఇదే సందర్భములో యింకొక చమత్కారమైన వృత్తాంతము చెప్పెదను. 1879 సంవత్సరములో ఒకని యెడమచీలమండ సంధి బంధనాలు కండరాలు జారి వాచినవి. 2 మాసాలు రోగి ప్రక్క మీదపరుండి మందును వాడుచుండిరి. కాలు మానినతర్వాత అది యింకా దుర్బలముగానున్నది. వాపూ తగ్గలేదు. రోగి నడిచే టప్పుడు అతడు తొట్రుపడేవాడు. దానితో వాచేది. బాధ కలిగే వాడు. అతని ఆరోగ్యముకూడా బాగాలేదు. అందువలన చివరకు 1889 సంవత్సరములో మనవైద్యము చేసినాడు. అందువల్ల మేలుకలిగినది అతడు మనవైద్యమును చాలాకాలము చేసినాడు. 1890 సంవత్సరము మొదట అదివరకు నయమైన దెబ్బతినిన పాదము తిరిగి వాచినది. మంటలు పోట్లు పుట్టినవి. ఆవిధంగా 3 దినములున్నది. మనచికిత్సలోనే 4వనాటికి ఆబాధ తగ్గినది. చీలమండవాపు తగ్గినది. బాధ దౌర్బల్యముకూడా మానినది. 11 సంవత్సరాలు దేహములో దాగియున్న రోగము కూడా మనవైద్యములో నయమవుతుందని తేలినది.

కాల్పులు:— కాలినదానికికూడా చన్నీటి చికిత్స బాగా పని చేస్తుంది. బాధకూడా తగ్గుతుంది. కాలినభాగమునందు కలిగే

బాధ; కాలిన ప్రదేశమును నీటిలో కొన్నిగంటలు ఉంచినందు వలన తగ్గిపోతుంది. మొదట పుండు చన్నీటిలో ఉంచినందువలన యెక్కువ బాధ అనిపిస్తుంది. ఆ బాధ ఓర్చుకోవాలి. తర్వాత బాధ లేకుండా పోతుంది. మంటలు తగ్గినతర్వాత పుండ్లమీద కట్టి నట్లుగానే కాలినచోట తడిపాత్తి కచి. కట్టుకట్టినవలయును. కట్టుకు ఉపయోగించేనీరు వర్షోదకముగా ఉండేమంచిది, నదీజలము కూడా మంచిదే, గుంటలలోను, వాగులలోను ఉండేనీరు, యెక్కువ నిర్మలముగా ఉండదు. అందువలన పుండు తొందరగా మానదు. బాధలు యెక్కువ అవుతాయి. తడిపాత్తివేసి కట్టుకట్టినప్పుడు అద్భుతముగా బాధోపశమనమవుతుంది. మనవైద్యముచేస్తే కాల్పులవల్ల మరణించేవారి సంఖ్యను తగ్గించవచ్చు. అసలుకు ఆరోగ్యముగా ఉన్నవారికి దేహము కాలితే మన చికిత్సలో వారికి తొందరగా నయమవుతుంది. అదినంకే దేహములో అమితముగా రోగపదార్థముచేరి ఉన్నవారికి యీ విధంగా చికిత్స చేయవలసివస్తే నయము కావటం కొంచెము ఆలస్యము అవుతుంది. అటువంటి కాలిక రోగులకు చికిత్సచేసేటప్పుడు ప్రదేకముగాని, సహజాహారము ను పథ్యము పెట్టితిని. కటి లింగి స్నానములను చేయించితిని. ఈ స్నానాలవలన కాల్పుపుండుకూడా తొందరగా మానుతుంది.

ఒకనికి 3 చోట్ల లోతుగా కాలినది. మొదటిచోట ప్రరూపాయి అంత వెడల్పుగల కాల్పులు రెండు, పాదముమీద లోతుగను వెడల్పుగను యింకొకచోట కాలినది. ఒకరోజు మందువైద్యము చేసినారు. ఆరోగి బాధను భరింపలేకపోయినాడు. పాత ప్రకృతి

వైద్యము ఒక వారమురోజులు సొంతముగా చేసుకున్నారు. తగినంతసుగుణము చేకూరనందున నన్ను సంప్రతించినారు. బాధను పోగొట్టటమే మొదట మనము చేయవలసినపని. పుండు మీదనున్న చీము కడిగి తడికట్టు కట్టినాను. 2 గంటలలో బాధ తగ్గినది, 2 దినాలు చికిత్స చేసేసరికి కాలినభాగము మెత్తని పుండుగను వచ్చినది. మెడమీదనున్న పుండ్లలో చిన్నపుండ్లు అంచుకట్టి మానుపట్టినవి. పాదముమీదిపుండు లోతులో అరంగుళము కండ పెట్టినది. అయిదుదినములలో మెడమీదిపుండ్లు మానినవి. కాళ్ళమీదపుండు కొంతవరకు తగ్గినది. ఇప్పుడతడు నడువగలడు. అందువలన తిరిగి యంత్రాలయములో పనిచేయుటకు వెళ్లెను.

తుపాకిదెబ్బలు :—బొక్కలు, తూటులు పడినప్పుడు చేసే చికిత్సే, యిందుకుకూడా పనికివస్తుంది. యుద్ధములో ఉన్న వారికే తుపాకి దెబ్బలు తగులుతవి గనుక, చికిత్సకూడా అందుకు అనుకూలముగా ఉండాలి. ప్రతి సైనికునకు తుపాకీదెబ్బ తగులుటతోడనే యేమిచికిత్స చెయ్యాలో; తెలిసి ఉండటము చాలా అవుసరము. డాక్టరు వచ్చేలోపల చాలా గంటలుగడచిపోతవి. ఈలోపల పుండు ముదిగిపోయిగాని రక్తము కారిపోయిగాని ప్రాణముపోవచ్చు. లేకపోతే తుపాకిదెబ్బ తగిలినభాగం, శస్త్రముచేసి తీసివేయవలసి రావచ్చు. దీనిని తప్పించుటకు ప్రతిసైనికునకు మొదట కట్టుకట్టడము తెలిసియుండాలి.

మానవ జీవితపు రహస్యము తెలియనందునను దేహములోనే పుండును మాన్పే మహత్తరమైనశక్తి ఉన్నదని తెలియకపోవుట

ధాతుశక్తి వృద్ధి అయినపుడు, అనుకూలమైన విధముగా, దేహము బైటికిగుండును నెట్టి వేస్తుంది.

భుజములో నిలిచిపోయిన గుండు గురుత్వ వశమున క్రిందికి దిగి, కొన్ని నెలలకో, సంవత్సరముల తరువాతనో, పిర్రలలోనుండిగాని, తొడలలోనుండిగాని బైటికి రావటము కద్దు.

అందువలన తుపాకీగుండు లోపలికి పోయినప్పుడు దానిని బైటికి లాగటానికి శస్త్రిముచేయ నక్కరలేదు. అనుకూలముగా ఉంటే, వ్రణము మానేలోపల చీముపోసి అది బైటికి రానే వస్తుంది, లేకపోతే కాలము గడచినకొలదినీ ఏదో విధముగా బైటికిపోతుంది. కనుక మొట్టమొదట వ్రణములోనుండి వచ్చే రక్తస్రావాన్ని ఆపవలసినది. తర్వాత వ్రణములో వుట్టే వేడిమిని కుళ్ళును ఆపవలెను. ఇట్లాఆపితే వ్రణజ్వరము పుట్టకుండా ఉంటుంది. రక్తాన్ని ఆపటం, వ్రణముకు తడికట్టు కట్టడము, యిది వరకే వివరించినాను. ప్రతిసైనికునివెంట తడికట్టుకట్టుటకు కొంత నూలుగుడ్డ, ఉన్నగుడ్డ యెప్పుడూ సిద్ధముగా ఉంటే చాలు. కట్టులోనికి మందు సంపాదించటంకంటె, నీరు సంపాదించుట తేలికగదా! నీరుకూడా దొరుకకపోతే నేలతవ్వితే లోపలగా తడిమన్ను దొరుకుతుంది. ఆ తడిమన్ను వేసి కట్టవచ్చు. లేదా చల్లని పచ్చికవేసిఅయినా కట్టవచ్చు. వీనితో రక్తపుస్రావ మును ఆపవచ్చు. వ్రణముమీదపుట్టే వేడిమిని తగ్గింపవచ్చును. శక్తిఉంటే దెబ్బతిన్న సైనికుడే కట్టుకోవచ్చును. లేదా తోడి సైనికుల సహాయము పొందవచ్చును. పెద్దడాక్టరు వచ్చేదాకా వేచియుండ నక్కరలేదు. మందుశస్త్రములతో నిమిత్తములేని

యిట్టి సహజచికిత్సతో పుండ్లను మాన్పుకునే విద్య ప్రతిసైని కునకు వివరముగా నేర్పటము విధియైవున్నది. ఈవిధంగా తర్ఫీతు నొందిన సైనికులకు దెబ్బ తగిలినపుడు పెద్దవైద్యుడు వచ్చేదాకా గంటలాదికాలము మూలుగుతూ పడియుండక వారు వెంటనే ప్రథమచికిత్స చేసుకుంటారు. కొద్ది దెబ్బలు తిన్న సైనికులు పెద్ద దెబ్బలుతిన్న సైనికులకు సహాయమున్నూ చేయగలిగి ఉంటారు. 1870, 71వ సంవత్సరములో జర్మనీకి ఫ్రాన్సుకు యుద్ధము జరిగినది. అప్పటినుండి తుపాకిదెబ్బలకు చేసిన మందువైద్యము వలన అపకారము పొందిన వారిచరిత్రలు స్వీకరించి అట్టిపెట్టినాను. అందొకరిచరిత్ర యిచ్చట చేర్చుచున్నాను. 1870వ సంవత్సరములో యుద్ధములో తుపాకిదెబ్బతిన్న ఒకపెద్దమనిషి 1880 సంవత్సరములో నావద్దకు వచ్చెను. అతనికి 1870వ సంవత్సరములో ఒకగుండు దేహములో మిగిలిపోయినది. మందు వైద్యులు దానిని వెల్లగింపలేకపోయిరి. పుండుకు వారు మందు వేస్తే అప్పుడప్పుడూ మాని తిరిగి పుండు పుడుతూ ఉండేది. అందులోనుండి చీముకారేది. 13 సంవత్సరాల మందువైద్యములోనూ ఆపుండు పూర్తిగా మాననేలేదు. రోగిస్థితి నానాటికి చెడిపోయినది. అతడిప్పుడు నడువనుగూడా లేడు. అతడు నావద్దకు వచ్చినపుడు ముఖనిదానము చేసినాను. అతని దేహమునం దంతటనూ రోగపదార్థము నిండియున్నది. ఆరోగపదార్థము పోనిదే యీపుండు మానదు. పుండుకేమీ చికిత్స చేయకుండానే రోగిచేత కటి లింగ స్నానాలు ఆవిరి చేయిస్తూ ఉచితమైన పథ్యము పెట్టినాను. ఒకవారములోనే పుండుమానినది. అప్పటి నుండి యిప్పటిదాకా తిరిగి ఆపుండు తెరుచుకోలేదు. 15 దినాల

లోనే వ్రణము మానినందున అతనికి సంతోషము కలిగినది. అప్పు డతడు బాగుగా నడువగలిగెను. తన దేహములోనిరోగపదార్థము సాంతముగా పోయేదాకా నాసలహాతీసుకొని యింకా కొంత కాలము తొట్టివైద్యముచేసినాడు.

ఒకసైనికునకు మోకాటిచిప్ప యుద్ధములో బద్దలయిపోయినది. మందువైద్యములో లభించే మందులన్నీ వాడినా ఆవ్రణము మానలేదు. కాలు బిగుసుకుపోలేదు. అయినప్పటికీ నడవటానికి వీలుకాలేదు. తర్వాత 20 సంవత్సరాలు పాత ప్రకృతి పద్ధతిని వైద్యముచేసినారు. దానితోకూడా వ్రణముమానలేదు. తనవ్రణము మానుతుందని నమ్మకము లేకపోయినా తొట్టి వైద్యముయొక్క సుగుణాన్ని పరీక్ష చేసేటందుకు, మనవైద్యము మొదలుపెట్టినాడు. కొన్నిరోజులు చేసేటప్పటికి, మోకాలు మంటలు పుట్టనారంభించినవి. ఇదివరకే వ్రణముమానలేదుగనుక, అతనికి ఆశ్చర్యము కలుగలేదు. ఇంకాకొంతకాలము మన చికిత్స చేసేసరికి, మోకాలుమంటలు తగ్గినవి. అదివరకు బిగుసుకుపోయిన కాలు సడలువదలి, నడువ వీలాయెను. తర్వాత అతడు వెనుకటి వలెనే నడువగలిగెను.

అస్థిభంగములు:—— బహిరంగమైన ఆపదలలో అస్థిభంగము ఒకటి. ఇది నయముకావటము కొంచెము ఆలస్యము. మందు వైద్యులు తెల్లని నాముతో (ప్లాస్టర్ ఆఫ్ పేరిసుతో) ఒక కట్టు తయారుచేసి విరిగిపోయిన యెముకగల భాగమును, అందులో నుంచి కట్టుకట్టెదరు. నేను యింతకన్నా యెక్కువ ఉపయోగకరమైన యింకొక కొత్తపద్ధతిని కనిపెట్టినాను. నా పద్ధతి

మందు వైద్యులపద్ధతికంటె నమ్మకముగా పనిచేస్తుంది. అంతే కాకుండా, మన పద్ధతిలో కట్టినకట్టువలన యెముక విరిగినచోట వేడిమి, వాపు, బాధ, చాలా తొందరగా నయమవుతవి. కటి లింగ స్నానాలుకూడా, యెముక తొందరగా అతుక్కునేందుకు సహాయము చేస్తవి. సహజమైన తొట్టివైద్యపు ప్రక్రియలనుమాని యెవరు మందు వైద్యమును చేయించుకుంటున్నారో, అచంచలమైన ప్రకృతి సూత్రములవలన వచ్చే మేలును నిరాకరించినట్లు అవుచున్నది. విరిగిన కాలు తడి కట్టుతో గట్టిగా ఉంచుతాము. గనుక కొయ్యచెక్కలలో పెట్టిగాని, చెట్టుబెరడు పట్టలో పెట్టిగాని కట్టవచ్చు. అంతేగాని యెప్పుడూ తెల్లనాముపట్టు మట్టుకు కట్టరాదు. ఎముకలు విరిగినపుడు మనవైద్యము చేస్తే వెంటనే బాధలు తగ్గుతవి. ఎముకలును తొందరగా కట్టుపడుతవి.

30 సంవత్సరాల పెద్దమనిషికి మోచేతికిపైగా యెముక విరిగినది. అతడు ప్రకృతివైద్యము నవలంబించేవాడు, వెంటనే తడికట్టు కట్టి బాహుస్నానము చేసేవాడు. ఒకవైద్యుణ్ని సంప్రదిస్తే దానికి తెల్లనాము కట్టు కట్టవలయుననియు అయినప్పటికి చేయి బిగుసుకు పోతుందనీ చెప్పినాడు. చేయి బిగుసుకుపోవటం యిష్టములేక అతడు నన్ను సంప్రతించినాడు. చేయి కదలకుండా తీగచిక్కములో పెట్టించి విరిగిన భాగానికి తడికట్టుకట్టించినాను. తోడుగా కటి లింగ స్నానాలు, ఉద్రేకము కలిగించని మితమైన సహజాహారమును యిప్పించితిని. 24 గంటలలోనే వాపు తీపు తగ్గినది. ఇంకొక వారములో ఆరోగిచేయి నయమై వ్రాసుకొన

గలిగినాడు. ఇంకొకవారములో అతడొక కుర్చీని సులభంగా లేపగలిగినాడు. 3 వారా లయ్యేటప్పటికి విరిగిపోయిన యెముక కట్టుపడినది.

బహిరంగవ్రణములు:— కత్తితోగాని, శూలము మొదలైన వానితోగాని, యుద్ధములో తటస్థించిన ఘాతలకు తొట్టివైద్యము బాగుగా పనిచేస్తుంది. దేహములోపల పుట్టే యితరవ్రణాలు కొంతఆలస్యముగా నయమవుతవి. మందువైద్యులు యీబహిరంగ వ్రణాలలో పుట్టే చీముచుపట్టి, వ్రణాలకు వేరు వేరు పేరులు పెట్టినారు. సవాయి వ్రణాలనీ, క్షుద్రవ్రణాలనీ, క్షయ వ్రణములనీ వారుపెలుస్తారు. ఏమైనప్పటికీ యీ వ్రణాలన్నిటికీ రోగపదార్థము కారణమనీ, అందులో చీముపుట్టునని మనకు తెలుసు. మందులు వాడికూడా పుండ్లలో ముసుగుపుట్టకుండా మందువైద్యులు చేయలేకపోయినారు. మందువైద్యమువలన బైటికి వచ్చేచీము, దేహములోనే అణచిపెడతారు. అసలు చీముపుట్టకుండా చేయటము మందువైద్యుల చేతకాదు. వారికీ రోగాన్ని నయముచేసే శక్తిలేదు. ప్రక్రియలులేవు. అందువలననే ఒకచోటపుండు మానితే యింకొకచోట సెలవేస్తుంది. దేహములో ఉండే ముసుగుపోక నిలిచియుంటుంది. పైకి దెబ్బ తగులకుండా దేహములోనే పుట్టేపుండ్లుకూడా, వారి వైద్యములో నయముకావు.

ఒకవేళ నయమైనా — యెంతోకాలము విసిగిస్తేగాని నయము కాదు. దేహములో యేదో కాలికవ్యాధి ఉన్నప్పుడే యిటు వంటి వ్రణాలుపుట్టును. ప్రకృతిసిద్ధమైన సహజ జీవనాన్ని

వదలి జీవించే మానవుని అక్రమ ప్రవర్తన వలన దేహములో రోగపదార్థము చేరుతుంది. అప్పుడప్పుడు దేహప్రకృతి ఆ మాలిన్యములను వెలువరించుటకు ప్రయత్నము చేస్తుంది. ఆ ప్రయత్నానికే రోగము అని పేరు. సహజమార్గముగా ఆ రోగపదార్థము వెళ్ళిపోయేదాకా వేచిఉంటే. దేహములో నుండి మురికి వెళ్ళిపోయి ఆరోగ్యము వస్తుంది. మానవుడు తొందరపడి రోగచిహ్నలను పోగొట్టేందుకు మందులువాడితే, ఆ మందులవలన రోగము దేహములోనే అణిగిపోతుంది. ఇట్లా అనేక తూరులు రోగపదార్థము అణచిపెట్టితే చిట్టచివరకు సవాయివ్రణాలు, క్షుద్రవ్రణాలు, క్షయవ్రణాలు పుట్టుచున్నవి. అదివరకు వాడిన పాదరసము, అయోడిన్, పొటాషియం, అయోడైడ్, బ్రోమిన్ శాలిసైలిక్ యాసిడ్ పైన డిజిటాలిస్ మొదలైన విషఔషధాలు చేయుచుండుటవలనను, దుర్భర వ్యాధులు వస్తవి. టీకాలవలన దేహములో ప్రవేశించిన మురికివలనకూడా: మానవజాతి, నానాటికి దిగనాసిల్లి పోవు చున్నది. అందువలననే, దేహములోనుండే మురికిసులభంగా వెలువడిపోక దేహములోనే నిలువఉండి క్షయ, కేన్సర్, సవాయి, ఉన్మాదము, మొదలగు కాలిక వ్యాధులుగా ప్రత్యక్షమవుచున్నవి. అందువలననే టీకాలు వేయించుకొనేవారి దేహములో, టీకాల సంబంధమైనచీము, చిరకాలము నిలచిఉండి చిట్టచివరకు, కన పడే వ్యాధులలో ప్రత్యక్ష మవుచున్నది.

ఈ మందులే తర్వాతవచ్చే సూక్ష్మజీవులకు కారణమవుచున్నవి. రక్తము, విషఔషధాలతో నిండిపోయి దేహములో ధాతుశక్తి పూర్తిగా క్షీణించిపోయినపుడు తీరుణములగు జ్వరములు, అతి

సారము, మొదలగు వ్యాధులుకాక. బహిరంగ వ్రణములుగా ప్రత్యక్ష మవుచుండును. మందువైద్యులు, దేహములో ధాతుశక్తి క్షీణించిపోగాపోగా చిట్ట చివరకువచ్చే అతిదుర్భరమయిన వ్యాధులను పాతమందులతో నయముచేయలేక యింకాయింకా, కొత్తకొత్త, మందులను కనిపెట్టుచునే యున్నారు. నానాటికి మందులయొక్క విషస్వభావాన్ని పెంచుకు బోతున్నారు.

అంతేగాని రోగానికి మూలకారణమైన మురికిని తీసి వేయుటకు వాసనమంత అయినా ప్రయత్నించుట లేదు. ప్రతి మందులోనూ, విషమేచేరి ఉంటున్నది. అదివరకు దేహములో ఉన్న రోగపదార్థానికి, తోడై దేహములోని ధాతుశక్తిని దుర్బలము చేయుచున్నది. పైనుంచి వేసిన విష ఔషధము, దేహానికి అపకారం చేయకుండా ఉండేటందుకు, దానిచుట్టూ శ్లేష్మపు పొర కమ్ముకుని, గట్టిపడి, దేహములోనే యిమిడిపోయి, దేశకాల పాత్రములు అనుకూలించినప్పుడు రోగపదార్థముతోపాటు తిన్న విషపుమందు కూడా బైటికి వస్తున్నది. అప్పుడు కూడా ఆమురికి సహజముగా బైటికి పోకుండా మందువైద్యులు దానికి కూడా విష ఔషధాలనే వాడుతారు. కనుక, దేహము, రోగపదార్థముతో నానాటికినిండిపోయి, రోగములుకాలికములై చిట్టచివర వరకు కుదర్చ వీలుగాని, దుర్భర వ్యాధులుగా ప్రత్యక్షమవుచున్నవి. ఈ సంగతి రుజువు చేసేటందుకు నా అనుభవములోని ఒక ఉదాహరణ చేర్చుచున్నాను.

ఒకమందువైద్యుడు, కాలిమీద లేచిన బహిరంగ వ్రణాలను నయముచేయటానికి ఒకకొత్త మందును కనిపెట్టి

ప్రచారముచేసి ఖ్యాతిసంపాదించినాడు. వ్రణాలకు ఆమందు పూయటంతోనే పుండువెంటనే మానిపోతుంది. నా పెద్దమని షికి తొడమీద కురుపులు లేచినవి. యెన్నిమందులు యిచ్చినా మానలేదు. ఈకొత్తమందు వాడటంతోనే కురుపులు మాని నవి. 2 సంవత్సరాలు అయిన తర్వాత ఆ చోటనే మళ్లీ కురు పులు లేచినవి. ఈ సారికూడా ఈ కొత్తవైద్యుడు దగ్గరికి పోయినాడు. ఆ వైద్యుడు కొత్తమందును వాడినాడు. ఈసారి కొత్తమందు పనిచేయలేదు. కురుపులు మానలేదు. కొత్త వైద్యునికి బంగారు పుట్టినది. ఈ రోగం పాతరోగం కాదని యింకొక కొత్తరోగం పుట్టినదని చెప్పినాడు. ఈ విషపు కురు పులు కాలు తీసేస్తే పోతవి అన్నాడు యెంతసులభమయిన వైద్యము? ఆ నిర్భాగ్యపు వైద్యములో యింతకన్నా ఉపా యములేదు. మసూచికం రాకుండుటకు చీముతో టీకాలు వేయటం, వైద్యునికి రోగకారణము తెలియనపుడు, శస్త్ర ముతో అవయవాలను భేదించుట యివి వారి వైద్యములో ప్రక్రియలు. జ్వరము, అతిసారము మొదలగు వ్యాధులకు రోగకారణము, రోగపదార్థమే అని మనకు తెలుసు. కురుపు లలోనుండి బైటికివచ్చే చీముకూడా రోగపదార్థము యొక్క రూపాంతరమేనని మనకు తెలుసు. వ్రణములలో దేహము నందు రోగపదార్థము కాలికస్థితిలో ఉండదనీ, అందు నిరంత రము అమితమగు వేడిమి పుట్టుచున్నదని కూడా మనకు తెలుసు. అమితమగు అంతర్గత ఉష్ణమువలన దేహములో చేరియుండిన రోగపదార్థము మురిగి అందులో వివిధములయిన సూక్ష్మ జీవులు పుట్టుచున్నవని మనకు తెలుసు. దేహములోఉన్న

అమితమగు వేడిమిలో ఉండే తారతమ్యాలవలన పుట్టే మురుగు, ఆమురుగులో. పుట్టే సూక్ష్మజీవులు వివిధ రకములుగా ఉంటవి. ఈ సంగతులు మనకు తెలిసిఉంటే దేహములో పుట్టినమురుగు, అందులో పుట్టిన సూక్ష్మజీవులు యెలా పోతయ్యో మనకు సులభంగానే తెలియును. మురుగును తగ్గించాలంటే వేడిని తగ్గించాలి. గనుక దేహమునందున్న అమితమగు వేడిమిని చన్నీటి కటిలింగ స్నానాలతో తగ్గిస్తాము. దేహములో కొత్త వేడిపుట్టకుండా ఉండేటందుకు, కూరా అన్నంగాని, రొట్టె కూర గాని పెడతాము. దీనితో రోగి దేహములో ఉండే అమితమగు వేడిమి తగ్గుతుంది. ఈవేడిమిని కొలిచేటందుకు ధర్మామీటరు పనికిరాదు. ముఖనిదాన శాస్త్రముతో ఈ వేడిని సులభంగా కొలువవచ్చును.

కేన్సర్, క్షయ, సవాయి, మొదలగు వ్రణాలతో, బాధపడే అనేకమందికి చికిత్స నేను చేసియున్నాను. తగుమాత్రము, ధాతుశక్తి ఉండి దేహములో విషపుమందులు వాడకుండా ఉన్నవారికి, ఆశ్చర్యకరముగా కొద్దికాలములోనే యీవ్రణాలు మానుతూఉండేవి. ఇలానయమైన వారిలో చాలా తీవ్రమయిన వ్రణనివారణ వృత్తాంతము; ఒక పెద్దమనిషికి, 50 సంవత్సరాలవయస్సు, పాదములు మొదట మోకాలువరకూ చీము కారే బహిరంగవ్రణములు, 30, 40, లేచినవి. అన్నింటిలోకీ పెద్దపుండు 4 చదరపుఅంగుళాలు ఉన్నది. దుర్వాసనతో కూడి నీరు, చీము, నిరంతరము కారుతూఉండేది. మందులతో ఆపుండ్లు మానేవికాని, మానినచోట దురదయెక్కువగా

ఉండి గోకుతే పుండుపడేది. చర్మముకిౖందచేరి, మందు లచే అణచిపెట్టబడిన చీము నలననే దురదపుట్టినది. గోకినతర్వాత, చీముకారిపోతే, దురదపోయినది. మోకాలికి దిగువభాగమంతా, నల్లబడిపోయినది. అంటే అక్కడ యిదివరకే,మురిగిపోయినదని అర్థము.ఎన్నోమందులు వాడినారు. అవన్నీ వ్యర్థమయిపోయినవి. శస్త్రముచేసి కాలు తీసివేయటం ఒక్కటే మిగిలినది. తీసివేయకపోతే ఆసుౖళ్లు హృదయములోనికి వ్యాపించి, పాౖణమేపోతుంది. మనవైద్యములో అతనికి నమ్మ కము లేకపోయినా, యీ దుర్భరస్థితిని తప్పించుకొనుటకు మనవైద్యములో పౖవేశించినాడు. ముఖనిదాన శాస్త్రముతో అతని జీర్ణకిౖయ అప్పటికే చెడిపోయినదని కనిపెట్టినాను. నిక్కలి తేలికఅయిన ఆహారముకూడా ఆ జీర్ణకోశము, పచనము చేయలేకుండా వున్నది. అందువల్ల సుదరక్తమనేదే ఆ దేహ ములో తయారుకావటంలేదు. శ్వాసకోశాలు కూడా తిన్నగా పనిచేయటంలేదు. అతనిదేహము రోగపదార్థముతో అమిత ముగా నిండియున్నది. పౖతిదినము రోగపదార్థము చేరుతున్నది కాని తగ్గటములేదు. తన దేహములో యుండే రోగపదార్థం చేత, కాళ్లుగూడా రోగగౖస్తమయినవని అతనికి తెలియదు. కాలిమీద పుండ్లకు చికిత్స, దేహమున కంతటికి చేయవలెనని నేను పట్టుపట్టితే, అతడు అర్థము చేసుకోలేక పోయినాడు. అతను కాలిమీదపుండ్లకు, కాలిమీదనే వైద్యము చేయవలెనని అను కున్నాడు. దేహమునకంతా చికిత్సచేస్తూ కాలిమీద కురు పులకు, తడికట్టుమాతౖము కట్టించేవాడను. దినమునకు

4 లింగస్నానములు చేయించేవాడను, చెమట పోయుటకు, సీటిఆవిరి. దేహమునకు పట్టించేవాడను. పరిశుద్ధమైన గాలిలో యెండలో రోగిని త్రిప్పేవాడను. పండ్లు, కూర గాయలు, నిర్మలమయిన సహజాహారములను, పొట్టుతీయని పిండితో చేసిన గోధుమరొట్టెను ఆహారముగా యిచ్చేవాడను. మొదటినుండియు తొట్టిస్నానము మొదలగు చికిత్సలకంటె, కాలుమీదవేసే కట్టును శ్రద్ధగా వేసేవాడు. అందువల్ల ఆరు మాసాలు ఆ కురుపులు మానలేదు. అప్పుడు నా నిర్బంధము వలన స్నానము, పథ్యము మొదలైనవి నేను చెప్పిన ప్రకారము యథావిధిగా చేసినాడు. తర్వాత ఆరుమాసాలలో చిన్నకురుపులన్నీ మానినవి. చీముకట్టుకుంది. దురద లేకుండా పోయినది. జీర్ణక్రియ బాగుపడినది. ఊపిరితిత్తులుకూడా బాగా పనిచేస్తున్నవి. ఈ మంచిలక్షణాలను చూచుకుని రోగి యింకా ఉత్సాహంగానూ పట్టుదలగాను మన వైద్యమును చేయుచున్నాడు. మోకాలుకు దిగువగా నుండే కురుపులుమాని, మోకాలుకుపైగా కురుపులు లేచినవి. రోగము కిందనుంచి ఉదరమువంకకు నడచుచుండుట ఒకమంచిలక్షణము. మోకాలికి దిగువనున్న కాలు, నలుపు పోయినది. సహజమైన రంగువచ్చినది. మోకాలికి దిగువనున్న కురుపులు మాని కొత్తకురుపులు లేచేటప్పటికి, మిగతా వైద్యమువల్లనే, మన వైద్యము కూడా, నిరుపయోగమైనదని రోగి భయపడినాడు. మొదట రోగపదార్థము ఉదరములోనుండి కిందికి దిగినదనియు అది ఉదరములో నుండియే బైటకు పోవలసి యున్నందున,

కురుపులు కిందనుంచి మీాదకు వ్యాపించుచున్నవనియు, అతనికి బోధించినాను. ఈ విషయములో అతనికి నమ్మికకలిగినది. యథావిధిగా చికిత్స చేయుచున్నాడు. మొత్తంచికిత్స 3 సంవత్సరాలు పట్టింది. ఆ కురుపులు శాశ్వతముగా నయమైనవి. చర్మానికి, సహజమైన రంగు వచ్చినది. అతని జీర్ణశక్తి శాశ్వతముగా, బాగుపడినది. క్షయ రానటానికి సిద్ధముగానున్న అతని ఊపిరితిత్తులు బాగుపడినవి. ఆరోగాలన్నీ క్షయ, కేన్సర్, అని సుప్రసిద్ధవైద్యులు పేర్లుపెట్టినారు. అవి యింకా యెప్పటికీ నయము కావనికూడా అన్నారు. ఆరోగాలన్నీ మానినవి. యిప్పటివరకు తిరిగి ఒక కురుపుకూడా పుట్టలేదు.

విషపుపురుగులు :- పిచ్చికుక్కలు - పాములు - వీనివలన కలిగే విషీకరణము. మానవదేహములో యుందే రక్తకణాలు చాలా సున్నితమయినవి. ఏదైనా ఒకవిషము దేహములో ప్రవేశిస్తే రక్తములో ఉపద్రవమయిన ఉద్రేకము పుడుతుంది. దేహములో మండము కలిగినప్పటివలెనే ఉపద్రవమయిన వేడి పుడుతుంది. ఆరోగ్యవంతునికి పాముకరచినా యీ వేడి పుట్టకుండా మానదు. దేహములో అదివరకే రోగపదార్థము చేరి ఉంటే పాము కాటువలన చాలా ఉపద్రవము సంభవిస్తుంది. పాముకాటు, పిచ్చికుక్కకాటు చివరకు యేవిషపు, పురుగుకుట్టినా దేహములోని రోగపదార్థములో, తీవ్రమయిన మండము పుడుతుంది. అందువలన ప్రాణాపాయము రావటానికి వీలున్నది. దేహములో రోగపదార్థము యెంత యెక్కువగా ఉంటే పాముకాటువలనవచ్చే ప్రమాదముకు "ఊ" అంత యెక్కువగా పుట్టుంది.

ఒకనికి ఒక విషపుజంతువు కుడితే అది ఒకనికి పెద్దవాపు కలిగిస్తుంది. ఇంకొకనికి దోమకుట్టినట్లు ఉంటుంది. పిచ్చికుక్క కరచినప్పుడుకూడా ఒకనికి పిచ్చిపుడుతుంది. ఇంకొకనికి అదేకుక్క కరచినా యేమీ అపకారం చేయదు. పాము కరచినపుడుకూడా ఒకనికి ప్రాణము పోతుంది. యింకొకనికి ఉపద్రవమయిన వెడిచేసి మానిపోతుంది. దేహములో ఉండే రోగపదార్థము యొక్క హెచ్చుతగ్గులనుబట్టి ఆయాజంతువులు కుట్టినప్పుడు కలిగే ప్రమాదముకూడా హెచ్చు తక్కువలుగా ఉంటుంది. ఈకారణము చేతనే జయప్రదముగా జరిగిన శస్త్రచికిత్సల తర్వాత కొంత మంది రక్తవిషీకరణముతో చనిపోతారు.

పిచ్చికుక్క కరచినప్పుడు దానినోటిలోని చొంగ మొదట పుండులోపడి కాలికమైన ప్రారంభదశలో ఉంటుంది. కొంతకాలము తరువాత, అది తరుణావస్థనుపొంది పిచ్చిపుట్టుతుంది. మొదట జీర్ణక్రియనుచెడగొట్టి, తర్వాత తరుణావస్థలో ఉన్మాదము, మూర్ఛనిస్తుంది. పిచ్చికుక్కల జీర్ణక్రియకూడా అసహజమైన స్థితిలోనే, ఉండుట నేనుచూచినాను. ఈక్రింది వృత్తాంతమువలన, పాముకాటు విషయము తెలిసికొనవచ్చును. ఒక పిల్లవాడు అడవిలో పరుండియుండగా, నాగుపాము కరచెను. అతని ఉదరమునందు యీడ్పుపట్టినది. దానితో అతనికి 15 ఘంటలుమాత్రము బిగబట్టినది. అతను ప్రాణాపాయస్థితిలో నుండెను. ఈ స్థితిలో, మన వైద్యముచేసిరి. పాము కరచిన చోటును, దేహమున కంతటికిని, నీటిఆవిరి పట్టిరి. అదేసమయములో కటిలింగస్నానములు చేయించి, ఉద్రేకములేని ఆహార

మును యిచ్చిరి. కొలదికాలములోనే, ప్రాణాపాయభయము పోయినది. బాగుగా చెమటపోసినది. మూత్రముకూడా బాగుగా అయినది.

విషజంతువులకాటు, తటస్థించినప్పుడెల్లా, జంతువు కాటు వేసిన చోట, వాయుట, అందు వేడిమియు నుండును. ఆవాపును తగ్గించుటకును, అందులోని వేడిమిని తగ్గించుటకును, ఆ ప్రదేశమును చల్లబరుచుట, మిక్కిలి అవసరమైనది. విషజంతువు కాటు వేసిన ప్రదేశమును చల్లనినీటిలో నుంచవలయును. ప్రవహిస్తూఉన్న నీటిలో ఉంచటం చాలా మంచిది. తరుచుగా, తడిపాత్తి మారుస్తూ, ఆ ప్రదేశమున యెడతెగకుండా తడికట్టు కట్టవలెను. అది, ఇదిగా కటిలింగ స్నానములను చేయవలయును. తేనెటీగ, తుమ్మెద మొదలగునవి కుట్టినప్పుడు, ఆ ప్రదేశము తత్కాలములో వాచి అంతటితో ఆ బాధ తీరిపోవును. దేహములో యే ప్రదేశములో రోగపదార్థము యెక్కువగా ఉంటుందో, ఆ ప్రదేశములోనే యీ చిన్న జంతువులు కుట్టుతవి. చన్నీటి పట్టీలు వేసినందువలన రోగపదార్థములో కలిగిన మండవ్యాప్తి బాధతగ్గి విషమును వెలువరించుటకు తోడుపడును. కుట్టినచోట నాపు అంతతో పోక యితర ప్రదేశాలకుకూడా వ్యాపిస్తే, వెంటనే చికిత్సచేసి ప్రమాదాన్ని తగ్గించవలెను. కుట్టిన ప్రదేశమును చన్నీటిలో నుంచవలయును. లేదా తడికట్టయినా వేయవలయును. వసతిగలవారు కుట్టినచోట నీటిఆవిరిపట్టి కటిలింగస్నానములు చేయించవలె నది. దానితో వెంటనే ఉపశాంతి కలుగుతుంది. వెంటనే

బాధోపశమనము కలుగనియెడల ప్రతి 2, 3 ఘంటల కొకసారి కటిలింగస్నానములను చేయింపవలయును. ఈ విధంగా అంతర్గతమయిన వేడిమిని తగ్గిస్తే, తొందరగా రోగనివారణ మవుతుంది. తీవ్రమగు అపాయదశ తగ్గిపోయేదాకా ఉపవాసం చేయడం మంచిది లేదా పొట్టుతీయని గోధుమపిండితో చేసినరొట్టె, పండ్లు యివ్వడం మంచిది. త్రాగుటకు మంచినీరు తప్ప యింకేమి యివ్వరాదు. కటిలింగస్నానములు చేసినతర్వాత, యెండలో కూర్చుండి దేహమునకు వేడికలిగించుకోవలసినది. ఓపికఉంటే తేలికగ వ్యాయామము చేయుట మంచిది. కాటువేసిన చోటు వాపు గట్టిపడితే, ఆప్రదేశానికి, వేడినీటి ఆవిరిపట్టి, కటిలింగ స్నానములను చేయవలయును. ఆవిరితో లోపలనున్న విషము చెమటద్వారా వెళ్ళిపోతుంది. ఈ అపాయములందెల్ల పుట్టే వేడి తగ్గించటానికి మనము ముందు జాగ్రత్త పడవలయును.

20 సంవత్సరముల వానికి పొలములో పనిచేస్తూ ఉండగా, యెడమచేయి విషజంతువు కుట్టినది. కుట్టినచోట యెక్కువ బాధగా లేదు. వాపుకూడా యెక్కువగా లేదు. అందువల్ల అతడు దానికేమీ చికిత్సకూడా చేయలేదు. కొన్ని ఘంటలయినతర్వాత, చేయి వాయ నారంభించి తీపు, పోటు కలిగినవి. చేయిఅంతా వాచినది. వైద్యులను పిలిచినారు. చేయిఅంతా విషీకరణమై పోయినది. శస్త్రముచేసి చేయి తొలగించాలన్నారు. అక్కడ మనవైద్య మెరిగిన వారు ఒకరున్నారు. చేయి తీసివేయటమంటే యెవరికీ యిష్టముండదుగనుక, ఆరోగిని మనవైద్యములో దింపినారు.

చేతికి నీటిఆవిరి పట్టి కటిస్నానములు చేయిస్తూవున్నారు. వాపు తగ్గిన తర్వాత ఆవిరిలేకుండా, కటిలింగస్నానములు చేయించినారు. చేతికి నీటిఆవిరికి తోడుగా, తడికట్లు కట్టినారు. దేహమునకు చెమట పట్టుటను, రోగి బరువు తగ్గుట, గాలిలోను యెండలోను. తగినంత వ్యాయామమును చేసేవారు. ఈ విధంగా యీ స్వల్పచికిత్సలతోనే పుట్టిన వాపంతా మానినది. రోగి ఆరోగ్యం కూడా అభివృద్ధి నొందినది.

---

## ౨. స్త్రీల వ్యాధులు

స్త్రీ దేహ నిర్మాణము చాలా సంకీర్ణముగా యుంటుంది. మల మూత్రకోశాలు, జననేంద్రియాలు, అన్నియొకటి ఒక్క కూపకములో యిమిడియున్నవి. అందువలన స్త్రీలకు తరుచుగావచ్చే వ్యాధులన్నియు చాలా బాధాకరముగా వుంటవి. ఋతువు, గర్భధారణము, ప్రసూతి, బాలింత, బిడ్డకు పాలిచ్చుట, శిశుపోషణ మొదలగు వానివలన కలిగే రోగములకు తోడు అజీర్ణవ్యాధులు మూత్రవ్యాధులు మొదలగునవికూడా వచ్చుచున్నవి. కామోద్రేకానికి లోనై, అకాలములో అసహజముగా చేసే అమిత సంగమక్రియ, నేటి నాగరికతకు సామాన్య లక్షణముగా యుంటున్నది. ఇందువలన కలిగే గర్భాశయ వ్యాధులు. అవివేకము చేత అందుకొరకై వాడిన మందులు స్త్రీల జననేంద్రియాలను కాలికవ్యాధులకు లోనొనర్చుచున్నవి. ఈకాలిక దశవలన

అసంఖ్యాకములగు స్త్రీవ్యాధులు రావడము, వానిని నయము చేయలేక మందువైద్యులు తన్నుకొను చుండుట అందరు యెరిగినదే. స్త్రీలకే ప్రత్యేకముగా వచ్చు యీ రోగాలన్నిటికీ మూలకారణము యేమిటి? అక్రమమైన ఆహారము తినుట, అది అమితముగా తినటం, పనిపాటలు చేయకపోవటం, ఎండ గాలి తగిలేచోటు తిరుగక పోవటం, గాలి తగులని యిరుకు గదులలో ముసుగు పెట్టుకొని నిద్రించుట, మల మూత్రములను, సకాలములో వెలువరించక ఆపటం, పగటి పూట నిద్రపోవుటం, రాత్రి జాగరణచేయడం, జిహ్వోపస్థేంద్రియములతో యెక్కువ సుఖాన్ని పొందవలెనని అభిలషించడం, ప్రతిసామాన్య రోగానికి యేదో ఒకమందు తిను చుండుట మొదలగునవి. ఒక్కొక్కటే ఒక్కరోగాన్ని కల్గింప, సమర్థమయి ఉన్నది. వీనిలో అనేక దుర్భ్యాసాలు ఒకరికే ఉంటే, అట్టివారికి రోగమువస్తే ఆశ్చర్యపడవలసిన పని యేమున్నది? స్త్రీదేహము అసలే సున్నితమైనది, అట్టిదేహాన్ని రోగాలు పీడింపనారంభిస్తే, అదియెంతో చెడిపోతుంది. పల్లెటూరులో ఉండే మోటు స్త్రీ పనిపాటలు చేసుకుంటూ ఉండుటచేత యెన్నో ఆరోగ్య నియమాలను, అవలంబించుటకు వీలులేక పోయినా ఆరోగ్యముగానే యుంటున్నది. బస్తీలో ఉండి అన్ని వసతులు గలిగిన, నవనాగరిక స్త్రీకే, ఆరోగ్యము ఉండటం లేదు. పితృముంగా సంక్రమించినట్టియు స్వార్జితముగా సంపాదించినట్టియు, రోగములకు మూలకందముగా ఉండేస్త్రీ నిజంగా ఆరోగ్యముగా ఉండుటకు నాతొట్టి వైద్యము యెంతో

సహాయంచేస్తుంది. వివిధనామరూపాలతో కనపడే లెక్కలే నన్ని స్త్రీ వ్యాధులను, తొట్టివైద్యముతో నేను నయముచేయ గలను. నావైద్యము స్త్రీలలోను, ఆడపిల్లలలోను, బాగా వ్యాప్తిలోనున్నది. ఈవైద్యము చౌకయగుటవలన, వారందరు దీనిని అవలంబింపలేదు. ప్రతివారికి తప్పకుండా రోగినయము కావటం, ఒకసారి నయమైనరోగము తిరిగిరాకుండా శాశ్వత ముగా కుదురుటవలననే వారందరు యీవైద్యాన్ని అవలం బించి మేలును పొందుచున్నారు. శాస్త్రీయంగా చర్చించి, వానిపర్యవసానం తెల్సుకుని వారు యీవైద్యాన్ని అవలంబింప లేదు. పాతవారిరోగాలు నయమగుచుండుట ప్రత్యక్షముగా చూచి, కొత్తవారు యీ వైద్యములోనికి, వచ్చుచున్నారు. ఎవరిరోగాలు యీవిధంగా నయమవుతున్నవో, వారే యీవై ద్యాన్ని యింకా బాగా ప్రచారము చేయుచున్నారు. స్త్రీ సహజమైన సిగ్గునుపోగొట్టే, జననేంద్రియాలపరీక్ష, మన ముఖనిదాన శాస్త్రములో లేదు. తమకు యిష్టముగాని, రహ స్యావయవపరీక్ష చేయకపోవుటవల్ల కూడా స్త్రీలు యీవిధా నాన్ని, అమోదింతురు. యెంతోమంది రోగులు, రోగము ముదిరిపోతున్నా, తమరహస్యా వయవములను యితరులు పరీక్షించి, పోతారని సిగ్గుచేత, రోగాన్ని దాచిపెట్టుకుం టున్నారు. అట్టిరహస్యావయవాలపరీక్ష మనవైద్యములో అక్కరలేదు. ఈ ఒక్కవిషయానికే అనేకమంది స్త్రీలు నన్ను అభినందించియున్నారు. ప్రత్యక్షములో ఫలాన్నియిచ్చేది గనుకనే స్త్రీలు దీనిని అవలంబించటము వారికి తప్పకుండా

మే లే జరగటం తటస్థించుచున్నది. అందువలననే స్త్రీలలోను ఆడబిడ్డలలోను నావైద్యము బాగా ప్రచారములో నున్నది. ఎంతదుర్భర వ్యాధికికూడా మనవిధానము తప్పకుండా జవాబిస్తున్నది.

ఋతుదోషములు:— ఋతువుఅగుట అనినంతనే ఒక స్త్రీ గర్భ ధారణకు, తయారుగానున్నది అని అర్థము. యేనెలలో గర్భ ధారణ అవుతుందో, అంతవరకు నెలకొకతూరి ఋతురక్తము అవుచుండును. ఆరోగ్యవతి అయిన స్త్రీయందు, ఋతుస్రావము వలని యెట్టిబాధగాని, యితర అసౌకర్యాలుగాని కలుగవు. ఇట్టిబాధలు కలిగినపుడు, తప్పకుండా దేహములో, రోగ పదార్థము ఉన్నదని నమ్మవచ్చును.

స్త్రీలలో వచ్చే యీ ఋతుధర్మము, చంద్రునియొక్క గతి ననుసరించి యుంటుంది. ఆరోగ్యవతియగు స్త్రీకి ఋతుమతి అయిన తర్వాత 3,4 దినములు ఋతుస్రావము అవుతుంది. తిరిగి 29 రోజులు నిండినతరువాత ఋతుమతి అవుతుంది. ఇందుకు భిన్నంగా యెవరికి ఋతువు యెగుడు దిగుడుగాగాని, ఋతు స్రావము యెక్కువ, తక్కువలుగాగాని అయితే, వారి ఉదరము నందలి అవయవములు కొద్దో గొప్పో రోగగ్రస్తమయినవనియే తప్పకుండా చెప్పవచ్చును. ఆవిధముగానే నెలనిండకమునుపే 2, 3 వారములకే ఋతుమతి అయినను, ఋతుస్రావము వారం 15 రోజులదాకా అవుచుండినా, జననేంద్రియాలు కాలిక రోగా నికి గురిఅయినవి అని చెప్పవచ్చును. దురదృష్ట మేమనగా నేటి నాగరిక స్త్రీలలో యిట్టి వారే మనకు తరచు కాన్పించు

చున్నారు. మామూలుగా అనుకునేదానికంటే, యీ ఋతు ధర్మముయొక్క హెచ్చుతక్కువ్వలమీద స్త్రీలయొక్క ఆరోగ్యము ఆధారపడి యున్నది. ఋతుమతి అయినస్త్రీ ఋతు కాలమున యెట్టి ఉద్రేకములకు లోనుగాక, శాంతముగా, జీవింప వలయును. గర్భవతులు కూడా, యీ నియమమును తప్పక పాలింప వలయును. గర్భవతిగానున్న స్త్రీ ఋతుమతి కాదగిన దినములు ప్రతినెలలోను కొన్ని ఉంటవి. ఆ దిన ములలో ఋతుమతికాదు. కాని ఆ దినములలో ఆమె దేహము, మనస్సు, మిక్కిలి సున్నితముగా ఉంటవి. ఆ దిన ములలో ఆమెకు కలిగిన దైహిక, మానసిక ఉద్రేకాలు గర్భస్థ మయిన పిండానికి బాధను కలిగిస్తవి. గర్భవతిగానున్న కాల ములో వచ్చే వ్యాధులుకూడా బిడ్డకు సంక్రమిస్తవి. స్త్రీ దేహ ములో జరిగే యీ సహజమైన మార్పులు జాగ్రత్తగా పరి శీలన చేసేవారికి యెన్నో విషయాలను బోధిస్తవి. విశ్వమంతా వ్యాపించిఉండే సహజమైన నియమములు, స్వల్పమయినవని మనకు తెలుస్తుంది. ఈ విషయాలను ముఖసాధనశాస్త్రములో నింకా వివరముగా చెప్పినాను. సందేహాల మున్నవారు ఆ గ్రంథమును చదువ వచ్చును. ఒక స్త్రీ, ఒక మాసంకన్నా తక్కువ కాలములో ఋతుమతిఅయినా, యెక్కువ కాలములో ఋతుమతి అయినప్పటికీ, ఋతుస్రావము యెక్కువగా అయినా మిక్కిలి స్వల్పముగా అయినా దేహములో రోగపదార్థము చేరిన దని యిదివరకే చెప్పినాను. ఈరోగపదార్థాన్ని పోగొట్టుటయెట్లు! దీనికికూడా తొట్టివైద్యము చికిత్స. అజీర్ణమువలన ఉదరమునందు

చేరిన రోగపదార్థము ఋతురోగాలకు కారణ మవుచున్నది. జీర్ణక్రియను బాగుచేసి ఉదరమునందు చేరిన రోగపదార్థమును, మలమూత్ర స్వేదరూపమున సక్రమముగా వెలువరింప కలిగినపుడు ఉదరము నందలి అమిత వేడి తగ్గిపోతుంది. దానితో ఋతువ్యాధులుకూడా మానిపోతవి. అన్ని యితర రోగములకు చేస్తూఉండే చన్నీటి కటిలింగ స్నానములవలనను, నీటిఆవిరి, యెండఆవిరి, ఉద్రేకములేని అవిదాహి పథ్యము వలనను ఋతురోగములు నయమవుచున్నవి. ఈసంగతి అనేకమందికి చికిత్స చేసి ఋజువు చేసియున్నాను.

ఋతురక్తము స్త్రీదేహానికి అవుసరమైనదికాదు. అందువలననే ఋతుస్రావమువలన స్త్రీకెట్టి దార్బల్యమునురాదు. గర్భవతి దేహము నందుండి రాకనిలచిన ఋతురక్తము గర్భస్థమయిన పిండముయొక్క పెంపకమునకు ఉపయోగపడుతుంది. అందువలననే ఆమెఋతుమతి కాదగినరోజులు చాల సున్నితమయినవని వ్రాసితిని. గర్భాశయ సంబంధమయిన వ్యాధులుకూడా, శుక్ల పక్షములో వృద్ధిపొంది, కృష్ణపక్షములో తగ్గిపోవుచుండుట, గమనించితిని. ఇందువలన కూడా, ప్రకృతితో మనకు గల సన్నిహిత సంబంధము, తెలియుచున్నది,

ఋతుకాలము యొక్క ప్రాధాన్యమును తెలియచేసే కొన్ని ప్రత్యక్ష విషయములను యిచ్చట చేర్చుచున్నాను. ఒకామెకు ఒక శిశువు కలిగెను. ఆమెకు చిట్టెలుక అంటే, అమితమయిన భయము. పరిశోధనచేయుగా ఆబిడ్డ గర్భస్థుడయి ఉండగా ఆతల్లి చేతిమీద ఒకరోజున ఒక యెలుక పాకినది. ఆమెకు ఆదినము

ఋతుకాలములోనిది. అప్పటినుండియు ఆమెకు చిట్టెలుక అంటే తగనిభయము. రాత్రిలందు, నిద్రిలో చిట్టెలుక మీాద ప్రాకి నట్లు కలవరించి భయపడేది. ఆమెకు శిశువు కలిగిన తర్వాత, ఆరుమాసాలకు చూడగా ఆబిడ్డ చేతిమీాద సరిగా చిట్టెలుకంత పొడుగున, మచ్చ ఉన్నది. తోకగూడా ఉంది.. దానిమీాద బొచ్చు ఉన్నది. ఆమచ్చ ఉన్నచోట కండ చేతితో సమముట్టము గానే యున్నది. అయితే ఆమచ్చమీాద తెల్లని, బొచ్చుఉన్నది. ఒకామెకు ఆరవకాన్పు. ఆమెకుకలిగిన మొదటి అయిదుగురు నల్లనివెండ్రుకలు కలవారు. ఈతూరి గర్భవతిగానున్నపుడు వలయాలుతిరిగిన యెర్రని వెండ్రుకలుగల ఒక ఆడబిడ్డ ఆమెతో నివసించుచుండెను. ఆమెకు ఆ బిడ్డమీాద తగనిప్రేమ. తనకు పుట్టేబిడ్డ యీా విధంగా ఉంటేబాగుండునని ఆమెకు గాఢమగు వాంఛకలదు. ఆమెకు ఋతువుకాతగిన రోజులలో తనకు అట్టి వెంట్రుకలుకల్గిన బిడ్డపుట్టియున్నట్లు కలలుకనేది. తర్వాత అయిదు మాసములకు, ఆమె ప్రసవించినది. ఆమెకు కలిగిన ఆడశిశువు అన్నివిధములా, తల్లి తండ్రిలను పోలియుండెను. గాని వెంట్రుకలు మాత్రము, ఆమెతోనివసించిన బిడ్డవెంట్రుకలను పోలియుండెను.

మూడవవిషయము. యింతకన్న చమత్కారమైనది – ఒకామె తనకుక్కతో బండిలో పోవుచుండెను. ఇంతలో ఆకుక్క అకస్మాత్తుగా దోవనపోయే వస్తువుకొరకై యెగిరి దుమికినది. దాని తలమీాదుగా బండిపోయినది. ఆమె యీా ఆపదకు మిక్కిలి వ్యధనొందెను... కుక్కయొక్క యీా వృత్తాంతము చాల

నెలలవరకును మరచిపోలేదు. ఆమె అప్పటికే గర్భిణి గానుండెను. తరువాత 6 మాసములకు ఆమె ప్రసవించెను. పుట్టిన బిడ్డ తల నలిగినట్లు చిహ్నములతో పుట్టెను.

నాలుగవ వృత్తాంతము. ఒకామెకు కలిగిన సంతానమునకు నోరు యీచెవినుండి ఆచెవివరకు వ్యాపించి యున్నది. పుట్టి నంతనే ఆ బిడ్డ చనిపోయినది. దీని కొక కారణమున్నది. ఆమె గర్భిణిగా నుండగా బుట్టబొమ్మను చూచినది. ఆబొమ్మకు నోరు యీచెవినుండి ఆచెవివరకు వ్యాపించినది. ఆబొమ్మను చూచి ఆగర్భిణి చాల భయపడెను. చాల దినముల వరకును ఆమెకు రాత్రిలయందు దా భయముతో నిద్ర పోజాలకుండెను. ఈ భయకాలము ఆమె ఋతుమతి కాదగిన కాలముగానుండెను. అందువలననే ఆబిడ్డకు ఆయవస్థ పట్టెను.

గర్భిణిగానున్న కాలమున ఋతుమతికాదగిన దినములలో తల్లి మానసికస్థితి బిడ్డయొక్క స్థితిగతులను నిర్ణయించేదిగా ఉంటుంది. కోపము, భయము, పరాక్రమము, చౌర్యము, లాలసత్వము, మోసము, దురాశ, లొభ్యము మొదలగు దుర్గుణములు యీ కారణముచేతనే తఱచుగా గలుగుచుండును.

ఇందువలన మనమనస్సును కదలించు బాహ్య విషయములు నాడులద్వారా ఉదరమును పీడించి జీర్ణక్రియను చెడగొట్టును. నాశాస్త్రమును జాగ్రత్తగా గ్రహించినచో సర్వ రోగములకును మూలస్థానము ఉదరమనియే గ్రహింపగలరు. ఈ విషయమును బాగుగా రుజువుచేసి యున్నాను.

గర్భాశయస్థాన భ్రంశము:- గర్భాశయమునందు జేరిన రోగ పదార్థపు వత్తిడివలననే గర్భాశయము క్రిందికిజారుచున్నది. ఇదియును పేగుజారుటయును, రోగపదార్థమునందు గలిగిన మండమును, వేడిమియు, వత్తిడి మొదలగు వానివలననే కలుగుచున్నవి.

మామూలు మందువైద్యులకు గర్భాశయము జారేకారణమేదో తెలియదు. అందువలన వారు మూలకారణమును పోగొట్టుట కేమియు ప్రయత్నింపక, జారిన గర్భాశయమును పైకి వత్తి యుంచుటకు గట్టి రబ్బరు ఉంగరమును యోనిలోనికి ఎక్కించుచున్నారు. ఎంతోమంది యిట్టి ఉంగరములు ధరించుచున్నారు. దీనివలన తాత్కాలిక ఉపశాంతియేగాని శాశ్వతమగు లాభము గలుగదు.

తొట్టివైద్య మవలంబించిన వారికి ఉదరము నందలి రోగ పదార్థము లేకుండా బోవును. దానితో వత్తిడియు పోవును. ఇక గర్భాశయము జారదు. రబ్బరు ఉంగరముతో పని యుండదు. ఒక తూరి స్వస్థానమునకు చేరిన గర్భాశయము తిరిగి జారిపోదు.

గర్భాశయము ఒరగుట :— ఉదరమునందలి రోగపదార్థపు వత్తిడివలననే గర్భాశయపు పైభాగము స్వస్థానములో నుండక కుడియెడమలకుగాని, ముందువెనుకలకుగాని ఒరగుచున్నది. గర్భాశయస్థాన భ్రంశమునకు యేది చికిత్సో దీనికినీ అదే చికిత్స. తొట్టివైద్యముచేసి లాభము పొందినవారి అనుభవము

మీదనే నేనిది వ్రాయుచున్నాను. ఒరగుటగాని, గర్భాశయము జారుటగాని సదురుచ్చుటకు చేసే శస్త్రము రోగకారణాన్ని పోగొట్టదు. శస్త్రముచేసినప్పుడల్లా శాశ్వతమైన అపకారము జరుగుచున్నది.

వంధ్యాత్వము:—ప్రతిస్త్రీకి సంతానవాంఛ ఉంటుంది. సంతానము కలుగనివారు పొందే దుఃఖము ఎంతఉండేది నాతో సంప్రదించిన సంతానము కలుగని స్త్రీలవలన నాకు భాగా తెలిసినది. తాము ఆరోగ్యంగా ఉండినాకూడా, తమకు సంతానము కలుగని కారణము యేమిటో వారికి తెలియక బాధపడుచుందురు. సంతానము కలుగనివారికి ఆరోగ్య మూంటుందని గాని, ఆరోగ్యవతులకు సంతానము కలుగదని చెప్పుట చాలతప్పు. దేహమునందు అందు ముఖ్యముగా గర్భాశయము, గర్భాండములు, గర్భ నాళములందును రోగపదార్థము చేరినపుడే అదియును మిక్కుటమయినపుడే వంధ్యాత్వము కలుగుచున్నది. కొందరియందు రోగపదార్థము కొంచెము తగ్గియున్నపుడు గర్భధారణ మవుతుందిగాని ఉదరమునందలి రోగపదార్థమునందు కల్గిన మండమువలన పుట్టిన అమితవేడివలన గర్భస్రావమగుటయో, అకాలపు ప్రసవమో జరుగుచున్నది. గర్భధారణమైన తర్వాత 4వ మాసములోపల ఉదరమునందలి వత్తిడివలన గర్భస్రావ మగుచున్నది. తత్కాలములో కలిగిన మానసికోద్రేకము భయ క్రోధములు పడుట మొదలగు వానివలన ఉదరమునందు చేరిన రోగపదార్థమునందు అమితమగుమండము కలిగి గర్భస్రావము మొదలగునవి కలుగుచున్నవి. కొందరు

స్త్రీలు వస్త్రధారణము చేసేటపుడు, నడుమును అమిత గట్టిగా బిగింతురు. యిందువలన, గర్భస్రావము, అకాలప్రసవము, జరుగుటకద్దు. పల్లెటూరులలో నుండే స్త్రీలు, బస్తీవారి కన్నా సహజమైన జీవనముచేస్తూ ఉంటారు, గనుక వారి ఆరోగ్యము చాలా బాగుంటుంది. అందువలన పల్లెటూళ్ళయందుండి, పనిపాటలు చేసుకునే స్త్రీలయందు, గర్భస్రావము, అకాలప్రసవము, మెక్కుడోగాని, తరచుగా జరుగవు. నాగరిక స్త్రీలయందు యిట్టివి, తరుచుగా చూస్తున్నాము. పల్లెటూరి వారియందు స్త్రీలు ప్రసవకాలము వరకున్నూ, పనిపాటలు చేసుకొనుచుందురు. పొలంలో పనిచేస్తూ, ప్రసవించే వారికి కూడా మనము తరుచు చూస్తూనే ఉంటాము.

గర్భస్రావాదులను పోగొట్టుటకు ఒక్కటే ఉపాయమున్నది. ఉదరమునందు చేరిన రోగపదార్థమును వెలువరించుటయే. స్త్రీల సిగ్గును పోగొట్టే ఆపరేషనుగాని, ఇంజక్షనులు గాని యితరవిధములయిన, యంత్రతంత్రములుగాని, గర్భదోషాన్ని పోగొట్టజాలవు. మందుమాకులవలన స్త్రీలదేహములో ఉండే రోగాన్ని వెలువరించే ధాతుశక్తి తగ్గిపోతుంది. ఇట్లు చెడిపోయిన తర్వాత ఒకొక్కపుడు మన వైద్యముకూడా పనిచేయదు.
ఈ సందర్భములో ఒక ప్రధానమైన విషయమును చెప్పకుండా వదలుటకు వీలులేదు. ప్రకృతియందుండే జీవజాలాన్ని చూచినపుడు ధాతుశక్తి మిగతాకాలాల్లోకంటే, తెల్లవారుఝామున ఎక్కువగా ఉంటుందని, మనకు తెలియుచున్నది. అందువలన సంగమక్రియకు తెల్లవారుఝామేమంచికాలమనిమానవుకను-

స్త్రీలలో ఉత్తమమయిన పద్మినీజాతి స్త్రీ రాత్రియందలి నాల్గవ ఝామునే ప్రధానముగా కోరుతుంది. ఈకాలమే గర్భధారణకు చాలా అనుకూలమైనది. మిగతాకాలములలో గర్భస్థమయిన శిశువుకన్న రాత్రి నాల్గవఝాములో గర్భస్థమయిన శిశువు బాగాఆరోగ్యముగా ఉంటుంది. దేహములో రోగపదార్థము కొద్దిగా ఉండి దేహములోని ధాతుశక్తి తగ్గిపోకుండా ఉంటే, వంధ్యాత్వము గల స్త్రీలకైననూ మనవైద్యము చేసినపుడు వంధ్యాత్వము నయమవుచున్నది. స్త్రీ సహజమైన సంతాన వాంఛ మనవైద్యమువలన సఫలీకృతమగుచున్నది.

దాంపత్య మవలంబించిన తర్వాత, ఒకామెకు 8 సంవత్సరముల వరకు, సంతానము కలుగలేదు. గొప్పగొప్ప వైద్యులందరిని సంప్రదించినది. యేమీ లాభము లేకపోయినది. చిట్టచివరకు, నావద్దకు సలహాకు వచ్చినది. ఆమెఉదరములో, అమితముగు రోగపదార్థము చేరియున్నదనియు, ఆరోగపదార్థమున్నంతవరకు, సంతానము కలుగదనియు, రోగపదార్థము పోయిన యెడల ఆమెకు తప్పక సంతానము కలుగుననియు, నేను చెప్పితిని. దినమునకు 2, 3, కటిలింగ స్నానములు చేయిస్తూ ఉద్రేకము లేని సహజపథ్యమును యిచ్చుచుంటిని. కృత్రిమముగాని సహజ జీవనము ఆమె అవలంబించుచుండెను. కొన్ని మాసములకు, ఆమె దేహమునందలి రోగపదార్థమంతయు, క్రమముగా వెడలిపోయెను. తర్వాత ఆమె గర్భము ధరించి, నాకాసంతోషవార్త తెలియ చేసెను. మన వైద్యము వలననే ఆమెకు సుఖప్రసవము ను ఆరోగ్యవంతమైన సత్సంతానమును కలిగెను.

పాలులేకుండుట, చనుకుదురు:— అత్యుత్తమమును ఆరోగ్యవంతము నగు శిశు ఆహారము తల్లిపాలే. యిట్టి ప్రధాన అవయవమును గురించిన విజ్ఞానము యెందరకో మృగ్యముగా నుండును. అందువల్లనే ఉత్తమజాతికి ప్రధానమైన యీ పాల విషయము అనేకమంది విస్మరించుచున్నారు. యెంతోమంది తల్లులవద్ద తమ బిడ్డలను పోషించే పాలులేకుండా పోయినవి. నిజము చెప్పవలెనంటే అట్టి తల్లులు సంతానోత్పాదనకే పనికిరారు. జంతువులయందు చెప్పుటను బిడ్డలను పోషించుకోలేని తల్లులులేవు. వానివద్ద బిడ్డలకు సరిపోయినపాలు సమృద్ధిగా ఉంటున్నవి. పాలిచ్చుటచేత నే తల్లి పొదుగులోకూడా పుండు పుట్టుటలేదు. మానవ స్త్రీలలో చనుకుదురు పుట్టుటకు యేదో కారణముండవలెను. గర్భధారణకు పూర్వమే యే స్త్రీ చనులు మిక్కిలి లావుగా ఉంటున్నవో, అట్టి స్త్రీలకే చనుకుదురు కలుగుచున్నది. అట్టివారికే పాలు లేకుండుటయు, తరుగుపడుటయు సంభవించుచున్నది, యువతులుగా నున్నప్పుడే, చన్నులులావగుట, స్వాభావికముకాదు. దేహమంతయు రోగపదార్థముతో నిండి యున్నది అని చెప్పుటకు గుర్తుగా మాత్రమే యీ చన్నులు లావగుచున్నవి. పల్లెటూళ్లలో ఉండే స్త్రీల చన్నులు గర్భధారణకు పూర్వమందును, గర్భధారణ కాలమందును, ప్రసవించిన తరువాతను, మిక్కిలి లావుగానుండక, చిన్నవిగాఉంటవి. అట్టివారు సుఖంగా ప్రసవించి, తమబిడ్డలకు సరిపోయినన్ని పాలు యివ్వగలిగి ఉందురు. కొంతమంది దేహములో ఉండే రోగపదార్థము యెండిపోవుటవలన, సన్నంగానుందురు. అట్టివారి చన్నులుకూడా శుష్కించియుండును. ఆ కారణముచేత

వారియందుకూడా, బిడ్డలను పోషించుటకు తగినపాలు ఉండుట లేదు. చనుకుదురు పోవుటకును, బిడ్డలను పోషించుటకు తగినన్నిపాలు తల్లులయందు కలుగుటకును, కటిలింగ స్థాన ములును – ఉద్రేకము కలిగింపని సహజపథ్యమును బాగుగా ఉపయోగించుచున్నవి. సన్నగా నున్నవారికి, బలము కలుగుటకొరకై యిచ్చే, టానిక్కులుగాని, బలకరము అని తలంపబడే, మాంసము గుడ్లు మొదలగు ఆహారములుగాని, తల్లియందలిపాలను వృద్ధిచేయలేక పోవుచున్నవి. తల్లి ఆరోగ్యము నానాటికి చెడిపోవుచున్నది.

ఒకతల్లికి అదివరకు యిద్దరు సంతానముకలిగిరి. ఆమెకు బిడ్డలను పోషించుటకు తగినన్నిపాలు లేవు. మూడవసారి కాన్పుకు వచ్చినపుడు నాతో సంప్రదించి ప్రసవించుటకు ముందు, తొట్టివైద్యము కొంతకాలము చేసెను. ఆ కాన్పునకు ఆబిడ్డకు సరిపోయినన్నిపాలు లభించెను. నా అనుభవములో యిట్టి వృత్తాంతములెన్నియో తటస్థించెను. యెంతోమందికి చనుకుదురుకూడా మానినది. అందు ఒక్కరి వృత్తాంతము మాత్రము వివరించెదను. ప్రసవించిన తర్వాత కొన్నివారము లలోనే ఒకామెకు చనుకుదురు కలిగెను. వారింటివైద్యుడు చన్నును ఛేదించి లోపలి దుర్మాంసములను తీసి వేస్తానన్నాడు. ఆమె కావిషయము నచ్చలేదు. అందువలన ఆదినము చీకటిపడిన తర్వాత నన్ను సంప్రదించినది. శస్త్రము చేయుట వలన మేలుకు బదులుగా అపాయము సంభవించుననియు, శస్త్రము కంటె సులభమైన పద్ధతిలో తక్కువకాలములోనే ఆమె చను కుదురు మాన్పెదననియు చెప్పితిని. ఆమె సంతోషముతో

నేచెప్పినట్లు చేసినది. పారెన్‌హీటు 50 డిగ్రీల చల్లని నీటిలో ఆరాత్రి 30 ని॥ పరిమితిగల దీర్ఘములగు లింగస్నానములు 4 చేయించితిని. మర్నాడు ఆమెస్థితి తేటగానున్నది. ఇంకాకొన్ని దినాలు జరిగేటప్పటికి బాధలు అదృశ్యమైనవి. ఇంకా కొన్ని వారాలు అగునప్పటికి ఆమె ఉదరము నందలి రోగపదార్థ మంతా వెడలిపోయి ఆమె ఆరోగ్యము బాగుపడినది. మందు వైద్యుల చేతులలో రోగము నయముకావడం యెంతబూటకమో; మనవైద్యము వలన రోగం తప్పకుండా నయము కావటం ఎంత సహజముగా నున్నదని పై వృత్తాంతము వలన ఋజువగుచున్నది.

బాలెంతరోగము:—దీనికే సూతికా జ్వరమనిపేరు. ప్రతిసంవత్సరము, వేలాది తల్లులు యీబాలింత రోగమునకు బలియగుచున్నారు. ఇంతవరకు వాడుకలోనున్న మందువైద్యము దీని తాకిడికి ఆగలేకుండా నున్నది. దయారహితముగా అనేకమందిని తనపొట్టను బెట్టుకొనుచున్న యీరోగం పేరు చెప్పినంతనే, అనేకమంది తల్లడిల్లి పోవుచున్నారు. బాలింత రోగము వచ్చిందంటే - దేహములో అమితంగా రోగపదార్థము చేరిఉండి అందు తీవ్రమయిన మండము పుట్టినదని అర్థము. ఎవరిదేహములో ప్రసవా నంతరము యెక్కువగా మాలిన్యములు మిగిలిపోతవో, వారికే సూతికా జ్వరమువస్తుంది. అందువలననేగర్భాశయములో శేషించిన ప్రసవసంబంధమైన మాలిన్యములు గర్భకోశమున వేడిమిని పుట్టించి తద్వారా ఉదరము నందలి మాలిన్యములలోకు -ఆ- అమితమండము కలిగి తీవ్రమగు జ్వరము

వచ్చుచున్నవి. దేహములోని మాలిన్యాలు వెలువరిస్తే బాలెంత రోగము మానుతుంది.

దీర్ఘములగు చన్నీటి లింగస్నానముల వలన, ఉదరమునందు, మండము తాత్కాలికముగా తగ్గి క్రమంగా రోగపదార్థము వెడలి పోవుచున్నది. అందువలన వెంటనే, బాలింతరోగం ఉపశమించి క్రమంగా పరిపూర్ణారోగ్యము కలుగుచున్నది.

ఒకామె సుఖముగా ప్రసవించినది. మర్నాడే తీవ్రమగు బాలింతరోగము కలిగినది. మంత్రసాని ఆమె ఉదరమునకు, వేడి నీటికాపడము, పెట్టినది. దానివలన లాభము లేకపోయినది. ఉదరమునందు మండిపోయే వేడి ఉన్నదనియు, చన్నీటితో చేసిన ఉపశమన స్నానములవలన, ఆమె ఉదరమునందలి రోగ పదార్థమునందు గల మండము తగ్గి సూతికాజ్వరము నయమవు నని, నాకు తెలియును. కాని యీ చన్నీటి చికిత్స ఆమె చేస్తుందో లేదోనని నేను సంశయించాను. నేను యీచికిత్స చెప్పితే, ఆచికిత్సా ఆమె చేయుటానికి ఒప్పుకున్నది. 15- మొదలు 30 ని॥ పరిమితిగల లింగస్నానములు ఫారెన్‌హీటు 64 డిగ్రీల చల్లనినీటితో దినమునకు 3, 4 చొ॥ నియమించితిని. అప్పుడునీటి చల్లదనము 50 డిగ్రీలుమాత్రమే ఉండెను. నీటిని వేడిచేయుట, ఆమెకు కష్టమనిపించెను. అందువలన-తోడిననీరు తోడినట్లే తొట్టెకిపోసి స్నానములు చేసినది. కీడేమీ జరుగ లేదు, సరిగదా రోగముయింకా తొందరగ నయమమైనది. దేహములోఉండే రోగనివారకశక్తి తగినంత ఉన్నంతవరకూ తొట్టెస్నానమునకు వాడే నీరు యెంతచల్లగా ఉంటే అంత

మంచిది. అయితే రోగికి సుఖముగా ఉండుటకుమాత్రమే నీటిని వెచ్చచేయమన్నాను. 18 గంటలలోనే జ్వరము తగ్గి అపాయము తప్పిపోయినది. ఇంకొక వారము చికిత్సచేసిన తర్వాత ఆమె తన పనులను తిరిగి చేసుకొనగలిగెను. ఈ సందర్భములో కూడా లింగస్నానములు యెంత అద్భుతముగను, త్వరగను పని చేయునో తెలియుచున్నది. ఇతర రోగము లన్నిటియందువలెనే బాలింతరోగమునందును, మనవైద్యము అద్భుతముగా పనిచేసినది. ఇంకా కొంతకాలము తొట్టివైద్యము చేసేటప్పటికి ఆమె ఉదరమునందున్న రోగపదార్థమంతా మల మూత్ర స్వేదాలుగా వెడలి పోయినది. అందువల్ల ఆమెకు పరిపూర్ణారోగ్యము కలిగినది. మందువైద్యులు మనము చేయించినవైద్యానికి ప్రత్యక్షంగా విరుద్ధమైన చికిత్స చేయించేవారు. మనము ఉదరము చల్లబరిస్తే మందు వైద్యులు మంచుగడ్డల సంచులతో తలకాయను చల్లబరిచేవారు. మనము ఉదరానికి చన్నీటి చికిత్స చేస్తే, మందువైద్యులు వేడినీటి కాపడమునుపెడతారు. మందు వైద్యులు యే ప్రదేశములో రక్తము యెక్కువగా చేరరాదో అట్టి తలకే మంచుగడ్డ సంచులుకట్టి రక్తాన్ని ఆవంకకు యెందుకు ఆకర్షిస్తారో నేను ఊహించలేకుండా ఉన్నాను. అంతే కాకుండా దేహములోనుండే మురికిని ఉదరమునందుండే మల మూత్ర కోశాలు వెలువరిస్తవి. తలలోనికి రోగపదార్థాన్ని ఆకర్షిస్తే అక్కడ దేహములోని మురికిని వెలువరించే అవయవాలేమి ఉన్నవి? తల యెప్పుడయితే చల్లబరిచినామో అప్పుడే తలలో ఉండవలసిన వేడిమి నిలిపేటందుకు హృదయము యెక్కువగా స్పందిస్తుంది. అందువలన లోపల అమితమైన

వేడిమి పుట్టును. లోపల మండిపోయే వేడి ఉంటే తలమాత్రము చల్లగా ఉంటుంది. అందువల్లనే యీ శీతోష్ణాల అమిత తేడా వలన ఒకప్పుడు ప్రాణాపాయం వస్తుంది.

ప్రసవించిన మరునాడే ఒకామెకు బాలింతరోగం వచ్చింది. ఆమెకు పెద్దపెద్ద డాక్టర్లు యెన్నిమందులిచ్చి చికిత్స చేసినా ఆమె జ్వరము తగ్గలేదు. 7 రోజులయ్యేటప్పటికి ఆమెకు సంధి పుట్టినది. వైద్యులకు భయము వేసినది. నాకు టెలిగ్రాం యిస్తే నేనా రోగిని చూచుటకు వెళ్ళితిని. నేను చూచేటప్పటికి ఆ రోగి యీ దుస్థితిలో ఉన్నది. మొట్టమొదట అంతర్గత మయిన కాలిక జ్వరాన్ని తగ్గించాలి. దీర్ఘములయిన అనగా 1టి.- 1 గంట పరిమితిగల లింగస్నానములు కొద్దిగా చేయించే టప్పటికి ఉదరమునందలి అమితమగు వేడిమి తగ్గినది. దానితో సంధి పోయినది. రోగికి స్మృతి కలిగినది. ఈ కొలదికాలము లోనే ఆమె ఉదరము నందలి రోగపదార్థమంతయు పోలేదు. అయినప్పటికి అపాయము తప్పిపోయినది. ఇంకా కొంతకాలము తొట్టివైద్యముచేసి పథ్యము అవలంబించినది. అందువలన ఆమె ఆరోగ్యము బాగు పడినది. మాఊరిలో ఉండే ఆమె బంధువుల వల్ల ఆమె క్షేమవార్త తెలిసినది.

---

# 3. అపాయములేని సుఖప్రసవోపాయము

నిరంతరాయంగా కలుగుతూఉండే మార్పులమధ్య ప్రతిజీవీ ప్రవర్తింపవలసినరీతి యెట్టి వికల్పాలు లేకుండా ప్రకృతిరనే నిర్దేశించినది. మానవునితోడి పొత్తువలన చెడిపోక సహజ జీవనముచేసే జంతువులు బిడ్డలను యెట్లు కనుచున్నవో చూద్దాము, ఒకపిల్లి, కుక్క, సీమకుందేలు మొదలగు జంతువులు తోటిజంతువుయొక్క సహాయం లేకుండానే బిడ్డలను కనుచున్నవి. ప్రసవము యెక్కువ కాలము పట్టటంలేదు. అవి పెద్దబాధలు యేమీపడకుండానే ప్రసవించుచున్నవి. రాబోయే ప్రసవాన్ని గురించి ముందుగా అవి భయపడుచున్నట్లుకూడా కనపడదు. మానవజాతిలో ప్రసవమంటే పునర్జన్మగా ఉంటున్నది. అట్టి ప్రసవము జంతువులలో బాధలుగాని అపాయముగాని లేకుండా సుఖముగా జరిగిపోతున్నది. ప్రసవమువలన కొత్తరోగాలు యేవీ రావడంలేదు.

ఆ జంతువులను శ్రద్ధగా పరిశీలన చేసినపుడు ప్రసవించిన ఉత్తరక్షణమునుండియు, అవి యేమీ జరుగనట్లే తమకు సహజమైన పనులలోనికి పోవుచున్నవి. బిడ్డనుగూర్చి ప్రేమ తప్ప, వానియందు యే దోషములు కాన్పింపవు. ఆరోగ్యవంతమైన జంతుజాలమంతయు యిట్లేఉన్నది. ఒక కుందేలు 2 పిల్లలను ప్రసవించినది. ఇంతలో ఒక వేటకాడు వెంటపడినాడు, ఆ కుందేలు పరుగెత్తినది. _ వేటగానిగుండు ఆ కుందేలు కడుపులో నుంచి దూరిపోయినది. ఆ కుందేలు కడుపులో బిడ్డయింకా బ్రతికియే ఉన్నది. 2+1 మూడు పిల్లలను వారుపెంచినారు.

మానవ స్త్రీలు సుఖంగా ప్రసవించడం అరుదు. కష్టంగా ప్రస వించడం, అకాల ప్రసవాలు, గర్భధారణ కాలంలో వస్తూ ఉండే రోగాలు, బాలింతచావులు, మొదలగునవి, కారణము లేకుండారావు. మంత్రసాని లేకుండా, ప్రసవము జరుగుట అపురూపంగాఉంది. ఇప్పుడు అన్నీ అసహజ ప్రసవాలే. మంత్రసానులు – దొరసానులు, లేకుండా జరుగుటయే లేదు. గర్భావయవాలు జారుతవేమో అనే భయంచేత, ప్రసవించిన లగాయతు యెంతోకాలము పక్కమీదనే ఉండవలసి వస్తుంది. సహజముగా జీవించే జంతువులలోలేని, భయము, బాధ, అపా యము, మృతి మొదలగునవి, మనుష్య స్త్రీలలో రావటానికి తప్ప కుండా ఒక కారణమున్నది. స్వాభావికంగా ఉండేనియమాలకు భిన్నమైనజీవితము అనుసరించుట చేతనే యీబాధలన్నీవస్తున్నవి. మార్పుచేయుటకు వీలుగాని ప్రకృతి సూత్రముల ఉల్లంఘించి నందు వలననే మానవజాతికి యీదుఃఖము సిద్ధమవుచున్నది. బిడ్డ పుట్టేటప్పటికి, యేఅవయవము, బలహీనముగా ఉంటుందో ఆ అవయవములోనే క్రమ క్రమముగా రోగపదార్థము చేరుతూ ఉంటుంది. అందువలననే తల్లిదండ్రులకుండే వ్యాధులే బిడ్డలకువస్తవి. ప్రకృతి వైద్యమువలనను, స్వాభావిక జీవనము వలనను, దేహమునందలి రోగపదార్థము, వెడలిపోవుచున్నది. దానితో దుర్బలముగాఉండే అవయవాలు బలపడతవి. తర్వాత కొత్తగా రోగపదార్థము చేరకుండాఉంటే, బిడ్డలు ఆరోగ్యంగా. ఉంటారు. దానితో జాతిబలపడుతుంది. తల్లిదండ్రుల దేహాలు యెంతరోగగ్రస్తమైనవో, బిడ్డలదేహాలుకూడ అంత రోగ గ్రస్తమవుతవి; ఇట్లా క్రమక్రమంగా జాతి దుర్బలమై పోతుంది.

గర్భధారణమాత్రమునను, సంతానం కనుటచేతను ఒక్క మనుష్య స్త్రీలుతప్ప, ప్రకృతి యందుండే యే జంతువుకూడ సౌందర్యము కోలుపోవుటలేదు. ఒక్క మానవ స్త్రీ మాత్రమే ఒక్క సంతానం కనేటప్పటికి అందవికారం అగుచున్నది. పొట్టకూడా చాలలావు అవుతుంది. ముదిమి వస్తుంది. ఎంతో మంది స్త్రీలు మంచిఆహారం తినగలిగినా, ఆరోగ్యవంతమైన గృహాలలో ఉండగలిగినా, వరుసగా 4, 5 గురు సంతానం కనేటప్పటికి చూచుటకు వీలుగాని అసహ్యమగు రూపమువస్తుంది. ఈ అందవికారానికి ముదిమికి కారణము గర్భధారణము, ప్రసవము, పిల్లలకు పాలిచ్చుటయే అని అనేకమంది అపోహ పడుచున్నారు.

దీనికంతకును, ఒక్క ప్రత్యక్షమైన కారణమున్నది. ఒక్క మానవ జాతిలో తప్పితే గర్భముధరించిన యే స్త్రీ జంతువు, తిరిగి పురుషజంతువుతో సంగమము చేయదు. పురుషజంతువు సమీపిస్తేనే కాండ్రమని యెదురుతిరుగుతుంది. ఇది సహజ సిద్ధమైన విషయము. సంతానము కొరకై సంగమము చేయవలెనేగాని యింద్రియముల తృప్తికొరకై మాత్రమే సంగమము చేయరాదు. సంగమ కాలమున దేహములోని రక్తము ప్రచండ వేగముతో జననేంద్రియముల వంకకు పరుగెత్తును. గర్భము ధరించిన స్త్రీ ఉదరమునందలి పిండమున కారక్తపు దెబ్బతగిలి దాని అభివృద్ధికి హానిచేయును. గర్భస్థమైన పిండమును రక్షించే ప్రయత్నములో ప్రకృతియే తల్లికి అపకారం చేస్తుంది. సహజమయిన యీనియమాన్ని ఉల్లంఘించుటం

చేతనే మానవ స్త్రీ రోగగ్రస్తమై అకాలములోనే ముదిమికి వశమై దుర్బలు రాలగుచున్నది. అసంఖ్యాకములుగా నుండే స్త్రీవ్యాధులకు ఆమె లోనగుచున్నది.

గర్భధారణవలన వస్తూ ఉన్నవనుకునే, వేవిళ్ళు, దౌర్బల్యము, పంటినొప్పి, జ్వరము, విసుగు, అన్నహితవు లేకపోవడం, ఆకలి లేకపోవడం, అజీర్ణము, మలబద్ధకము, మొదలగు వ్యాధులకు, కూడా గర్భధారణ కాలంలో చేసిన సంగమమే కారణమై యున్నది. పితీ్రయంగా సంక్రమించిన, లేదా అసహజజీవనము వలన దేహములో చేరిన రోగపదార్థము చేతకూడా, యీ బాధలు వస్తవి. గర్భధారణమైనంతనే సహజముగానే స్త్రీకి సంప్రయోగమునందు, అసహ్యము పుడుతుంది. పురుషుల దేహాలు అమితముగా రోగపదార్థంతో నిండి ఉండటంచేత, అసహజమైన సంగమేచ్ఛకు లోనై ఆమె యిష్టాన్ని లెక్కచేయకుండా, అసహజమైన సంగమక్రియకు ఆమెను లోను చేయుచున్నారు. క్రమంగా ఆమెలో ఉండే సహజపరిజ్ఞానం దుర్బలమైపోయి, గర్భధారణ కాలంలో సంగమక్రియ చేస్తేనేగాని ఉండలేని, అసహజవాంఛకు లోనగుచున్నారు.

ఒక్కమందలో ఉండే పశువులలో యేదైనా ఒకజంతువు గర్భధారణమైనతర్వాత, యీనేలోపల పురుషజంతువుతో కలిస్తే ఆతడు వెంటనే ఆడజంతువునకు వాతం చేసినదని కనిపెట్టి దానికి వాతలు వేస్తాడు. నిశ్చయంగా మానవుల్లోకూడా యిట్టి కోర్కె కలిగితే దానికి రోగమే కారణమని స్పష్టముగా తెలిసికొనవలెను. క్షయరోగులలో అమితమగు సంగమేచ్ఛ ఉండటం

సర్వజన విదితమేగదా ! నేటిమానవులలో కన్పించే కళ్ళెము లేని నియమరహితమైన సంగమేచ్ఛకును, ఆరోగ్యవంతుని మితమైన నియమవంతమైన సహజమగు సంగమేచ్ఛకును, యెంతో తేడా వున్నది. అతని కామేచ్ఛలో వుద్రేకము లేదు. మోహాములేదు. ఆతడు సంతానము కొరకై మాత్రమే సంగమము చేస్తాడు. కొంతకాలము సంగమము చేయక పోయినా అట్టివానికి యేవిధమైన బాధలు కలుగవు. సహజమైనవి, వుద్రేకరహితమైనటువంటి ఆహారములను తినుచూ సహజ జీవనము చేసే వారికిమాత్రమే ఆస్థితి అరమవుతుంది. ఎవరికి అసహాజమైన కోరికలులేవో, యెవరికి దేహేంద్రియాలు వశమై వుంటవో, యెవరికామము పరిమితమైన హద్దులో వుంటుందో, ఇతరుల కందరికీ యేది కష్టముగా ఉంటుందో, అట్టిబ్రహ్మచర్యము అతనికి సుఖదాయకము, ఆరోగ్య వర్ధకముగా ఉంటుంది. అట్టివాడు నేను చెప్పినట్లు ఆరోగ్యనియమాలను అవలంబిస్తే, వాని దేహమునందలి రోగపదార్థం నిశ్శేషముగా వెడలిపోతుంది. అతనికి క్రమంగా పరిపూర్ణ ఆరోగ్యమున్నూ కలుగుతుంది. సుఖశాంతులు అతనికి స్వాధీనముగా ఉంటవి.

నే డెచ్చట చూచినను అసహాజమైన ప్రసవాలు కనుపించుచున్నవి. అకాలములో ప్రసవించుటమేగాక, గర్భస్రావాలు కూడా చూస్తున్నాము. గర్భవివరములోనుండి వచ్చేటప్పుడు తల ముందుగా రావలెను. కాని కొంతమంది పిల్లల ముడ్డి

ముందరగ వచ్చుచున్నది. కొంతమంది ప్రక్కకు తిరిగి జన్మించు చున్నారు. కొంతమంది పిల్లల తలకాయ చాలా లావుగా ఉండి, తల్లి గర్భవివరములోనుండి తేలికగా బైటికిరాక, కృత్రిమ సాధనలచేత లాగవలసి వస్తున్నది. కొంతమంది బిడ్డలను ముక్కలుచేసి తీసివేయవలసి వస్తున్నది. తల్లి పొట్టకోసి బిడ్డను తప్పించవలసి వస్తున్నది. కొంతమందికి ప్రసవవేదన తగినంతరాక బిడ్డలు తల్లిగర్భములోనే మరణించుచున్నారు. ఈ విధంగా యెన్నో రకాలైన ప్రసవవైపరీత్యాలు వచ్చుటకు మాతృగర్భము రోగపదార్థముతో నిండియుండుటయు, అందు పెరిగిన బిడ్డదేహముకూడా, అమితముగా లావగుటయు యిందుకు కారణము. ప్రసవకాలములో, బిడ్డ సక్రమంగా రాకపోవటానికి, తల్లి దేహము రోగపదార్థముతో నిండియుండుటయు, గర్భధారణమైన మొదటినెలలో తల్లి అవలంబించే వృత్తినిబట్టి, అసహజమైన రీతుల నివసించుటయు కారణము. మాతృగర్భములో వున్నశిశువు తల్లికడుపులో వుండే రోగపదార్థపు వత్తిడివలన, వుండవలసిన రీతిని వుండక, బైటికి గెంటివేయబడుచున్నది. అక్రమ జీవనమువలన;గర్భాశయము స్థానంలోనుండక. బిడ్డ మాతృగర్భములో వుండవలసినరీతి మారిపోవుచున్నది. గర్భవివరము చుట్టూవుండే కండరములు అమితముగా లావై ప్రసవకాలములో సడలు వదలవలసినంతగా, గర్భవివరము విరివికానందువలనకూడా, ప్రసవము కష్టమగుచున్నది. తల్లి తండ్రిల దేహాలు రోగపదార్థముతో నిండియున్నపుడు వారికి కలిగే సంతానం, మాతృగర్భములో ఉండగానే, అమితముగా లావుఅవుతుంది. అందువలనకూడా కష్టప్రసవము వస్తుంది.

ఈ కారణములచేత గర్భధారణ కాలమునాటికే తల్లి తండ్రుల దేహాలు రోగపదార్థ రహితముగా నుండవలయును.

రోగపదార్థముతో నిండిన దేహమునందు, జననేంద్రియ సంబంధమైన కండరములందు సాగేగుణము తగ్గిపోతుంది. అందువలన ప్రసవ కాలములో ఆకండరాలల్లో అమితమగు బాధలు పుట్టును.

ఇందువలననే రోగగ్రస్తులయిన స్త్రీలు ప్రసవించ వలెనంటే యెంతో కష్టమవుచున్నది; సహజంగా ఆరోగ్యవతులు ప్రసవించినపుడు, యిట్టిబాధలుండవు. రోగగ్రస్తులయినవారికే ప్రసవ భయముండును. అది సహజమేను. దేహమును అక్రమంగా వినియోగించి నందువలన, ఆరోగ్యము చెడిపోవుచున్నది. అట్టి వారికే యిట్టిభయము కలుగుచున్నది. శస్త్రము కృత్రిమ యంత్ర సాధనలు లేకుండా ప్రసవమే సాధ్యంకాదు, అనేవారు యీక్రింది విషయములను, చదువవలసినది.

ఒకామెవయస్సు36సంవత్సరాలు. 2డవకాన్పు. అప్పటికే2పగళ్లు 2రాత్రిళ్లు ప్రసవవేదనపడినది, గర్భస్థమైనపిండము కదలిరాలేదు. వైద్యుని సహాయములేనిదే ప్రసవము జరుగదనియే ఆమె అభిప్రాయము. ప్రసవవిద్యలో ఒకశోధకుని పిలిచిరి. ఆతడు తన శస్త్రనైపుణ్యమును చూపించి 4 ఘంటలైన తర్వాత శిశువు గర్భములోఉన్న తీరు బాగుండలేదనియు, తల్లిప్రాణానికి ముప్పములేకుండా ఆ శిశువు బైటకిరావడము సాధ్యంకాదని నిర్ణయించినాడు. దైవనిర్ణయము వేరేఉన్నది. 24 ఘంటల తర్వాత అదేప్రసవవేదనతో ఆతల్లి ప్రసవించినది.అప్పుడక్కడ

ఉన్నమంత్రసాని సహాయం సరిపోయినది. ఈ విషయములో ప్రసూతిశోధకునికన్న ప్రకృతియే యెక్కువసహాయం చేసింది. కాగా ప్రసూతిశోధకుడు చేసిన శస్త్రముఊరికే పోలేదు. ఆ శస్త్రమువలన ఆమె తొమ్మిదివారాలు ప్రక్కమీదనుండి లేచుటకు వీలులేకుండా పోయినది. ఈ మధ్యకాలంలో ఆమెకు ప్రాణభయంకూడా కలిగినది. శస్త్రమువలన ప్రసవావయవాలు దుర్బలములైనవి. అయినా ఆమె తత్త్వము గట్టిదిగనుక ఆమెకు తిరిగి ఆరోగ్యము కలిగినది.

అసహజమైన జీవనానికి లోనై కాలికరోగాలతో బాధపడుతూ ఉండే, నేటిమానవులలో ప్రసవము బాధలతోకూడి యుండక, మానదు. అందుకు మందు వైద్యులుగాని, ప్రసవశోధకులుగాని అవుసరములేదు. అట్టి పరిస్థితులలో ప్రకృతికే వారిని ఒప్పచెప్పితే ఆమెయే వారిని భద్రముగా రక్షింపగలదు. ప్రసవవేదన వలన, కదలని ప్రసవావయవాలు దీర్ఘములగు లింగస్నానముల వలన బాగుగా కదలుతవి. ప్రసవవేదనను తగ్గించుటకు ఉదరమునకు మట్టికట్లు కట్టడం మంచిది. దానితో నెంతో బాధ తగ్గుతుంది. మన్ను కొంచెము మందముగా, ఒక్కగుడ్డమీదవేసి మట్టిపైపు పొట్టకును, మలుగులకును ఆనునట్లుగా చుట్టి దానిపైన కప్పునట్లుగా ఉన్నిగుడ్డను చుట్టబెట్టవలయును. ఉదరమునందలి వేడినిబట్టి ప్రతిగంటకును లేదా 2 గంటలకు, లోపలనున్న మట్టిని మార్చివేయుచుండవలెను.

కొలదికాలము ఓర్పుతో వేచియుంటే అయిపొయ్యే ప్రసవాలకు గూడా; తొందరపడి చేసిన శస్త్ర చికిత్సవలన నెంతో మంది

స్త్రీలు వెంటనే చనిపోవుచున్నారు. ప్రసవబాధ కలిగినంతనే తొందరపడి ప్రసవశోధకునివమనము పిల్చినప్పుడు, అతనిదృష్టి యెంతసేపటికీ శస్త్రముమీదనే వుంటుంది. ఈ శస్త్రమువలన స్త్రీలుఎంతో దుర్భర బాధకు గురియగుచున్నారు. ఇంతకన్న దయామయి అయిన ప్రకృతి యెంతో భద్రముగా ప్రసవాన్ని చేస్తుంది. శస్త్రచికిత్స చేస్తేనేగాని ప్రసవము కానట్టి దుస్థితి వచ్చిందీ అంటే దానికి స్త్రీయే బాధ్యురాలు. గర్భధారణ మైన సంగతి ఆమెకు తెలిసిన తర్వాత తొమ్మిది మాసములు గడచినగాని ప్రసవము రాదుగదా! యీ కాలములోనైనా ఆమె శ్రద్ధతీసుకుని నేను వ్రాసిన నియమాలను అవలంబిస్తే తప్పకుండా సుఖప్రసవమే కలుగుతుంది. స్వాధీనములో వున్న తొమ్మిది మాసాల కాలము వ్యర్థపుచ్చుకొని ఆ కాలంలో అవలంబింపవలసిన ఆరోగ్యనియమాలను అవలంబింపక మీదు మిక్కిలి అనారోగ్యమైన, అస్వాభావికమైన జీవిత పద్ధతులను అవలంబించినప్పుడే ఆమె కిట్టి దుఃఖము కలుగు చున్నది. ఈ తర్వాత కాలములో నెంతోమంది నా విధానము అవలంబించి నేను చెప్పిన సిద్ధాంతములను ధృవపరిచి యున్నారు. లింగస్నానములు చేయుచూ ప్రదేశికములేని సహజాహారమును పుచ్చుకొనుచూ తొట్టివైద్యము నవలంబించిన స్త్రీలు సుఖముగా ప్రసవించుచున్నారు. ఒక్కవిషయములోకూడా అపజయము జరుగలేదు. అఖండ భూమండలములో మనవైద్యము అవలంబించినవారెల్లా సుఖప్రసవమగుచున్నారు. సుఖ ప్రసవము, ఆరోగ్యవంతమైన సంతానము తమకు కావలెనని కోర్తే వారెల్లరు గర్భధారణానికి పూర్వమే తమ దేహములోనుండే

రోగపదార్థమును వెలువరించుకోవాలి. తరువాత తిరిగి రోగ పదార్థము చేరకుండా యీ గ్రంథమునందు చెప్పబడిన ఆరోగ్య సూత్రాలను అవలంబింపవలసినది.

ఒకామె మేహవాతముతో బాధపడుచుండెడిది. ఆమె కప్పటికే అయిదుగురు సంతానము. ప్రతితడవ 2, 3 దినాలు బాధపడితేనేగాని ప్రసవము కావడంలేదు. అమితకష్టమైన ప్రసవము. ప్రసవశోధకుడు వచ్చి ఫార్సెప్సు వాడితేగాని ప్రసవమయ్యేది గాదు. ఆరవతూరి గర్భధారణమైన తర్వాత తొట్టివైద్యమవలంబించి దినానికి 2. 3 లింగస్నానాలు చేసేది. అదివరకే చాలా కాన్పులు అయినమనిషికి ఈ కాన్పు ఇంకా కష్టముగా కావలసియుండగా అట్లుగాక చాలా సుఖముగా ప్రసవించినది. పురిటినొప్పులు క్రమక్రమంగా వృద్ధిపొంది ఒకగంటకాలమైనా పట్టకుండానే ఆమె సుఖముగా ప్రసవించినది. ఆరోగ్యనియమాలను అవలంబింపని స్త్రీలు ఈ విషయమును ఊహింపలేరు; పై చెప్పిన స్త్రీగూడా సుఖముగా ప్రసవిస్తుంది అని నేను చెప్పినపుడు ప్రసవబాధ తీసివేయటం ఎవరితరమవుతుందీ అనేది. ఆశ్చర్యకరముగా నీతూరి ఆమెబిడ్డకు సరిపోయినన్నిపాలు ఆమెవద్ద లభించినవి. వెనుకటి కాన్పులలో బిడ్డలను పోషించుటకు, ఆమెవద్ద పాలేఉండేవికావు. ఇప్పటికి సుఖముగా ప్రసవించటం ఎలాగో తనకు తెలిసినదనియు, అయినప్పటికీ తనకు వయస్సుమళ్ళినందున నీ వయస్సులో తనకు సంతానం కలుగదనియు నింతసుఖముగా ప్రసవము వచ్చేటప్పుడు ఇంకా కొంతమంది సంతానం కనుటకు తనకు తగినవయస్సు లేదు గదా అని ఆమె విచారపడినది. తొట్టివైద్యము చేస్తూ ఆరోగ్య

నియమాలను అవలంబించి ఉద్రేకములేని సహజాహారమును తినుచుండుట వలన ఆమె దేహములోనుండే రోగపదార్థము చాలా భాగము తగ్గిపోయినది. అందువలన ఆమె యందలి దైహిక మానసికశక్తులు వృద్ధిపొందినవి. అందువల్లనే సుఖముగా ప్రసవించినది. ఇట్లే యింకొక స్త్రీకూడా యేడుమాసములు మాత్రమే గర్భిణిగానున్న కాలములో తొట్టివైద్యము చేసి సుఖముగా ప్రసవించ గలిగినది. ఇంకొక ఆమెకూడా యిట్లే సుఖముగా ప్రసవించి, 1890 సంవత్సరం సెప్టెంబరు నెలలోనాకువ్రాసిన జాబుద్వారా తన కృతజ్ఞతనువెల్లడించినది.

"నావయస్సు 28 సంవత్సరాలు. నా పదిహేనవ యేటినుండి మూత్రపిండ మూత్రకోశ జబ్బులతో బాధపడుచున్నాను. అప్పుడు 8 మాసాలు టీ చికిత్సాలయములో చికిత్స పొందితిని. దాని వలన మూత్రకోశములో నుంచి భరింపవీలుగాని, శ్లేష్మ స్రావము కలిగినది. ఎక్కువ బాధగానుండుట వలన నిల్చుండుటకుగాని, నడచుటకుగాని వీలుగాక ప్రక్కమీదనే పడియుండ వలసి వచ్చెడిది. ఇట్లు నాల్గువారాలు జరిగినది. తర్వాత, యల్, వీధిలో నింకొక చికిత్సాలయములో చాలా దినాలు చికిత్స చేయించుకుంటే ఆ బాధ తాత్కాలికముగా ఉపశమించినది. రోగ మూలకారణమునకు నెవరూ చికిత్స చేయనందున ఒక్క సంవత్సరానికే ఆవ్యాధి యింకా తీవ్ర రూపముతో ప్రత్యక్షమైనది.

అప్పుడు చం, డిడ్జిలో నుంటిని. అక్కడ నున్న ఆసుపత్రిలో 3 మాసాలు చికిత్స చేసినారు. సైలిక్ యాసిడ్, సైలిసిలిక్

యాసీడ్, లునార్ కాస్టిక్, కట్లు, విద్యుచ్ఛక్తులను వాడినారు. ఫలము కనపడలేదు. రోగము నయము కాలేదు. 1880 వ సంవత్సరం మేప్రియల్ నెలలో నేను లీప్‌జిగ్‌నకు వెళ్లినాను. తిరిగి ఆసుపత్రికి పోవలసి వచ్చినది. అక్కడ 4 వారాలు గర్భాశయ రోగానికి చికిత్స చేసినారు. అదియు కుదరలేదు. ఆసుపత్రి నుంచి యింటికి యెప్పటికైనా పోతానా? అనిపించేది, మార్గము, తోచేది కాదు. ఆసుపత్రిలో అంత బాధలు పెట్టేవారు. ఏ విధమైన ఆశా కనబడక, ఆసుపత్రి వదలిపెట్టి, లీప్‌జిగ్‌లోని డాక్టరు యమ్, గారివద్ద చికిత్స పొందితిని. అతడు మూత్రకోశమునుండి వచ్చే శ్లేష్మ స్రావాన్ని నయము చేసినాడు. గర్భాశయము నందలి మంటలను తగ్గించినాడు. తర్వాత 3 సంవత్సరాలు వరుసగా ఫ్రామెజన్ సుబేద్ పంపినాడు. అక్కడ ఉండే లోహ జలములలో స్నానము చేసి ఆనీరే త్రాగి అందులో ఉన్న మట్టితో దేహమును రుద్దుకునే దానను. దీనివలన కూడా రోగము శాశ్వతముగా, నయము కాలేదు. చివరసారి ఆయూరు నేను వెళ్ళినప్పుడు, అక్కడనున్న వైద్యుడు శస్త్రము చేయించుకొనుటకై నన్ను లీప్‌జిగ్‌నకు వెళ్ళమన్నాడు. లీప్‌జిగ్‌లో డాక్టరు యల్‌గారు, శస్త్రముచేసిరి. అప్పటికి నాబాధ కొంచెము ఉపశమించినది. అప్పటికీ నారోగముయొక్క మూలకారణము పోలేదని, శస్త్రముతో ఆరోగం లోపలనే అణచిపెట్టబడినదని నాకు తెలియుచునే యుండెను. అప్పుడు కూడా, బాధోపశమనం కొరకు కట్లో యేవో చేసుకోవలసియే వచ్చేది. రోగము తిరగబెట్టినది. లీప్‌జిగ్‌లో, డాక్టరు జడ్‌వద్ద ఒక్క సంవత్సరము చికిత్స పొందితిని.

ఏమీా ఫలము కన్పడలేదు. ఆ వైద్యుడు నామూత్రపిండము అంతరాళములో తేలి యాడుచున్నదనియు దానికి చికిత్స లేద నియు తెలిపెను. అయినను, డాక్టరుయన్ గారిని, సంప్రతించుమనెను. అతడొక వారంనన్ను బాగుగా పరిశోధించి, చిట్టచివరకు నా రోగము నయముకాదని నిర్ణయించి నన్నుపంపివైచెను.

అన్నివిధాలా నిరాశపొంది 2సంవత్సరాలకిృందట జులయి నెలలో మీావద్దచికిత్స మొదలిడినాను. మొదటి 2 దినాలలోనే భరింప సాధ్యముకాని నాబాధలు ఉపశమించినవి. 4వారాలలో నేనుతిరిగి పనిచేసుకోగలిగితిని; ఈ చికిత్సవలన నిప్పటివరకును నేను ఆరో గ్యము, బలము, కలిగిఉన్నాను. అనేకమంది వైద్యులు గర్భ ధారణము అయితే ప్రసవము కాలేక చచ్చిపోతావని భయ పెట్టుతూ ఉండినా, యింకా యెంతోమంది నన్ను నివారిస్తూ ఉండినప్పటికి, ఒకసంవత్సరము తొట్టివైద్యము చేసినతర్వాత నేను వివాహామాడితిని. తమసలహోపకారము నా అనుభ వాన్ని తోడానర్చి యిట్లుచేసితిని, తాము ముందుగా సెలవిచ్చి నట్లే జరిగినది. నేను వివాహామాడితిని. గర్భధారణమైనది. మీారు బోధించినట్లే అప్పుడు ప్రవర్తించితిని. అందువలన సుఖముగాను, భద్రముగాను ప్రసవించితిని. అద్భుతమైన యీా ఫలితము సరళమైన తమ చికిత్సావిధానమువలన నాకు లభించినది”

ఇట్లు లీప్‌జిగ్, నివాసి లూసే బీ.

# ౮. బాలెంతరాలు.

ఆరోగ్యవతి అయిన స్త్రీ ప్రసవించిన తరువాత యెలా ప్రవర్తించాలో యెవరూ చెప్పనక్కరలేదు. సహజంగా జీవించే జంతువులే కాకుండా, నాగరికత యెరుగని పల్లెటూరి యువతులు, ప్రసవించినతోడనే తమ పనులను, నెరవేర్చుకొనగలిగియుంటున్నారు. నాగరికులయిన స్త్రీలు ప్రసవించిన తర్వాత చాలా దినములు పక్కమీద పరుండవలసి వచ్చుచున్నది. పూర్వము బాలెంత, తొమ్మిది దినములే పురిటిపక్కమీద పరుండేది. ఇప్పుడు చాలామంది వైద్యులు బాలెంతను 12 దినాలు పరుండవలె ననుచున్నారు. ఆమె జననేంద్రియములు సహజస్థితికి మారుచుకొనుటకు యిప్పుడు యెక్కువకాలము పట్టుచున్నది. అందువలన ఆమె దేహములో బలమున్నాకూడా వైద్యులు ఆమెను 12 దినములు పురిటిపక్కమీద పరుండవలె ననుచున్నారు. ఇందువలన జీర్ణక్రియ దుర్బలమగుచున్నది. మలబద్ధకమున్నూ పుట్టుచున్నది. జననేంద్రియాలు సహజస్థితికి రాకపూర్వమే, లేచి తిరగడంకూడా మంచిదికాదు. అందువలన ఉదరము లావవుతుంది. పిల్లలుగన్న తల్లులయొక్క పొట్టలు, యిట్లే లావవుచున్నవి. బాలెంత చాలా దినాలు పురిటి పక్కమీద పరుండకుండా చేయటానికి బాగా ఆలోచించినాము. అందుకొక ఉపాయముకూడా కనిపెట్టినాము.

ప్రసవించినతోడనే ఆయాసము తీరువరకున్నూ, విశ్రాంతి తీసుకొనవలయును. కొలదికాలము నిద్రించిన మంచిది. తర్వాత దేహమంతయు నులివెచ్చని నీటితో కడిగి, లింగస్నానము చేయవలయును. నీటి చల్లదనము ఫారెన్ హీట్ 73, 77 డిగ్రీలలో ఉండవచ్చును. లింగస్నానము చేసేటప్పుడు, పీటమీద 3 అంగుళాల నీరుండవలెను. తర్వాత యీప్రక్క పుటలోని



వ డి క ట్టు

బొమ్మలో చూపినట్లు నడికట్టు వేయవలెను. నడికట్టు వేసేగుడ్డ, ముతుక ఖద్దరు బట్టగా ఉంటే మంచిది. దాని చివర ముడి వేసేటందుకు బద్దెకు -ఒ- ఉండవలెను. ఒక చివర తలుపు; కడియానికిపెట్టి 2 డవ వైపునుంచి ఉదరముచుట్టునూ, చుట్ట వలెను. వస్త్రమంతయు చుట్టినతర్వాత, చివరబద్దెతో నడికట్టును, బిగించవలెను. ఇందువలన ఉదరములోపలి అవయవములు, గట్టిగా వత్తిఉంటవి. ఒంట్లో ఓపికగాఉంటే పక్కవదలిపెట్టి, తిరుగ వచ్చును. పొట్ట పచ్చిగాఉంటే 3, 4, దినాల వరకు కట్టుట ఆప వచ్చును. తర్వాత, 3, 4, వారాల వరకు కట్టు కట్టితే చాలును. ఇతర బాధలేమీ లేకపోతే యీకట్టు ఒకటేచాలు. జ్వరము, మొదలగు లక్షణాలు కనపడితే ఒక మట్టికట్టు, తర్వాత 3, 4, గంటలాగి ఒక లింగస్నానము, తర్వాత 3, 4, గంటలాగి ఒక మట్టిపట్టీ, యీ విధముగా చేస్తూ ఉండవలసినది. ఇట్లు చేయుట వలన దేహామునకు చెమట పోయును. ఉదరములో వేడి తగ్గును. దేహారోగ్యము వృద్ధి పొందును. తల్లికి పాలు ఊరినప్పటి నుండియు, బిడ్డకు పాలివ్వ వచ్చును. ఎక్కువగా తింటే పాలూ రతవని భ్రాంతిపడి పాలులేని తల్లులు అవ్యక్తంగా ఆహార పానీయాలను యెక్కువగా వాడుతున్నారు. దాని వలన పాలు వృద్ధికావు, తగ్గిపోతవి. సహజ నియమాన్ని అనుసరించి, ఆకలి దప్పులు ఉన్నపుడే, ఆహార పానీయములను పుచ్చుకొన వలసినది. సహజమైన ఆహార పానీయముల వలననే తల్లి దేహారోగ్యము వృద్ధి పొందుతుంది. ఆమె దేహము ఆరోగ్యముగా ఉంటే ఆమె వద్ద బిడ్డకు కావలసినన్ని, మంచిపాలు ఊరుతవి.

# ★ శిశువులను పెంచుట

ప్రకృతిని పరిశీలించినపుడు, శిశువుపుట్టినతర్వాత చాలాకాలము వరకునూ తల్లికి బిడ్డకు చాలా దగ్గరసంబంధము ఉంటుంది అని తెలియుచున్నది. శిశువు దేహానికి కావలసిన వేడిమి; తల్లి నుండియే లభింపవలెనుగాన బిడ్డ తల్లిప్రక్కలోనే పరుండవలెను. చాలా మంది, బిడ్డ పుట్టినప్పటినుండియే దానిని తల్లిప్రక్కలో కాకుండా, వేరొక ప్రక్కమీద పిల్లను పరుండబెట్టుచున్నారు. ఇందువలన బిడ్డ ఆరోగ్యాన్ని వృద్ధిచేసే వేడిమి బిడ్డలకు లభించకుండా పోవు చున్నది.

ఒకప్పుడు నన్నొక యింటికిపిల్చిరి. ఆ యింటిలో ఒక బిడ్డపుట్టి 3 వారములయినది. సుఖముగా పడుకోదు. నిద్ర పోదు. దాని జీర్ణక్రియకూడా చెడిపోయినది. తల్లి తండ్రులు చాలా ఆందోళన పడుచున్నారు. దినమునకు 3 తొట్టిస్నానాలు చేయించి, వెచ్చని తల్లిప్రక్కన పరుండబెట్టుటచేత, ఆబిడ్డ ఆరోగ్యము వృద్ధిపొందినది. సుఖముగా నిద్రకూడా పోయినది.

ఇప్పుడు చాలామంది తల్లులవద్ద బిడ్డకు కావలసినన్నిపాలు లేవు. అందువలన వారి బిడ్డలు సంపూర్ణంగా వృద్ధిపొందక, బక్క-చిక్కి ఉంటున్నారు. తల్లిపాలు దొరకనపుడు, ఉత్తమమైన ఆహారము దాదిపాలే. ఈ కాలములో ఆరోగ్యవంతమైన దాది కూడా దొరకటం దుస్సాధ్యంగా ఉన్నది. రోగిష్టిదాదివద్ద పాలుత్రాగిన బిడ్డదేహములో నానాటికి రోగపదార్థము చేరుతూ ఉంటుంది, అదివరకున్న రోగపదార్థానికి ఇదితోడై మరింత రోగగ్రస్తులగు చున్నారు.

ముఖనిదాన శాస్త్రమువలన దాది ఆరోగ్యముగా ఉన్నదీ లేనిదీ చెప్పవచ్చు, కాని యిప్పుడు పరిపూర్ణారోగ్యముగల దాది యెచ్చటనూ దొరుకుటలేదు. ఇప్పుడు శిశువులకిచ్చే ఆహారాలు క్రమంగా తయారుచేసినవికావు. సరిగా యెన్నుకోక వాడిన పాలవలన, బిడ్డఆరోగ్యము చెడిపోవుచున్నది. బిడ్డకు ఆవుపాలిచ్చినపుడెల్లా వాటిని వేడిచేయకుండాను, మరగకాచకుండాను యివ్వవలసినది. కాచినపాలు, పచ్చిపాలకంటే కఠినముగా జీర్ణమవుతవి. పాలలోఉండే సూక్ష్మజీవులను చంపుటకొరకై యిట్లు పాలను కాచినపుడు పాలల్లో ఉండే పోషక శక్తులు నశించి పోతున్నవి. సులభంగా జీర్ణమయ్యే ఆహారాలే దేహానికి యెక్కువ పోషక శక్తులను యిస్తవి. జీర్ణక్రియ సక్రమంగా ఉన్నంత వరకూ, దేహానికి అపకారము చేసే సూక్ష్మ జీవులు జీర్ణ రసాలలోనే, నశించి పోతవి. అందువలన, పచ్చిపాలే తేలికగా జీర్ణ మవుతవి. కాచినపాలు జీర్ణకోశములో చాలా కాలము నిల్వఉండి పులిసి పోతవి. పచ్చిపాలు అంత యెక్కువుగా పులిసిపోక దేహ పోషణకే ఉపయోగిస్తవి.

పోతపాల బిడ్డలకు తరచుగా రోగములు వచ్చుటకును, అసంఖ్యాకమైన, శిశు మరణాలకును యిదే కారణము. ఇప్పుడు తయారవుచున్న శిశు ఆహారాలు గాని, ఆహార సారాలుగాని బిడ్డలయందు, జీర్ణక్రియను చెడగొట్టి; పొట్టలను పెంచి, రోగములను కలిగించు చున్నవి. నిప్పుమీద కాచినపాలు యెంత అపకారాన్ని చేస్తవో శాస్త్రీయ పద్ధతుల వలన స్టెరిలైజ్ చేసినపాలు కూడా అంతే అపకారాన్ని చేస్తవి. విజ్ఞానశాస్త్రము పాలను మరగకాచి సూక్ష్మజీవులను చంపాలి, అంటుంది.

అందువలన పాలల్లోఉండే జీర్ణమయ్యే గుణము నశించిపోతుంది. ప్రకృతియందు దంతటను, తల్లి చంటిలోని పాలు సూటిగా బిడ్డ కడుపులోనికి పోతవి. గాలి యేమీ తగలదు. గాలి తగిలినపాలు బిడ్డకడుపులో పోసినపుడు కొంతఅపకారం తప్పకుండా జరుగుతుంది. ఎక్కువ కాలము గడువకుండా అప్పుడు తీసిన పాలు, అప్పుడే పోస్తే జరిగే అపకారము తక్కువగా ఉంటుంది. అయితే ఆవుకూడా ఆరోగ్యవంతముగా ఉండాలి. వేసవికాల, వర్షకాలములలో కూడా, రాత్రిం బవళ్ళు కొట్టములలోనే ఉంచుటచేత, క్రొవ్వెక్కిన ఆవు బాగా మంచిపా లిస్తుందనుకోవటం పొరపాటు. ఆ యావు దేహములో రోగపదార్థం నిండుగా చేరుకుని యుండుటవలన, ఆపాలు త్రాగిన బిడ్డకు తప్పకుండా అపకారమే జరుగుతుంది.

నాగరిక దేశాల్లో పెంచే ఆవులు, ఆరోగ్యంగా ఉండటానికి వీలేలేదు. ఇందువలన అట్టి యావుల పాలు రోగాన్నే వృద్ధిచేస్తవి. అందువలన ఆవుపాలకు బదులుగా, గోధుమ జావగాని, మొలకలెత్తిన జొన్నల జావగాని, బిడ్డకు పోయటం మంచిది. జావలో - వెన్నగాని, ఉప్పుగాని వేయరాదు. జావకు తయారుచేసే పిండి యేనాటికానాడు విసురుకోవటమే మంచిది. ఒక్కసారి విసరినపిండి, చిరకాలము నిల్వఉంచితే, అందులో ఉండే పోషక శక్తులు నశించి పోతవి. నుత్తని పిండిగా విసరిగాని, నానబెట్టి రుబ్బిగాని, జావ కాచవచ్చును. ఇది యేదో కష్టమని వదిలివేయ వలసినది కాదు. కొలది దినములలోనే అలవాటై యిది చాలా సులభము అనిపిస్తుంది. 'శిశుసేవ' అనే గ్రంథములో యీ విషయాన్ని యింకా విపులంగా వ్రాశాను.

తమ బిడ్డలను పెంచుకొనలేక, తల్లిదండ్రులు చాలా కష్టపడు చున్నారు. ఇది చాలా విషాదకరమైన విషయము. చాలామంది "పిల్లలకు చదువు వచ్చుటలేదు. నీతి మంతులుగా ఉండక, గుణ వంతులుగా లేక, కోపధారులు, చపల చిత్తులుగా ఉండి, తలితండ్రులను, చదువు చెప్పే వారిని నానా యిబ్బందులు పెట్టుచున్నారు. ఈ కాలపు పిల్లలు యింతేనయ్యా! అను కుంటున్నారే కాని" వారి అవినయానికి వేరే కారణమున్నదని వారు గ్రహించుట లేదు. దేహములో రోగపదార్థము యెక్కువగా ఉన్న బిడ్డలకు దైహిక, మానసిక క్రియలు తిన్నగా ఉండవు. ఆ బిడ్డలకే దేహములో యుండే రోగ పదార్థము సంపూర్ణంగా వెలువరిస్తే, వారికి పరిపూర్ణ ఆరో గ్యము వస్తుంది. ఎంతో అవినయముగా ఉండేబిడ్డలు, తొట్టి వైద్యము చేసినపుడు వారి ఆరోగ్యము వృద్ధిపొందుటయు, వారి అవినముపోయి, మంచివారగుటయు, నేను అనుభవములో చూచియున్నాను. ఎంతో కాలము యేమిచదివినారాక, మొద్దులల్లే ఉండేపిల్లలు మన వైద్యముచేసి ఆరోగ్యమును పొందిరి. వారే తర్వాత విద్యలను తొందరగాను, చురుకుగాను గ్రహించి, తల్లిదండ్రుల ఆనందాన్ని వృద్ధిచేసిరి. ఆరోగ్య వంతులైన బిడ్డలనుపెంచుట యెంతసులభమో, తెలిసిన వారం దరును, తమబిడ్డలకట్టి ఆరోగ్యమును, సంపాదించి పెట్టెదరు. తల్లి తండ్రులుగా ఉండేవారందరు తప్పకుండా తొట్టివైద్యము, ముఖనిదాన శాస్త్రము చదివి అందలి విధులను యెరిగి ఉండుట ముఖ్యమై యున్నది. ముఖనిదాన శాస్త్రము వలన యెవరియందు యెంత రోగపదార్థము యేస్థితిలో ఉన్నదీ తెలుస్తుంది. ఆరోగ

పదార్థాన్ని వెలువరించే ఉపాయము, తొట్టివైద్యము బోధిస్తుంది. అందువలన యీ రెండు గ్రంథాలు అభ్యసింపవలెను. ఇంకొక విషయమును యీ సందర్భములో చెప్పకుండా ఉండటానికి వీలులేదు. అది అంత ముఖ్యమైనది. ఈ కాలములో చిన్నవయస్సు వారికి అకాలములోనే కామేచ్ఛ కలుగుతున్నది. అందువలన వారు ముష్టిమైథునాది దురభ్యాసములకు లోనగుచున్నారు. నీతిపేరిట యీవిషయాన్ని యెవరునూ వెలువరింపక అణటిపెట్టుచున్నారు. ఈ పొరపాటు యీ విధంగానే ఉంటే యెప్పటికీన్ని సర్దుపాటుకాదు. ప్రపంచకాన్ని బాగుచేయాలంటే, దాచిపెట్టిన రహస్యాలను వెలువరించాలి. జంతువులలో అకాలంలోనే చిన్నజంతువులు యెద అయితే అదిరోగము అని అందరికి తెలుసు. ఎవరు యెన్ని చెప్పినా మానవులకుకూడా యిదేనియమము వర్తిస్తుంది. చిన్నవయస్సులోనే కామేచ్ఛ పుడితే, దానికి కారణము రోగమే. జననేంద్రియాలల్లో రోగపదార్థము చేరితేనే ముష్టిమైథునము అలవాటవుతుంది. రోగపదార్థమును వెలువరించినంతనే అసహజమైన కోరికకూడా పోతుంది. బెత్తముతీసుకుకొట్టి పిల్లలకుండే, యీ దురభ్యాసాన్ని పోగొట్టటంనుకు కొంతమంది తల్లితండ్రులు ప్రయత్నించుచున్నారు, దీనివలన లాభములేదు. దేహములోని రోగపదార్థమును వెలువరించకుండా, బిడ్డలలోఉండే మనోబలాన్ని వృద్ధిచేసి కూడా యీ దురభ్యాసాన్నుంచి మరలించుటకు కూడా ప్రయత్నము చేయవచ్చు. దీనివలనకూడా శాశ్వతమైన లాభమురాదు. లోపల అవయవాలల్లోఉండే తపన తీరనంత వరకు ఆ రోగము అలాగే ఉంటుంది. తొట్టి

వైద్యముచేసి, ఉద్రేకములేని సహజాహారాన్ని తింటూ సహజమైన జీవనముచేస్తే దేహములోని రోగపదార్థము వెడలి పోయినందువలన పిల్లలకుండే ముష్టి మైథున దురభ్యాసము శాశ్వతముగా కుదురుతుంది. పిల్లలకు చదువు రావాలంటే, ప్రవర్తన బాగు పడాలంటే కూడా పిల్లలకు తొట్టి వైద్యము చేయిస్తేనే, వారు పరిపూర్ణారోగ్య వంతులు, విద్యావంతులు, నీతిమంతులు, దేశభక్తులుగా అవుతారు.

— —

# రోగ నివారణ వృత్తాంతములు

దూరప్రదేశాలలో ఉండియున్నవారికొరకు నిజంగా జరిగిన రోగనివారణ వృత్తాంతములను, నూటికిపైగా యేరి యీ క్రింద ముద్రించుచున్నాను. ఇందులో అన్నిరకాల రోగాలు ఉన్నవి. ఇందులో చేర్చిన కృతజ్ఞతాలేఖలు కూడా నేను కోరకుండా పంపినవే బాధితమైన మానవలోకానికి, తొట్టివైద్యము ఎంత మేలు చేయగలదో ఆ జాబులవలన కూడా తెలుస్తుంది.

## 1. నాడుల దౌర్బల్యము, నిద్రలేకపోవడం, ప్రేగులలో కాలికమగు తపన, పైత్యతిత్తులలో రాయి.

ఆర్ అనునామె, కాలికమగు ప్రేగుల మంటతో బాధపడుచుండెను. మందులో - యెనిమా చేస్తేనేగాని విరేచనముకాదు. పైత్యపు తిత్తియందలి అశ్మరీ (రాయి) తో బాధపడుచుండెను. ఆనెలకానెల ఆమె లావగుచుండెను. క్రమ క్రమంగా - ఆమెకున్న బాధలు భరింపసాధ్యముగాకుండా పోయినవి. నాడులు దుర్బలముగా నుండెను. నిద్రలేదు. పైత్యకోశ మున్నచోట, పైత్యాశ్మరీవలన బాధపడుచుండెను. ఆకలిలేదు. ఆమెను పరిశీలించిన వైద్యులు ఆమెకు శస్త్రము చేసి పైత్యకోశమునందలి రాయి తీసివేయవలె ననిరి. ఎంతో మందికి శస్త్రచికిత్స చేసినను, రోగంనయముకాక అపాయ ములు సంభవించుట ఆమె వినియుండుటవలన ఈ కష్ట స్థితిలో మనవైద్య మారంభించినది. దినమునకు 2 మొదలు

5 వరకు కటిలింగస్నానములు చేయించితిని. వారానికి 2 తూరులు నీటిఆవిరి పట్టేవారు; మాంసములేని ఆహారమును పథ్యముగా పెట్టేవాడను. మొదటివారములో చికిత్స నెమ్మదిగా జరిగినది. 2 డవ వారములోనే ఆకలి సహజస్థితికి వచ్చినది. విరేచనము సాఫీకి వచ్చినది. నిద్ర సరిగా పట్టినది. 3 డవ వారములో నాడీదౌర్బల్యము తగ్గినది. 4 వ వారములో నల్లని దుర్వాసనతో కూడి కుళ్ళిన బంకవిరేచనాలు వెళ్ళినవి. ఆ వారములో ఆమె 30 పౌన్లు తగ్గినది. అదివరకు లావెక్కిన ఉదరము సహజస్థితికి వచ్చినది. 5 వారములు చికిత్సచేసిన తర్వాత, పైత్య కోశములోని రాళ్ళు కరుగ నారంభించినవి. కరగిన రాళ్ళు, పచ్చని యిసుకరేణువులవలె మూత్రములో కనుపించుచుండెను. 7 డవ వారములో రోగము సాంతముగా నయమైనది.

## 2. జలుబు, చలికాళ్లు – జీర్ణకోశవ్యాధులు, పైత్యవ్యాధులు, గొంతులోమంట.

హెచ్ అనువాడు. వయస్సు 27. పై రోగాలకు మన వైద్యము ను ప్రారంభించినాడు. మొదట కటిస్నానాలు, తర్వాత లింగ స్నానాలుచేస్తూ, ఉద్రేకములేని పదార్థములు పథ్యముగా పుచ్చుకునేవాడు. తొందరగా రోగనివారణ మైనది. రెండవ దినముననే జీర్ణకోశవ్యాధు లుపశమించినవి. 3 వారాలు చికిత్సతోనే అతని వ్యాధులు నయమయినవి. అన్నిటికంటె ఆశ్చర్యమేమిటంటే, ప్రత్యేకమైన చికిత్స లేమీ లేకుండానే, చల్లగానున్న పాదాలు వెచ్చపడినవి.

## 3. కాన్సర్.

బ్రెజిల్ దేశస్థుడు. వయస్సు 25 సం॥. ఎనిమిది సంవత్సరములనుండి వృద్ధిపొందుతూ యిప్పుడు కంఠమునుండి ఉదరము వరకూ మేహవ్రణాలు వ్యాపించి ఉన్నవి. ఆహారము తిన్న తర్వాత - ఆ వ్రణాలలోనుంచి నెత్తురు వచ్చేది. రోగి గొంతులోనుండి యెవ్వరూ భరింపరాని దుర్వాసన వచ్చుచుండెను. రోగివద్దకు ఎవ్వరూపోరు. రోగికి ఆత్మహత్య చేసుకుందామని కోరిక కల్గుటలో ఆశ్చర్య మేమున్నది? నా చికిత్సలో మేలుపొందిన వారి ప్రోద్బలము వలన, ఆతడు మన చికిత్స నారంభించెను. మొదటి 3 నెలలు అతనికి బాధలు ఎక్కువైనవి. గుప్తముగా నుండిన మేహగ్రంథులు కరిగి మెత్తపడి చీముకార నారంభించినవి. అప్పుడు చాలా బాధగా యుండేది. మిక్కిలి ఓర్పుతో అత డాబాధలను భరించినాడు. కొద్దిగా సుగుణము కన్పడ నారంభించినది. గట్టిగా సంవత్సరం చికిత్స చేసేసరికి ఆతని రోగం అంతా నయమైంది. అత నిప్పుడు బలంగాను, ఉత్సాహంగాను ఉన్నాడు. తోటివైద్యము ప్రచారం చేస్తున్నాడు.

## 4. కామిల, దౌర్బల్యము - తలనొప్పులు.

లిప్ జిగ్ లోని యల్ అను నామె కుమార్తె. 1½ యేండ్ల వయస్సు కలది. 1887 వ॥సంవత్సరము. వసంతఋతువులో దౌర్బల్యము, పనియందు ఔదాసీన్యము, తలనొప్పులు మొదలగు వానితో బాధపడుచుండెను. తెల్లగా ఉండవలసిన, కంటిలోని గుడ్డు

పచ్చబడి, ఆ పసిమి దేహమంతా కూడా వ్యాపించినది. అప్పుడామె ఉదరములో బైలుదేరిన జ్వరము దేహమంతా కూడా వ్యాపించేది. తలనొప్పులు కూడా ఉండేవి. ఉద్రేకములేని సహజపథ్యము, దినానికి 3 తొట్టిస్నానాలు చేయించేవాడను, దానితో రోగపదార్థము ఉదరమువంకకు లాగివేయబడినది. రోమరంధ్రాలు కూడా బాగుగా వికసించినవి. 15 దినములలో కామిలారోగం పూర్తిగా నయమైనది.

## 5. ఎముకలో క్షయ.

ఏ. హెచ్. అను వారికి ఎముకక్షయ. 9 మాసాలు అలోపతీ విధానంగా అయిడోఫారం, కార్బాలిక్ యాసిడు, కరోసిల్ సబ్లిమేటు, మొదలగు మందులతో చికిత్స చేసిరి. పుండు కుదురలేదు. 2 కాళ్ళు అనేకతూపులు శస్త్రము చేసినారు. ఎన్నో యెముకల ముక్కల తీసివేసినారు. ప్రాదేశికంగా చేసిన యీ తప్పుడు చికిత్సలవలన ఆతనిస్థితి మరెంత చెడినది. ఇప్పుడతడు నడువలేడు. ఈ స్థితిలో మనవైద్యము ఆరంభించినాను. మూడుమాసాలలో కాలిమీది అన్నిపుండ్లు మానినవి. మెత్తపడిపోయిన, బొమికలు గట్టిపడినవి. వాచిన బొమికలు సన్నపడినవి. ఇంకొక మూడుమాసాలు చికిత్స చేసిన తర్వాత అతని రోగం అంతా నయమైనది.

## 6. తుంటినొప్పి, అంగవికృతి, కుంటితనము.

ఒన్‌వాల్ – జడ్. 12 యేండ్ల పిల్లవాడు. మొదట దగ్గు పడిశము పట్టినది. తర్వాత తుంటినొప్పి పచ్చినది. అస్వాభావిక

మైన మందులతో వైద్యము చేసినారు. పక్కమీద పరుండ బెట్టి సాగదీసినారు. ఎంతోమంది వైద్యముచేసినారు. రోగము ఎక్కువైనది. మలుగులు నానాటికి గట్టిపడి బిగిసిపోయినవి. చివరకు కుంటివాడైనాడు. ఎడమకాలు కంటె కుడికాలు సన్న పడిపోయినది.

మనవైద్యములో అతనికి కటిలింగస్నానాలు ఉద్రేకములేని సహజపథ్యమును పెట్టినాము. బిగిసి యెండిపోయిన కాలికి ఆ ప్రదేశములో యేచికిత్స చేయలేదు. 15 దినాలు చికిత్స చేసేసరికి ఆ కుర్రవాడు చేతికర్రలయినా లేకుండా నడువగలిగి నాడు. ఒక నెలరోజుల చికిత్స జరిగేటప్పటికి గట్టిపడిన మలుగులు మెత్తబడినవి. కుంటితనము పోయినది. ఎడమకాలు వలెనే కుడికాలు కదలింపగల్గుచున్నాడు. 6 మాసాల చికిత్స చేసేటప్పటికి సన్నపడిపోయిన కుడికాలు మామూలుగా యెప్పటి స్థితికి వచ్చినది.

## 7. సాధారణదౌర్బల్యము, నడుములోనొప్పి, రక్తక్షీణము, సుఖప్రసవము.

ఈ అను ఆమెకు పై జబ్బులున్నవి. అప్పు డామె గర్భవతిగా నున్నది. వైద్యులు ఆమెకుచేసిన సహాయము ఉప యోగించలేదు. ఆమె మన వైద్యముమీాద మనసు పెట్టు కున్నది. దినమునకు ఒక కటిస్నానము, 2 లింగస్నాన ములు చేయవలసిందనీ, ప్రతి తొట్టిస్నానము తర్వాత

ఎండలో కూర్చోవలసిందని చెప్పితిని. ఉద్రేకములేని తేలికగా జీర్ణమవు పథ్యమును పెట్టించినాను. కొన్ని నెలలు అయిన తర్వాత, "ఆమె నావద్దకు వచ్చి యిట్లు చెప్పినది. ఒక వారం రోజులు మనవైద్యము చేసేటప్పటికి, కొంచెము ఆరోగ్యము వృద్ధిపొందినది. నెలనెలా ఆరోగ్యము బాగా వృద్ధినొంది ఒక నెలక్రిందట – ఆమె సుఖముగా ప్రసవించినది. ఇదివరకు కాన్పులలో, ఆమె చాలా కష్టపడేది. ఈసారి ఆమె యింతసుఖముగా ప్రసూతి అవుట చూచి మంత్రసాని ఆశ్చర్యపోయినది. ఇది వరకు ప్రసవానంతరము మైల సరిగా కాక, చిక్కని, నల్లని, మురిగిన, నెత్తురు అయ్యేది. ఈ తూరి ఆబాధలు ఏవీలేవు. బిడ్డకూడా బాగా ఆరోగ్యముగా నున్నది. ఇదివరకు కాన్పులలో బిడ్డలకు ఇవ్వటానికి ఆమెవద్ద పాలుండేవికావు. ఈ కాన్పుకు బిడ్డకు కావలసినన్ని పాలు. ఇదివరకుకన్నా ఆమెఆకలి బాగా ఉన్నది. ఇదివరకు జీవించిన, జీవితముకంటె యీ జీవితమే తేలికగాను, సుఖప్రదంగాను ఉన్నది."

## 8. గ్రంధివాపు.

ఈ, కే, అనే తొమ్మిదేండ్ల పిల్ల. కంఠానికి యెడమవైపున గ్రంధి వాచివాచి, కోడిగుడ్డంత అయినది. దినానికి ఒక కటిస్నానం 2 లింగస్నానములు అరగంట పరిమితితో చేయిస్తూ కంఠానికి, వారానికి, 2 తూర్లు ఆవిరి పట్టించినాను. ఉచితమైన పథ్యము పెట్టితిని. మొదట చిక్కని మెరుపురంగుగా ఉన్న గ్రంధి తర్వాత కొంతకాలానికి నల్లబడినది. ఇట్లు 3 వారాలు

జరిగిన తర్వాత తల ఒకవైపునకు వాలిపోయినది. అందువల్ల ఆవిరి పట్టటానికి వీలులేకపోయినది. భరింపగలిగినంత వేడినీటితో కాపుపెట్టినాను. బహిరంగంగా ఉండి పడకపోయినప్పటికీ కంఠికి కట్టినగుడ్డ కట్టులోకి చీముపచ్చేది. తర్వాత రెండు శనగ గింజలంత బెజ్జములు పడినవి. కొంత చీము కారిపోయినది. ఆ కంఠిలావు క్రమంగా తగ్గినది. అయితే యింకొక కంఠి యేర్పడి నది. మొదటి పుండులోనుండి యింకా కొంతచీము కారిపోయిన తర్వాత రెండవ కంఠికూడా లేకుండా పోయినది. ఒక నెల రోజులు చికిత్సచేసిన తర్వాత, ఆ బిడ్డ తిరిగి పాఠశాలకు పోగలిగి నది. ఇట్లు 5 వారములు చికిత్సచేసిన తర్వాత అన్ని బాధలు తీరినవి. తల మెడ సులభముగా త్రిప్పగలిగినది. ఈ చికిత్సా కాలములో ఆ బిడ్డకెట్టి బాధలులేవు. ఎప్పుడైనా బాధకలిగితే నీటిఆవిరి, వేడినీటికట్లు, లింగస్నానములుచేసి వానిని పోగొట్టే వారు. చిట్టచివరకు మచ్చకూడా లేకుండా పుండు మానినది.

## 9. చన్నుమీదను, ముక్కుమీదను మేహవ్రణము.

లీప్‌జిగ్‌లో యస్ అను ఆమెకు చంటిమీాదను, ముక్కు మీాదను మేహవ్రణములు పుట్టినవి. ఎన్నెన్నో వైద్యములు చేసినారు. నయముకాలేదు. ఎవరో చెప్పినందువలన నన్ను చూచుటకు రమ్మన్నది. నేనుబోయి చూచునప్పటికి ఆమెస్థితి దుర్భరముగా నున్నది. చన్నుమీాద లోతైన వ్రణమున్నది. అది కుళ్ళి నల్లబడియున్నది. చాలా విశాలముగాకూడా నున్నది. ముక్కు సగము నశించి యున్నది. నుదురుమీాద మేహ

గ్రంథులు ఉన్నవి. అవి పగలటానికి సిద్ధముగా నున్నవి. పరీక్ష చేసి చికిత్సాపద్ధతిని బోధించినాను. నేను చెప్పిన పద్ధతి చాలా ఉపయోగించినది. నుదుటిమీద గ్రంథులు మొదట కనుపడకుండా పోయినవి. తర్వాత చంటిమీది వ్రణము నయమైనది. చిట్టచివరకు ముక్కు నయమైనది. అప్పటికి కూడా ఆమె చూచుటకు భయంకరముగానే ఉన్నది. ఇప్పుడామె రూపము బాగుపడినది. చూచుటకు సుందరముగా నున్నది. ఆమెస్థితి యింత యింద్రజాలముగా నయమవుటకు స్వాభావిక మగు పథ్యము కటిలింగస్నానాలు చెమటపట్టుట ఇంతకంటె రొమ్ముకుగాని, ముక్కుకుగాని, నుదురుకుగాని యెట్టి ప్రదేశ, చికిత్సలు చేయలేదు. నేను చెప్పిన చికిత్స ఆమె శ్రద్ధగా అవలంబించినందున ఆమె రోగము 9 మాసములలో నయమైనది.

## 10. కాలిమీద బహిరంగ వ్రణములు.

బ్రెజిల్‌లో యఫ్ అను పాఠశాలోపాధ్యాయుడు. 7 సంవత్సరాలనుండి, కాలిమీద వ్రణాలతో బాధపడుచూ వైద్యుడు చెల్లగా వైద్యునిచేత చికిత్సలు చేయించుకున్నాడు. కష్టపడి సంపాదించిన డబ్బంతా మందులక్రింద ఖర్చుపెట్టినాడు. కాలిమీద వ్రణాలు నానాటికి పెద్దవై బాధ యెక్కువగుచున్నది. అప్పుడప్పుడు బాధలు మరీ యెక్కువై చదువు చెప్పటానికి కూడా వీలుకావటములేదు. అతడు నేను రచియించిన తొట్టి వైద్యమును చదివి, నావైద్యము కూడా చేసి చూడా

మనుకున్నాడు. అతడు కటిస్నానాలు మాత్రమే చేసినాడు. ఒక సంవత్సరంచేసిన తర్వాత, అతని కాలిమీది పుండు నయమైనది. లింగస్నానాలు చేసిఉంటే యింతకంటె తొందరగా నయమయ్యేది. పోర్టుయలిజిరీలో నుండే జర్మను పత్రికకు తన రోగ నివారణ వృత్తాంతము వ్రాసి పంపినాడు.

## 11 మూత్రపిండ, మూత్రకోశవ్యాధులు, నంజు, పైత్యకోశవ్యాధి.

బి. అనునామె, మూత్రపిండ, మూత్రకోశ వ్యాధులతో అనేక సంవత్సరాలనుండి బాధపడుచున్నది. సర్కారు వైద్యము చేసినా, లాభము కలుగకపోగా తత్కాల ఉపశాంతికూడా కలుగలేదు. నంజురాకుండా ఆపేందుకు కూడా చేతకాలేదు. అప్పుడామె నావైద్యము చేయుటకు నిశ్చయించుకున్నది. దిన మునకు రెండు, కటిస్నానాలు, ఒకలింగస్నానము చేయుటకును, స్వాభావికమగు పథ్యము పుచ్చుకొనుటకును యేర్పాటు చేసితిని. కూంసపుపులుసు త్రాగవద్దన్నాను.

వెంటనే గుణమీయ నారంభించినది. వరుసగా కొన్ని ఏండ్లు ఆకలి లేదు. అందువలన ఆమెకు అధైర్యము కలిగినది. కుమార్తె ప్రోద్బలము లేకపోతే వైద్యము ఆపివేసేదేను. ఆమె వైద్యమును సాగించినది. దానివలన మేలే కలిగినది. కటి స్నానానికి బదులుగా తొందరగా రోగనివారణ మయ్యేందుకు లింగస్నానాలను నిర్ణయించినాను. క్రమంగా, నంజు మూత్ర కోశ మూత్రపిండ వ్యాధులు పైత్యవ్యాధి నయమైనవి. ఇప్పు

డామెను యెవరైనా చూస్తే, ఆమెకు యెప్పుడైనా జబ్బు చేసిందా! అనుకుంటారు. ఆమె యిప్పుడంత ఆరోగ్యముగా నున్నది.

## 12. గుండెజబ్బు, కంటియెదుట నల్లనిమచ్చ.

కంటియెదుట ప్రత్యక్షముగ యేవస్తువు లేకపోయినా, కంటి యెదుట నల్లనివస్తువులు కదులుతున్నట్లుగా కనుపడును. కంటి లోని కాచబింబములో సన్నని నలుసులవంటి రోగపదార్థము నిల్చిపోయి, వానిచ్ఛాయలు దృష్టిపటలముమీదపడినపుడు యిట్టి నల్లనిమచ్చలు కనుపడుతవి. దేహములోయుండే రోగ పదార్థముపోతె, కంటిలోఉండే రోగపదార్థం దిగిపోయి, కంటి యెదుటి మచ్చలుకూడా పోతవి. బి. అనే ప్రదేశములో ఉండు నట్టి యఫ్. హెచ్. అను నతడు తన గుండెజబ్బుకు మన వైద్యమును చేసినాడు. అతనికి గుండెజబ్బు నయమైనది. అతనికి గుండెజబ్బు ఉన్నపుడు నల్లనిమచ్చలు కనపడేవి.

## 13. కాలికమగు అతిసారము, గ్రహణి.

డబ్ల్యూ. అను ఒక అమెరికాదేశపు స్త్రీ 4 సంవత్సరాలనుండి కాలికమగు అతిసారముతోను, గ్రహణితోను బాధపడుచూ అనేకమంది వైద్యుల సలహావలన యెన్నోమందులు వాడి రోగ ములు నయముకాక నా సలహా కోరెను. ఆమెకు తేలికగా జీర్ణ మయ్యే పథ్యముపెట్టి దినమునకు 3 తొట్టిస్నానములు చేయిం పుచూ వారమునకు 3 తూరులు నీటి ఆవిరి పట్టించితిని. అట్లు 3 వారాలు చేయగా ఆమె రోగము పూర్తిగా నయమైనది.

## 14. పైత్యకోశవ్యాధి, ప్రేగులలో విదాహము, మంటలు, చెమటపోసే పాదములు, జీర్ణకోశములోనుండి శ్లేష్మ స్రావము.

యమ్. అనునతడు, చిరకాలం. ప్రేగులయందలి మంటలతో బాధపడి, చివర కావ్యాధి కాలికముకాగా, తీవ్రమగు పైత్య కోశవ్యాధి కలిగినది. అనేక సంవత్సరాలు అలోపతీ వైద్యములో అనేక మందులు పుచ్చుకొనెను. గుణము కనబడలేదు. తర్వాత మనవైద్యము నారంభించెను. మొదట జీర్ణకోశములో పుట్టిన శ్లేష్మస్రావము కట్టుకొన్నది. దానితో ఆకలి సహజస్థితికి వచ్చినది. మొదటి వారంలోనే యీ సుగుణములు కలిగినవి. క్రమ క్రమముగా ప్రతివారము, దేహములో యుండే రోగపదార్థము తగ్గుచూరాగా, రెండుమాసములు అవునప్పటికి, అనేక సంవత్సరాలనుండి అతని దేహములో పేరుకొనిన, రోగపదార్థమంతయు వెడలిపోయినది. ఆకాలములో, అతని దేహములో 15 పౌనుల తూకముకూడా తగ్గినది. అతని పాదాలలోనుంచి వచ్చే కంపుకొట్టే చెమటకూడా, రాకుండా మానినది. మిగతా బాధలన్నీ కూడా లేకుండాపోయినవి.

## 15. వెన్నుపామునందలి క్షయ.

యమ్. అనువానికి, వెన్నుపాములో క్షయపుట్టినది. లీప్ జిగ్ విశ్వకళాపరిషత్తు నందలి చికిత్సాలయపు వైద్యులంతా కలిసి, ఆవ్యాధి నయముకాదన్నారు. ఒకసంవత్సరం ఆచికిత్సాలయ

ములో చికిత్సచేసుకున్నా రోగం నయముకాలేదు. అతడు ముద్రాక్షరశాలలో అక్షరములు కూర్చేవాడు. వృత్తిపోయి నందున దరిద్రుడయినాడు. బంధువు లతనిని భరింపవలసి వచ్చినది. వైద్యుల నిర్ణయప్రకారము తనకు రోగం నయమవుతుందనే ఆశకూడా అంతరించినది. మన చికిత్సా విధానములో రోగ ములు నయముకావడం అతను వినియున్నాడు. అందువలన తొట్టివైద్యము చేయడానికి అతను నిశ్చయం చేసుకున్నాడు. బలము రావడంకొరకై వైద్యులు నిర్ణయించిన ఆహారసారాలు తింటూకూడా నీరసించి పోయినాడు. అంత బలహీనముతోనూ యెట్లో నా వద్దకు చేరినాడు. నే నతనిని పరీక్షచేసితిని. రోగ పదార్థము వెనుకవైపున చేరినది. దానికితోడుగా, జ్వరము అంతర్గతముగా నున్నది. అతనికి ఫారెన్‌హీట్ 68_72 డిగ్రీల చల్లని నీటిలో కటిస్నానాలు చేయించితిని. ఒక కటిస్నానం, గంట పరిమితిగల లింగస్నానమును తోడుగా చేయించితిని. మాంసములేని పథ్యము పెట్టించినాను. ఉదయం పొట్టు తీయని గోధుమరొట్టె, పండ్లున్నూ, మధ్యాహ్నము కూర గాయలను బెట్టించేవాడను. 3, 4, వారాలకు ఒకతూరి ఉదరమునకు నీటి ఆవిరి పట్టెడివారము. ఇట్లు 3 మాసములు చేయునప్పటికి అతడు తేలికగా లేచి తిరుగ గలిగెను. ఆరు మాసాలనాటికి, కర్రతో కూడా నిమిత్తం లేకుండా పోయినది. అప్పటికే అతని వెన్నులో ఉండే రోగపదార్థము చాలాభాగము తగ్గినందున అతడు తెలికగా పనిచేసుకో గలిగినాడు. అందు వలన అతనిని మన చికిత్సాలయమునుండి పంపివేసితిని.

## 16. తీవ్రమగు ఋతుదోషము, రక్తప్రదరము.

లీప్‌జిగ్‌లో డబ్లియూ అను నామె 8 సంవత్సరాలనుండి, ఋతు వ్యాధితో బాధపడుచుండెను. నెలదాటినా ఋతువు కాకుండు టయు: ఋతువు అయినపుడు, రక్తము అమితముగా వెడలి పోయి, మిక్కిలి బలహీనమవుటయు జరుగుచుండెను. మొదట లీప్‌జిగ్‌లో యస్ అను వైద్యుడు చికిత్సచేసెను. ఇసుమంతయు గుణము కనపడలేదు. లీప్‌జిగ్‌లోనే స్త్రీల వైద్యశాలలో ఆ ప్రదేశములో చికిత్స చేసినారు. అసహ్యాకరమైన ఆ చికిత్స వలనకూడా ఆమెకు సుగుణము కలుగలేదు. ఉద్రేకములేని సహాజమగు పథ్యము నిచ్చుచూ ప్రతిదినమూ, లింగస్నానము లను చేయించేవాడను. అద్భుతముగా సుగుణము కలిగినది. కొలది మాసములలోనే ఆమెకు ఉండే రక్తప్రదరము నయ మైనది. ఋతువుకూడా క్రమమేర్పడినది. వైద్యము ప్రారం భించే టప్పటికి ఉండేదౌర్బల్యముపోయి, బలము వృద్ధిపొందినది.

## 17. ముఖముమీద దద్దుర్లు.

ముఖముమీద దద్దుర్లున్న ఆమె ఒకతూరి నన్ను సంప్రతించినది. ఇతరసలహాలతోపాటు తొట్టివైద్యము కూడ చేయించితిని. ముఖముమీద దద్దుర్లు, యెక్కువై జ్వరము పుట్టినపుడు, స్నాన కాలము పెంచవలసివచ్చేది. అప్పుడు 2 గంటలు స్నానం చేయించేవారము. స్నానంచేయించేటప్పుడు తొట్లో ఉండే నీరు ప్రతి అరగంటకు మార్చేవారు. అట్లాచేస్తే జ్వరము తగ్గు తుంది. ముఖానికి ఆవిరిపట్టి, తర్వాత లింగస్నానాలు చేయించే

వారము. ఇలాచేయిస్తే ఆ రోగికి యెంతో ఉపశాంతి కలిగేది. ఒకవారం రోజులు అయ్యేటప్పటికి ఆమెరోగం అంతా నయమైనది. దద్దురులు మానిపోయినవి. పూర్వము కంటె యెంతో ఆరోగ్యముగానూ, ఉల్లాసంగానూ యున్నది.

## 18. గడ్డకట్టిన గ్రంథి, చెవులలో ధ్వని.

యల్. అను నామెకు చెవికింద గడ్డకట్టిన గ్రంథి యుండెను. ఆమెకు చెవులో ధ్వని, యిట్లుండి నన్ను సంప్రదించెను. 3 సంవత్సరాలు వరుసగా యితర చికిత్సలుచేసి ఫలములేక వారు శస్త్రచికిత్స చేయవలెనంటె, అందుకు ఒప్పుకోనక నన్ను సంప్రదించినది. తొట్టిస్నానములు, స్వాభావికమగు పథ్యము, సహజమగు జీవనము, ఆమెకుకూడా యిదే చికిత్స. తొట్టిస్నానములు కొన్నిచేయు నప్పటికి చెవులల్లోనిధ్వని ఆగిపోయినది. ఆరువారాలలో చెవికిందఉన్న కంతికూడా మానిపోయినది.

## 19. సైకోసిస్, వెన్నుపాము సంబంధమైన నాడీవ్యాధి.

హెచ్. అను నతనికి గడ్డముపై నున్న భాగమంతయు ఎర్రబడి దద్దుర్లు కట్టినది. అల్లోపతీ, హోమియోపతీ, పాతప్రకృతి వైద్యము పద్ధతులన్నియు ఉపయోగించినాడు. యేమియు సుగుణము కనుపించలేదు. వెన్నులో చేరిన రోగపదార్థము. శిరస్సుకంట వ్యాపించి గడ్డముమీది చర్మవ్యాధికి కారణమైనదని తెలిసికొన్నాను. ఆ రోగికి కొన్ని సంవత్సరములు వరుసగా వెన్నులో నొప్పులుండేవి. రోగపదార్థము

వెనుకవైపు చేరియుండుటవలన, చికిత్స నెమ్మదిగా నడచినది. దినమునకు 3, 4, తొట్టిస్నానములను చేయించేవారము. ఆరోగ్య వర్ధకమైన పథ్యమును పెట్టేవారము. వారానికి 2 మార్లు ఆవిరిని పట్టేవారము. కాలికమైన అతనివ్యాధి అయిదు మాసాలు చికిత్సచేస్తే మానినది.

## 20. నపుంసకత్వము.

జి అను నతనికి సంపూర్ణముగా నపుంసకత్వము వచ్చినది. వాడిన మందులన్నియు వ్యర్థములయి పోయినవి. ఇంటికిపోయి నేను చెప్పినట్లు ఒక కటిస్నానము ఒక లింగస్నానము చేయుచూ మాంసములేని ఆహారము పుచ్చుకొన్నాడు. చికిత్సకూడా వాని యింటివద్దనే చేసుకొన్నాడు. ఆరువారములలోనే, వాని నపుంసకత్వము సంపూర్ణముగా నయమైనది.

## 21. చిన్నబిడ్డకు వచ్చిన మలబద్ధకము.

6 మాసాల బిడ్డకు అతితీవ్రమయిన మలబద్ధకము. ఎన్ని మందు లిచ్చినా కుదరలేదు. కాచిన పాలతో ఆబిడ్డను పెంచుతూఉండే వారు. అందువలన దేహము రోగపదార్థముతో నిండిపోయినది. ఎప్పుడూ జ్వరముండేది. అప్పుడప్పుడు మగతవచ్చేది. అందు వలన బిడ్డ బలహీనమై పోయినది. 2 గంటలకొకతూరి, చన్నీటి పాత్తి ఆమగతకు వేసేవారు. ఇట్లు దినమునకు 12 తూరులు మగతవచ్చేది. ప్రతి 15 ని॥లకూ మారుస్తూ తడిపాత్తి వొెడ తెగకుండా వేయసాగినారు. దానితో మగత రావటము ఆగి

పోయినది, కాని మలబద్ధకముయొక్క మూలకారణము పోనందున అది అటులనే ఉన్నది. ఆ బిడ్డతండ్రి మన తొట్టివైద్యమును చదివినాడు. బిడ్డకు చలి తగులుతుందనే భయముచేత నీరు కాచి నులివెచ్చని నీటితో దినమునకు 2 తూరులు కటిస్నానము చేయించినాడు. 5 వారములకు తర్వాత బిడ్డయొక్క జీర్ణశక్తి సహజస్థితికి వచ్చినది. వేడినీటికి బదులుగా చన్నీటితోనే తొట్టిస్నానము చేయించిఉంటే యింకా తొందరగా రోగము నయమయ్యేది. బిడ్డ ఆహారములో కూడా మార్పుచేసినారు. బిడ్డకు పచ్చిపాలను యిచ్చేవారు. వానికి తోడుగా పొట్టుతీయని యవలపిండితో కాచిన జావకూడా యిచ్చేవారు. ఇందువల్ల కూడా రోగం తొందరగా నయమయినది. బక్కచిక్కి శల్యావశిష్టంగా ఉన్న బిడ్డ యిప్పుడు బలిసి ఆరోగ్యముగా నున్నాడు. బాగా తెలివిగా ఉన్నాడు.

## 22. గ్రంధులవాపు - సుఖప్రసవము.

యమ్. అను నామెకు మెడమీద కణుతులు. ఎల్లప్పుడూ ఒక రుమాలు వానిపై కప్పవలసివచ్చేది. ఆమె మన వైద్యము అవలంబించి శ్రద్ధగాను ఓర్పుతోనూ చేసినది. మెడమీది గట్టి గ్రంధులు క్రమక్రమంగా మెత్తపడి లావు తగ్గినవి. ఆమె ఆరోగ్యము యిప్పుడు బాగుపడినది. ఈతూరి గర్భధారణమయినది. ఇప్పుడు ఏడవకాన్పు. మూడు కాన్పునొప్పులతో, ఆమె సుఖముగా ప్రసవించినది. బిడ్డ చిన్నగా ఉన్నది. అన్ని అవయవాలు యథావిధిగా యేర్పడి యున్నవి.

ఇది వరకు కాన్పులలో బిడ్డలు పాలిపోయి ఉండేవారు. ఈ కాన్పులో బిడ్డ అందముగాను, రక్తవంతముగానూ ఉన్నది. ఈ కాన్పుకు ముందు చూలింతగా ఉన్నప్పుడు మాంసాహారము తినలేదు. ఇదివరకు కాన్పులలో ఆమెవద్ద పాలుండేవికావు. ఈతూరి కాన్పులో మూడుమాసాలు వరుసగా తరుగులేకుండా బిడ్డకు పాలిచ్చుకో గలిగినది. ఆమె ఆరోగ్యము యెంతవృద్ధి అయినది. ఆ భార్యా భర్తలు యిందునలన కూడా తెలిసికొన్నారు.

## 23. తుంటినొప్పి.

బి. అనే వైద్యుడు నా కొరకు కబురంపగా వెళ్ళితిని. ఎన్ని మందులు వాడినా నయముకాక అతడు తుంటినొప్పితో బాధపడుచుండెను. చివరకు అది వృద్ధిపొందెను. నిల్చుండుటకుగాని పరుండుటకుగాని ఆతనికి బాధగా నుండెను. ఎల్లప్పుడూ సోఫాలో కూర్చుండవలసి వచ్చెను. దినమునకు ఫారెన్‌హీట్ 59, 65 డిగ్రీల చల్లని నీటితో, దినమునకు 2 కటిస్నానములు చేయిస్తూ, దినము విడచి దినము నీటిఆవిరిని పట్టించితిమి. యుక్తమయిన పథ్యమును యిచ్చేవారు. 4 దినములు యిట్లు చేయగా ఆ డాక్టరు, కొద్దిగా నడువగలిగెనని స్నానము చేయించే నౌకరు నాకుచెప్పెను. ఇంకొక వారము చేయించే టప్పటికి నా సంప్రదింపుతో నిమిత్తం లేకుండానే అతను చికిత్స చేసుకొనగలిగెను. 4 వారాలలో రోగమంతా నయమైనది.

## 24. సర్ప్, పొంగు. జ్వరము.

యన్ అను నామె నాకొరకు కబురు పంపెను. ఆమె బిడ్డకు పొంగుజర్వము సర్పి వచ్చినది. ఆ బిడ్డకు మొట్టమొదటగా నీటిఆవిరి పట్టించితిని. ఒక పేముకుర్చీమీద తొమ్మిది సంవత్సరాల బిడ్డను పగుండబెట్టి, నీటితో మరుగుతుచున్న, చిన్న డేక్సాను ఆ కుర్చీకింద పెట్టితిని. పాదాలకుకూడా ఆవిరి వచ్చెటందుకు యింకొక కుండలో, ఆవిరినీరుపోసి 2 కొయ్యముక్కలు కుండమూతికి అడ్డమువైచి ఆ బిడ్డపాదములు ఆ కొయ్యమీద నుంచిరి. ఆ బిడ్డ దేహామంతయు, మూయునట్లు ఒక ఉన్ని దుప్పటిని కప్పిరి. బిడ్డకు బాగుగా చెమటపోసిన తర్వాత ఫారెన్ హీట్ 50 డిగ్రీల చల్లని నీటితో ఆ బిడ్డ తలలోవేడి తగ్గిపోవునంతదనుక పొత్తికడుపును రుద్దుతూ దీర్ఘమగు కటిస్నానము చేయించిరి. అదివరకు యెంతో కష్టముమీదగాని రానిశ్వాస యీ చికిత్సతో సులభముగా రా నారంభించినది. ఇప్పు డపాయమంతయు. తీరిపోయినది. అయితే తిరిగి జ్వరము వస్తే మళ్ళీ కటిస్నానము చేయిస్తూ ఉండవలసినదని ఆమెకు చెప్పి పంపినాను. 5 దినములలో ఆబిడ్డ వ్యాధి అంతా నయమై సుఖముగా నున్నాడు. యేరోగాన్ని శాస్త్ర వైద్యులు, రోగులు మిక్కిలిగా భయపడుతున్నారో, యేరోగం నయము, చేయుటకు నిరంతరము, మందులను వెతుకుచున్నారో ఆ సర్పిరోగము యింత సులభముగా నయమవుతుంది.

## 25. చెవుడు - స్వరపేటికలో కొయ్యగండ, గొంతు బొంగురుపోవుట.

.యస్. అను వతనికి, కుడిచెవ్వి వినపడదు. స్వరపేటికలో కొయ్యగండ ఉన్నది. అందువలన మాట బొంగురుపోయి, బాగా వినపడదు. ఎన్నో ఆసుపత్రులు చూచినాడు. యెంతో మంది వైద్యులతో సంప్రదించినాడు. ఎవరివలనను అతనికి సహాయము లభింపలేదు. ముఖనిదానమువలన, రోగపదార్థము అతనిముందు భాగములో చేరినదనిన్నీ, అతని రోగము తొందరగా నయమవుతుందని నాకు తెలిసినది. నేనుచెప్పినట్లే జరిగినది. 10 దినాలు చికిత్స చేసినంతనే అతనికి వినేశక్తి కొద్దిగా కలిగినది. చిరకాలంనుంచి, కాలికంగా ఉన్న గొంతు బొంగురు, చాలాభాగం తగ్గినది. ఇంకొక 4 వారములలో అతనికి పరిపూర్ణారోగ్యము కలిగినది. రోగమంతయు నయమైన తర్వాత, తనకు చిన్నతనములో కూడా లేనంతశక్తి, ఉత్సాహము తనకిప్పుడు కలిగినవని ఆతడు చెప్పినాడు. దేహములో ఉండే రోగపదార్థము పోయినపుడు యిలాగే అద్భుతంగా ఆరోగ్యము కలుగుతుంది.

## 26. నాడులలో నొప్పి, సప్తపథలోనుండి కాలికమగు శ్లేష్మస్రావము.

లేప్‌జిగ్‌లోని కె. అను వానికి నాడుల దౌర్బల్యము తర్వాత, నాడులయందలి నొప్పులు కలిగినవి. సప్తపథలోనుండి శ్లేష్మము

వచ్చుచుండెను. ఎన్ని చికిత్సలు చేసినా ఉపయోగించలేదు. అతని దేహమునందలి రోగపదార్థము వెడలిపోవుటకు వీలైన చోటునం దుండుటవలన అతనికి రోగము నయముచేసెదనని వాగ్దత్తము చేసితిని. నేను చెప్పినట్లే అతనికి తొట్టివైద్యము వలన అద్భుతముగా మేలుకలిగినది. చికిత్సాకాలములో అనేక తూరులు రోగనివారణకొరకై తాత్కాలికముగా బాధలు వచ్చినవి. చిట్టచివరకు నాడులయందలి బాధ శ్లేష్మస్రావము మానినవి. తనకు రోగనివారణమై క్రొత్తగా జన్మించినట్లున్న దని అతడే చెప్పెను.

## 27. ముఖనాడులలో మంట, నిద్రలేకపోవుట, జీర్ణకోశము పెరుగుట.

ఆర్. బి. అను నతనికి 39 యేండ్ల వయస్సు. 4 సంవత్సరముల నుండి నాడులలో మంటలతో బాధపడుచుండెను. అనేకమంది వైద్యులను సంప్రదించినను, యెవరును సహాయము చేయలేక పోయిరి. ఒక గొప్ప పండితుడు అతనిని శస్త్రము చేయించుకొమని సలహా నిచ్చెను. ఈ సలహా అతనికి సమ్మతి కానందున, మనవైద్యము నవలంబింపనెంచెను. ముఖనిదానము వలన అతని దేహమునందలి రోగపదార్థము కుడివైపున చేరినదని కన్పించు చున్నది. అందువల్లనే అతని ముఖములో కుడివైపున ఉండే నాడులలో మంటలున్నవి. దీనికి మూలకారణము ఉదరములో నున్నది. అందువల్లనే జీర్ణకోశము పెరిగినది. మన వైద్యము చేసిన మొదటివారములోనే జీర్ణక్రియ స్వాభావికమగు క్రమ

స్థితికి వచ్చినది. 3 వారము లగునప్పటికి, యెట్టిబాధలు లేకుండానే ఆతడు రాత్రిఅంతయు సుఖముగా నిద్రింపగలిగెను. మన వైద్యము నారంభింపక మునుపు 4 వారములు వరుసగా ఆతనికి నిదురయే లేదు. 2 మాసములు చికిత్సచేయునప్పటికి ఆతని రోగము బాధలు కూడ అంతరించినవి. ఆతని ఆకారము కూడా బాగుపడినది.

28. గండమాల, పాండువ, దూరపుచూపు, గ్రంధులవాపు,

హెచ్. జి. అనునామె పాఠశాల ఉపాధ్యాయురాలు. అనేక సంవత్సరములనుండి గండమాలతో బాధపడుచుండెను. క్రమంగా గ్రంధులు వాచి కాయలుకాచినవి. చూపు దూరము నకు పోయినది. చికిత్సాపద్ధతులు యేవీకూడ ఉపయోగించ లేదు. కంటిచూపుకు వాడిన అద్దములు యెక్కువకాలము ఉపయో గింపక మరల మార్చవలసివచ్చెను. ఆమె స్నేహితులొకరు, ఆమెకు మనవైద్యమును గురించిచెప్పిరి. అర్ధ సంవత్సరము మిక్కిలి శ్రద్ధగా మనవైద్యమును చేసినది. 15, 20 నిమిషాల పరిమితిగల, లింగస్నానములు దినమునకు రెండు చొప్పున చేయుచూ, మిగతా ఆరోగ్యనియమాలను కూడా అవలంబిం చెను. మొదట జీర్ణక్రియ బాగుపడినది. తర్వాత కాయలు ఒక్కొక్కటే కరిగిపోయినవి. కంటిజబ్బుకూడా తగ్గినది. ఒక సంవత్సరం చికిత్స చేయునప్పటికి కంటికి అద్దములు వాడవలసిన పనిలేకుండా పోయినది. సుప్రసిద్ధులైన కంటి వైద్యులు చేయలేని పని, మన తొట్టివైద్యము చేసినది.

29. చిన్నబిడ్డకు; మలబద్ధకము. నిద్రలేమి, కండ్లుమంటలు.

మాన్, హేం, పట్టణములో నుండే హెచ్ అను నామె 2 నెలల ఆడ శిశువును నావద్దకు తీసుకొనివచ్చి సంప్రదించెను. ఆబిడ్డకు మలబద్ధకము. నిద్రపోదు. ఆ బిడ్డ పుట్టినప్పటికే దాని దేహములో రోగపదార్థ మున్నదని, దీనినిబట్టి చెప్పవచ్చును. తల్లి ముఖము పరీక్ష చేసినపుడు, ఆమెకు కూడా, అజీర్ణము, కన్నుల మంటలు, చిరకాలమునుండి ఉన్నవని తెలిసినది. బిడ్డకు పాలిచ్చేది తల్లిగనుక, ఆ తల్లి దేహములో రోగపదార్థము లేకుండా చేయాలి. అందుకుగాను ఆతల్లి దినమునకు ఒక కటిస్నానము 2 లింగస్నానములు చేయుచూ, ఉద్రేకము కలిగించని స్వాభావికమగు పథ్యము తీసుకునేది. ఆరుబైట మంచిగాలిసే పీల్చేది. బిడ్డకు చెమటపట్టుటకై, బిడ్డను తల్లి ప్రక్కలో పరుండబెట్టినారు. ఇట్లే బిడ్డకు కూడా చికిత్స చేసినారు. రెండు దినములలోనే బిడ్డ మలబద్ధకము పోయినది నిద్రపట్టినది. ఒకవారం చికిత్స చేయునప్పటికి తల్లి అజీర్ణము, కన్నులమంటలు కూడా నయమైనవి. తల్లికీ, బిడ్డకు యెంత దగ్గర సంబంధమున్నదో, పాలద్వారా బిడ్డ దేహములో యెటువంటి మార్పులు వస్తవో దీనినిబట్టి తెలియుచున్నది. ఆబిడ్డకు సూటిగా చికిత్సచేస్తే యింత తొందరగా నయమయ్యేదికాదు. తల్లి దేహములో యుండే రోగపదార్థము వలననే బిడ్డ కీవ్యాధి వచ్చినది.

## 30. చర్మము కిమలుట.

ఇ. హెచ్. అను వానికి 12 సంవత్సరముల కుమార్తె. ఆమె చర్మమంతయు, కమిలి నల్లగా నున్నది. ఎన్నోమందులు వాడినారు. ఆమె చాలా బలహీనముగా నున్నది. రోగము ముదిరి పోయినది. ఈ స్థితిలో నయముకావడము చాలా కష్టమని చెప్పినాను. జీర్ణక్రియ బాగుపడి ఉదరమునందలి అవయవములు బాగుపడటానికి అవకాశముంటే ఆరోగము నయమవుతుంది. కాని నాకు నమ్మకలేదు. అనుమానముతోనే చికిత్స ఆరంభము చేసినాను. వారంరోజులు అగునప్పటికే జీర్ణక్రియ బాగుపడినది. ఆకలి బాగా పుట్టినది. 4 వారాలలోనే చర్మము సహజమైన రంగుకు వచ్చినది. చిన్నబిడ్డల దేహములో మనము అనుకునే ధాతుశక్తి యెక్కువగా ఉంటుంది. అందువల్లనే యింత తొందరగా నయమైనది.

## 31. అప్పుడప్పుడు వాంతులు, శ్వాసాశయవ్యాధి, పాండువు.

యమ్. అను నతడు 12 సంవత్సరములనుండి అప్పుడప్పుడు వాంతులతో బాధపడుచుండెను. ఎన్నిమందులువాడినా ఉపయోగింపలేదు. వారమునకు 1,2 తూరులు యీ వాంతులు వచ్చేవి. ఉదయము నిద్రలేచినది మొదలు రాత్రి పరుండబోయేవరకు వాంతులు వెళ్లేవి. కటిలింగ స్నానాలుచేస్తూ ఉద్రేకము కలిగింపని పథ్యముతింటూ, యితర ఆరోగ్య నియమాలుకూడా అవలంబించినారు. దానివలన అద్భుతమయిన ఫలము కలిగినది. పాలిపోయి, కాంతిహీనముగా ఉండే అతని

ముఖములో కాంతి, నవనవత్వము ప్రవేశించినవి. అదివరకు యేమీ ఆకలి ఉండేదికాదు. ఇప్పుడు పరిపూర్ణముగా బాగుపడి నది. వాంతులు పూర్తిగా మానినవి. తర్వాత 4 వారములకు కృతజ్ఞత తెల్పుటకు రోగి నావద్దకు వచ్చెను. తన దేహము సాంతముగా మారిపోయినదని తాను యిప్పుడు బాగా ఆరోగ్య ముగా నున్నానని నాతో చెప్పినాడు.

32. తీవ్రమగు హృద్రోగము, రక్తముకూడుట, నిద్ర లేకుం డుట, హృదయసంబంధ ధమని జారుట, ఉబ్బసము.

యమ్. అనునామెకు 53 సంవత్సరాల వయస్సు. ఆమెకు పై వ్యాధులన్నియు కలవు. క్రిందటి సంవత్సరము ఆమె ఉబ్బస ముతో మిక్కిలి బాధపడెను. చిట్టచివరకు, నడిరొమ్ములో భరింపసాధ్యముగాని, బాధలు కలిగెను. గుండె దడుపుతోను, శ్వాసావరోధముతోను. ఆమె బాధపడెను. తీవ్రమగు బాధ, కఠినమగు శ్వాసావరోధము, వీనితో ఆమెకు రాత్రులందు నిద్దురయేలేదు. 10 అడుగులైనను నడువజాలదు. మాట్లాడుట కూడా ఆమెకు కష్టముగా నుండెను. తర్వాత ఒక దినమున, కుడి రొమ్ముమీద కంఠమునకు దిగువగా, ఒక ధమని బైటికి వెళ్ళు కొనివచ్చి హృదయముకంటె వడిగా స్పందింప నారంభించెను. ఆ ధమని చిటికిన వ్రేలంత లావు ఉండెను. ఎంతోమంచివైద్యులు వైద్యము చేయుచుండిరి. అందులో ఒక సుప్రసిద్ధ వైద్యుడు కూడా నుండెను. ఇంతమంది ఉండి ఆమెకు యేమీ సహాయం చేయలేకపోయిరి. అది శ్వాసాశయధమని అనియు, అది రక్త

ముతోనిండి బ్రద్దలయినపుడు, ఆమె చనిపోవుననియు చెప్పిరి. సుప్రసిద్ధ ఆరోగ్యశాస్త్రవేత్తతో కలిసి 5 గురు డాక్టర్లు, ఆమె రోగము నయముకాదని నిష్కర్ష చేసిరి. వారి వైద్యములో ఆశ లేకపోవుటవలన చివరకు మన వైద్యమునకు వచ్చెను. నేను ముఖనిదానముచేసి వివిధములుగా కనుపడే యీ రోగము లన్నిటికి, ఉదరమునందలి వ్యాధియే మూలమని తెలిసి కొన్నాను. ముందు అజీర్ణము, తర్వాత ఉబ్బసము – తర్వాత హృద్రోగము చిట్టచివరకు శ్వాసాశయధమనిలో రక్తము కూడుకొనుట, జరిగినదని తెలిసి కొన్నాను. దినానికి మూడు తొట్టిస్నానములు స్వాభావికమగు పథ్యము చేయగా మొదటివారములోనే బాధలు ఉపశమించినవి. బైటికి వెళ్ళుకు వచ్చిన శ్వాసాశయధమని; లోపలికి పోయి స్పందించటం కనపడకుండా పోయినది. మూడు వారాలలో చిరకాలంనుంచి ఉన్న అజీర్ణరోగము కూడా పోయినది. అన్ని రోగాలకు ఒకటే కారణమని నేను చెప్పే సిద్ధాంతం యిందులో కూడా ఋజువైనది.

## 33. సర్పి.

యల్. సి. బి. అను నామెకు 12 సంవత్సరముల వయస్సు. ప్రమాదకరమైన సర్పిరోగము వచ్చినది. అలోపతీవైద్యుడొకడు తాను యెరిగిఉన్న మందులన్నీ వాడినాడు. గుణము కనపడలేదు. గొంతు వాచినది. అందులో కుడివైపు మరీ వాచినది. వేళ్ళలంతా లావుగల దుర్వాసనతో కూడినపొర గొంతుకు

అడ్డము వచ్చినది. ఊపిరాడక బిడ్డ చచ్చిపోయే ప్రమాద మున్నది. వాయునాళము కోసి తీసివేయుటకు వెంటనే ఆసుపత్రికి తీసుకువెళ్లమని వైద్యుడు తొందరపెట్టెను. ఆమె తల్లిదండ్రులకు యీ సలహా రుచింపలేదు. చిట్టచివరకు మనవైద్యము నవలంబించిరి. దీర్ఘమగు లింగస్నానము చేయించితిమి. దానితో కొంత జ్వరము తగ్గినది. కంఠములో ఉండే వత్తిడికూడా తగ్గ నారంభించి నది. అవసరమువెంట లింగస్నానములను తరుచుగా చేయించి తిమి. ప్రతిలింగస్నానం తర్వాత, చెమటపట్టుటకు యేర్పాటు చేసితిమి. రోగి పరున్నగది, కిటికీ తలుపులు రాత్రింబవళ్ళు తెరిచి యుంచితిమి. 12 గంటలలోనే ప్రమాదము తప్పిపోయినది. 4 దినములలోనే మెడమీదికంతి కరిగిపోయినది. గొంతులో ఉండే పొరకూడా కనపడకుండా పోయినది. వారము రోజులలో బిడ్డకు సహజమైన ఆకలి కలిగినది. అయినప్పటికీ పొట్టుతీయని గోధుమపిండితో చేసిన పొడిరొట్టె, ఫల్లని రసముగల పండ్లు మాత్రమే పథ్యముగా పెట్టితిమి. చికిత్స ఆరంభించిన పదవ నాడు ఆ బిడ్డను యెండలోనికి పోనిచ్చితిమి. 15 వ నాటికి ఆ బిడ్డ రోగమంతయు నయమైనది. పరిపూర్ణ ఆరోగ్యము కలిగినది.

## 34. పెదవిమీద మేహవ్రణము.

72 సంవత్సరముల వయస్సు కలిగిన వృద్ధుడు. అతనికి పెదవి మీద మేహవ్రణము లేచినది. ఆరు సంవత్సరములు సుప్రసిద్ధులైన అలోపతీ వైద్యులును, హోమియోపతీ వైద్యులును,

చికిత్సలుచేసి నయము చేయలేక పోయినారు. క్రిమి క్రిమంగా పెదవి వాచిపోవుచున్నది. నోటివెంట యెడతెగకుండా చొంగ కారుచున్నది. నేను ముఖనిదానము చేసినాను. రోగి దేహములో రోగపదార్థము. ముందుభాగమునందు, ప్రక్కలయందు ప్రధానంగా ఉన్నట్లు కనిపెట్టితిని. అది శిరస్సువంకకు వ్యాపించినది. మొదటిరోజు చికిత్సతోనే చొంగ కారటం ఆగిపోయినది. వాపు పుండ్లు కొయ్యగండలు తగ్గనారంభించినవి. పది దినములలో పుండు మానినది. పెదవిలావు, మూడవ వంతుకు తగ్గిపోయినది. గడచిన ఆరు సంవత్సరాలలోను మందులన్ని యేమి చేయలేకపోయినవి. 11 దినాలలో మన వైద్యమువలన ఆ లాభము కలిగినది. మందువైద్యులు క్యాన్సరుకు, చికిత్స లేదంటారు. అట్టి రోగము మనవైద్యములో నయమైనది.

## 35. గొంతుజబ్బు, ఎర్రని సర్పి.

కారల్. బి. అనువానికి 8 సంవత్సరాల 6 నెలల వయస్సు. వాని తల్లి అతనిని నావద్దకు చికిత్సకు తీసుకొని వచ్చినది. బిడ్డపుట్టిన 2 సంవత్సరాల ఆరునెలలవరకు అతను ఆరోగ్యముగా నుండెననియు, తర్వాత టీకాలువేయగా అప్పటినుండియు అతను జబ్బుగా నున్నాడనియు చెప్పినారు. 8 డవయేట అతనికి వచ్చిన సర్పి మందులతో అణిచివేసినారు. అప్పటినుండియు బిడ్డ, దుర్బలముగా నున్నాడు. అతనిమాటకూడ చాలా బలహీనముగా ఉండేది. గొంతులో ఉండే ఉపజిహ్వకల మీద తెల్లని పొక్కులు పుట్టేవి. కాస్తకు, కూస్తకూ సర్పిరోగములో వాచి

నట్లు గొంతు వాచేది. అప్పటినుండి, అతని జీర్ణశక్తి బొత్తిగా పాడయిపోయినది. 1891 సంవత్సరం మార్చి నెలలో ఆబిడ్డ భయపడగా సంధి జ్వరము కలిగినది 3 వారాలు దానితో బాధ పడినాడు. దానితో అతని ఆరోగ్యము బొత్తిగా పాడయి పోయినది. చేయునది లేక మనవైద్యము నవలంబిస్తే యేమైనా లాభము కలుగుతుందనే ఆశతో 1891 సంవత్సరం యేప్రి యల్ 15 వ తేదీన మనవైద్యము నారంభించినారు. మన చికిత్స అద్భుతముగా పని చేసినది. మనచికిత్స ప్రారంభించిన రెండవ నాడే ఆకలి బాగుగా పుట్టినది. మూడవరోజున అది వరకు మందులతో అణచిపెట్టిన సర్పిరోగం తిరిగి తీవ్రరూప ములో ప్రత్యక్షమైనది. ఒకరోగం మందుతో అణచిపెట్టి నపుడు రోగపదార్థానికి తోడుగా వాడినమందుకూడా దేహ ములో నిలువఉంటుంది. అందువల్ల ఆరోగ్యము కలగటానికి వచ్చే తాత్కాలిక తరుణరోగాలను మనము అణచిపెట్టరాదు. అందువల్ల రెండు దినములు అలాగే చికిత్సచేసినాము. అయి దవనాడు మిక్కిలి దుర్గంధముతోకూడిన నల్లని మలమును కాఫీరంగులోనుండే దుర్వాసనతో కూడిన మూత్రమును ఆ దేహమునుండి వెడలిపోయెను. ఇట్లు రోగపదార్థము వెడలి పోయిన తర్వాత 5 వారములకు అతనికి పరిపూర్ణారోగ్యము కలిగినది. అతని దైహిక మానసిక శక్తులు అద్భుతముగా బాగుపడినవి.

## 36. అజీర్ణము, ముక్కులో కొయ్యగండ.

బి. అను నతడు మందులు అమ్మేవాడు. 20 సంవత్సరముల నుండి అతనికి అజీర్ణవ్యాధి. అతని దుకాణములో అన్నిరకాల మందులూ ఉండేవి. తనకున్న మలబద్ధకము పోగొట్టుకొనే టందుకు తనవద్దనున్న మందుల నన్నిటిని పేరు పేరు వరుసన వాడినాడు. వాడిన ప్రతిమందు మొదట్లో గుణమిచ్చినట్లు యిచ్చేది. తర్వాత యేమీాపని చేసేదికాదు. అతనికున్న అజీర్ణ రోగమువలననూ వాడిన మందులవలనను అతని నోటిలో ఉండే పన్నులు పాడయిపోయినవి. ముక్కులోను, వాయునాళము లోను కొయ్యగండలు పుట్టినవి. అవి మానలేదు. వరుసగా వదలక నిలచియున్న ఉదరవ్యాధివలననే యివి పుట్టినవి. ముక్కులోని కొయ్యగండలను, 26 తూరులు శస్త్రముచేసి తీసివేసినా అవి తిరిగి మొలిచినవి. నిత్యకృత్యములో జరిగే విషయాల నుండి, ఒక సత్యాన్ని మందువైద్యులు నేర్చుకోరు. అపసిద్ధాంతము మీాద యేర్పడిన మందు వైద్యములో వారికుండే నమ్మకయే దీనికి కారణము.

ఇరవై సంవత్సరాలు మందులతో యే సుగుణమయితే కలుగ లేదో ఆ సుగుణము ఒక వారము దినములలోనే మన వైద్యములో కలిగినది. మొదటి వారములోనే ముక్కులోఉండే కొయ్యగండలు అంతరించినవి. 4 వారములలో అతని రోగ మంతా నయమైనది. నా సిద్ధాంతముయొక్క నిజాయతీ అతను ప్రత్యక్షముగా చూచియుండుట వలన, రోగము నయమై

యింటికిపోయిన తర్వాత తాను మనస్ఫూర్తిగా మందులను అమ్మజాలను. అని అతడు వెల్లడించెను. తాను అమ్మిన మందుల వలన, తినినవారి దేహములు ఆ విషములతో వారిని మోసగించుట అవుచున్నదని ఆతడు నమ్మెను. తాను చేస్తున్నవృత్తి యెవరికైనా, అమ్మెదననియు, యిక చేయ ననియు చెప్పెను.

## 37. ఛద్రినాట్యము, నిద్రలేక పోవుట.

జి. అను నామెకు 5 సంవత్సరముల కుమార్తె. ఆ బిడ్డకు మూర్ఛలు వస్తవి. నడువలేదు. మాట్లాడలేదు. నిద్ర కూడా సరిగా పట్టదు. ఏవస్తువూ పట్టుకొనలేదు. తిన్న అన్నము జీర్ణముకాదు. అన్నిరకాల వైద్యములుచేసి ఫలము కానక చివరకు మనవద్దకు వచ్చినారు. కటిస్నానములు, దీర్ఘము లగు లింగస్నానములు ఆరుబైట వ్యాయామము, తేలికగా జీర్ణమయ్యే పథ్యము, వీనితో చికిత్సచేసితిమి. ఒకవారంలోపలనే బిడ్డ నడువనారంభించినది. ఇంకా కొంతకాలం చికిత్సచేయగా అదివరకు చెడిపోయిన జీర్ణశక్తి తిరిగి సహజస్థితికి వచ్చినది. తర్వాత పరిపూర్ణ ఆరోగ్యము కలిగినది. అన్ని ఇతరరోగాలకు యే సామాన్య చికిత్సలయితే చేయుస్తున్నామో ఆచికిత్సలతోనే యీ దుర్భరవ్యాధికూడా నయమైనది.

## 38. మూర్ఛలు.

జి. అనునామె విచిత్రమైన యీాడుపురోగముతో బాధ పడు చుండెను. మొదటివేలిచివర వంకరపొయ్యేది. తర్వాత దేహా

మంతా మెలికలు తిరిగేది. ఎంతో బాధ ఉండేది. ఆప్రదేశ ములో ఉండే, సుప్రసిద్ధ వైద్యులు చికిత్సచేసినారు. గుణము కనపడలేదు సరిగదా రోగము నానాటికి ముదిరిపోయినది. రోగానికి పైన కన్పడే చిహ్నాలే రోగమనుకొని పనిచేసినారు. రోగమూలకారణమైన ఉదరమునకు యేమీచేయలేదు. అందువల్లనే రోగము ముదిరిపోయినది. నేనామెకు లింగస్నానములు చేయించి స్వాభావిక జీవనము నలవాటుచేసినాను. అనేక సంవత్సరములనుండి బాధపెట్టిన ఆమెవ్యాధి యేడు వారములలో మనచికిత్సతో నయమైనది. ఆమెకు పరిపూర్ణారోగ్యం కలిగినది.

## 39. శుక్లనష్టము, వెన్నుపాములో క్షయ, నిద్రలేకపోవడం, నాడీవ్యాధి, పక్షవాతము

42 సంవత్సరాల వయస్సుగల్గిన హెచ్. అను నతడు పై వ్యాధులతో బాధపడుచూ చికిత్సకై నావద్దకు వచ్చినాడు. అతడు నడువలేడు. చాలా కష్టముగా ఉంటుంది. కూర్చున్నవాడు లేవవలెనంటే కూడా కష్టమే. అనేక సంవత్సరములనుండి అజీర్ణముతో బాధపడుచున్నాడు. నిద్ర సరిగా పట్టదు. దేహమెపుడూ చల్లగా నుంటుంది. భార్యతో కలుస్తూ ఉన్నా కూడా, విడిగా శుక్లనష్టముకూడా ఉంటుంది. వెన్నులో రోగపదార్థము యెక్కువగా చేరియున్నదనియు, తీవ్రమగు నాడీవ్యాధి కలదనియు, దీనివలన తెలియుచున్నది. మందు వైద్యులు తమవద్ద ఉన్న మందులన్నీ వాడి చూచినా

లాభము లేకపోయినది. ఇప్పు డీరోగిని యెవ్వరూ రానియ్యడం లేదు. మొదటి రెండు వారాలు దినమునకు రెండు కటి స్నానాలవంతున చేయించితిని. తర్వాత నాల్గు వారముల వరకూ దినమునకు ఒక కటిస్నానము. రెండు లింగస్నానముల వంతున చేయించినాము. కొన్ని స్నానములు చేసినంతనే జీర్ణక్రియ బాగుపడినది. కొన్ని వారాలలో పక్షవాతంతో బిగుసుకుపోయిన కాళ్ళు నడువనిచ్చినవి. వెన్నుపాము మూలుగుకు సంబంధించిన క్షయ రెండు నెలలలో నయమైనది. మందు వైద్యముయొక్క అసమర్థత మన వైద్యముయొక్క సామర్థ్యము యింకొకసారి ఋజువైనది.

## 40. చెముడు, మూగ, మెదడులో రక్తపు కూడిక.

యస్. అను నామెయొక్క, నాల్గేండ్ల చిన్న ఆడుబిడ్డకు టీకాలు వేయించిన తర్వాత తత్ఫలముగా చెముడు మూగ వచ్చినది. ఎన్నోరకాల మందులు వాడినా యేమీ ఉపయోగింపలేదు. ఆబిడ్డకు శస్త్రముచేసినారు. ఎన్నో వగరుమందులు యిచ్చినారు. అందువల్ల ఆ బిడ్డ యిప్పుడు వైద్యుణ్ణిచూస్తే యేడుస్తుంది. ఆబిడ్డకు ఉండే భయమువలన, నేను సరిగా నిదానముచేయుటకే వీలులేకపోయినది. కాని ఆ బిడ్డ దేహములో యెక్కువగా రోగ పదార్థము చేరినదని, అదే మెదడులోనికి చేరినదని నేను తెలిసికొన్నాను. కేవలము తొట్టిస్నానములు చేయిస్తూ ఉద్రేకము కలిగింపని తడిలేని స్వాభావికాహారముల నిచ్చితిమి. బిడ్డను కీకిటీలు తెరచినగదిలో పరుండబెట్టితిమి. ఆరుబైట గాలిలో

వ్యాయామము చేయించితిమి. రెండు వారములు చికిత్స చేయునప్పటికి, ఆ బిడ్డ కొద్దిగా వినగలిగెనని చెప్పెను. ఇంకొక 4 వారములలో ఆ చిన్నబిడ్డ వినగలిగెను. మాట్లాడగలిగెను. ఈ విధముగా మన చికిత్సావిధానము అత్యద్భుతముగ పని చేసెను. ఇప్పుడు ఆ బిడ్డకు వెనుకటి పిఱికితనము లేదు.

## 41. తీవ్రమగు మలబద్ధకము.

డాక్టరు యఫ్‌గారి భార్య యిరవై సంవత్సరాలనుండి, యెన్ని మందులు వాడినా, నయముకాని తీవ్రమైన మలబద్ధకముతో బాధపడుచున్నది. నా దగ్గరకు సంప్రదింపుకు వచ్చినపుడు తనమలబద్ధకము నయమవుతుందని ఆశ తనకు పూర్తిగా నశించి పోయినదని చెప్పినది. ఒకవారం రోజులు నేను చెప్పినవిధముగా సంపూర్ణమైన స్వాభావికపథ్యము తినినందున ఆ మలబద్ధకము పోయినది. దానితోపాటు యింకా కొన్ని యితర చిన్నరోగాలు కూడా పోయినవి. ఆమెకు పొట్టుతీయని గోధుమపిండిని, పుల్లని పండ్లను మాత్రము యిచ్చేవారము. ఆమె జీర్ణశక్తి వృద్ధిఅయిన తర్వాత వండిన పదార్థమును పెట్టినాము.

## కృతజ్ఞతా పూర్వకమగు ఉత్తరము

## 42. గొంతునొప్పి, మూత్రకోశ మూత్రపిండ వ్యాధులు, లింగ వ్యాధులు.

ప్రియమైన కూనేగారికి:—తాము ఉత్తరముద్వారా యిచ్చిన సలహాలోని చికిత్స నాకు బాగా ఉపయోగించినది. మూత్ర

పిండ మూత్రకోశములలోని వ్యాధులు తగ్గినవి. జననేంద్రియ సంబంధమైన స్రావముకూడా పోయినది. గొంతులో పొడిచి నట్లు ఉండేనొప్పి యిప్పుడు లేదు. గొంతులో ఉండే పచ్చనిపుండు మానినది. పూర్వముకంటె యిప్పుడు ఉల్లాసముగా నున్నాను. నా కంత బాగా ఉపయోగించిన మీ ఉత్తరములోని సలహాకు ధన్యవాదములు. కృతజ్ఞుడను.

మీ విశ్వసనీయుడు,

బూంబెర్గ. -ఈయమ్.

## 43. మోకాలు సంధిలో మంటలు

తీవ్రమగు నాడీవ్యధ, మెదడులో రక్తపుకూడిక, గుండె కొట్టుకొనుట, పైత్యకోశవ్యాధి, మూత్రపిండవ్యాధి, ప్రేగులలో జబ్బు.

ప్రియమైన అయ్యగారికి— నా మోకాలు సంధివాచి మంటలు పుట్టినవి. మోకాలు వలయము 22 అంగుళాలు ఉండెను. అప్పుడు మీ చికిత్సాలయమునకు వచ్చి 18 దినములు చికిత్సను పొంది యింటికి పోతిని. కఠిన మైన పథ్యము, కటిస్నానములు, గాలిలోను, యెండలోను తిరగడం వీనివలన నా మోకాలు లావు 17 అంగుళములకు తగ్గినది. కొన్ని సంవత్సరాలకు పూర్వము నేను మీరు రచియించిన తొట్టివైద్యము పుస్తకముకొని, చదువుటవలన నా కీమేలు కలిగినది. ఇంటికిపోయిన తర్వాత, యింకా కొంతకాలము వరకూ పథ్యమూ; లింగస్నానములు చేసినాను. మీ చికిత్సలో

నా క్రిందపేర్కొనిన వ్యాధులుకూడా నయమైనవి. తీవ్రమగు నాడీవ్యథ, మెదడులో రక్తపుకూడిక, గుండె క్రొవ్వెక్కుట, పైత్యకోశవ్యాధి, మూత్రపిండవ్యాధి. యిందులో పైత్యకోశ వ్యాధి మూత్రపిండవ్యాధులు నయమేకావని వైద్యులు చెప్పి నారు. ప్రేగుల సంబంధమైన జబ్బులుకూడా కనపడి అదృశ్య మైనవి. నన్ను కోరకుండానే వ్రాసియిచ్చిన యీ సాక్ష్యమును అవసరమైనపుడు మీ యిష్టము వచ్చినట్లుగా మీ కార్యాలయ ములోగాని, న్యాయస్థానములోగాని వాడుకొనవచ్చును. కృతజ్ఞతాపూర్వకమగు వందనములతో.

మీ విశ్వసనీయుడు,

టొరెంటో, బొహేమియా, కారల్ హెచ్.

## 44. తీవ్రమగు పార్శ్వపు తలనొప్పి.

ప్రియమయిన కూనేగారికి:—చాలాకాలమునుండి నా హృదయ పూర్వకమగు కృతజ్ఞతను తమకు తెలుపుకుందామనుకున్నాను. యేదో ఆటంకముచేత మీకు వ్రాయలేకపోయినాను. నేను మీకు జ్ఞాపకముండవచ్చు. క్రిందటి ఆగష్టునెలలో నా కుమా ర్తెతో కూడా వచ్చితిని. యన్ అను నామె నన్ను మీకు యెరుకచేసినది. అప్పుడు నాకు, చాలా తీవ్రమయిన పార్శ్వపు తలనొప్పి ఉండేది. నేను మీ దగ్గరకు వచ్చిన మరునాడే, నాకు భయంకరమైన తలనొప్పి వచ్చినది. తాము స్వయముగా చూచినారు. ఒకగంట కాలము తోటలో మీరు నాతో గడిపినారు. మీ విలువగల కాలము మాకొరకు వినియోగించి

తిరి. ముందు భగవంతునికి, తర్వాత మీకు నాధన్యవాదములు తెలుపుకొనుచున్నాను. నేను చిన్నతనంలో యెంతఉత్సాహంగా ఉండేదానినో యిప్పుడంత ఉత్సాహంగా ఉంటున్నాను. అందు వల్లనే మీరు నియమించిన పథ్యాన్ని శ్రిద్ధగా చేయుచున్నాను. స్నానాలుకూడ అద్భుతముగా పనిచేయుచున్నవి. అందువల్ల ఒక్కస్నానంకూడా యెవరూ మానటానికి వీలుండదు. ఆవిరి స్నానపు పనిముట్టు మావద్ద లేకపోవుటవలన, ఆవిరి అమర్చు కొనుటే కష్టమనిపించుచున్నది. నాకొక ఆవిరిస్నానపు మంచాన్ని పంపించగోరుతాను. దానితో 3 సీటి వాత్రిలను కూడా పంపవలసినది. నాకుమార్తె మిమ్ములను అడిగితినని చెప్పమన్నది. వందనపరంపరలతోను, అభివందనములతోను.

తమ విధేయురాలు,

బయల్ ఫెల్డు, ఈ హెచ్.

## 45. మేహవాతము, ఆమవాతము, పక్షవాతము, తుంటినొప్పి కంటిజబ్బు.

ఈ క్రింద దస్కతుచేసిన నేను, ఈ పై వ్యాధులతో 1892 సం వత్సరం ఆకులు రాలుకాలమునుండి 3¼ సంవత్సరములు బాధ పడ్డాను. ఎన్నోమందులు పుచ్చుకొన్నాను. నాకు ఆరోగ్యము కలుగలేదు. ఈ పట్నములోనుండే అతి సుప్రసిద్ధులైన వైద్యులు వైద్యపండితులు నాకు చికిత్స చేసినారు. కాని లాభము కనపడ లేదు. చిట్టచివరకు విశ్వకళాపరిషత్‌కు సంబంధించిన ఒక

ప్రొఫెసర్ ఒక డాక్టరు. లూయీ, కూనేను, సంప్రదింపుమని నాకు సలహా యిచ్చినారు. యిప్పటికి మూడున్నర సంవత్సరాలు వివిధ వైద్యులు వివిధ చికిత్సలు చేసినారు. వైద్యశాస్త్రములో అధికారిక పురుషులుగా నుండేవారు వైద్యము చేసినారు. నాస్థితి నానాటికి ముదిరి దుర్భరమై పోయినది. లూయీ కూనేగారు తన నవీన విధానముతో 3 వారాలలోనే ఉన్న రోగాలు పోగొట్టి నేను పనిచేసేశక్తిని కలిగించి యున్నారు.

ఏంజర్, లీప్ జిగ్ — హెచ్. కె..

## 46. శ్వాసాశయక్షయ - గుండెజబ్బు, అస్థిక్షయ, ప్రేవులయందుమంటలు, మూల వ్యాధి, రక్తముతోకూడిన మూత్రపిండము

ప్రియమైన కూనేగారికి:— అలపతీ వైద్యులంతా నయముకాదని నిర్ణయించినందున నేను చావుకు యెదురుచూస్తున్న సమయమందున నాకుమారుడు మీరు వ్రాసిన తొట్టివైద్యపు ప్రతి తెప్పించి నాకు చూపినాడు. నడిఏట్లో మునిగిపోయ్యేవాడు యేవిధంగా చేతికందినపెల్లుదుబ్బులయినా పట్టుకుంటాడో, ఆవిధముగానే నేను మీ గ్రంథము తీసికొని చదివితిని. మీరు చెప్పిన తొట్టిస్నానములు ఆహారవిధానము అత్యద్భుతముగ పనిచేసినవి. చికిత్స 5 మాసాలు చేసిన తర్వాత నాకుండిన పైవ్యాధులన్ని పోయినవి. 12 సంవత్సరాలు చికిత్సచేసీ కూడా మందు వైద్యులు యేరోగాన్ని కుదర్చలేక నా స్థితిని చెడగొట్టినారో,

ఆ రోగములన్నియు కూడా మీ విధానమువలన 5 మాసాలలో నయమయినవి. యఫ్ అను నతడు నా సలహామీద మీ పుస్తకము తెప్పించుకున్నాడు. అతని హృద్రోగము నయమైనది. మీ వైద్యాన్ని బాగుగా వ్యాప్తిచేస్తున్నాను. నేనిక్కడ చాలామందికి రోగాలు నయము చేసితిని. 16 యేండ్ల ఆడపిల్లకు ఆరు సంవత్సరములనుండి అస్థిక్షయకు అనేకమంది వైద్యులు చికిత్సచేసినారు. నయముకాలేదు. వెన్నులోనుండి పాదాలలోనుండి, చేతులలోనుండి యెముకముక్కలు బైటికి వచ్చుచున్నవి. వారానికి 2 తూరులు దేహమున కంతకూ ఆవిరిపట్టుచూ దినమునకు 3 లింగస్నానములు, మీరు చెప్పినట్లు కఠినమగు పథ్యము నవలంబించినది. నా సంతోషము నేమని చెప్పను? యెముకలగూడల్లే ఉండే నా బిడ్డ యిప్పు డారోగ్యమును పొంది సుఖముగా నున్నది. కూనేగారూ! మీకు నా హృదయపూర్వకమైన ధన్యవాదములు తెలుపుకొనుటకే యీ పంక్తులు వ్రాసితిని.

మీ విధేయురాలు,

గ్రాస్‌హిలిమ్ సుఫెల్‌డు, యు. గారిభార్య.

47. పక్షవాతము, మలబద్ధకము, గ్రంధులవాపు, కంఠమాల

అయ్యా, ఇదివరకు నాకు జబ్బుచేసినపుడు మీరిచ్చిన అద్భుతమయిన సలహా మీరు చూపిన ఔదార్యములకు నా ధన్యవాదముల నందజేయుచున్నాను. అనేక సంవత్సరాలనుండి నాకు అజీర్ణవ్యాధి ఉండేది. దానికి తోడుగా 1882 సం॥ నుండి కంఠమాలగూడాఉన్నది.ఎన్నోమందులు వాడినాను. సుప్రసిద్ధ

లైన వైద్యుల సలహాలు తీసుకొన్నాను. నావ్యాధి మరింత ముదిరిపోయినది. అందువలన వైద్యులమీద నాకు విశ్వాసము లేకుండా పోయినది. ఇట్టి నిస్సహాయస్థితిలో మీ వైద్యవిధానము విని, అప్పుడే లీప్ జిగ్ నకు ప్రయాణమైనాను. అప్పటికే నా యెడమ పాదమును శస్త్రముచేసినారు. అందువలన కర్రల ఆధారముతో నడుచుచున్నాను. మీ వైద్యము నాకు బాగా ఉపయోగించినది. కొలదిదినములలోనే కర్రలను; నిమిత్తంగా పెట్టికొని నడువగలిగితిని. ఇంకొక మూడుదినములు చికిత్స చేసేటప్పటికి ఆకర్రలతో నిమిత్తములేకుండా పోయినది. చికిత్స కాలంలోకూడా నాకు చాలా హాయిగానే ఉన్నది. నేను మొదటిలోనే లీప్ జిగ్ వచ్చియున్నట్లయితే శస్త్ర వైద్యులు చేసిన వైద్యమువలన యేర్పడిన మచ్చలు నా కంఠముమీద లేకుండాపోయేవి. నావ్యాధి యిప్పుడు నయమైనను ఆ మచ్చలు మాత్రము తప్పలేదు. కూనేగారూ! నేను మీకు సర్వదా కృతజ్ఞుడను. మీవైద్య విధానము నేను వెళ్లినచోటులందెల్ల శక్తికొలదీ ప్రచారంచేస్తాను. విధేయుడు. బి. బర్గ్వెండ్ హెమ్,

## 48. సవాయిరోగము, నిదలేకపోవటం, శిరోవ్యాధి.

ప్రియమైనకూనేగారికి:— దుర్భరమయిన సవాయి వ్యాధికి మీ వైద్యమువలన పొందినమేలునకు, కృతజ్ఞత తెలుపుట నావిధి. సుప్రసిద్ధులైన వైద్యులు యీ రోగం నయముకాదు అని నిశ్చయం చేసినారు. ఈ రోగమునకు 7,8, సం॥ లు వివిధము

లయిన పాదరసపుమందులు వాడినాను. 2,3, సం॥ లు మిక్కిలి వ్యయసాధ్యమయిన గంధకపు నీటిస్నానములు చేసినాను. వీని వలన రోగము నయమైనట్లు కనపడినది. కాని, నిజముగా నయముకాలేదు. మందులవలన లోపల అణిగిపోయినది. ప్రతి సంవత్సరము రోగము కనపడేది. మందు వాడేవారు. అప్పుడు బలహీనమువచ్చేది. శక్తి ఉడిగిపొయ్యేది. పనిచేసేశక్తి తగ్గిపోయేది. చిట్టచివరకు భరింపలేని తలనొప్పులు వచ్చేవి. పిచ్చియెక్కినట్లు ఉండేది. కొన్ని నెలలు వరుసగా నిద్రలేదు. మా వైద్యుడు నన్ను తిరిగి గంధకపునీటితో స్నానాలు చేయవలె నన్నాడు. చేయకపోతే మెదడు పల్చబడి పోతుందన్నాడు.

ఇట్లా చిరకాలం జరగటానికి వీలులేదను కొన్నాను. ఈ వైద్యులిచ్చే విషపుమందుల వలన నాదేహము పాడయిపోతుందని తెలిసినది. ఇంకా యేవైద్యముమీద ఆశలేదు. ఆ నిరాశతోనే మీ వైద్యము నారంభించినాను. 3 స్నానాలు చేసేటప్పటికే నాకు విశ్రాంతి కలిగినది. నిద్రపట్టినది. నిరపాయకరమై సులభమైన మీ వైద్యవిధానమును అందరురోగులు అవలంబిస్తే యెంతో మేలు కలుగుతుంది. ఎంతోబాధ తప్పుతుంది; మీ వైద్యముయొక్క మాహాత్మ్యాన్ని నేనుసంపూర్ణముగా స్తుతింపజాలను. సవాయిరోగం అసలే నయముకాదనిచెప్పే, మందు వైద్యులు ఎంతపొరపాటు పడుచున్నారో, నా కిప్పుడు తెలిసినది. ఈ రోగంతో బాధపడే రోగుల మేలుకొరకు నాకు సవాయిరోగం మీ వైద్యములో నయమైన విషయాన్ని వెల్లడి చేస్తున్నాను. చిరకాలంనుంచి వేరుపాతుకుపోయిన

నా రోగం మీ వైద్యములో నయముకావడం నిజముగా అద్భుతమైన విషయమే. రోగము నయమైన తర్వాతకూడా యింకా కొంతకాలము చికిత్స చేశాను. దానితో దేహము సంపూర్ణముగా శుద్ధిపొందినది. ఇప్పుడు నేను నవయువకునివలెయున్నాను. నా ఆరోగ్యము, ఉత్సాహము అభివృద్ధి పొందినవి. కూనేగారూ! దీనికంతకును నేను మీకు కృతజ్ఞుడను. మీ కెప్పటికిని కృతజ్ఞుడనై యుండెదను. ఇట్లు మీ విశ్వాసపాత్రుడు,

లీప్‌జిగ్, యఫ్. యీ.

## 49. మూత్రపిండ దాహము, మూలవ్యాధి, నంజు

ప్రియమయిన అయ్యా! కొన్ని సంవత్సరాల ముందర నాకు జబ్బు చేసినది. మూత్రపిండ వ్యాధులు, మలబద్ధకము నిద్రలేమి, మొదట వచ్చినవి. అప్పుడెంతో బాధను భరింపుచుంటిని. 3 సం॥ తర్వాత బాగా నీరసపడి రోగము యెక్కువై పట్నపు ఆసుపత్రిలో చేరినాను. మూత్రపిండాలలో దాహము, శిలామేహము, మూలవ్యాధి ఉన్నవి. నంజుకూడా వస్తుందన్నారు. ఎన్నో మందులు వాడినారు. సుగుణము కలుగలేదు మీ వైద్యమును మొదలుపెట్టిన మొదటిగంటలోనే సుగుణము కలిగినది. నన్నిప్పు డెవరైనా చూస్తే నాకింత జబ్బుచేసినదని, నమ్మరు. నే నారోగముతోనే చనిపోవలసినది. నా ఆయుస్సు మంచి ఆరోగ్యము మీ విధానములోనే నాకు లభించినవి. అందుకు కృతజ్ఞుడను. మీ విశ్వసనీయుడు.

లీప్‌జిగ్. జి. హెచ్.

## 50. పంటినొప్పి, జ్వరము.

ప్రియమయిన కూనేగారికి, మీరు వ్రాసిన సలహా ప్రకారము, నా రోగానికి యింకా యితరులరోగాలకు కూడా మీ వైద్యమును జేయించినాను. ఆ యా కాలములలో వచ్చే జ్వరాలవల్ల, పంటినొప్పులవల్ల బాలా బాధపడ్డాను. ఆ యా ప్రదేశాలలో పట్టిన ఆవిరులవల్లను, చన్నీటి కటిస్నానములవల్లనూ, నాకు ఉపశాంతి కలిగేది. నాకు కుడిచేతిమీద, కత్తిపోటు తగిలినది. దానికి కూడా మీ వైద్యమునే చేసినాను. స్నానము చేసినప్పుడల్లా బాధలు తగ్గినవి. ఆఫ్రికా దేశవాసులైన హాటెన్టాటులకు, జబ్బుచేసినపుడు వారిలో కొందరికి మీ వైద్యము చేసి రోగనివారణ చేసితిని. ఇతర దేశాలకుపోయే మతప్రచారకులు ముందుగా తొట్టివైద్యము నేర్చుకొని ఇతర దేశాలకు పోవలసినదని మతప్రచారక సంస్థలకు నేను సలహా యిచ్చినాను.

మీ ప్రియశిష్యుడు,

వారమ్‌బాద్, కేఫ్ కాలనీ, సి. డబ్ల్యూ మతప్రచారకుడు

ఆఫ్రికా

## 51 మేహవ్రణము, నిద్రలేకపోవటము

యన్ అనువారు యిట్లు వ్రాయుచున్నారు. ఏప్రియల్ నెలలో మెడమీద ఒకగట్టి కంతి పుట్టినది. నాకప్పుడు చాలా బాధ కలిగినది. మొదట్లో నేను దానిని చూడలేదు, కాని ఆకంతి క్రమంగా పెరిగిపోయినది. నా ఆరోగ్యముకూడా చెడిపో నారంభించినది. నా ఆకలి తగ్గినది. నడుములో లాగినట్లు నొప్పి పుట్టి,

నిద్రపట్టేదికాదు. ఆకంతి కోడిగుడ్డంత లావైనది. బాధలు కూడా హెచ్చువైనవి. దానితో ఆకలి నిద్రలు లేకుండా పోయినవి. తీవ్రమగు జ్వరమారంభించినది. ఏదైనా గట్టి చికిత్సా విధానము నవలంబించాలనుకున్నాను. కూనేగారు కనిపెట్టిన పనిముట్టుతో ఆయా ప్రదేశాలలో నీటిఆవిరి పట్టేవాడను. ఆవిరిపట్టినపుడల్లా బాధ లుపశమించేవి. దాని తర్వాత ఒక లింగస్నానము చేసేవాడను. స్నానానికి, స్నానానికి మధ్య కంతి ఉన్నచోట శుభ్రమయిన తడిపాత్తివేసి దానిపైన ఉన్ని గుడ్డ వేసి కట్టేవాడను. ఆకంతి ఊదారంగుగా ఉండేది. మొదట్లో చాలా గట్టిగా నున్నది. ఉండి ఉండి బాధ పుట్టేది. పై చికిత్సతో 4 మొ॥ 6 దినములలో ఆ కంతిలో గుండు సూదంత రంధ్రములు పడినవి. రంధ్రముల సంఖ్య 20 వరకు పెరిగినవి. దానిలోనుండి రక్తము, కొంసు కారేవి. కంతి అట్లాగే గట్టిగాను నల్లగాను ఉండినది. ఇంకొక 4 దినాలలో ఆచిన్న రంధ్రాలన్నీ కలిసి, పెద్దరంధ్రాలైనవి. వానిలోనుంచి ధారాళంగా మురికి వచ్చేది. చిట్టచివరకు అన్ని రంధ్రాలు కలిసి ఒక్కటే పెద్దవ్రణమైనది. దానిలోనుంచి, చీము నెత్తురు వచ్చేది. అప్పటినుంచి బాధలు క్రమంగా తగ్గి పుండు మానినది. ఒక్క పెద్దబరువు నా దేహమునుంచి దింపినట్లయినది. పూర్వముకంటె యిప్పుడు నేను ఆరోగ్యముగా నున్నాను. నాబలము వృద్ధిపొందినది. నాబలము, ఆరోగ్యము ఉత్సాహము యిప్పుడున్నంత ఆనందము ఎప్పుడూ ఉండేదిగాదు.

## 52. దుర్బలమైన జ్ఞాపకశక్తి, మేదోవృద్ధి

శ్వాసాశయవ్యాధి, తీవ్రమగు నాడీదౌర్బల్యము, చెముడు, గొంతునొప్పి, తీవ్రమగుజ్వరం. ప్రియమైన కూనేగారికి, 2 - 2 కలిపితే నాలు గవుతుంది అనే లెక్క యెంత తేలికగా ఉన్నదో మీరు కనిపెట్టిన యీ నవీన చికిత్సావిధానము, రోగాలను అంత తేలికగా నయముచేస్తుంది.

పూర్వము వ్యాయామము చేసేటప్పుడు కొంచెము అలసట వచ్చినా ఓర్చుకోలేక పోయేవాడిని; ఇప్పుడు మీ చికిత్సలో నా దేహముయొక్క లావంతా తగ్గిపోయినది. ఇప్పుడు గంట లాది తోటలో పనిచేసినాకూడా నా కలసట రావటంలేదు. పూర్వము నేను నడిచేటప్పుడు నా ఊపిరితిత్తులు దుర్బలముగా నుండుటవలన, నోటితోనే గాలి పీల్చవలసి వచ్చేది. మీ వైద్యముచేసిన తర్వాత యిప్పుడు నా ఊపిరితిత్తులు బల పడినందున నోరు మూసికొని ముక్కుతోనే నెమ్మదిగా గాలి పీల్చుచున్నాను. నామెదడు పలచబడినా జ్ఞాపకశక్తి తగ్గిపోయినది. చెప్పటానికి వీలుకానంత పిరికితన ముండేది. కొద్ది కారణానికికూడా పెద్దకోపము వచ్చేది. నాకు సంబం ధించిన విషయాలలో బొత్తిగా శ్రద్ధ ఉండేది కాదు. నా స్థితిని గురించికూడా 6 నెలల కిందటవుతే యెవరికీ యేమి చెప్పేదానినికాదు. ఈ సంగతి నా భర్తకే బాగా తెలుసు. నా స్థితిని యెవరూ బాగుచేసేవారు లేరని నేను అను కొన్నాను. అయితే యిప్పుడు సంగతులు అద్భుతముగా మారినవి. మీ చికిత్సవలన నేను కొత్తగా పుట్టినట్లయినది.

ఇంతేకాకుండా నేను యింకొక చిక్కులోనుంచికూడా బైట పడ్డాను. నేను మా వూరు వెళ్ళినప్పుడు వెంట నొక పనిచేసే పిల్లను తీసుకు వెళ్ళినాను. అది అప్పుడు ఆరోగ్యముగా నున్నట్లే కనపడినది. ఒక వారము రోజులు గడవకమునుపే ఆ పిల్ల కంట నీరు పెట్టికొని, తాను పనిచేయలేనని చెప్పినది. ఆమెపాదాలు వాచినవి. మేజోళ్ళు వేసికొనుటకుగాని, చెప్పులు తొడుగు కొనుటకుగాని వీలులేనిబాధ, పిచ్చిపుడుతుందా యేమి అన్నంత తీవ్రమగు తలనొప్పి, మండిపోయే జ్వరము, వీనితో ఆ పిల్ల అటూ యిటూ కదలలేదు. ఆ పిల్లను ఆ స్థితిలో మేముండే పట్నానికి చేర్చటం చాలా కష్టమయింది. అందువల్ల ఆ పిల్లను అలాగే పరుండబెట్టి పైన గడ్డను కప్పితిని. అపుడు చెమట పోసినది. తర్వాత కటిస్నానం చేయించితిని. తర్వాత బోధించి ఒక లింగస్నానం కూడా చేయించాను. ఆస్నానంవలన ఆమెకు తేలికగాను కులాసాగాను ఉన్నది. అట్లే యింకొకసారి చేయించాను. మర్నాడు కూడా అట్లే 2 మార్లు చేయించాను. 3 వ నాటికి, ఆవిరి పట్టవలసిన పనిలేక పోయినది. ఆపిల్లకు చాలా కులాసా చిక్కినది.

సెంట్ పీటర్ సుబర్గు. ఆగ్. ఈ.

## 53. తలనొప్పులు.

ప్రియమయిన కూనేగారికి, లీప్‌జిగ్ పట్నములో తాము నా కొసంగిన శ్రద్ధతో కూడినచికిత్సకు, హృదయపూర్వకమగు కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను. కొన్ని సంవత్సరాలనుండి నన్ను

బాధించుచూ చిట్టచివరకు భరింపనలవిగాకుండా, పెరిగిపోయిన యీ కాలికమగు తలనొప్పి మీ చికిత్సావిధానములో నయమైనది. మీ స్నానవిధానము నేను బ్రతికి ఉన్నంతవరకూ వాడుతుంటాను. మీరు కనిపెట్టిన యీ నూతన చికిత్సా విధానము ప్రజలకు ఉపయోగించి మేలుచేస్తూ — మీరు చిరకాలము జీవించియుండవలెనని కోరుతున్నాను:

ఇట్లు విధేయురాలు,

లీప్ జిగ్. యమ్. డబ్లియూ

## 54. సప్తపథలోనుండి శ్లేష్మస్రావము, ముఖముపైద పొక్కులు

నాకు గల పై 2 వ్యాధులు కూనేగారి చికిత్సావిధానములో నయమైనవని యిందుమూలముగా స్థిరపర్చుచున్నాను. కావలెనంటే చికిత్సావివరాలను యెప్పుడైనా వ్రాసియిచ్చెదను.

లీప్ జిగ్, ఎమిల్ పి.

## 55. మూర్ఛలు, అపస్మారము, రక్తక్షీణము.

నాకుమార్తె రోగం నయముకాదని మేము నిరాశచేసికొని ఉన్నస్థితిలో మీ చికిత్సవలన ఆమె రోగం నయమైనది. ఇందుకు మాకృతజ్ఞత తెల్పుకొనుచున్నాను. గొప్పవైద్యులు ఖరీదుగల మందులతో నయముచేయలేని రోగము స్వాభావిక భూతమయిన నీటితో నయమైనది, నాకుమార్తె రోగనివారణ

వృత్తాంతముయొక్క వివరములను యిచ్చుచున్నాను. 9 సం॥ పిల్లగా ఉండగా నాబిడ్డ కీవ్యాధి ప్రారంభించినది. అప్పుడు మేము గమనింపనేలేదు. తర్వాత చిన్న మూర్ఛవచ్చి అప్పుడే తెలిసేది. ఆ మూర్ఛలే తరచుగా రామొదలు పెట్టునప్పటికి, సమర్థుడయిన వైద్యునిసలహా తీసుకొన్నాను. మా కొమా ర్తెకు రక్తక్షీణము నాడుల దౌర్బల్యము ఉన్నదని చెప్పి నారు. అందుకేవో చూర్ణాలు, మందులూ యిచ్చినాడు. దానితో రోగము నయముకాలేదు. ఎక్కువైనది. మూర్ఛలు యింకా ప్రళయముగాకుండా వచ్చేవి. ఇంకా యెంతో మంది యితర వైద్యులను కూడా సంప్రదించినాను. వారుకూడా అవే మందులను యిచ్చేవారు. ఏ మందులు పనిచెయ్యలేదు. పొటాషియం బ్రొమైడ్ మాత్రం యివ్వ వలసినదని చిట్టచివరకు ఒక వైద్యుడు చెప్పినాడు. అప్పుడు కూడా రోగము నయమయ్యే రోగంకాదని చెప్పినాడు. మీరు వివరంగా సంగతులు బోధించేదాకా మేము ఆ మాట నమ్మి ఉన్నాము. ఇప్పుడు మీ వైద్యమువలన ఆ రోగము సాంతముగా నయమైనది. ఆ బిడ్డకు మీరే రక్షకులు, ప్రాణ దాతలు అని మా హృదయ పూర్వకమగు నమ్మకతో మిమ్ము౽ను గౌరవించు చున్నాము. ఇందుకు మీకు, మా హృదయపూర్వక ధన్యవాదములు.

ఇట్లు మీ విశ్వాసనీయులు,

యఫ్. హెచ్.

గాబ్లోన్ జ్. బొహీమియా,

## 56. జలుబు, జ్వరము.

ప్రియమయిన కూనేగారికి, తాము నాకు నా తల్లికి చేసిన సహాయమునకు మేము చూపించే కృతజ్ఞత యేమూలకూ చాలదు. తీవ్రమగు జలుబు, పెద్ద జ్వరము వచ్చినపుడు నేను మీ వైద్యము నవలంబించి మీ విధానాన్ని పరీక్షచేసినాను. అందువలన నాకు మేలే కలిగినది. నాకు ఆశ్చర్యమున్నూ కలిగినది. ముందుకాలములో మీ వైద్యమే ప్రధాన వైద్యముగా నుంటుందని నాకు నమ్మిక కలదు.

హాంబర్గు, సి. హెచ్. ఆర్. ఆర్. డబ్ల్యూ. పి. హెచ్. డి.

## 57. అస్థిగ్రంధి.

ప్రియమయిన కూనేగారికి, శస్త్రముతో పనిలేకుండా మీ చికిత్సా విధానములో, రోగనివారణము పొందిన నేను మీకు ధన్యవాదములను అర్పించుకొనుచున్నాను. మందు వైద్యులు నా కాలు 8 సార్లు శస్త్రము చేసిరి. మొదట కాలివేళ్ళు తీసివేసినారు. తర్వాత పాదమంతయు తీసివేసినారు. నేను కర్రల ఆధారముతో నడచి వచ్చుచున్నాను. అయినప్పటికీ యెముక జబ్బు నయముకాలేదు. తర్వాత కాలు బరువెక్కినది. పిడికిలి అంతగ్రంధి పుట్టినది. బాధ కూడా పుట్టినది. ఇంకొకతూరి శస్త్రము చేస్తారని కూడా భయము పుట్టినది. అప్పుడు మీ వైద్య విధానాన్ని గురించి విని ఈ మార్చి నెలారంభములో తొట్టివైద్యము నారంభముచేసినాను. 4 వారాలు, తొట్టిస్నానములు చేయుచూ మీరు నిర్ణయించి

నట్లు యితరపద్ధతులు కూడా అవలంబించినందున ఆగ్రంథి అదృశ్యమైనది. ఇంకొకతూరి శస్త్రము చేయించుకోకుండా తప్పి నది. నేను మొట్టమొదటిలోనే మీా వైద్యము నవలంబించి యుంటే నా అవయవాలన్ని నిలిచియుండేవి. ఒక్క శస్త్రము కూడా అవసరము లేకుండా పొయ్యేది. తాము చేసిన సహాయమునకు తిరిగి కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

తమ విధేయుడు,

రూడ్ నిట్ జ్ — సోఫీ, డబ్లియూ.

## 58. గర్భకోశములో వ్రణము, రక్తప్రదరము.

ప్రియమయిన కూనేగారికి, డిశంబరు నెలలో నా భార్యకు భయంకరమైన రక్తప్రదరవ్యాధి వచ్చినది. కె. అనే డాక్టరును మాయింటికి తీసుకొని వచ్చినాము. అప్పుడు రాత్రి 11 గం॥ లయినది. దూదిపొత్తులు పెట్టి అప్పుడు రక్తస్రావాన్ని ఆపినారు. మర్నాటి ఉదయమునకు రక్తప్రదరము యెక్కువైనది. అప్పుడు డి. అనే యింకొక డాక్టరును తీసుకొని వచ్చినాము. ఆ వైద్యుడు శస్త్రముచేయవలె నన్నాడు. నా భార్యకా యేమీా నిమ్మళము లేదు. అప్పుడు హెచ్ అనే యింకొక ప్రొఫెసర్ ను సంప్రదించినాను. ఆతడు అది గర్భాశయ వ్రణమనియు, దానికి వెంటనే శస్త్రమే చేయకున్న ఆమె బ్రతుకదనియూ చెప్పినారు. శస్త్రము లేకుండా యేదైనా యింకొక వైద్యము చెప్పుమన్నాను. శస్త్రము చేయకపోతే ఆ రోగము నయమే కాదన్నారు. అప్పుడు నేను మీా

వద్దకు వచ్చినాను. మీరు కటిలింగ స్నానాలు, ప్రత్యేక మయిన పథ్యము చెప్పినారు. నాభార్య చికిత్స మొదలుపెట్టి నప్పటినుంచి, సుగుణము గలుగ నారంభించినది. ఇప్పుడు ఉదయము 5 గం॥ నిద్రలేచి రాత్రి 10 గం॥ వరకూ యింటిపని. అంతా చేస్తున్నది. ఎట్టి అలసటయు కలుగదు. ఇప్పుడామె. చాలా ఆరోగ్యముగా నున్నది. మా హృదయపూర్వక ధన్య. వాదముల నర్పించుచున్నాను. బాధపడే వారికి మీ వైద్యము. చేయవలసినదిగా సలహా నిచ్చుచున్నాను. మీ వైద్యము. చేయకపోతే నాభార్య యెప్పుడో చనిపొయ్యేది.

యిట్లు మీ విధేయుడు – ఆల్‌బర్టు.

లీప్. జిగ్. డబ్లియూ.

## 59. కోరింత దగ్గు

ప్రియమయిన కూనేగారికి, నా బిడ్డకువచ్చిన కోరింతదగ్గునకు సలహాకోరుతూ మీకు గడచిన ఫిబ్రవరి నెలలో ఉత్తరము వ్రాసినాను. అమూల్యమయిన మీ సలహావలన ఆ బిడ్డను తల్లి ప్రక్కలో పరుండబెట్టి బాగుగా చెమట పుట్టునట్లు చేయ వలెనని తెలిసికొన్నాను. మీ పుస్తకములో వ్రాసినట్లు యితర. పద్ధతులు కూడా అవలంబించినాము. అప్పుడిట్లు జరిగినది.

14 వారముల వయస్సుగలిగిన మాబిడ్డకు ఆదివారంనాడు. కోరింతదగ్గు వచ్చినది. అప్పుడా చుట్టుప్రక్కల కోరింతదగ్గులు ఉన్నవి. మాపిల్లను యెత్తుకొనే దాయిపిల్లకు, కోరింతదగ్గు వచ్చినది. దానినుండీ మాబిడ్డకు కోరింతదగ్గు వచ్చినదని తెలుసు

కున్నాను. మా పిల్ల తల్లిపాలు త్రాగినది. 88 ఫారెన్‌హీట్, డిగ్రీల నీటిని ఒంటిమీద పోసినాము. మధ్యాహ్నము, ఫారెన్ హీట్ 81 డిగ్రీలనీటితో కటిస్నానమును చేయించినాము. మా బిడ్డ యేడుస్తుందని ఆస్నానము కొద్దిసేపే చేయించినాను. ఆ స్నానం పనిచేసినది. విరేచనము సాఫీ అయినది. 3 వ నాడు కోరింతదగ్గు తీవ్రముగా తగ్గినది. అప్పుడే మీాజాబు చేరినది. నాభార్య ఆబిడ్డను ప్రక్కలో పరుండబెట్టుకొని దుప్పటికప్పి. చెమట పట్టించినది. అప్పుడు మధ్యాహ్నపు స్నానం ఆపివైచి నాము. వస్తే 2-3, మాసాలదాకా పోదనే కోరింతదగ్గు 12 దినాలలోనే నయమైనది. మీారు కోరింతదగ్గును గురించి గ్రంథ ములో వ్రాసినదంతా సత్యమేనని ధృవపర్చుచున్నాను. భగవంతునితర్వాత మీారు, మీావైద్య విధానము మాబిడ్డకు ప్రాణదానం చేసినవారయినారు. ఇందుకు, నేను, నాభార్య ధన్యవాదముల నర్పించుకొను చున్నాము.

హోర్జిబర్గు. ఈ. కె.

## 60. నాడీ వ్యథ, నాడీ దాహము, మూర్ఛ

ప్రియమైన అయ్యా, డ్రెస్ డెన్‌లో అతి సుప్రసిద్ధవైద్యులు చిరకాలం చికిత్సచేసి నారోగం నయమయ్యే ఆశలేదని స్పష్ట ముగా చెప్పినతర్వాత, మీావైద్యము నవలంబించి నా రోగము లను పోగొట్టుకున్నాను. రోగములోనుండగా 3 మాసాలు

మంచము మీదనే ఉన్నాను. ఆ రోజుల్లో ఆరోగ్యవంతులు, యుద్ధములో చేరవలెనని రాజశాసనమున్నది. నారోగంచూచి నన్ను వారు వదిలిపెట్టినారు. అట్టిరోగము మీ విధానములో నయమైనది.

డెన్స్ డెన్. హేన్. సు. బి.

## 61 చెముడు, వెన్నులోనొప్పి, దగ్గు. శ్వాసావరోధము

ప్రియమయిన కూనేగారికి, అప్పుడపుడూ మాక్షేమం వ్రాయ వలసిందని మీరు కోరినారు. మొదటితూరి మా వృత్తాంతము వ్రాయుచున్నాను.

ప్రతిదినము మిమ్మును గూర్చి చెప్పుకొనుచుందుము. కాలిక మగు చెముడుతో 1½ సం॥నుండి వినపడక బాధపడుచున్న మా బిడ్డకు మీ విధానమువలన కొన్ని వారములనుండి బాగుగా వినపడుతున్నది. దాని గొంతులో నుండే టాన్సిల్సు, చాలా వాచియుండెను. అవి క్రమంగా తగ్గిపోయినవి. ఎప్పుడూ యీపురుమనుచూ యేడుస్తూ ఉండే పిల్లకాయ మాకి యిప్పు డందరితోను కలిసి ఉత్సాహంగా ఆడుకొనుచున్నాడు. ఇది వరకు సన్నని గొంతు. యెక్కడో మాట్లాడేవాడు. ఇప్పుడు గంతులువేస్తూ, పాటలుపాడుచూ, చప్పట్లుకొడుతూ ఆడుకుం టున్నాడు. ఇదివరకుండే దగ్గు శ్వాసావరోధము యిప్పుడు జాస్తిగా రావడములేదు. వాని దైహికమానసిక శక్తులు క్రమక్రమంగా అభివృద్ధినొందిన చిహ్నములు కనిపించు

చున్నవి. మేము, మిమ్ములను ప్రతిదినము స్తుతిచేయుచున్నాము నేను నా తరఫున నాభర్తతరఫున ధన్యవాదముల నర్పించుకొను చున్నాను. ఇదివరకు నా వెన్నులో మంటలూ పోట్లు ఉండేవి. లింగస్నానమువంటి నిరపాయమైన చికిత్సలతో నే నాబాధను పోగొట్టుకొన్నాను.

విధేయురాలు, రెవ రెండు, యమ్ - గారి భార్య.

## 62. రక్తప్రదరము

ఈ ప్రదేశములో నివసిస్తూఉండే ఫ్లోరికాస్కి-ల్లేరియస్, అను రొమేనియన్ స్త్రీ 4 వారాలనుంచి యెడతెగని రక్తప్రద రముతో బాధపడుచున్నది. మీ సలహాప్రకారము, వారానికి 2 కటిస్నానాలు ఒక ఆవిరిస్నానం దినమునకు 2,3 లింగ స్నానాలు, ఉద్రేకము కలిగింపని పథ్యము నవలంబించినది. చికిత్స మొదలుపెట్టిన ఆరవనాడు చాలా సుగుణము కనుపడి నది. ఇవ్వాళ్ళకు చికిత్స ఆరంభించి 15 దినములు జరిగినది. ఆమెస్థితి పూర్తిగా బాగుపడినది. ఆ స్త్రీ పక్షమునను, బాధిత మానవలోకము పక్షమునను నేను హృదయపూర్వక ధన్యవాద ముల నర్పించుచున్నాను. అభినందించుచూ మీవిధేయుడు.

తియోడర్. డీ.

క్రేన్సిల్ హాంగెరీ వేనియా. గ్రీక్ కేథలిక్ మతప్రచారకుడు.

## 63. తీవ్రమగు నాడీవ్యాధి:దుర్బలమయిన జ్ఞాపకశక్తి

కొన్ని సంవత్సరాలనుండి నాభార్య నాడీవ్యాధితో బాధపడు చున్నది. వర్తకములో ఉండే పనివత్తిడివలన ఆమెస్థితి మరింత పాడయినది సంపూర్ణముగా రోగనివారణము చేసుకుంటేనే గాని యెక్కువకాలము జరగటానికి వీలులేదు. ప్రకృతి వైద్యము నవలంబించినాము. అందులో ఉండే ప్రక్రియ లన్నీ చేసినాము. ఎన్నో ప్రక్రియలవలన, సుగుణము కలిగి నది, కాని రోగము సాంతముగా నయముకాలేదు. అయ స్కాంత చికిత్స కూడా వాడినాము. అది కూడా సాంతముగా రోగాన్ని నయముచేయలేదు. 1890 వ సం॥రం యేప్రియల్ నెలలో కూనేగారి తొట్టివైద్యము కూడా చేసి నాము. మొదట సుగుణము కనపడలేదు. రోగంకూడా నానాటికి ముదురుతున్నట్లే కనిపించినది. యేడు వారములు అయిన తర్వాత ఒకమార్పు వచ్చినది. రోగము చెల్లగా రోగము వస్తున్నవి. ఈ భయప్రదమయిన స్థితిలో కొన్ని నెలలు గడిచినది. దేహములో ఉండే ధాతుశక్తి కూనేగారు కనిపెట్టిన లింగస్నానాలు తోడై 11 నెలలు చికిత్స చేసిన తర్వాత మంచి సుగుణము కలిగినది. అదివరకు నాభార్య జ్ఞాపకశక్తి తగ్గి ఉన్నది. తిన్నగా ఆలోచింపలేదు. ఇప్పుడాస్థితి మారి ఆమె మానసికశక్తి వృద్ధిపొందినది. ఇప్పుడు బాగుగా ఆలోచింపగలదు. ఆమె దేహాశక్తి కూడా బాగుపడినది. ఉత్సాహశక్తి కూడా వృద్ధిపొందినది. కొన్ని సంవత్సరముల నుండి లేని శక్తులు యిప్పుడామెకు కలిగినవి. మునుపు య్యేదైనా

ఆలోచింపవలెనంటే కష్టపడేది. ఇప్పుడు మానసిక పరిశ్రమ అంటే ఉత్సాహంగా ఉంటుంది. అట్లాగే దేహశక్తి కూడా వృద్ధిపొందినది. చికిత్సాకాలము మొదటి ఆరునెలలలోను ఆమె 2 మైళ్ళకంటె కూర్చోకుండా నడవలేకపోయేది. 10 నెలలు జరిగిన తర్వాత ఆమె ప్రతిదినము 12 మైళ్ళు నడువగలుగు చున్నది, ఈ లోపుగా ఆమెకు ఆయాసము కలుగదు. కూర్చుండ వలసిన అవసరమూ లేదు. ఆమె దేహములో ఉండే ప్రతి అవ యవము యీ విధంగానే బలపడినది. మనిషి సంపూర్ణముగా మారిపోయినది. ఇదివరకు దిగులుగా నుండేది. ఇప్పుడు చాలా సుఖముగా నుంటున్నది. ఇట్టి మంచి సలహా నిచ్చినందుకు, భగవంతుని తర్వాత శ్రీ కూనేగారికి మా ధన్యవాదముల నర్పించుకొనుచున్నాము. తోడిమానవులకు మేలుచేయుటకు కూనేగారికి దీర్ఘాయువు నొసంగ భగవానుని ప్రార్థించు చున్నాను. కూనేగారి సత్యమగు యీ నవీన చికిత్సాశాస్త్రము వ్యాప్తిచెందుటకు ప్రతిరోగి ఒక నమ్మకమైన చికిత్సా ప్రచారకుడుగా యేర్పడ గలడని మానమ్మిక.

ఇట్లు

మీ విధేయుడు

బెర్లిన్, సి. యస్.

## 64. శిరస్సులోబాధ, కంటిలోజబ్బు, రక్తక్షీణం, నాడుల వ్యాధి, సంధిబంధనములు పెరుగుట, దౌర్బల్యము కఠినమగుశ్వాస.

### కృతజ్ఞతాప్రకటనము

చిన్నతనములో, బడిలో చదువు కొనేటప్పుడు అప్పుడప్పుడూ తల నొప్పులు వచ్చేవి. వానిబాధ తర్వాత యింకా యెక్కువైనది. నా 15 వ యేట ఒకతూరి పడినప్పుడు పాదానికి సంబంధించిన సంధిబంధాలు పెరిగినవి. మందువైద్యులు దానిని నయము చేయలేక పోయిరి. తర్వాత నడవటానికే వీలులేకుండా పోయినది. 5 సం॥ యెక్కువ బాధతో అట్లాగే గడపితిని. తలలో నొప్పి యెక్కువైనది. నాడులు యింకా దుర్బలమైనవి. రక్తక్షీణము యేర్పడినది. ఈ స్థితిలో వైద్యాలయానికి వెళ్ళితిని. కొంతకాలమున్న తర్వాత రోగమేమీ తగ్గకపోతే యింటికి వచ్చినాను. నానేత్రదృష్టికూడా తగ్గిపోయినది. ఏపని చేయలేనిస్థితి యేర్పడినది. జీవన్మృతుడనుగానున్నాను. లోపల యేదో కుళ్ళుతూ ఉండేది. శ్వాస కఠినంగా వచ్చేది. యెడతెగని జ్వరముండేది. కన్నులు పోతవనే భయముండేది. ఇట్టి దుర్భరస్థితిలో సహాయం చేసేవారు యెవరూ లేక సెప్టెంబరు నెలలో కూనేగారి నిరౌషధ చికిత్సాలయానికి వచ్చినాను. మొదటి స్నానంతోనే కొంచెము సుగుణము కనుపడినది. తొట్టిస్నానములు చేయగా, చేయగా. ఆ సుగుణము యింకా యెక్కువైనది. మంచి పథ్యమును యేర్పాటు

చేసినారు. కొన్ని వారములలో నాస్థితి బాగుపడినది. పూర్వపు స్థితికి యీ స్థితికి సంబంధములేదు. కొన్ని నెలలు చికిత్స చేసిన తర్వాత నా దృష్టిదోషము పోయి చూపు బాగుపడినది. నా దేహములో ఉండే దౌర్బల్యము కూడా పోయి శక్తి వచ్చినది. నేను యిప్పుడు బాగుగా చూడగలను. ఇంటిపనులు చేసుకోగలను. పనిచేయుటకు ఉల్లాసము శక్తి కూడా నున్నది. పాదములు బాగుపడినవి. నేనిప్పుడు బాధలేకుండా నడువగలను. నేనిప్పుడు కొత్తమనిషివలె వ్యవహరించుచున్నాను. ఈ సుగుణములన్నియు యీ అద్భుతమైన చికిత్సావిధానములో నాకు లభించినవి. ఇప్పుడీచికిత్స మా కుటుంబ చికిత్సఅయినది. ఎవరికి చికిత్సచేసినా యిలాగే మంచిఫలాలు కనపడుచున్నవి, రోగం వచ్చినవారందరూ, మీ చికిత్స నవలంబించి, ఆరోగ్యమును పొందవలెనని నా కోరిక.

లీప్.జిగ్. మేరీ – ఆర్.

## 65. మేహవాతము

ప్రియమైన కూనేగారికి, జబ్బు చేసినప్పుడు మీరు దయతో నాకొసంగిన సలహావలన, నేను మేలుపొందితిని గనుక, మీకు ధన్యవాదములు అర్పించుచున్నాను. క్రిందటి సంవత్సరము మే నెలనుండి మేహవాతముతో బాధపడుచున్నాను. లెప్లిట్ జిలో ఒకతూరి నారోగం నయమైనది. కాని నవంబరులో యింకా యెక్కువ తీవ్రముగా వచ్చినది. నాకు నయమవుతుందని ఆశలేకుండా పోయినది. నాకు చికిత్సచేసిన వైద్యుడు

తన వద్దనున్న మందులన్నిటిని పూర్తిగా వాడినాడు. మళ్ళీ తిరిగి కొన్ని వారాలు కనపడలేదు. దక్షిణానికిపోయి నివసించుమని చెప్పినాడు. ఇంతకంటె అతనిదగ్గర వైద్యమేమీలేదు. నాభార్య ఆమెకుండే ఆందోళనవలన మిమ్ము సంప్రదించినది. ఒకఉత్తరములో మీరు సలహావ్రాసి పంపినారు. మీరు చెప్పిన పథ్యము సరిగా చేసినాను. మిగతా చికిత్సలు బలహీనమువలన సక్రమంగా చేయలేకపోయినాను. ఫిబ్రవరి నెలారంభములో స్నానాలు ఆరంభము చేసినాను. తర్వాత సుగుణము కలుగ నారంభించినది. 3 డవ స్నానం తర్వాతనే ఒక్కొక్క రోగమే కన్పడ నారంభించినది. మీ పుస్తకము చదువకపోతే మాకు ఆందోళన కలిగేది. నాకు కొంత ఆందోళన కలుగనే కలిగినది. 4 వ స్నానం తర్వాత మెడమశీలమండలో బాధ తగ్గినది. మూత్రము చిక్కగా నల్లగా నున్నది. రోగమూలకారణాన్ని కదిలించే వైద్యము నవలంబించానుగదా అని నాకు తృప్తి కలిగినది. ఆయాసంధులలో రోగపదార్థము మొదట యెట్లా చేరుకొన్నదో ఆవిధముగానే కదలిపో నారంభించినది. సంధులలోని రోగపదార్థము కదిలినపుడెల్లా నాకు బాధలు వచ్చేవి. 14 దినాల చికిత్స తర్వాత నేను ఉద్యోగములో తిరిగి ప్రవేశించినాను. మార్చి నెలలో మంచు బడుతుంది. గాలి కూడా చల్లగా నుంటుంది. అయినప్పటికి నాకు కీళ్ళనొప్పులు రాలేదు. అప్పటినుండి నేను ఆరోగ్యముగానూ, సుఖముగాను ఉన్నాను. మీ చికిత్సావిధానముయొక్క విలువను లెక్కపెట్టలేరు. నేను మీ వైద్యాన్ని అభినందించి ప్రచారము చేయుచున్నాను.

మీ నవీన చికిత్సా విధానము యెక్కువమంది అవలంబించి లాభము పొందవలెననియు, మానవజాతిని పీడించే నవీన నాగరికతనుండి సహజమగు ప్రకృతి వంకకు ప్రజలు అభి ముఖులగుటకును నేను కోరుచున్నాను. కూనేగారూ ! నేను మీకు కృతజ్ఞుడను.

జూలియస్. యస్. ప్రభుత్వమువారి సర్టిఫికెట్ పొందిన ఉపాధ్యాయుడు.

66. కడుపులోనొప్పి, ఆకలిలేకుండుట, తలదిమ్ము, గుండె జబ్బు, రక్తస్రావము, శ్వాసాశయవ్యాధి, దౌర్బల్యము.

పజల అభినందనములు

క్రింద దస్కతుచేసిన వానిభార్య ఆమె 61 వ యేట అనేక సం॥రాలుగా 1890 సం॥ నుండి తలదిమ్ము, కడుపులోనొప్పి, ఆకలిలేకపోవటం దౌర్బల్యము మొదలగు వ్యాధులతో బాధ పడుచుండెను.

1890 సం॥ ఆరురాలు కాలములో ప్రభుత్వమువారి విశ్వకళా పరిషత్తుకు సంబంధించిన చికిత్సాలయమునకు నా భార్యను తీసుకు వచ్చినాను. ఇక్కడుండే వైద్యులంతా కడుపులోనొప్పి మూత్రపిండ వ్యాధులు కలవని నిశ్చయించేసి వివిధములగు మందులను వాడినారు. రోగం నయము కాకపోగా ఆమెస్థితి మరింత పాడయినది. 1890 సం॥ డిశెంబరు వరకు అక్కడి

వైద్యులు యీ పాడుమందు వైద్యమునకు తోడుగా కోక్ కారగారి టీకాలనుకూడా మొదలు పెట్టినారు. అప్పుడుకూడా రోగము నయము కాకపోవుటవలన ఆమెను ఆసుపత్రినుంచి యింటికి తీసుకువచ్చినాము. 1891 సం॥ ఫిబ్రవరినాటికి నాభార్య స్థితి మరీచెడినది. తలదిమ్ము యెక్కువైనది. అప్పుడు మతిపోయి నట్లుండేది. అమితమగు దౌర్బల్యము, జీర్ణావయవాలు బొత్తిగా పనిచేయడం మానివేసినవి. అప్పుడామె ఆరువారాలు పక్కమీదనే ఉన్నది. అప్పుడు హెచ్ అనే డాక్టరును సంప్రదించినాను. కుదర్పసాధ్యముకాని గుండెజబ్బువలన ఆమె కాస్థితి కలిగినదనిచెప్పి యేదో భేదిమందు యిచ్చినాడు. తిరిగి కనపడలేదు. 1891 యేప్రియల్ నెలలో కడుపులోనొప్పి చాలా యెక్కువైనది. తిన్నపదార్థము యిముడక వాంతిఅయ్యేది. అప్పుడే శ్వాసకూడా కఠినముగా వచ్చేది. రొమ్ములలోనొప్పి కలిగేది. దేహమంతాకూడా మార్పు పొందినట్లుండేది. అప్పుడు హోమ్యోపతీ వాడినాము. హోమ్యోపతీ వైద్యుడు కూడా నారోగము నయముకాదని తేల్చినాడు. తగినంత సుగుణము కూడా కలుగలేదు. చిట్టచివరకు, నాభార్య అదృష్టమువలన లూయీ కూనేగారి నిరౌషధ నిశ్శస్త్ర చికిత్సాలయమునకు చేరుకొంటిమి.

అక్కడివారి సలహాప్రకారము, దినానికి 2 లింగస్నానాలు, యుక్తమైన పథ్యము నిచ్చినారు. ఒకవారం చికిత్స చేసేటప్పటికి ఆమె ఆరోగ్యములో చెప్పతగిన సుగుణము కలిగినది. ఆమె జీర్ణక్రియ కొంచెము బాగుపడినది. ఇంకా కొన్ని వార

ములు చేసేటప్పటికి బాధలు తగ్గినవి. తలదిమ్ము శ్వాసావరోధము, మొదలగు బాధలన్నీ కూడా క్రమంగా తగ్గినవి. తగ్గించి పథ్యముపెట్టినను ఆమె దేహములోని బలము నానాటికి వృద్ధిపొందినది. ఈ విధంగా యిదివరకు కంటె నాభార్య ఆరోగ్యము వృద్ధి అయినది. ఆమెను చూచినవారెల్లరు యిప్పుడు కలిగిన పరిపూర్ణ ఆరోగ్యమునకు ఆశ్చర్యము నొందుచున్నారు. నాభార్య కంటిచూపు కూడా యిదివరకు కంటె యెక్కువ బాగుపడినట్లు నాకు తోచినది. 2 సంవత్సరాలు చికిత్సచేసి, సుప్రసిద్ధవైద్యులు కుదర్పలేని రోగాన్ని కూనేగారి చికిత్సాలయములో 8 వారాలలోనే నయమైనది. వారికి ధన్యవాదము లర్పించుట మావిధి. లోకశ్రేయముకొరకై వారు చిరకాలము జీవింపవలెనని భగవంతుని కోరుకొనుచున్నాము. సరి అయిన సలహానిచ్చి రోగములను నిజముగా నయముచేయ కలిగినవారు ఇప్పటికి ఒకరు లభించిరి.

క్రీప్జిగ్. గుస్టన్. పి.

## 67. కుదుర్ప సాధ్యముకాని కంటిజబ్బు, తల నాడులవ్యాధి, కాలికమగు సప్తపథదాహము, వెన్నులోను, ప్రక్కలందును, నొప్పులు.

ప్రియమైన కూనేగారికి, తీవ్రమైన నా కంటిరోగము చాలా త్వరగా నయమైనందుకు మీకు కృతజ్ఞతను తెలుపుచూ తోడుగా అందుకు సంబంధించిన వివరముల నిచ్చుచున్నాను. మీరు ఈ వృత్తాంతమును మీ యిష్టమువచ్చిన ట్లుపయోగించు

కొనవచ్చును. నాకు చిన్నతనములో మశూచికము వచ్చినది. అప్పటినుండి కాలికమగు నేత్రరోగముతో బాధపడుచున్నాను. ఎంతమంది వైద్యులను సంప్రదించినను ఫలము కలుగలేదు. మందులతో తాత్కాలికమగు ఉపశాంతి కలిగినను, కొంతకాలానికి యింకా అంతకన్న చెడినస్థితిలో రోగము ప్రత్యక్షమయ్యేది. రసభస్మము, పాదరసముతో చేసిన మందులు, తుత్తునాగపుద్రావము వాడినారు. కంటిమంట తగ్గలేదు. ఇప్పటికి 10 మందివైద్యుల సలహా తీసుకున్నాను. ఎవరూ యీ రోగాన్ని నయముచేయలేకపోయిరి. నానాటికి నాకంటిరోగము ముదిరిపోయింది. చివరకు కంటిలో దుర్మాంసములు వచ్చినవి. నాస్థితి దుర్భరమైపోయినది. ఆశ తెగక వియన్నాలోని కంటి ఆస్పత్రికి పోతిని. బోరిక్ యాసిడ్, కాస్టిక్ పొటాష్, కరోసివ్ సబ్లిమేట్, ఐడోఫారము మొదలగు మందులతో 6 మాసములు చికిత్సచేసి ఎంతో బాధపెట్టిరి. కాని యేమీ సుగుణము కలుగలేదు.

మీ చికిత్సతో నాకన్ను నానాటికి బలపడినది. 3 సంవత్సరములు బాధించిన నాతలనాడులవ్యాధి నయమైనది. కాలికమగు సప్తపథదాహము నయమైనది. అదివరకు మూత్రము తెలియకుండా పడిపోయేది. అది నయమైనది. 8 సంవత్సరములకు ముందువచ్చిన పుప్ఫుస జ్వరముతో ఆరంభించి వెన్నులోను, ప్రక్కలందును ఉండేబాధలు పోయినవి.

నా దేహారోగ్యమంతయు బాగుపడినది. మీ చికిత్సావిధానము నవలంబించినందువలన నా మనోబలముకూడా వృద్ధిపొందినది

రోగాలతో బాధపడే మానవులు మీ చికిత్సా విధానాన్ని అవలంబించి యింకా యెక్కువగా మేలుపొందవలెనని నా కోరిక. రోగనివారణం చేయుటకు సామర్థ్యము కలిగినది మీ చికిత్సా విధానం ఒకటే.

యస్. ఉన్నిసాలు వేనియా. మీ విధేయుడు, యూజన్, కె.

## 68. శ్వాసాశయాల్లో మంటలు, సర్పి.

ప్రియమైన కూనేగారికి, 9 సం॥ వయస్సుగలిగిన నా కుమార్తె రోగం నయముచేసినందుకు మీకు నా ధన్యవాదములు. మా యింటివైద్యుడు నా కుమార్తెజబ్బు శ్వాసాశయ దాహమని నిర్ణయించి 2 మా॥ లు మందుతో చికిత్స చేసినాడు. నయముకాలేదు. ఆ బిడ్డకు రోగం నయమవుతుందనే ఆశ నాకు నా బిడ్డకు కూడా వదిలిపోయినది. ఆ బిడ్డ బ్రతుకదని నిరాశ చేసుకున్నాము. ఈ దుస్థితిలో మీ వైద్యము జ్ఞాపకమునకు వచ్చినది. మీ కొక జాబు వ్రాసినాను. మీరు జవాబు వ్రాసినారు. అందులో యింటివైద్యుడు చెప్పిన వైద్యము మానివేయవలసినది, నేను వ్రాసిన సలహా అవలంబించవలసినది, దానితో మీబిడ్డ జబ్బు నయమవుతుందని మీరు వ్రాస్తిరి. అట్లే వాగ్దత్తము చేసి మీరు యిచ్చిన సలహా ప్రకారము చేసినాను. చికిత్స ఆరంభించిన మర్నాడే సుగుణము కనబడినది. ఒక వారం అయ్యేటప్పటికి బిడ్డకు అపాయము తప్పిపోయినది. ఈ రోజున బిడ్డ ఆరోగ్యముగా ఉన్నది. పరుగెత్తును. నవ్వుతూ ఆడుకొంటుంది. మీరు మధ్యలో కల్పించుకోకపోతే ఆ బిడ్డ మృతిపొందేదేను.

ఇదేసమయములో ఒక చుట్టము చూడవచ్చినాడు. 14 సం॥ ముందు మేము యే సర్పిరోగముతో బాధపడ్డామో ఆ రోగమే యీ చుట్టము. మిగిలిన అయిదుగురు బిడ్డలకు సర్పివచ్చినది. దయతోకూడిన మీ చికిత్సావిధానములో వారందరికి నయమైనది. ఇందుకుకూడా మీకు మా ధన్యవాదములు సర్పించుకొనుచున్నాను. నేను వ్రాసియిచ్చిన పై విషయము మీకు అవసరమైనన్ని తూరులు ఉపయోగించుకొన వచ్చును.

లీప్ జిగ్, ఇట్లు, కారల్. ఐ.

## 69. జీర్ణకోశములో నుండియు ప్రేవులలో నుండియు శ్లేష్మస్రావము, నాడుల దౌర్బల్యము, జ్ఞాపకశక్తి తగ్గిపోవుట, ఆత్మహత్యమీద కోరిక.

అయ్యా, ఇప్పుడు మీకు రోగనివారణ వృత్తాంతము పంపుటకు అనుకూలమైన ఆనందస్థితిలో నున్నాను. నేను తమకు చికిత్సకు పూర్వము పంపిన నా ఆరోగ్యచరిత్రవలన నాస్థితి మీకు జ్ఞాపకముండి యుండవచ్చును.

నాది చాలా తీవ్రమైన వ్యాధి. 4 సం॥ నుండి అపథ్యమువలన నా నాడులు చాలా చెడిపోయినవి. నారోగము కొన్ని వారాలలోగాని, నెలలలోగాని నయముకాదగినదికాదని తెలియుచున్నది.

ఇప్పుడు నా జ్ఞాపకశక్తి బాగా వృద్ధిపొందినది. ఉల్లాసము యెక్కువైనది. ఆత్మహత్యా సంకల్పము యిప్పుడు లేనేలేదు.

అప్పటివలె వేధించే తలనొప్పులు యిప్పుడు లేవు. అవి అంతరించినవి. మీరు చెప్పినట్లే, వేసవికాలములోను శీతకాలములోను కూడా గది కిటికీలు తెరిచియే పరుంటున్నాము. దాని వలన కూడా నాకు మేలే జరిగినది. మీ చికిత్సావిధానం నాకు చాలా మేలుచేసినది. నావలెనే రోగముతో బాధపడేవారు మీ చికిత్సాలయాన్ని దర్శించి మేలుపొందవలెనని నాహృదయపు లోతులనుండి కోరుచున్నాను. మీ చికిత్సాలయములో నేను 6 మాసాలలో పొందినమేలులో మందుల చికిత్స యెన్ని సంవత్సరాలకు లభించేదికాదు. మీరు మీ చికిత్సాలయము చిరకాలము నిల్చిఉండవలెనని కోరుతున్నాను.
సెయింటు (మోరవియా). హ్యూగో. బి.

ఆస్ట్రియన్ పోష్టు మేష్టరు.

## 70. ఋతుబద్ధము

ప్రియమైన కూనేగారికి. క్రిందటి సం॥ ఆగష్టు నెలనుండి ఆకురాలు కాలమువరకూ నాభార్య ఋతుబద్ధముతో బాధపడుచుండెను. అప్పుడు నేను మీకు వ్రాశాను. మీకీవిషయము జ్ఞాపకము ఉండవచ్చును. అప్పుడు నాకున్న ఆందోళనకొద్దీ, అక్టోబర్ 10వ తేదీన ఆదుర్దాగా మీకు జాబువ్రాసితిని. మీరు ఆందోళన పడవద్దనియు, వ్యాధి తప్పకుండా నయమవుతుందనియు వ్రాసిరి. మీరుచెప్పిన జ్యోతిషము 1896 సం॥ మార్చి 19వ తేదీనాడు నిజముగా ఋజువైనది. అదివరకు 9 నెలలు కనుపడని ఋతువు మీ చికిత్సవలన ఆరోజు కనుపడినది. ఇప్పుడు

కూడా, మీ చికిత్సా విధానముయొక్క గొప్పతనము ఋజువైనది. సాధారణముగా యిలాంటి వ్యాధులు నయముకావు. మీ చికిత్సలో అద్భుతముగా నయమైనది.

కీయల్, విధేయుడు, హెచ్. హెచ్.

## 71. కోరింతదగ్గు.

నా ముగ్గురు బిడ్డలకు ఒకేతూరి ప్రమాదకరమైన కోరింతదగ్గు వచ్చినది. బంధువుల ప్రోద్బలముచేత వారి ముగ్గురికి మీ వైద్యమును చేయించినాను. ఒక్కొక్కరికి 3 దినములు మాత్రమే చికిత్సచేసినాను. అందరికీ నయమైనది. ఇందుకు నా ధన్యవాదముల నందుకొనుడు. నా బిడ్డల కుపయోగించినట్లే ప్రపంచకములో మీ వైద్యము అవలంబించిన వారికెల్ల మేలే జరుగుతుందని, మానమ్మకము. మీ వైద్యవిదానము యింకా యెక్కువగా ప్రజాదరణను పొంది ప్రజలకు అభ్యుదయ మొసంగునుగాక.

లీప్ జిగ్, తెరసా. బి.

## 72. దౌర్బల్యము, ఆకలి లేకపోవుట.

అయ్యా, మీరువ్రాసిన సలహా ఉత్తరము ప్రకారము మా కుమార్తెకు వైద్యము చేసినందున రోగము నయమైనది. మొదటచేసిన కొలదికటిస్నానములతోనే దౌర్బల్యము తగ్గి ఆకలి పుట్టినది. మలబంధము నయమైనది. చర్మము అప్పుడు

పచ్చగా నుండేది. ఇప్పుడు సహజమైన రంగువచ్చినది, నా బిడ్డకు రోగనివారణంచేసిన మీవైద్యవిధానమునకు మిక్కిలికృతజ్ఞుడను.
క్లీను ఫాలుకె, విధేయుడు, యఫ్. బి.

## 73. మేహవాతము, పైత్యవ్యాధి, మూలవ్యాధి.

ఇప్పటికి 2 సం॥ పూర్వము మీ చికిత్సవలన నాకు ఆరోగ్యము కలిగినది. అప్పటినుండి యిప్పటిదాకా ఆ రోగలక్షణా లేవీ తిరిగి కనపడలేదు. నన్ను అప్పుడు యిప్పుడూ చూచినవారు నాకు గలిగిన ఆరోగ్యమునుచూచి ఆశ్చర్యపడుచున్నారు. నా రోగము నయముకావటం నిజంగా నాకుకూడా ఆశ్చర్యముగా నున్నది. నేను తమవద్దకు వచ్చినపుడు నే నెట్టిదుర్భర స్థితిలో నున్నానో తమకు తెలుసు. నా జీవితంలో నే నెప్పుడూ సుఖముగాలేను. మేహవాతము, జలుబు మొదలగు వ్యాధులు ఏవో ఒకటి నన్నెప్పుడూ బాధిస్తూనే ఉండేవి. తర్వాత మూలవ్యాధి, పైత్యవ్యాధి వచ్చినవి. దానికి వేరు వేరు వైద్యులు 10 సం॥ చికిత్సలు చేసిరి. ఏమియు నయము కాలేదు. ఆ వైద్యులలో హోమ్యోపతీ వైద్యులున్నారు. ఆలోపతీ వైద్యు లున్నారు. బాన్ విశ్వకళాపరిషత్తు ప్రొఫెసర్ కూడా ఉన్నాడు. వీరిచికిత్సలలో నాస్థితి నానాటికి పాడయినది. సొంతపనులు కూడా చేసుకోలేకపోయినాను. అందువలన జీవితము మీద నిరాశచేసుకున్నాను. అయితే మీవైద్య విధానమువలన, నారోగం అద్భుతముగా నయమైనది. అందువల్ల యింకా యెంతోమంది మీవైద్యవిధానము నవలంబించి

నారు. అయితే యెవరికీ అపజయం కలుగలేదు. నేను, నా కుటుంబము తమ కిదివరకే ధన్యవాదముల నర్పించియున్నాము. అయితే యింకా యెక్కువమందికి మీ వైద్యమునందు నమ్మకం కలుగుటకుగాను యీ రోగనివారణ వృత్తాంతమునకు విరివి అయిన ప్రచారం కలిగించవలసినది. నా కుటుంబవిషయంలోనూ యితరుల కుటుంబాల విషయములోనూ మీ వైద్యమువలన కలిగిన మేలు వ్రాయ నారంభిస్తే యీ గ్రంథం యింకా పెరిగి పోతుంది. నా వయస్సిప్పుడు 51 సం॥ లక్ష 15 వేల జనాభా కల్గిన యీ పట్టణములో 16 సం॥ నుండి క్రైస్తవమత ప్రచారకునిగా నున్నాను. అందువల్ల మీకు యెవ్వరికైనా కావాలంటే అట్టి రోగనివారణ వృత్తాంతాల వివరాలు వ్రాసి పంపమంటే పంపుతాను. కృతజ్ఞుడను, ప్రేమపూర్వకముగు అభివందనములతో.

బార్మెన్ యసినస్ టు యఫ్

### 74. అజీర్ణవ్యాధి, నాడీవ్యాధి, మలబద్ధకము.

ఆరు సంవత్సరాలనుండి నన్ను బాధించుచుండిన అజీర్ణరోగము, నాడీవ్యాధి, మీ వైద్యవిధానములో 15 దినములలో నయమైనది. ఇందుకు నేను మీకు చాలా ఋణపడియున్నాను. వివిధ సుప్రసిద్ధ వైద్యులు యెరిగియున్న మందులన్నివాడి, నివారణ చేయలేని మలబద్ధకమును, మీ నిరౌషధ నిశ్శస్త్ర వైద్య విధాన

ముతో అయిదు దినములలోనే పోగొట్ట గలిగితిరి. ఇదివరకు ఎనిమా చేస్తేనేగాని విరేచనము అయ్యేదికాదు. ఇప్పుడు దానితో పని లేదు.

వి. పడమటి ప్రిసియా, జడ్ పాఠశాలోపాధ్యాయుడు.

## 75. నా తుల వ్యాధి.

ప్రియమైన కూనేగారికి, శాస్త్రీయవైద్యులు వైద్యముచేసినా రోగాలు నయముకాక నానాటికి రోగము, ముదిరి రోగులు దైన్యస్థితికి వచ్చుచుండుట, అనేకు లెరింగినదే. మీ వైద్య విధానం అట్లుగాక, రోగములను నిజముగా నయముచేసి, రోగులకు సుఖము కల్గించుచున్నది. నా మనస్సులోఉన్న ఊహాను యిప్పుడు వ్రాయుచున్నాను. మందు వైద్యమువలన జరిగే అపకారము తన విషయంలో నూతన కుటుంబము విషయం లోనూ, ప్రతివారు చూస్తూనే యున్నారు. ఆచారానికి, అభ్యాసానికి లోబడి ప్రకృతి వైద్యము చేయక, మందు వైద్య ముతోనే కాలక్షేపంచేసి తనకు, తన ఆప్తులకూ, ప్రాణాపాయం కలిగించుకోవటంకంటె, బుద్ధిపూర్వకమైన గుడ్డితనములేదు. నేను తప్పుగా యేమిచెప్తూవచ్చానో అదే యిక్కడ వ్రాస్తు న్నాను. రోగము వచ్చినపుడు నివారించేందుకు మీరు కని పెట్టిన చికిత్సావిధానం ధీమంతుల సృష్టియై యున్నది. ఏదో అనుకూలమైనది వ్రాయటంలేదు. నా కుటుంబములో అనేక సంవత్సరాలు అనుభవములో మీరు చేసిన రోగనివారణ వృత్తాంతాలమీద ఆధారపరిచి వ్రాస్తున్నాను. మీరు నా

తోడబుట్టినదానిప్రాణమును కాపాడితిరనినిస్సంకోచముగాచెప్ప గలను. నా బిడ్డలకు వచ్చిన వ్యాధులను స్వల్పకాలములోనే మీరు నయముచేసి యున్నారు. లీప్ జిగ్‌లో మేమున్నకాలములో మీతోకలిగిన పరిచయం అమూల్యమయిన భాగ్యంగా యెంచుకొనుచున్నాము. యెల్లకాలమును మిమ్ములను కృతజ్ఞతతో జ్ఞాపకముంచుకొనెదను. నేనెక్కడయుండినా మీ చికిత్సావిధానాలను ఉత్సాహముతో ప్రచారం చేస్తాను.

వియన్నా. ఆల్గా. యల్.

## 76. మేహ వాతము.

తీవ్రమయిన మేహవాతపు నొప్పులతో బాధపడుచూ నీటిఆవిరి పట్టుచూ కటిస్నానములు చేసితిని, రెండవ స్నానముతోనే గుణము కలిగినది. నే నిప్పుడు బాగుగా నడువగలుగుచున్నాను. పట్టుదలతో నీటి ఆవిరిపట్టుచూ కటిస్నానములు చేస్తే నాకున్న మేహవాతం తొందరగా నయమైనది. ఈ వైద్యము చాలా మంచిది. రోగాలతో బాధపడేవారు యీ వైద్యాన్ని చేయవలసిందని సిఫార్సుచేయుచున్నాను.

లీప్ – జిగ్. జి. ఇ.

## 77. కుంటిచెయ్యి.

ఆగష్టు వాన్ బి. అనే పేరుగల నా మొదటి సంబంధపు పిల్లవాడు 1886 సం॥రం డిశంబరులో తన 13వ యేట కుడిచెయ్యి బరువుగా ఉందని, నొప్పిగా ఉందని చెప్పి

నాడు. కొలదికాలమునకే, చేయి కదలించుటకు వీలులేక మెడకు ఒక ఉగ్గమువేసి వ్రేలాడదీయవలసివచ్చినది. ఎన్ని మందులు వాడినా ఉపయోగంలేదు. అకస్మాత్తుగా కూనే గారి వైద్యాన్నిగురించి యిదివరకే యిట్టిరోగాలు నయముచేసి నట్లు విని నాకుమారుని వారి వైద్యములో ప్రవేశపెట్టినాను. కూనేగారు యెలాచెప్పేరో ఆవిధంగా చేసినాము. చికిత్స చాలాదినాలు పట్టినది. మాకున్న ఓర్పంతాకూడా శోధనకు వచ్చింది. చిట్టచివరకు నా కుమారుని మొండివ్యాధి నయముకా నారంభించినది. కూనేగారు నిర్ణయించిన కటిలింగస్నానాలు, స్వాభావికమగు పథ్యము, వీనితో చెయ్యి సాంతముగా నయ మైనది. దానికి తోడుగా అదివరకున్న అజీర్ణరోగం పోయి మంచిఆకలి కలిగినది.

డ్రిస్‌డెన్.  లెఫ్టినెంట్ కల్నల్, కె. భార్య యెడిల్ కె.

## 78. తీవ్రమగు ఉదరవ్యాధి, శ్వేతకుసుమ.

మీ చికిత్సవలన నాకు మేలు కలిగినది. మానవసమాజ హితు లగు తమకు నా ధన్యవాదముల నందజేయుచున్నాను. అనేక సం॥లు సుప్రసిద్ధవైద్యులసలహా తీసుకున్నాను. వారందరిచికిత్స లోనూ నాకపకారమే జరిగినది. లాభమేమీ కనపడలేదు. అందరుకూడా శస్త్రము చేయాలన్నారు. అట్టిదేమీ లేకుండానే మీవైద్యములో నారోగము నయమైనది. మీ వైద్యములో అన్నిరోగాలు యెంత సులభంగా నయమవుచున్నవో, నేను పోయినచోట్లల్లా యెరుక పరచెదను. డాక్టర్లు, మందులు,

శస్త్రములు లేకుండానే అన్నిరోగాలు నయమవుచున్నవనికూడా చెప్పెదను. తాము నా కొసంగిన మేలునకు తిరిగి కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

లీప్ జిగ్.                                                                 ఈ. యల్.

## 79. ప్రశంస...

నా భార్యకొరకు ఆమెకు మీరుచేసిన చికిత్సకు కృతజ్ఞత తెలుపుచున్నాను. ఆమె ఆరోగ్యము 4 సం॥లుగా చెడినది. అల్లోపతీ, హోమియోపతీ వైద్యులు చేసిన చికిత్సలు ఏమియూ సహాయోగింపలేదు. మృత్యువునకు సన్నిహితురాలైనది. ఆ నిరాశలో మిమ్ములను సంప్రదించినాము. 6 మాసాలు మీ చికిత్స చేసిన తర్వాత, ఆమె ఆరోగ్యము సంపూర్ణముగా బాగుపడినవి. ఆమె మీ చికిత్సలోనికి వచ్చేటప్పటికి 104 పౌన్లు ఉన్నది. ఇప్పుడు 120 పౌ॥ ఉన్నది. నమస్కారములతో,

కిర్చ్‌చైన్, లోయర్ లుసేటియా.                                                టి. వబ్లియూ.

## 80. సుఖమైన గర్భధారణము. ప్రసవము.

నా భార్యకు యిప్పటికి 4 కాన్పు లయినవి. మొదటి ప్రసవం చాలా కష్టముగా జరిగినది. రెండవ ప్రసవానికి ఫోర్ సెప్సు వాడినారు. 3వ కాన్పుకు ముందు మీ వైద్యము నవలంబించినాము. ఈ 2 కాన్పులు బహు సులభముగా జరిగినవి.

కష్టముతో కూడుకొన్న ప్రసవము చాలా దురదృష్టము. అది సులభముగా జరుగుటకు కారణమైన మీ వైద్యవిధానం చాలా మంచిది. విధేయుడు,

న్యూయానిచ్. జార్జి. యస్.

## 81. ఆమవాతము.

నేను చదువుకొనే కాలమునుండి యిప్పటివరకునూ నాకు కాలికమైన వ్యాధి కలదు. నేను 12 యేళ్ళ పిల్లవాడినిగా ఉన్నప్పటినుంచీ నాకు కాలి బొటనవేలు ఆమవాతముతో బిగుసుకొనిపోయినది. అప్పటినుండి యెంతమంది వైద్యులను సంప్రదించినా, యెన్ని వైద్యాలుచేసినా నారోగము నయముకా లేదు. ఏటేట అది ముదిరిపోతున్నది. పాదాలు చేతులుకూడా కదిలించటానికి వీలులేకుండా సంధులలో బిగుసుకుపోయినవి. 1½ సంవత్సరాలు దుర్భరమయిన జీవితము వెళ్లబుచ్చి నాను. దేహములో యేభాగమూ కదలించుటకూ శక్తి లేదు. ఏ వైద్యుడూ నా బాధను తగ్గింపజాలడు. ఏ చిన్నపనీ కూడా స్వాంతముగా చేసుకొనలేను. అన్నంకూడా యింకొకరు తినిపించవలసి వచ్చేది. అప్పుడు పుట్టిన పిల్లవానిమోస్తరు అయినది నాపని. ప్రతి చిన్నపనికీ యితరులమీద ఆధారపడి యెదురుచూడవలసి వచ్చేది. ఆరుమాసాలకు పూర్వము, మీ వైద్యము నవలబించినాను. అప్పటినుండి సుగుణము కనుపడి నది. 2, 3, వారాలు చికిత్సచేసిన తర్వాత, చేతులు, కాళ్ళు స్వాయముగా కదలించి నడువకలిగినాను. నా చేతివేళ్లు.

అదివరకు వంగి వాచిఉండేవి. ఇప్పుడు సన్నపడి, మెత్తపడినవి. తర్వాత స్వాభావికస్థితికి వచ్చినవి. ఇదివరకు యెవరైనా నన్ను చూచి ఉంటే నేనీ జాబుద్వారా మీకు తెలియపర్చుకొనిన నాకృతజ్ఞత యెంత గాఢమయినదో అర్థము చేసుకొనగలరు.

లీప్. జిగ్ యెమిక్. డబ్లియూ.

## 82. కాలికమగు గొంతువ్యాధి.

ఒక సుప్రసిద్ధవైద్యుడు నయముచేయలేని నా కాలికమగు గొంతునొప్పి లీప్‌జిగ్ లోని ఆరోగ్య వైద్యుడు శ్రీ కూనేగారు నయముచేసిరి. 2 సం॥లు తొట్టిస్నానాలు చేసితిని. ఇప్పుడు వారానికి 30 సంగీతపాఠములు బోధిస్తున్నాను. క్లేరాసీ.

లీప్‌జిగ్, సంగీత ఉపాధ్యాయురాలు.

## 83. తలనొప్పి, మూర్ఛ, గొంతునొప్పి.

నాకు గల తలనొప్పి, మూర్ఛ, గొంతునొప్పి మీ విధానము వలన నాకు నయమైనవి. ఇందుకు కృతజ్ఞతతో మీకు ధన్యవాదములు అర్పించుచున్నాను. రోగాలతో బాధపడే మానవులకు మేలుచేయుటకొరకై మీరు చిరకాలము జీవించి యుండవలెనని భగవానుని ప్రార్థించుచున్నాను.

లీప్‌జిగ్, కెరొలిన్. కె.

## 84. అపస్మారము.

నా పూర్వవిద్యార్థియగు గోల్లే అనే వానికి మొండిఅపస్మార మొండేది. లీప్ జిగ్ లోని జలచికిత్సాలయాధిపతులు శ్రీ కూనే గారు దానిని సంపూర్ణముగా కుదిర్చియున్నారు. అతనికి ఒక రోజులోనే అనేకతూర్లు అపస్మార మొచ్చేది. వచ్చినపుడల్లా పిచ్చిలక్షణాలుగా ఉండేవి. రోగం నయమైన తర్వాత మళ్ళీ అపస్మారము రాలేదు. అతని రూపంకూడా ఆరోగ్యముగా నున్నది. కూనేగారికి యిష్టము లేకపోయినప్పటికీ నే నొకవిషయం చెప్పక తప్పదు. కూనేగారు వైద్యముచేసిన 4 మాసాలు ఆ పిల్లవానిదగ్గర ఫీజు తీసుకోనలేదు. అతనికి, అతని తల్లికి, సంరక్షణకూడా కూనేగారే చేసిరి. ఈ సంగతి నాకు సహాయం పొందినవారికి తప్ప యింకెవరికీ తెలియదు.ఎవరిట్టి స్వార్థత్యాగ ముతో చికిత్స చేస్తారో, వారే నిజమైన వైద్యులు.

లీప్ జిగ్. ఈ. హేచ్.

## 85. వెన్ను వంపు - నాడీవ్యాధి.

నా కుమారునికి కలిగిన వెన్నువంపు, నాకు కల్గిన నాడీవ్యాధి యీ రెండు జబ్బులకు మేమూ కూనేగారి వైద్యమును చేసినాము. ఇంతవరకూ గల్గిన లాభానికి మేము చాలా తృప్తిపడియున్నాము. ఇప్పటికి 6 మాసాలు జరిగినది. ఇప్పు డింకా గట్టి నమ్మకతో యీ చికిత్సను సాగించుచున్నాము. ఎవరునన్నడిగినా, యీవిషయాన్ని సంకోచం లేకుండా చెప్పగలను. ఈ వ్రాతను మీకు అవసరమైనట్లు ఉపయోగింపుకొనవచ్చును.

వైమార్. బి. అడ్మిరల్.

పడలేదు. నాకిదివరకు సంశయముంగా ఉండేది. మీ వైద్యము ఇంద్రజాలమువలె పనిచేస్తుందిఅని యిప్పుడొప్పుకొనుచున్నాను. నాకు నాభర్తకు ఉన్న ఆదుర్దా అంతా మీరు పోగొట్టినందుకు మీకు నా ధన్యవాదములు సర్పించుకొనుచున్నాను. తన ప్రాణములను మీరు రక్షించితిరని నాభర్తమెచ్చుకొనుచుండును. మీకు మీ అమూల్యమగు చికిత్సా విధానమునకు, నేను నాభర్త మిక్కిలి కృతజ్ఞులమై యున్నాము.

డ్రెస్‌డెన్. క్లాటిల్డు, డబ్లియూ.

## 87. తీవ్రమగు తలనొప్పి.

నాకు తీవ్రమైన తలనొప్పి కలిగి 15 దినాలు బాధించినది. ఆ కాలములో నామోహ్యములో నన్నువారి విషయంలో నాకు చాలా ఆందోళన కలిగినది. నాకు చిన్నతనమునుండి యు తల నొప్పి వచ్చుచుండెను. కొన్ని సంవత్సరములు నాకు నెల కొకతూరి అయినను తలనొప్పివచ్చి 24 గంటలు బాధించి పొయ్యేది తర్వాత 18 నెలలూ, వారానికి ఒకతూరి యిట్టి తల నొప్పి వచ్చుచుండెను. 6 వారాలకిందట అతి తీవ్రమగు తల నొప్పి వచ్చినది అది 5 దినాలు అమితముగా బాధించినది. నామెదడంతయు, ఉడుకెత్తిపోయిన దనుకొంటిని. నా దేహము లోని యెడమభాగం, తల, కన్నులుఅన్నిటిలోనూ బాధలు కలిగి నవి. నాయెడమకన్ను, లోనికిలాగుకొనిపోయి యెక్కువ బాధ పుట్టెను.

మొదటితూరి చేసిన 5 ని॥ స్నానముతోనే నాకెక్కువ సుగుణం కలిగినది. నా దేహములో బలము చేరినది. నేను పూర్వమువలె

వడిగా నడువగలను. నాపయస్సిపుడు 52 సం॥ అయినప్పటికి, యువకునికున్నంత ఉత్సాహం నాలో ఉన్నది. అదివరకెప్పుడూ చన్నీటిలో కూర్చుండి యెరుగను. మీసలహా ప్రకారం చేయ నారంభించిన తర్వాత నాకు చన్నీటి స్నానములంటే మిక్కిలి హితవుగా యున్నవి. తొట్టిలో కూర్చున్న 5 నిమిషాలకే నా మలుగులు వెచ్చబడుతవి. ఈ స్నానం 20 ని॥ చేస్తాను. తర్వాత 15 ని॥ నడుస్తాను. ఇట్లు 12 దినాలు చేసితిని. ప్రతి స్నానంతోనూ, నా దేహములో కులాసా చిక్కినది. నా తల లోని బాధలు తగినవి. నేను మీకు చాలా ఋణపడి యున్నాను. ఊరికే కృతజ్ఞత తెలిపితే చాలదు. తొట్టివారి లోనూ-చుట్టపక్కలనూ మీ నవీనవైద్యవిధానాన్ని బాగా వ్యాప్తిచేస్తాను.మీ రేమైన కరపత్రాలు అచ్చువేస్తే రోగంతో బాధపడుచున్నవారికి ఆ కరపత్రాలను అందచేస్తాను. మీ సేవ యందు నిమగ్నుడనై యుంటాను.

టు బిన్‌జన్.	జి. ఎ. యల్.

## 88. గర్భధారణము, సుఖప్రసవము.

ప్రియమయిన కూనేగారికి, యిప్పుడే యాత్రలనుండి వచ్చి నాను. మీ 50 వ వార్షికోత్సవమునుగూర్చి వినినాను. అందుకు నా హృదయపూర్వక అభినందనముల నందచేయుచున్నాను. ఒక సంవత్సరానికి పూర్వం చాలా నీరసించిపోయి అనేక చికిత్సాలయాలకు పోయి ప్రపంచము నందలి గొప్ప గొప్ప వైద్యుల నందరిని సంప్రదించి ఫలము గానక చిట్టచివరకు

మీా చికిత్సాలయమునకు వచ్చినాను. నీలోనే దేముడున్నాడని ఆశపెట్టుకుని వచ్చినాను. 3 వారములు చికిత్స చేసినంతనే అతి సామాన్యమగు మీా చికిత్సవలన మా కెంతో మేలుకలిగినది. మీా చికిత్సాపద్ధతిని నే నిప్పుడు వదలిపెట్టదలచుకొనలేదు. నేను గర్భవతిగా నుండియును శీతకాలపు చలిరోజులలో మీా సలహా ప్రకారము దినమునకు 2 లింగస్నానాలను చేసేదానను. సుఖముగా ప్రసవించినాను. గర్భధారణ కాలములోను. నా కెట్టి బాధలును కలుగలేదు. ఇదివరకు పుట్టిన ఇద్దరు బిడ్డలకు దాదిచేత పాలిప్పింపవలసివచ్చేది. ఈ బిడ్డకు నాపాలే సరిపోవుచున్నవి. అందుకు తోడుగా చిక్కని జావపోయుచున్నాము. ప్రతిరోజు సాయంత్రము కటిస్నానం చేయించుచున్నాము. ఎందుకంటే ఆబిడ్డకు పొట్ట లావుగాఉన్నది. ప్రతిదినం ఉదయం ఫారెన్‌హీట్ 88 డిగ్రీల నీటితో స్నానం చేయించి, చన్నీరు దిగపారపోస్తు న్నాము. నేను మీాచికిత్స చేస్తుంటే అప్పుడు నన్నుజూచి, నవ్వేవారు. వారే యిప్పుడు మీా చికిత్సావిధానం మంచిదని ఒప్పుకొనుచున్నారు. అప్పటికంటె యిప్పుడు 10 సం॥ చిన్న దానివలె కన్పడుచున్నాను. నేను నాబిడ్డకూడా ఆరోగ్యానికి ఒరవడిగానున్నాము. ఈ జులీఖాలో మీా వైద్యము యింకా 12 కుటుంబములవారు ఉత్సాహాముగా అవలంబిస్తున్నారు. నేను లీప్‌జిగ్‌లో నుండగా నావెంటనున్న నాచెల్లెలు, గర్భిణితో నున్నది. మీా వైద్యము చేయుమన్నాను. చేయలేదు. మాంసం తిన్నది. ప్రసవం కష్టమైనది. బిడ్డకు దాదిచేత పాలు యిప్పింప వలసివచ్చినది. నాచెల్లెలుకు యిప్పుడు జబ్బుగానున్నది. మీా

చికిత్సా విధానంమీద యెవరికైనా, అనుమానం కలుగుతే భగవదనుగ్రహము పొందిన శ్రీ కూనే గారిమీద పరిపూర్ణవిశ్వాస ముంచవలసిందీ అని యెలుగెత్తి చాటుచున్నాను. మీ పుట్టిన రోజు పండుగనాడు యీ జాబు వ్రాస్తున్నాను. భగవంతుని తర్వాత మీ రేనాకృతజ్ఞతకు పాత్రులైనారు. నా జీవితాంతము వరకూ నేను మీకు, నమ్మకమైన విద్యార్థినిగా ఉంటాను. మీకు మీ కుటుంబానికి, మేలు జరుగవలెనని కోరుతూ విరమించు చున్నాను.

జులిఖా. సి. బి.

### 89 పైత్యకోశవ్యాధి, పసరుతిత్తిలో రాళ్ళు, నాడీవ్యాధి, మేహవాతముతో కూడిన తలనొప్పి, ఉదరవ్యాధి.

అయ్యా, లీప్‌జిగ్ లో నున్న మీ చికిత్సాలయములో నేను జూన్ 24 తేదీనుండి, జులై 3 వ తేదీవరకు చికిత్స పొందిన సంగతి మీకు జ్ఞాపకముండవచ్చును. అప్పుడు నాకు పైత్యకోశ వ్యాధితో పసరుతిత్తిలో రాళ్లతోను, బాధపడుచుంటిని. అప్పుడే నారోగం చాలాభాగము కుదిరినది. ఇంకా కొన్నాళ్ళు చికిత్స చేస్తే పూర్తిగా నయమవుతుందని మీకు నమ్మకమేర్పడిన తర్వాత నేను మీ చికిత్సాలయమును, వదిలి పెట్టినాను. నేను యింటికివచ్చి కొన్ని రోజులు చికిత్సచేసుకొన్న తర్వాత చాలా బాధ కలిగి మీ చికిత్సాలయములో నుండగా పడిపోయిన శిలలవంటివే, పసరుతిత్తియందలి, శిలలు 3 పడి పోయినవి. బాధగా నున్నపుడు కటిస్నానాలు చేస్తే బాధలు

ఉపశమించేవి. అప్పటినుండియింకే బాధలుకలుగలేదు. ఆరోగ్యము కలిగినది, యెట్టిబడలిక లేకుండా దినమంతయు పనిచేయ గలను. నన్నుచూచినవారు నా రోగం యింద్రజాలము వలె నయమైనదీ అనుచున్నారు. నేను ఈ విధంగా నా రోగము మీవలన సంపూర్తిగా నయమైనదని ఒప్పుకొను చున్నాను. నా రోగం యీ విధంగా నయముకావడంచూచి యిక్కడొక వితంతువు మీ వైద్యము చేసినది. ఆమెకు నాడీ వ్యాధి, మహావాతపు తలనొప్పి, ఉదరవ్యాధి ఉండెను. ఆమెకు చికిత్సచేస్తే వైద్యుడుఆమెకు, నిజంగా వ్యాధిలేదని, వ్యాధిగలదనే భ్రాంతి గలదని చెప్పినాడు. ఆమె మీరు రచియించిన తొట్టి వైద్యము చదివెను. అందువలన ఆమె దినానికి 2, 3 లింగ స్నానాలు చేసేది. ఆమె చాలా లావుగా నుండేది. 15 దినా లలో ఆమె లావు తగ్గినది. ఉదరవ్యాధి దాదాపుగా తగ్గినదని చెప్పినది.

ఓల్ మార్ స్టీల్. మీ విధేయుడు, యల్. యస్.

## 90. ఉబ్బసం, మూలవ్యాధి, గొంతులో మంట.

ప్రియమైన కూనేగారికి, అక్టోబర్ చివరభాగములో సలహా కొరకై మీకు వ్రాసితిని. నవంబర్ 3 డవ తేదీన మీరు జవాబు వ్రాసినారు. తర్వాత యేమి జరిగినదీ వ్రాస్తున్నాను. మీరు చెప్పినట్లుగా నా భార్య దినానికి 3 లింగస్నానాల చొప్పున 6 మాసాలు క్రమంగా చేసినది. బాధగా నున్న పుడు యింకొక స్నానం యెక్కువగా చేసేది. అప్పు డపుడూ వేడినీటి కటిస్నానాలుగాని, నీటి ఆవిరిపట్టుటగాని

చేసేది. తేలికగా జీర్ణమయ్యే పదార్థాలు, కూరగాయలు తినేది. ఎక్కువకాలం ఆరుబైట ఉండేది. రాత్రిలందు కిటికీలు తెర్చుకొని పరుండేది. ఇదివరకు యెప్పుడూ లేనంత సుఖముగా యిప్పుడున్నది. చికిత్సచేసే మొదటినెలలో, జననేంద్రియాలమీద పెద్దపుండుపడి చీము కారిపోతుండేది. తిరిగి కురుపేర్పడి. అదికూడా మానినది. ఉదరము మీద వ్రణము పుట్టి అందులోనుంచి కంపుకొట్టి చీము కారిపోయినది. దీనితో అతిబాధాకరమైన ఊబ్బసం, మూలవ్యాధి అంతరించినవి. ఇప్పుడు నాభార్య యెంతదూరమైనా సుఖముగా నడువగలదు. ఆమె రూపంకూడా మారిపోయినది. ప్రతిలింగస్నానం తర్వాత ఆమెకు మిక్కుటంగా చలిపుట్టేది. ఇప్పుడు చలి క్రమంగా తగ్గిపోయినది. ఆమెకెప్పుడును, సహజంగా చెమటపోయుదు. ఇదే ఆమె రోగానికి కారణమనుకుంటున్నాను. ఇప్పుడామెకు సహజమైన ఆకలి పుట్టింది. ఆమె జీర్ణశక్తికూడా వృద్ధియైనది. ఇప్పుడామె తిన్నది వంటబట్టుచున్నది. క్రమముగా రోగం అంతా నయమవుతుందని నాకు నమ్మకం గలదు. ఇదివరకు రోగాలుక్రమంగాతక్కువగా కనపడిపోతవి. రోగము నెమ్మదిగా నైనప్పటికీ తప్పకుండా నయమవుతుంది.

3½ సం॥ వయస్సు కలిగిన నాబిడ్డకు, లింగస్నానాలు ఆవిరి వాడితిని. చాలా అద్భుతంగా పనిచేసినవి. ఆ బిడ్డకు గొంతు పచ్చిగా నుండేది. నయమైనది. మీ చికిత్సే నిజమైన చికిత్స యని నేను ఋజువు చేయగలను. బహుమాన పురస్సరమైన నా వందనముల నందుకొనుడు.

హెూమ్సు, డోర్ఫు. పి. యల్. పాఠశాలోపాధ్యాయుడు.

## 91. మేహవాతము, పాదమువాచుట.

ప్రియమైన కూనేగారికి, సులభమైన మీ లింగస్నానాల వలన నన్ను తీవ్రంగా బాధించే రోగం 3 మాసాలలో నయమైనది. చాలా కాలము చేతులు కాళ్ళు మేహవాతముతో బిగుసుకు పోయినవి. చేతిబొమికలు ప్రధానంగా కనపడు తుండేవి. నే నేపనీ చేయలేక పోయేదానను. ఏ వస్తువు పట్టుకొనజాలను. భరింప నలవికానిబాధ ఉండేది. ఏమి చేయవలెనో తోచేది కాదు. పాదములు వాచినవి. మేడమెట్లు యెక్కుటకే వీలులేక పోయేది. ఇట్టి దుర్భరవ్యాధికి, వ్యయరహితమైన మీ చికిత్స నవలంబించుటవలన చాలా తొందరగా రోగనివారణ మైనది. ఇందుకు ధన్యవాదముల నర్పించుచున్నాను. ఇట్టి వ్యాధితో బాధపడేవారిని మీ సలహా తీసుకోవలసిందని కోరుచున్నాను. మీ చికిత్స సులభమైనది. వ్యయములేనిది.

లీప్‌జిగ్. విధేయురాలు, టి.

## 92. గర్భాశయమునందు గ్రంధి, శ్వేతకుసుమ.

హెూచ్ అను నామె నా కిట్లు చెప్పెను:—

హెూచ్ మేనకోడలు కూనే చికిత్సాలయమున తన రోగము కుదుర్చుకొనెను. ఆ విధముగానే తన మేనత్త రోగముగూడా కూనే చికిత్సతో కుదుర్చుకొనేదాకా ఆమెకు తృప్తికలుగ లేదు. ఆమె మేనత్త యిట్లు చెప్పెను. “నేను అనేక సంవత్స రములు ఉదరవ్యాధితో బాధపడితిని. ఎన్నిమందులు వాడినను

ఫలము కనుపడలేదు. నా గర్భాశయమున ఒక గ్రంథి పుట్టె ననియు అది క్రమముగా పెరుగుచున్నదనియు వెంటనే శస్త్రము చేయవలసి యున్నదనియు మా వైద్యుడు చెప్పెను. నా స్థితి అప్పటికే దుర్భరముగా నున్నందున శస్త్రమునకు నేను ఒప్పుకోలేదు. శస్త్రము చేయకున్న ప్రాణము పోవుట తప్పనిచో, శస్త్రము లేకుండా చనిపోవుటకే నేను నిశ్చయించుకొంటిని. ఆ బలహీనమైనస్థితిలో శస్త్రమునకు నేను ఆగి ఉండగలనను ధైర్యము లేదు. అట్టి నిరాశతోనే, మా మేనకోడలు చూపించినట్లు ప్రకృతి వైద్యముచేసినాను. అదివరకెప్పుడూ మలం గట్టిపడేది. చికిత్స ఆరంభించిన 2 వనాటినుండియే మలం మెత్తపడి క్రమంగా వెడలి పోనారంభించినది. ఇదివరకుకన్నా 3,4, రెట్లు తూరులు యెక్కువగా మూత్రము రా నారంభించినది. నా దేహము లోని రోగపదార్థం దినదినం వెడలిపోవుచున్నదని నేను గ్రహించాను. లావైన నా ఉదరము క్రమక్రమంగా తగ్గి సహజస్థితికి వచ్చినది. అదివరకు చెమట పోసేదికాదు. ఇప్పుడు నాకు ప్రతిరాత్రి చెమట పోయుచున్నది. దానితో నా దేహం తేలికయై కులాసాగా నున్నది. బలంకూడా వృద్ధిపొందినది. ప్రతిలింగస్నానం తర్వాత తెల్లని కుసుమ వెళ్ళేది. ఇట్లు 4 వారాలు దాదాపు 2 తూరులు శ్వేతకుసుమ వెళ్ళిపోయినది. ఒకరోజున అకస్మాత్తుగా గర్భాశయంలోనుండి, కండ వెలుపలికి వచ్చినది. వైద్యుని పిలువగా అది కండకాదనియు గర్భాశయసంబంధ గ్రంథియనియు చెప్పినాడు. అది కాఫీ కుండరూపంలో నున్నది. 4 పౌనుల తూకమున్నది. ఇది గర్భాశయపు కంఠమునుండి బైటికి వచ్చినది. దానికి పైన రెండు

చర్మపు పొరలతో అంటిఉన్నది. లింగస్నానములు యింకా కొంత కాలం చేయగా వెలుపలికి వచ్చిన గ్రంథి తగ్గిపోయినది. పూర్వముకంటె యిప్పుడు నేనారోగ్యముగా నున్నాను.

## 93. ఒకకాలు పొట్టి అగుటవలన వచ్చిన కుంటితనము.

మలుగులలో కాలికమగు వ్యాధి, ఎల్లప్పుడూ ఉగులుగా నుండుట. హేచ్. అను నామె తన కుమార్తెయొక్క జబ్బును గురించి నాకిట్లు వ్రాసినది. 1889 అక్టోబరులో నా కుమార్తె యల్సాకు 5 సంIIలు. దానికి మలుగులలో వ్యాధి కలిగినది. అపుడు అలోపతి వైద్యము చేసినాము. నయమైనట్లే కనపడిందిగాని, 1890 ఫిబ్రివరిలో ఒక కాలు బిగిసి పొట్టిదైపోయినది. ఎక్కువసేపు బిడ్డ నడువజాలదు. 3 వారాలు సీమసున్నపు పట్టీలువేసినారు. ఉపయోగం లేకపోయినది. తర్వాత తను ప్రక్కమీాద పరుండబెట్టి కాలు సాగదీసి కట్టినారు. బిడ్డకు బాధమాత్రమే కలిగిందిగాని లాభము కలగలేదు లీప్జిగ్లో హాప్నెర్, యస్ అనువారికి పిల్లను అప్పగింతపెట్టితిని. ఆతడు పిల్లను యెప్పుడూ పరుండబెట్టి యేవో తైలాలు రుద్దించేవాడు; యెల్లప్పుడూ పరుండవలసి వచ్చేది. కొన్ని వారాలయిన తర్వాత పిల్లపరుండలేకపోయినది. లాభము లేకపోయినందున ఆ వైద్యము ఆపివైచినాము. తర్వాత లీప్జిగ్లోని ఆసుపత్రిలో 3 వారాలు చికిత్స చేయించినాము. అదివరకు మెత్తగానున్న మలుగులు గట్టిపడిపోయినవి. పొట్టిదైన కాలు పెరగనేలేదు. 9 మాసాలు నడవలేకుండా ఉన్నది. ఈ

కాలంలో ఆ బిడ్డకు యెప్పుడూ దిగులుగా ఉండేస్థితిలోకి వచ్చినది. బిడ్డకు నయమవుతుందనే ఆశ బొత్తిగా తొలగినది. మందు వైద్యాన్ని ప్రారంభింపక పూర్వము నిల్చుండ గలిగేది. ఇప్పుడు నిలబడలేదు. ఈ స్థితిలో నాయల్సాను తమకు ఒప్పగింత పెట్టినాను. తాము యిచ్చినసలహా ప్రకారం యథావిధిగా చికిత్స చేయించినాము. నాసంతోసము ఏమని చెప్పను. మొదటి 3 వారంగ స్నానాలతోనే, నిరంతరం దిగులుగాఉండే నాబిడ్డ, దిగులు లేకుండా నిర్మలముగా నున్నది. అదివరకు నిలువజాలనిది యిప్పుడు నిలబడ గల్గినది. 8 దినాలు చికిత్స చేసినంతనే అది నడువగల్గినది. నాకు అత్యద్భుతముగా నున్నది. 15 దినాలు చికిత్సచేసిన తర్వాత, బజారులోనుండి 4 వ అంతస్థుపై వరకూ పరులసహాయం లేకుండా నడువగలిగినది. ఈ కాలంలో గట్టిపడిన కండలు మెత్తపడినవి. 4 వారాలు చికిత్సతర్వాత పొట్టిదైనకాలు పొడుగు కానారంభించెను. ఇప్పటికి 3 మాసాలు చికిత్స చేసినాము. అన్ని బాధలు అంతరించినవి. 2 కాళ్ళ పొడుగు సమానంగా నున్నది. 2 కాళ్లు నడకకు సమానంగా ఉపయోగిస్తున్నవి."

లీప్‌జిగ్ మిన్నాహెచ్.

## 94. మేహవాతం, మలబద్ధకం, మూలవ్యాధి, విషజ్వరం, గర్భాశయం జారుట, కోరింతదగ్గు, హాంగుజ్వరము

అయ్యా, 1891 సం॥లో మీరు రచియించిన తొట్టివైద్యము గ్రంథపు 2 కూర్పు సంపాదించినాను. మీరు బోధించిన

శాస్త్రం సత్యమైనదని, నా కప్పటినుండియు, తేటతెల్లమైనది. నేను నాభార్య, చిన్నపిల్లలు, మీ పద్ధతుల ప్రకారమే జీవింపుచూ చాలా లాభము పొందినాము. ఆ విషయం తమకు తెలిపి, మా ధన్యవాదములు తమ కందజేయుట మానిధి అయి ఉన్నది. అప్పుడు నావయస్సు 52 సం॥ లు. అంతకుపూర్వం, చాలా నియమరహితంగాను, ఇంద్రియ చాపల్యముతోనూ జీవించితిని. అందుచే తీవ్రమగు నాడీవ్యాధి మహావాతము వచ్చినది. నే నేపనీ చేయ లేక పొయ్యేవాడను. అంతలోనే శక్తి ఉడిగిపోయినది. లింగస్నానాలు చేస్తూ వారానికి 1 తూరి ఆపిరిపట్టి, ఉద్రేకంలేని సహజాహారం తినేవాడను. నేను నాభార్య, అప్పటికీ యిప్పటికీకూడా, కటికీలు తెరచిన గదుల లోనే పరుండుచున్నాము. 15 మాసాలు చికిత్సచేసిన తర్వాత నేనిప్పుడు బాగా ఆరోగ్యంగా నున్నాను. పనిపాటలు యథావిధిగా చేయగలుగుచున్నాను. పూర్వంకంటె సౌఖ్యముగా నున్నాను. ఎంతో శాంతిగా ఉంటున్నది. పూర్వం మెంతో తొందరపాటుండేది. ఇప్పుడు నెమ్మదిగా ఆలోచింప గలుగు చున్నాను. ఈ వయస్సులో తిరిగి దాంపత్య సౌఖ్యముకూడా అనుభవింప గల్గుచున్నాను.

నాభార్యనుగూర్చి చెప్పెదను. అప్పు డామె, గర్భాశయం జారేది. $1\frac{1}{2}$ సం॥ ఆలోపతీ వైద్యము చేసినారు. నయముకాలేదు నేను చికిత్స నారంభించినపుడే, ఆమెకూడా మన వైద్యం మొదలు పెట్టినది. దినానికి 3 లింగస్నానాలు చేస్తూ నావలెనే యితర నియమముల నవలంబించినది. అదివర కామెకు తీవ్ర

మగు మలబద్ధక ముండేది. చికిత్స మొదలుపెట్టిన మర్నాడే ఆమెకు సాఫీగా విరేచన మైనది. ఆరాత్రి నిద్ర బాగా పట్టినది. ఆమెకు శక్తికూడా కలిగినది. ఉపవాసాలు చికిత్సతో, ఆమె ఉదరవ్యాధి నయమైనది. ఆ వ్యాధి కూడా నయమైనది. అన్నిరోగాలు నయమైనతర్వాత మాకొక మగపిల్లవాడు కలిగినాడు. మీబోధ ప్రకారమే ఆబిడ్డను పెంచినాము. తన యీడు వారికంటె యెంతో ఆరోగ్యంగాను చలాకీగాను ఉన్నాడు. మిగతా పిల్లలుతినే ఆహారములో 3 వ వంతు ఆహారమే యీబిడ్డకు సరిపోవుచున్నది. అంతకన్నా తినడు. కాలింత రోగంగాని, చనుకుపురుగాని నాభార్య యెరుగను.

మాపెద్దపిల్లల కొఱకై నాభార్య యెక్కువ శ్రమయు ఆందోళనయు పడినది. ఆకారణంచేత కాన్పులు, నాభార్యకు విషమ జ్వరం వచ్చినది. 15 రోజులు ప్రాకృతికచికిత్సలతో ఆవ్యాధి నయమైనది. 5 సం॥ వయస్సు కలిగిన మా[illegible] పిల్లవానికి [illegible]జ్వరం వచ్చి అందులో సంధించినది. 3 దినములు సంధిలోనున్నాడు. జ్వరం యెక్కువైనప్పుడల్లా, 15 ని॥ కటిస్నానం చేయించేవారము. దానితో జ్వరముతగ్గి తెలివివచ్చేది. మరీ తీవ్రంగానున్న చివరిరోజున పగలు 5 కటిస్నానాలు రాత్రి 3 కటిస్నానాలు చేయించితిని. మర్నాడు ఉదయంనుండి సంధి కనబడలేదు. అప్పటి నుండియు రోగం తొలగసాగా నయము కానారంభించినది. చికిత్సారంభమున బిడ్డను మంచముమీదవేసి పక్కనుండబెట్టి వేడినీటి సీసాలతో బిడ్డకు ఆవిరిపట్టేవారము దానితో చెమటపోసేది. కొంతకాలానికి ఆ బిడ్డకే కోరింతదగ్గు వచ్చి

నది. 15 ని॥ పరిమితిగల కటిస్నానములు దినానికి 2 చొ॥ చేయించితిమి. 3, 4 వారాలలో కోరింతదగ్గుకూడా నయమైనది. ఇంతకన్నా తేలికగానుండే రోగాలు యింకా కొన్నిటిని మేము మీ వైద్యముతో కుదిర్చినాము. ఇప్పుడు ప్రతి రోగానికీ మీ వైద్యమే చేయవలసిందని చెప్పుచున్నాము. పైన పేర్కొనిన రోగాలన్నీ మందు వైద్యులే చికిత్సచేస్తే యెంతో డబ్బు ఖర్చయ్యేది. రోగాలు నయం కావడం సంశయమే. మీ పుస్తకంలో వ్రాసిన సలహాకొరకు నేనేమి ఖర్చు చేయలేదు. అయితే కొంచెము శ్రమపడవలసి వచ్చినది. ఆప్తులయిన వారికొరకు యింతమాత్రపు శ్రమపడటం సహజమైనదే. తేలికైన మీ చికిత్సావిధానం సాత్వికమైన పథ్యము, మనిషి యొక్క ఆరోగ్యాన్నే కాకుండా నైతిక స్వభావాన్నికూడా బాగుపరుస్తుంది. మీ చికిత్సావిధానం వ్యాప్తిపొందుట కొరకు నేను వ్రాసియిచ్చిన దానిని మీ యిష్టం వచ్చినట్లు వాడుకొనవచ్చు. ఇంతవరకు యేర్పడియున్న చికిత్సా విధానాలలో మీ పద్ధతియే అత్యుత్తమమైనది. హృదయపూర్వక అభివందనములు.

యల్‌బర్, ఫెల్‌డ్. అతి విధేయుడు. బి. హెచ్.

## 95. శిలామేహము.

నా ఆరోగ్యములో కలిగిన ఆశ్చర్యకరమైన మార్పును తమకు తెలుప దలచినాను. ఈ విషయములో మీకేమి ఆశ్చర్యం లేదు. ఇట్టి విషయములలో మీకిదివరకే అనుభవమున్నది.

2 దినాలు వరుసగా నాయెడమ మలుగులలో పై భాగమందు తాత్కాలికంగా నొప్పి పుట్టినది. తర్వాత ఒక మధ్యాహ్నం మూత్రము ద్వారా ఒకరాయి పడినది. తర్వాత కొన్ని దినాలు వరుసగా ఆ రాతి రంగుగల చిక్కని యెర్రని మూత్రము చాలా దినాలు వచ్చినది. మూత్రము వచ్చేటప్పుడు బాధ ఉండేదికాదు. దీని తర్వాత నారోగం నయమైనది. శిలామేహములో మూత్రలవణాలు గడ్డగట్టుననియు అవి మన వైద్యములో కరిగి పోతవనియు వ్రాసితిని. ఈ విధంగా దుర్భర మయిన ఆ వ్యాధి నయమయ్యే మార్గము వ్రాసినారు. నా విషయంలో ఆ సంగతి ఋజువైనది. ఈ సంగతి మీకు తెలుపుట నావిధి. ధన్యవాదములు.

బ్రోడ్ స్టెడ్. విధేయుడు, ఎ.

## 96. దౌర్బల్యము, కంటిజబ్బు, ఉదరవ్యాధి.

నాభార్య ఉదరవ్యాధితోను, నాడీవ్యాధితోను 14 సం॥ లు బాధపడినది. ఎంతమంది నయము చేద్దామనుకున్నా నయం కాలేదు. 2 సం॥ గడచినకొద్దీ ఆమెశక్తి ఉడిగి పోతున్నది, తేలిక అయిన యింటిపనులు కూడా చేసుకోలేకపోయింది. తోడుగానున్న కంటి జబ్బుమూలకంగా చదివే సామర్థ్యం లేదు. 1884 సం॥ మార్చి 17 వ తేదీన నాభార్య తొట్టివైద్య మారంభించినది. నాభార్యకున్న వ్యాధులన్నీ యిప్పుడు నయమైనవి. ఇదేమాదిరి వ్యాధులు వచ్చినవారు మీవైద్యము నవలంబించవలసినదని నేను ప్రోత్సహించుచున్నాను.

లీఫ్ జిగ్. విధేయుడు, జీ. యఫ్

## 97. తీవ్రమగు నాడీవ్యాధి.

ప్రియమైన కూనేగారికి, నాకు ఆరోగ్యమును ప్రాణమును దానము చేసిన మీకు యింకొకసారి ధన్యవాదముల నర్పించు చున్నాను. మీదయలేకపోతే నేను యీ విధంగా మాట్లాడే టందుకు యిక్కడ ఉండేవాడినికాదు. సుప్రసిద్ధవైద్యులు నారోగం నయముకాదని, బాధకూడా అనుభవింపక తప్పదని నన్ను ఓదార్చిపోయినారు. ఆస్థితిలో మీరొక్కరే ధైర్యము చెప్పి ప్రాణదానం చేసినారు. మీ చికిత్స చాలా తేలికైనది, గొప్పది కూడాను; మీరు కనిపెట్టిన యీ కొత్తవిషయం ప్రపంచమునందందరికి తెలిసి దానివలన అందరూ మేలుపొందు టయే నాకోరిక. కృతజ్ఞురాలను,

వియన్నా. ఎ. మ్మా. పి.

## 98. అజీర్ణము, నిద్రలేకపోవటము.

కూనేగారికి. కటిశింగ స్నానాలుచేస్తూ, ఆవిరికూడా పట్టి మీ వైద్యము కొంతకాలం అవలంబించినాను. అందువలన నా ఆరోగ్యము చాలా బాగుపడింది. అజీర్ణరోగము పోయింది. దేహానికి బలము చిక్కినది. నాకున్న ఉత్సాహం వృద్ధిపొందినది. ఇదివరకు సరిగా నిద్రపట్టేదికాదు. ఇప్పుడు బాగా నిద్రపట్టు చున్నది. హృదయపూర్వక ధన్యవాదములు.

లీప్‌జిగ్. విధేయుడు, యమలీయఫ్.

## 99. కాలికమగు మలబద్ధకము, మూలవ్యాధి, పైత్యకోశము పెద్దదగుట.

ప్రియమైన కూనేగారికి, రెండు దినముల క్రిందట తమకొక జాబువ్రాసినాను. దానిలో చెప్పినట్లు మీ నిరౌషధ చికిత్సా విధానమువలన కలిగినమేలుకు తృప్తిపడుచున్నాను. నాకు కాలికమగు మలబద్ధక ముండేది. అన్నిరకాల మందులూ వాడినాను. మీరు ఉత్తరములో వ్రాసినట్లు ఆచరించినందున ఇప్పుడు ఆ రోగం పూర్తిగా నయమైనది, ఇప్పుడు దినమునకు 2 తూరులు సాఫీగా విరేచన మవుతుంది. మలబద్ధకంలో సమకాలికంగా వచ్చిన మూలవ్యాధి కూడా క్రమ క్రమంగా నయమైనది. అదివరకు నా పైత్యకోశము లావై ఉన్నది. ఇప్పుడు సహజ స్థితికి 3 నెలలక్రితం వచ్చినది. జీర్ణకోశానికి కుడిప్రక్క నొప్పి ఉండేది. ఇప్పుడది పూర్తిగా కుదిరింది. ఆ నొప్పికి హోమ్యోపతీ మందులు కూడా వాడినాను. అవికూడా యేమీ పనిచేయ లేదు. మీ వైద్యములో యివన్ని నయమైనవి. ఉద్రేకం కలిగింపని పథ్యము పుచ్చుకునేవాణ్ని. దినానికి 1 కటిస్నానాలు చేసేవాడను. అభినందనములు,

ఇ. బ్లింగ్. యఫ్. సి.

## 100. నాడీవ్యాధి, పంటిపోటు, తలనొప్పి, నిద్రలేకపోవుట, యెలుగువాపు.

ప్రియమయిన కూనేగారికి, మీ వైద్యవిధానాన్ని గురించి, 1887 సంగలో నేను మొదటిసారి విన్నాను. అప్పుడు నాకు

నాడీవ్యాధి ఉండేది. మీ వైద్యముతో ఆరోగం పొందుట్టు కొన్నాను. అప్పటినుండి మీ వైద్యముయొక్క మహత్తర మైన యోగ్యత ఋజువుచేయటానికి నాకనేక అవకాశములు సంభవించినవి. ఒక శీతకాలంలో పైదవడలో ఒక దంతం గుల్లగానై పంటినొప్పి వచ్చినది. మంటలెక్కువైనవి. ముఖ ములో కుడిభాగం, చెవివరకు వాచినది. తీవ్రమగు బాధ కలిగినది. నిద్రపట్టటం అసాధ్యమై పోయినది. కొద్దిపరిమితిగల లింగస్నానములు దినములో అనేక తూరులు చేసేవాడను. దానితో ఉపశాంతి కలిగేది. మీసలహా నాకు చేరినతర్వాత దీర్ఘకాలము లింగస్నానం చేసినాను. దానితో నానాడులు చల్లపడినవి. నా బాధకూడా క్రమంగా తగ్గినది. కొలది గంటల లోనే పంటినొప్పి సాంతం పోయినది. తలనొప్పి కంటిపోటు మొదలగు వానికి తలకు ఆవిరి పట్టితిని. బాధలు తీరినవి. నా కొకతూరి జలుబుచేసినది. యెలుగు రాపిడి అయినది. నేనెంత గట్టిగా మాట్లాడదలచుకున్నా రహస్యం చెప్పినట్లుండేది. దీనికి లింగస్నానములు చేసితిని. నీరు వెచ్చబడువరకు లింగస్నాన ములు చేయుచునే ఉంటిని. తర్వాత ఆనీరు పారబోసి తొట్టికి నీరుపోసి లింగస్నానమే చేసితిని. తొట్టిలోనీరు వేడి యెక్కినప్పు డెల్ల కొత్తగా నీరుపోస్తూ ఒకే లింగస్నానం 2½ గంటలు చేసి తిని, నాయెలుగు రాపిడి సాంతము పోయినది. గొంతెత్తి బిగ్గరగా మాట్లాడితిని. పాట పాడగలిగితిని. ఇంక యేయితర చికిత్సావిధానము వలననూ కూడ యింత త్వరగా యిట్టి అద్భుతమైన సుగుణము కలిగి ఉండేదికాదు. ఇందుకు నేను

తమకు మరీ కృతజ్ఞుడనై యున్నాను. లింగస్నానము యొక్క మహాత్తరమైన గుణమును గురించి యీ వృత్తాంతము తమ కుతూహలమును వృద్ధిచేయును. ఈ వృత్తాంతమువలన యెంతో మందికి మేలగును గాన దీనిని మీ యిష్టము వచ్చినట్లు ప్రచురింప ననుమతించు చున్నాను.

క్రిజ్జిగ్. మీ విధేయుడు, కారక్. ఎల్.

## 101 సుఖప్రసవము.

ప్రియమైనకూనేగారికి, తాము కోరుకున్నను మీ వైద్యమవలంబించుటవలన నాభార్య రెండవ మూడవ కాన్పులు, సుఖముగా ప్రసవించిన సంగతి తమకు విన్నవించుట నావిధి. ఆమె మొదటి కాన్పుకు చాల కష్టపడినది. వైద్యుడు అవసరమాయెను. నాభార్య అవయవములు సరిగా లేవనియు ఆమె యికముందు గర్భము ధరించిన ప్రమాదము సంభవించుననియు చెప్పియుండెను. ఈ తూరి రెండవ కాన్పునకు 2½ గంటలు పట్టెను. మూడవకాన్పు ఒక గంటలోనే పూర్తి అయినది. మంత్రసానితో గూడ అవసరము లేకపోయినది. చిట్ట చివరకాన్పు సంతానము మిగతా బిడ్డలకంటె బరువుగా కూడ నుండెను.

డాల్ బ్కే. పాల్. కె.

## 102. నాడులలో మంటలు.

కూనేగారి స్వాభావిక చికిత్సావిధానమువలన నేను పొందిన లాభమునకు వారికి కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను. కాలిక

మైన నాడులయందలి తీవ్రమగు మంటలు యీ వైద్యములో నయమైనవి. నా దేహారోగ్యముకూడ బాగుపడినది. అందువలన రోగముచే బాధపడేవారు లీప్జిగ్‌లోని కూనేగారి జల చికిత్సాలయమునకు పోవలసినదని నేను కోరుచున్నాను.

లీప్జిగ్.

ఇ. ఎఫ్. ఆరిస్టు.

103. చెవిలోనుండి చీముకారుట, చెవిలోపోటు, ఋతుజ్వరము.

తమ సలహో వచ్చిన తరువాత 3 వారములు మాత్రమే చికిత్స చేసితిని. దానివలన నాకుండిన పై వ్యాధులు నయమైనవి. మీరిచ్చిన సహాయమునకు ధన్యవాదములు. నా ఆరోగ్యము బాగుపడినది. ఇప్పుడు 5 నిమిషములు చొప్పున ఒక్కొక్క కటిస్నానము ప్రతిఉదయము చేయుచున్నాను. కృతజ్ఞుడను.

పుఎర్టొకాబెల్లో,

కార్లాస్ ఎల్. బి.

వెనిజులా, దక్షిణ అమెరికా.

## 104. కాలికమగు ఆమవాతము.

కూనేగారికి, 25 సం॥ల నుండి పాల్. కే కాలికమగు ఆమవాతముతో బాధపడుచుండెను. 5 గురు సుప్రసిద్ధవైద్యులు ఆరోగము కుదురనే కుదురదని వెల్లడించిరి. మీ పద్ధతిన చికిత్సచేసి నేనారోగమును 6 వారములలో కుదిర్చితిని. మీరు రచియించిన తొట్టివైద్యము ఒక మంచి జర్మన్ గ్రంథమును పోస్టుద్వారా పంపగోరెదను.

హీంర్‌డిట్‌క్రీన్ నూయిస్.

ఫ్రాంజ్ యస్.

## 105. పైత్యశూల, హిష్టీరియా.

ప్రియమయిన కూనేగారికి, నాకు తర్చుగా పైత్యశూలవచ్చి చాలారోజులు నిలువఉండేది. తర్వాత యింకొక వారానికి హిష్టీరియా వచ్చేది. అప్పుడు నేను యేడుస్తూ ఉండేదానను. దీనితో బాగా బాధపడ్డాను. మీ సలహాప్రకారం చేశాను. నా కున్న రోగాలన్నీ నయమైనవి. అన్నిటికన్న ఆశ్చర్య మేమిటంటే, యెంతోమంది వైద్యులు యెంతోకాలం చికిత్సచేసినా నా రోగం నయంకాలేదు. అందులో యిప్పు డెవరైనా కన పడితే నా రోగం యెట్లా నయమైనదా అని నన్ను అడుగుతూ ఉంటారు. నేనిప్పుడు పలుచగాను, కోమలంగాను ఉన్నాను. నేనింతకుముందు యీ రోగంతో 20 సం॥ బాధపడ్డాను. ఈ కాలంలో బైల్ ఫెల్డులో నున్న 30 మంది వైద్యుల సలహా తీసుకున్నాను. మేము సంపాదించి నిలువచేసినదంతా, వైద్యుల సలహాకు, మందుల ఖరీదుకు సరిపోయినది.

పయల్ ఫీల్డు. మీ విధేయుడు; యమ్. హెచ్.

## 106 సర్పి, మలబద్ధకం, వెన్నులోనొప్పి, ఋతుధర్మము క్రమముచెడుట, తలనొప్పి, కన్నులపోటు,

ప్రియమయిన కూనేగారికి, గడచిన వసంతకాలములో నా కుమారునికి సర్పి కలిగినది. మొట్టమొదట, మందువైద్యులకు చూపించినపుడు, యీ వ్యాధి చాలా ప్రమాదకరమైనదనియు, రోగిని ఆసుపత్రిలో ప్రవేశపెట్ట వలసినదనియు చెప్పిరి.

అతడిచ్చిన మందులన్నియు వ్యర్థమైనందున, మీ వైద్యము చేసినాను. కుదిరినది. నాకు తీవ్రమయిన మలబద్ధకము, వెన్నుపాములో నొప్పి ఉండేది. ఋతుధర్మము క్రమంగా ఉండేది కాదు. తలనొప్పి కన్నుపోటు ఉండేవి. వీనికి మీ వైద్యము చేసితిని. మొదటిస్నానముతోనే సుగుణముకనుపడినది. మీరు గ్రంథములో వ్రాసినట్లు మొదటి స్నానంతోనే విరేచనం సాఫీ అయినది. నేను మీ గ్రంథము చదువుట తటస్థించుట వలన నేనిట్లు ఆరోగ్యమును పొందగల్గితిని. యిందుకు మీకు నేను కృతజ్ఞురాలను.

సెల్లీ ఈ హెచ్.

## 107. మూర్ఛ, అపస్మారము.

ప్రియమయిన కూనేగారికి. 10 సం. నా బిడ్డకు మూర్ఛ అపస్మారము చాలా తీవ్రమయిన స్థితిలో కనుపించినవి. చిరకాలము మందు వాడితిమి. నయము కాలేదు. చిట్టచివరకు యింకొక పండితుని సంప్రదించమని చెప్పెను. ఇంతలో అమూల్యమయిన మీ చికిత్సా విధానమును గూర్చి వింటిని. మీరు చెప్పిన సలహాప్రకారము నడుచుకొంటూ ప్రతిదినము తొట్టిస్నానము చేయిస్తూ, స్వాభావికమైన పథ్యమును పెట్టితిని. యెంతో చెడుగాఉన్న రోగము అద్భుతముగా కుదుర నారంభించినది. ఒక వారం చికిత్స చేసేటప్పటికే, దేహారోగ్యము బాగుపడినది. మానసిక శక్తి కూడా వృద్ధి పొందినది. తిరిగి బడిలోకిపోయి పాఠములు చదువుకొన నారంభించినాడు. క్రమంగా రోగము నయమైనది.

అమూల్యమయిన మీ చికిత్సావిధానము అవలంబింపవలసిన దని, సందర్భపడినచోట్లనెల్ల చెప్పితీరెదను.

స్కాన్ ప్లెండ్. ఫ్రాన్జ్ ఏన్టన్. బి.

## 108. వెన్నుపాములో మంటలు, నాడీవ్యాధి.

అయ్యా, నా వయస్సు 28 సం॥లు. తీవ్రమయిన నాడీవ్యాధి. వెన్నుపాములో మంటలతో బాధపడుచూ అనేక మందులను పుచ్చుకొన్నాను. రోగం నయముకాలేదు. కూర్చోలేను, నడువనూలేను. మందు వైద్యులు నా రోగం నయముకాదని నిశ్చయం చేసినారు. ఆ స్థితిలో మీ వైద్యము నవలంబించినాను. 12 వారాలు చికిత్స చేసేటప్పటికి చేతికర్రలేకుండా నడిచేస్థితి వచ్చినది. ఇప్పుడు 1 గంట కర్రలేకుండా నడువగలను. ఈ స్థితిలో మీకు నా కృతజ్ఞతను వెల్లడించకుండా యోగ్యుండను.

జిట్టావ్ వద్ద బెర్కుడార్ఫు, గుస్టావ్. యన్.

## 109 జఠరకోశమునుండి శ్లేష్మముకారుట, జీర్ణకోశములో వ్రణము, పైత్యకోశము గట్టిపడుట, ప్లీహము పెద్దదగుట, మూత్రకోశము పిండవ్యాధులు, మలబద్ధకము మొదలైనవి.

ప్రియమయిన కూనేగారికి. ప్రమాదకరమైన నావ్యాధి మీ చికిత్సలో నయమైనది. ఇందుకు నాధన్యవాదముల నర్పించుకొనుచున్నాను. పైన పేర్కొనిన వ్యాధులన్నియు, నన్ను

బాధింపగా మీ సలహో తీసుకుని, ఉచితమయిన పథ్యముచేస్తూ కటిస్నానములు చేయుగా నా బాధలన్నీ ఉపశమించి రోగం నయమైనది. ఎంతమందో వైద్యులు యూనివర్సిటీ ప్రొఫెసర్లు ప్రియత్నం చేసినా విరేచనం సాఫీఅయినా కాలేదు. రోగాలేమి నయమవ్వలేదు. మీ వైద్యము నవలంబించిన తర్వాతనే విరేచనం సాఫీయై వ్యాధి నయమైనది. మీకు ధన్యవాదముల నర్పించుచున్నాను.

యల్ బెనది మీాదనున్న పెళ్ళన్, డబ్లియూ, ఎ.

## 110. ముదిరిన క్షయ.

ప్రియమయిన కూనే గారికి. నాబిడ్డకు క్షయరోగము వచ్చినది. మందు వైద్యులు చేసిన చికిత్సలతో రోగము ముదిరిపోయినది. వైద్యులు యిక లాభము లేదని చెప్పిరి. ఇంతలో మీారు రచియించిన తొట్టివైద్యము నేను కొని చదివినాను. అందులో వ్రాసిఉన్నట్లే తొట్టివైద్యము చేయించినాము. అంత ముదిరిపోయిన క్షయరోగము, కుదిరి నాబిడ్డ ఆరోగ్యముగా నున్నాడు. ఇందుకు నా ధన్యవాదములు.

లడ్ విగ్సులస్టు, టి. ఇ.

## 111. కాలుబొబ్బ.

అగష్టుఅనే నాకుమారుని చేతిమీాద కాగేనీరు పడి కాలి బొబ్బెక్కినది. అదృష్టవశాత్తు మీారు వ్రాసిన తొట్టివైద్యము నాచేత పడినది. మీారు అందులో వ్రాసిన విధంగా చికిత్సచేసినాను.

ఒక వారంరోజులు చికిత్స చేసేసరికి, కాల్పులు, బొబ్బలు మానినవి. ఇప్పుడక్కడ మచ్చగూడా లేదు. పూర్వమొకప్పుడు నాకిట్టి బాధే కలిగినది. అపుడు మీ వైద్యము తెలియక మంచు వైద్యముచేసితిని. ఆ వైద్యానికీ మీ వైద్యానికి, రాత్రికి పగటికి ఉన్నంతభేద మున్నది. అందువలన మీ వైద్యము చాలా ప్రశస్తమైనదని బహిరంగముగా వెల్లడించుచున్నాను.

కేన్ గెరెన్, హీన్‌రిచ్. బి.

## 112. జీర్ణకోశవ్యాధి, రొమ్ముదౌర్బల్యము, శ్వాసకోశ అభిష్యందము

జీర్ణకోశవ్యాధితో 16 సం॥ నుండి బాధపడుచున్నాను. భేదికి మందు వేసుకుంటేనేగాని విరేచనము అయ్యేదికాదు. 4, 5 యేండ్లనుంచి సరిగా మూత్రము అయ్యేదికాదు. రొమ్ము దుర్బలమై శ్వాసకోశ అభిష్యందము యేర్పడినది.

ఫ్రీబెర్గు, బెర్న్, జెనివా మొదలైన పట్నాలలోఉండే ప్రసిద్ధ వైద్యులు నా రోగానికి చికిత్సచేసినారు. రోగము నయముకాక పోగా ఉపశాంతి అయినా కలగలేదు. కూనేగారివల్ల ప్రత్యేకంగా సలహాపొంది, అనేక వారాలు తొట్టివైద్యము చేసినాను, ఇప్పుడు నా రోగము నయమైనది. ఇప్పుడు తిరిగి హోటలు నడుపుకోగలుగుతున్నాను. చిత్రాలు ఆవర్జాలు వ్రాస్తున్నాను. ఉత్తర ప్రత్యుత్తరాలు చేస్తున్నాను. కూనేగారి తొట్టివైద్యము వారుచెప్పిన పథ్యవిధానము అవలంబించుటవలన నా కెప్పటి

పరిపూర్ణ ఆరోగ్యము కలిగినది. వారు కోరకుండానే నా సంగతి బహిరంగముగా వెల్లడించుచున్నాను.

చార్జుసిబాద్, స్విడ్జర్లెండ్, వి. డబ్లియూ. యస్.

## 113. చెవులో చీముకారుట, తలనొప్పి, చెవులోను గొంతులోను కొయ్యగండలు, శ్రవణనాడిలో నుండి నీరుగారుట.

ప్రియమయిన కూనేగారికి, నా కొమారుడు 7 సం॥ నుండి వరుసగా కంఠవ్యాధులతోను కర్ణవ్యాధులతోను బాధపడుచూ అనేక మందులు పుచ్చుకొనెను. అవి యేవియు పనిచేయలేదు. గడచిన సెప్టెంబరు నెలనుండి చెవిలో చీముకార నారంభించినది. తల నొప్పులుగూడా వచ్చుచున్నవి. ఇ. యన్. టి. అనగా కర్ణ నాసిక, కంఠవ్యాధుల శాస్త్రప్రవీణుడైన వైద్యశ్రేష్ఠుని సంప్రదించితిని. అతడు పరీక్షించి, ముక్కులోను, చెవిలోను, కొయ్య గండలున్నవనియు. శస్త్రముచేస్తే ఆ వ్యాధులు నయమవుతవనియు అతడు చెప్పెను. వెంటనే శస్త్రము చేయించినాము. ఈసారి పరీక్షించి కర్ణనాడిలోనుండి నీరు గారుచున్నదనియు, యింకొకతూరి శస్త్రము చేయించుకొనుమనియు చెప్పెను. అప్పుడొక హోమ్యోపతీ వైద్యుని సంప్రదించినాను. ఆతడుకూడ ఈ వైద్యుడుచేసిన నిదానమే సరి అనెను.

ప్రయాణములో తిరిగేటప్పుడు, నేను మీ తోట్టివైద్యపు ఆశ్రమాన్ని గూర్చి విన్నాను. నా కొమారుని వెంట పెట్టు

కుని లీప్‌జిగ్‌నకు వచ్చితిమి. నాబిడ్డకు మీా సలహాప్రకారము 5 వారములు చికిత్స చేసినాను. వాని రోగము పూర్తిగా నయమైనది. ఇందుకు మీాకు నేను ధన్యవాదముల నర్పించుట నావిధియై యున్నది. మీారు రచియించినతొట్టివైద్య పుస్తకము నావద్దలేదు. దయయుంచి ఒక ప్రతి పంపించండి, అది ప్రతి గృహమునకు మూల ధనమువంటిది. ప్రతి కుటుంబానికి ఒక పుస్తకము ఉండితీరాలి.

వాల్ మార్ షేన్, బ్రూనో, యస్.

## 114 మూత్రపుతిత్తిలోరాయి. సుఖప్రసవము, క్షయాశయవ్యాధి.

ప్రియమయిన కూనేగారికి. ఒక గానుగవాని కుమారునికి, మూత్రపుతిత్తిలో రాయి. దానికి యెన్నో చికిత్సలు చేసినారు. గుణమివ్వలేదు. చివరకు మీా సలహాప్రకారము మన వైద్యము చేసినారు. మూత్రకోశములో రాళ్ళన్ని కరిగి, మూత్రముగా వెళ్ళిపోయినవి. రోగము నయమైనది.

37 సం॥ స్త్రీకి అదివరకు చాలా కాన్పులయినవి. ప్రతిసారి ప్రసవము చాలా కష్టముగా ఉండేది. బిడ్డకు పాలుండేవికావు. అందువలన ఆమె మీా వైద్యము నవలంబించినది. ఈతూరి ఆమెకు కవలలు పుట్టినారు. మంత్రసానితో నిమిత్తం లేకుండా సుఖముగా ప్రసవించినది. ఇదివరకు ఒక్క బిడ్డకుకూడా, సరిగ్గా పాలుండేవికాదు. ఈ తూరి ఆమెవద్ద ఇద్దరు కవలపిల్లలకు సరిపోయిన అన్నిపాలున్నవి.

ఒక పడుచువానికి శ్వాసాశయవ్యాధి వచ్చినది. వైద్యులు ఆ వ్యాధి నయముకాదని నిశ్చయం చేసినారు. ఇప్పుడతడు మీ వైద్యము అవలంబించి క్రమంగా అభివృద్ధినొందుచున్నాడు. మీ వైద్యము యీ విషయములో కూడా బాగా పనిచేసినది. నా దేహారోగ్యము కూడా బాగుగా నున్నది. ఈ విషయములు తమకు తెలుపుటలో నాకు ఆనందముగా నున్నది.

జెర్మనియా, కోష్టా, డి, శరాత్రి, హెచ్. యస్.

## 115 నేత్రవ్యాధి, ముఖచర్మవ్యాధి, గొంతువ్యాధి, సర్పి, ఆటలమ్మ, పొంగు.

ప్రియమయిన కూనేగారికి, నేను పొందిన మేలునకు తగినట్లుగా మిమ్ములను స్తుతించుటకు, తగిన పదజాలము నాకు లభింపలేదు. నేను యెప్పుడూ లావుగా ఉండేదాన్ని. నాబుగ్గలు గులాబీరంగుగా ఉండేవి. అయినప్పటికీ నేనెప్పుడు జబ్బుగా నుండేదానను. చిన్న బిడ్డప్పటినుంచి నేను కంటివ్యాధితో బాధపడేదానను. నేను పెద్దదాననైన కొలదిని, ఆ బాధ తగ్గి ముఖమువిూది చర్మవ్యాధి ఆరంభించినది. ప్రతిసంవత్సరం నాకు కంఠవ్యాధో,సర్పియో, ఆటలమ్మో,పొంగోయేదోఒక వ్యాధివస్తూ ఉండేది. ప్రతి సంవత్సరం నేను బ్రతుకననుకొనేవారు. ఆరోజులను తలచుకొని యిపుడు నేనున్న సంపూర్ణ ఆరోగ్య దశను తల్చుకొంటే నాకు కలిగే ఆనందమును నేను మాటలతో వర్ణింపలేకున్నాను. తాము ఉత్తరములద్వారా నాకందచేసిన సలహావలన నేను పొందిన ఆరోగ్యము నిల్చి యున్నది. యిప్పుడు

నన్ను చూచిన బంధువులు నా ఆరోగ్యముతోపాటు నా కపాలములో కూడా మార్పులు వచ్చినవని అనుచున్నారు. మీ చికిత్సా విధానములో నా విశ్వాసాన్ని గురించి మీకు ప్రత్యేకము వివరింప నక్కరలేదు. సమయము చిక్కినప్పుడెల్లా, మీ వైద్యము అవలంబింప వలసినదని రోగులను ప్రోత్సహించుచున్నాను. నాహృదయపు లోతులనుండి, మీకు నా ధన్యవాదముల నర్పించుకొను చున్నాను.

ఓ. ఈ. టిన్. జన్. లైనా, యం.

## 116. మోకాలు క్షయ. అందులో అస్థిశకలములు

ప్రియమైన కూనేగారికి. ఇప్పుడు నేను పొందిన ఆరోగ్యదశలో నేను పొందే ఆనందాన్ని ఎలావర్ణించాలో ఊహించ లేకుండా ఉన్నాను. మీ వలననే లాభమంతా పొందినాను. అందుకు మీకు నా ధన్యవాదములు.

నా మోకాలిలో క్షయపుట్టి వైద్యులు నిరంతరాయంగా చేసిన చికిత్సలతో 5 సం॥ బాధపడితిని. చిట్టచివరకు మోకాలుబొమిక తుంపులయినది. దానిని శస్త్రము చేయవలసివచ్చినది. శస్త్రము చేసిన 3 నెలలకు వైద్యులు, నారోగం నయమైనదని నిశ్చయం చేసినారు. అయితే నాస్థితి మరింత పాడయినది. నేను మీవద్దకు చికిత్సకు వచ్చినపుడు మీరిది చూడనే చూచినారు. 10 గజాల పొడవుగల గుడ్డ బద్దె మోకాలుచుట్టూ 5 సం॥ నిరంతరాయంగా కట్టే ఉంచినాము. మోకాలిపుండు మానినట్టే మాని తిరిగి ఆచోటనే శెలవేసి వాచినది. మీవైద్యము నారంభించిన

నాడే, మోకాలుకు చుట్టబెట్టిన బద్దె ఊడతీసినాము. తిరిగి కట్టవలసినపని లేకుండాపోయి, క్రమంగా మీ వైద్యమువలన మోకాలు లావు తగ్గినది. మోకాలిలో పుట్టిన పుండు కూడా, క్రమక్రమంగా చిన్నదై మానిపోయినది. ఇప్పటికి నాకాలు నయము కావటం చూచాను. నాకు అమితానందము కలిగినది. ఇందుకే నేను ధన్యవాదముల నర్పించుకొనుచున్నాను. నా హృదయములో మీయెడ నాకమితమైన గౌరవమున్నది. నా బోంట్లకు తాము చేసిన అమితమగు సహాయమునకు భగవానుడు తప్పకుండా వరాలు యిస్తాడు. మీకు ఆయురారోగ్య ఐశ్వర్యములు భగవంతుడు ప్రసాదిస్తాడు. మానవలోకానికి యిట్లె మేలుచేయుచూ మీరు చిరకాలం జీవించేటట్లు భగవానుని ప్రార్థిస్తున్నాను.

జైర్యాన - విట్జ్, బుకోవినా, స్టిఫాన్ - యస్.

మతశాస్త్ర విద్యార్థి.

## 117. పృష్టాస్థిలో పుండు, సుఖప్రసవము.

రోగి నాభార్య. ఆమెకు వెన్నుపాములో దిగువ భాగంలో ఉండే పూసల్లో పుండు పుట్టినది. దానికి తడిసిన నాములో కట్లుకట్టి చికిత్సలు చేసేవారు. ఎల్లప్పుడు వంగి కూర్చోవలసివచ్చేది. ఈ చికిత్సతో ఆమెకు సుగుణము కలుగలేదు. వైద్యులు నిరాశ చేసుకొనినారు. యేదో బహిరంగ వ్రణము పుడుతుంది అనుకున్నారు. అప్పుడే, మీపుస్తకాన్నిగురించి విని, కొని, చదివి నాసలహాకొరకు ఆపుస్త

కాన్ని నాదగ్గరకు పంపించినది. నే నాగ్రంథము చదివి వెంటనే మీా వైద్యము ప్రారంభింపవలసినదని మీావద్దకు పంపినాను. వైద్యులు బహిరంగవ్రణము పుట్టుతుం దనుకొన్నారు. అది పుట్టలేదు సరికదా! ఆమె ఆరోగ్యము క్రమంగా అభివృద్ధి పొందినది. తనంతనే లేచి, యెవరి సహాయము లేకుండా నడువ గలిగినది. వైద్యులు కట్టే నాముపట్టీ తీసివేసినది. ఆమె రోగం నయముకాదని వైద్యులు నిశ్చయం చేసినారు. ఆమెను నేను, నిరుడు వివాహమయినాను. ఆమె యిప్పుడు గర్భిణిలో నున్నది. ఒకమంచి ఆరోగ్యమైన బిడ్డకొరకై యెదురుచూచుచున్నాము. మీా చికిత్సావిధానంవల్లనే ఆమె కారోగ్యము కలిగినదని మేము నమ్ముచున్నాము. మీావైద్యమువల్లనే ఆమెకు ప్రాణము దక్కినది. మాదంపతుల ధన్యవాదముల స్వీకరింపుడు.

జూరిచ్, యమ్. వాన్. యస్.

## 118. క్షయ

ప్రియమయిన కూనేగారికి, 2 సం॥ క్రితం మీాతొట్టి వైద్యము నాకు లభించినది. నాకు క్షయవస్తే మీాచికిత్స చేసికొని అద్భుతమైన లాభాన్ని పొందితిని. ఈసంగతి మీాకు తెలుపుటకు శక్తిగలిగినది. యావజ్జీవితం మీాకు కృతజ్ఞుడను. మా సమీాపములో ఒకపూటకూలి యిల్లున్నది. ఆయింటి యజమాని కూతురు వికలాంగిగా నున్నది. వైద్యులు ఆ బిడ్డకేమీా చేయ తగినది లేదంటారు. ఆ బిడ్డకు తప్పకుండా నయమవుతుందని నా ఉద్దేశము. ఆబిడ్డను గురించి యేదైనా సలహా పంపిస్తారా?

ఓబర్‌స్టీ. నాక్,బవేరియా జోసెఫ్. హెచ్.

## 119 పక్ష్మకాలుష్యము. (ట్రాకోమా)

ప్రియమైన కూనేగారికి. 5 సం॥ నే నీ రోగముతో బాధపడి నాను. ఏ వైద్యుడూనాకు సహాయము చేయలేక పోయినాడు. అప్పుడు విధిలేక మీ వైద్యము నవలంబించినాను. అద్భుత మైన సుగుణము కలిగినది. 2 మాసాలలోనే నా కంటిరోగం నయమైనది. ఆ రోగం తిరిగి రాలేదు. ఒక్కసారి లీప్‌జిగ్ - వచ్చి మిమ్ము మీ చికిత్సాలయాన్ని చూడాలని ఉన్నది. రోగనివారణవృత్తాంతములు కలిగి, జర్మనీ భాషలోను, హాంగేరియన్ భాషలలోనూ అచ్చువేసిన 30 కరపత్ర ములను దయయుంచి పంపగలరా? యిక్కడ మా స్నేహితులకు ఉచితముగా పంచిపెడతాను.

బుడాపేస్ట్ హాంగెరీ, మీ విధేయుడు, కారల్, టి.

## 120 నంజు, కాళ్ళవాపు, తలనొప్పులు, మలబద్ధకము.

ఒక సం॥ క్రితం మీ తొట్టివైద్యపు పుస్తకము నాచేతికి వచ్చి నది. నా సలహామీద స్నేహితు లెంతోమంది ఆ పుస్తకం తెప్పించు కొన్నారు. అందులో విషయాలు చాలా అనుభవ సీయంగా ఉన్నవని వారంతా అంటున్నారు. నాభార్య వయస్సు 32 సం॥ లు. ఆమెకుచిన్నప్పటినుంచి మలబద్ధకము. తలనొప్పికూడా ఉంపేది. రకరకాల భేదిమందులను తిన్నది. యేమీ గుణము యివ్వలేదు. మీ చికిత్స అవలంబించిన నాటినుండి ఆ బాధ లన్నీ తగ్గి మలబద్ధము, తల నొప్పులు అంతరించినవి. కాళ్ల వాపు, నంజు కూడా నయమైనవి. నాకుకూడా మలబద్ధకముండి, మీ

వైద్యము చేస్తే మానినవి. మీరు రచియించిన, ముఖనిదాన శాస్త్రము మొదలగు గ్రంథములుకూడా పంపించవలసినది. త్రోట్టవైద్యము వ్యాప్తి చేయుటలోనే నేను కాలము గడుపుదామనుకొనుచున్నాను.

బాల్కేన్ హైన్సై లీషియా కారల్ కె.

## 121 నిద్రలేకపోవుట, కోపోద్రేకము, మలబద్ధకము.

3 సం॥ గకరకాల మందులిచ్చి కూడా నారోగాన్ని నయము చేయలేక పోయిన వైద్యులందరిని పంపివేసినాను. మీచికిత్సా విధానాన్ని అవలంబించినాను. ఉత్తరాల ద్వారా మీసలహా ననుసరించి స్నానాలు, పథ్యము ఆచరించినాను. 3 సం॥ ల బట్టి నాకున్న విరేచనబద్ధకము పోయినది. మూలవ్యాధి, కోపోద్రేకములు తగ్గినవి. తెల్లవార్లు నిద్ర సుఖముగా పోనున్నాను. ఇదివరకు నాకు నిద్ర పట్టేదేకాదు. ఇందుకు ధన్యవాదములను అర్పించుచున్నాను.

సెంటు పీటర్ సుబర్గు, రష్యా హెచ్, డబ్లియూ

## 122. పైత్యకోశవ్యాధి, మలబద్ధకము.

1893 సం॥ జులై నెలలో మేము లీప్ జిగ్ లో ఉన్నాము. అప్పుడు మేమిద్దరము మీచికిత్స చేసి లాభమును పొందినాము.

బి. పైత్యవ్యాధితో తీవ్రంగా బాధపడేవాడు. అతనిరోగం మీవైద్యముతో కుదిరినది. డెన్మార్కులో ఉండే అతని స్నేహితులంతా, అతనిరోగం నయము కావటానికి ఆశ్చర్య పడు

చున్నారు. నాకున్న మలబద్ధకం మీవైద్యముతో నయమైనది. మీవైద్యాన్ని గురించి తెలిసికొనేందుకు చాలామంది వచ్చు చున్నారు. డేనిష్ భాషలోను, స్వీడిష్ భాషలోను మీరు అచ్చువేసిన కరపత్రాలు పంపిస్తే నేనిక్కడ డెన్మార్కులోను, నార్వే, స్వీడనులలోను వానిని పంచిపెడతాను. అప్పుడు మీ పుస్తకాలు అమ్మటానికి, మీ వైద్యము నచ్చచెప్పటానికి వీలుగా ఉంటుంది.

మోర్ బ్రుడుప్ గార్డు, డెన్మార్కు, హెచ్. బి.

## 123 క్షయ - దగ్గు - నోటివెంట శ్లేష్మము పోవుట: కఫములో నెత్తురు.

నాకున్న పై తీవ్రవ్యాధులకు మీరు చక్కని చికిత్సచెప్పి నయము చేసినందుకు మీకు ధన్యవాదముల నర్పించుకొను చున్నాను. 8 సం॥ నుండి పైనపేర్కొనిన వ్యాధులతో బాధపడుచూ కూరగాయల వైద్యముల చేసినాను. డాక్టరులవద్ద మందు పుచ్చుకొన్నాను. నారోగం నయముకాక నానాటికి ముదిరిపోయినది. అది యెంత ముదిరిపోయినదో; యెవరికీ తెలియదు. నాస్థితి పాడైనది. నాకు వైద్యులమీద నమ్మకం పోయినది. డిశంబర్ 4 వ తేదీన మీ తొట్టివైద్యమును గూర్చి విన్నాను. మీ చికిత్స అవలంబించుట వలన 2,3 రోజులలోనే నాకు గుణము కనుపడినది. వారం వారం నా ఆరోగ్యము అభివృద్ధి పొంది 3 మాసాలయ్యేసరికి నా వ్యాధి పూర్తిగా నిమ్మళించినది. నేనిప్పుడు ఆరోగ్యముగా

నున్నాను. రోగంతో బాధపడేవారంతా మీ వైద్యాన్ని అవలంబిస్తే మేలు కలుగుతుందని నానమ్మకము. మీావైద్యమే నిజమైన వైద్యము.

ఫ్లోటక్. బెన్ అరేబియా రష్యా. గాట్. ఫ్రైడ్, యం.

## 124 నంజు, పార్శ్వశూల, శ్వాసాశయక్షయ.

ప్రియమయిన కూనేగారికి. నాకు మీ విధానములో ఉత్తమారోగ్యము లభించినది. ఇందుకు నాధన్యవాదముల నందుకొనుడు. నాకు తమమీాద చాలా గౌరవము గలదు. అది నాకు తాము చేసినమేలువలన కలిగినది. తాము రోగులను రక్షించుచున్నారు. 2 సం॥ వరుసగా నేను పార్శ్వశూలతో బాధపడితిని. ఆరోజులలో పడకమీాదనుండి లేవలేను. ఇంతలో నంజు పుట్టినది. యెన్నివిధముల మందులోయిచ్చి వైద్యులు నయముచేయ ప్రయత్నించిరి. నావ్యాధి నయముకాలేదు. మందులంటేను, వైద్యులంటేను నాకు భయముపుట్టినది. మీ చికిత్సా విధానము నవలంబించితిని. చికిత్స మొదలుపెట్టినలగాయతు గుణమిచ్చినది. నాపొట్టమీాది కణతి కరిగిపోయినది. నావ్యాధి నయమైనది. యిందుకుతిరిగి కృతజ్ఞతను వెల్లడించు చున్నాను.

స్విడ్జర్ లెండ్ లోని, బింజికామ్. మిస్. ఇడాయస్.

### 125. గ్రంధులవాపు - పంటిపోటు, కంటివ్యాధి.

సప్తపథలోనుండి శ్లేష్మస్రావము, శ్వాసకోశమునుండి శ్లేష్మస్రావము, ఊపిరిబిగబట్టుట, ఉబ్బసము, శుక్లనష్టము.

నేను క్రిష్టియన్ ఫాదరీని. తొట్టివైద్యము చదివి, చాలా ఆనందించుచున్నాను. మీ పుస్తకము 25 భాషలలోనికి తర్జుమా అయి ఉండుటవలన నాకు దానిమీద మోజుపుట్టినది. తర్వాత ముఖనిదానం కూడా చదివితిని. నేను యెక్కడకు వెళ్ళినా, మీ వైద్యాన్నికూడా వ్యాప్తి చేస్తున్నాను. పైనపేర్కొనిన వ్యాధులతో నేను చాలా బాధపడుతూ, మీరు వ్రాసిచ్చిన సలహాలను యథావిధిగా నవలంబించినాను. దానివలన మంచిఫలమే కలిగి నారోగం నయమైనది. ఈ సంగతి మీరు గ్రంథాలలో చేర్చినా, ఉపన్యాసాల నిచ్చినా నాకు యిష్టమే. సకాలంలో మీ వైద్యము అవలంబించకపోతే. క్షయతో చనిపోయేవాడను. నాకున్న రోగాలన్నీ పోయినవి.

స్కానా, మీ విధేయుడు, రెవరెండ్. ఈ.

### 126 గర్భధారణము, సుఖప్రసవము.

ప్రియమయిన కూనేగారికి, తాము సెలవిచ్చినట్లే జరిగినది. తమ సలహా ననుసరించి నాభార్య చికిత్స చేసకొన్నది. గర్భధారిణమైన తర్వాత కూడా మీ సలహా అవలంబించినది. గర్భధారణ కాలము బాగా గడచిపోయినది. ప్రసవించినరోజున 9½ గం॥ నొప్పులు వచ్చినవి. గం 9-40 ని.లకు

ప్రసవమయినది. అంతకుముందు మాయింటి వైద్యుడు వచ్చి 2 రోజులవరకు నాభార్య ప్రసవించదని చెప్పిపోయినాడు. అతను అనుకున్నదానికి భిన్నముగా అప్పుడే ప్రసవించినది. అప్పటినుంచీ ఆమె కులాసాగా నున్నది. ప్రసవమైనప్పుడే మిమ్ము తలచుకొన్నది. తమ జ్యోతిషము నిజమైనదన్నది. మా ధన్యవాదము ల నందుకొనుడు. మీ గ్రంథము పవిత్రమైనది. మాయింటివైద్యుడు తర్వాత వచ్చినాడు. ఆయన వయస్సు 65 సం॥లు. తన 41 సం॥ అనుభవములోను యింత తొందరగాను, సుఖముగను ప్రసవించినవారిని తాను చూడలేదన్నాడు. తన చికిత్సా విధానమునకు నాభార్య ప్రసవ మొక జయపత్రిక. నాభార్యయొక్క నాయొక్క కృతజ్ఞతా పూర్వకధన్యవాదములు స్వీకరింపుడు.

స్లాన్-హాలెండ్ ఎ. యస్.

## 127 భగంధరము. ప్రేగులలో పుండు.

అయ్యా, తాము ముందుగా సలహాను వ్రాసి పంపితిరి. ఇప్పుడు నా ఆరోగ్యమును గురించి వాకబు చేయుచూ ఉత్తరము వ్రాసితిరి. 15 దినాల క్రిందటనే భగంధరము, ప్రేగులలోని పుండు, నయమయినవని వ్రాయుటకు సంతోషముగానున్నది. మొదట క్రమంగాఅనుసరింపలేకపోయితిని.జనవరి 2వారంలోమీసలహాను దినానికి 2, 3, లింగస్నానములు చేసేదానను. పథ్యము,యథా విధిగా చేసితిని. నాఆరోగ్యము బాగుపడినది. మీరురచియించిన శాస్త్రగ్రంథములు, బాగుగా వ్యాప్తి కావలెనని మాకోరిక, మీకనేక ధన్యవాదములు. డెన్మార్కులో కోపెన్‌హేగన్ సమీపాన-జూరియా, యల్. వాల్. ఛే.

## 128 - తీవ్రిమయిన నాడీవ్యాధి, శుక్లనష్టము.

అయ్యా, నా 3 సం॥ బిడ్డకు, తీవ్రిమయిన వ్యాధివచ్చినది. చాలా దుర్బలముగా నుండేవాడు, బోర్లబొక్కలా పరుండి, శిశ్నము-నేలకువైచి రుద్దేవాడు. భయపెట్టినా, కొట్టినా, మానే వాడుకాదు. లింగస్నానాలు చేయించి, యుక్తమయిన పథ్యము పెట్టితిని. దానితో వాని నాడీవ్యాధి, దౌర్బల్యము, జన నేంద్రియ దోషములు పోయినవి. నాకు గట్టివిశ్వాస మేర్పడినది. కూనేగారి వైద్యాన్ని అంతటా ప్రిచారం చేస్తున్నాను.

లీప్ - జిగ్. హెచ్. యస్.

## 129 గుండెసంజు, కాలికమైన ఉబ్బసము.

అయ్యా, 3 సం॥ పై కాలమునుంచి, పై వ్యాధులతో బాధపడు చున్నాను. అనేకమంది, సివిల్ మిలిటరీ డాక్టరులవద్ద చికిత్స పొందితిని, కేకోా పట్టణవాసి, సుప్రసిద్ధుడైన - ప్రొఫెసర్ - పి. గారి వద్దకూడా చికిత్స పొందితిని. ఎవరివద్దను కూడా మేలు కలుగలేదు. మీా గ్రంథము చదివి, మీా సలహా ననుస రించితిని. 6 మాసాల క్రిందట, ప్రమాదకరమైన నావ్యాధి నయమైనది. ఇందుకు మీాకు ధన్యవాదముల సమర్పించుకొను చున్నాను.

జెన్. జో. గలీసియా, యమ్. ఎ. క్లార్కు

డిస్ట్రిక్టు కోర్టు - ఆఫీసు గుమాస్తా

130 మేహవాతము, గుండెజబ్బు, గర్భాశయములో కేన్సర్, మూలవ్యాధి, అజీర్ణము, ప్రక్కలందును, వెనుక నొప్పి.

ప్రియమయిన కూనేగారికి, ఈ పట్టణములో స్థాపించిన, ప్రకృతి చికిత్సాసంఘమునకు, నేను అధ్యక్షుడను. ఇచ్చటి సంఘములో 300 మంది సభ్యులున్నారు. వివేకములేని వైద్యులు నయముకావు అని వదలివేసిన రోగులలో చావసిద్ధముగా నున్నవారికి, ఆరోగ్యము నిచ్చినది. ఒకరోగికి, మేహవాతము. అదిగుండెవరకు వ్యాపించినది. మీ వైద్యము అవలంబిస్తే నయమైనది. ఒకామెకు గర్భాశయంలో కేన్సర్. ఆమెకు అదివరకే 10 మంది సుప్రసిద్ధవైద్యులు చికిత్సించినారు. ఈ పట్టణములో ఆసుపత్రికి ప్రధానాధికారిగా యున్నవారు, శస్త్రము చేయదలచి, పొట్టకు మెక్కపెట్టినారు. ఆమె బలహీనముగా ఉండుటచే భయపడి, గర్భాశయం శస్త్రము చేయకుండానే కుట్టివేసినారు. వైద్యులంతా యేకగ్రీవంగా – ఆమె 3 మాసాలకన్నా యెక్కువ జీవించదన్నారు. రోగం, అంతగా ముదిరిపోయినది. ఆమె మన వైద్యము నవలంబించినది. ఇప్పటికి – మూడుమాసాలు కాదు – 6 మాసాలు జీవించియున్నది. ఆమె రోగలక్షణములు కనుపించుట లేదు. ఒక సం॥రం నుండి నేను స్వయముగా మీ చికిత్స అవలంబించినాను. నా ఆరోగ్యము బాగుగా వృద్ధిపొందినది. నాకుగల, మూలవ్యాధి, అజీర్ణము, ముందు, వెనుక ప్రక్కలయుందలి నొప్పులు నయమైనవని తలచు చున్నాను. కోరకుండా వ్రాసియిచ్చిన

యీజయపత్రికను, మీయిష్టమువచ్చినట్లు వినియోగ పరచు
కొనవచ్చును. అనేక కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

బినాన్. హైరెసు. విన్. శెంట్. డి.

(కూనే ప్రకృతి చికిత్సా సంఘాధ్యక్షుడు)

## 131 కంటివ్యాధి

ప్రియమయిన కూనేగారు, నాకుమారుని వయస్సు 12 సం॥
అతడు కంటిజబ్బుతో బాధపడుచూ, మీ సలహాపొంది తమ
సలహా ప్రకారమే చికిత్స చేసికొనినాడు. నాకుకలిగిన ఆశ్చర్య
మును ఏమని వర్ణింపను. 3 వారాలలోనే అతనికి మేలుకలిగి
నది. 4 వారంతో, సాంతము నయమైనది. ఆ రోగలక్షణాలు
ఇప్పుడు కనుపడుటయేలేదు. అతడిప్పుడు బాగుగా నున్నాడు.
3 సం॥ వైద్యులు చికిత్సలచే నయముచేయలేని వ్యాధిని,
మీరు 4 వారములలో నయంచేసినారు. మా హృదయ పూర్వక
మైన ధన్యవాదముల నందుకొనుడు. మీరు కోరకుండానే
ఈ విషయాన్ని వ్రాసి పంపిస్తున్నాను. మీకేమైనా ఉపయో
గించేట్లయితే మీరీ జయపత్రికను మీ యిచ్చవచ్చినట్లు వాడు
కొనవచ్చును.

రెంహెడ్. హేష్టెక్. మీ విశ్వాసపాత్రుడు. జీ. యఫ్.

## 132 మూత్రకము మూసికొనిపోవుట

తాము దయతోపంపిన సలహాల ననుసరించి ఆగష్టు 23వ తేదీ
నుండి, అక్టోబర్ 1 టవ తేదీవరకు, మీ చికిత్సావిధానం,
అవలంబించినాను. నాకు మంచిఆరోగ్యము కలిగినది. ఈ

వృత్తాంతము, మీకు తెలిపికొనుటకు ఆనందభరితుడ నగు చున్నాను. రెండోవారం మొదటిలోనే, మూత్రం వచ్చే టప్పుడు మంటపుట్టడం, మానివేసినది మూత్రికలో ఉండే అవరోధం మాయమైనది. ఇప్పుడు ధారాళంగాను, వడిగాను మూత్రము వస్తుంది. నా కెప్పుడూ యింత సుఖముండే దేకాదు. నేను ఆరోగ్యంగా ఉన్నప్పుడు కూడా - మూత్రమింత తెంపుగా వచ్చేది కాదు. ఇందుకు మా హృదయపూర్వకమైన ధన్యవాదములు స్వీకరింపుడు. తమకు దీర్ఘ ఆయు రారోగ్యములు కలుగవలెననియును, దివ్యమయిన మీ చికిత్సావిధానము, సర్వవ్యాప్తము కావలెననియును, ఈ జయపత్రిక భూమియొక్క అంచులవరకు వ్యాప్తికావలెననియును కోరుచున్నాను. హెచ్ అను నామె చెవుటితో 5 సం॥ నుండి బాధపడుచున్నది. ఆమె కేదైనా సలహానువ్రాసి పంపించండి. కొలదికాలములోనే మిమ్ములను స్వయముగా దర్శింప వలెనని కోరిక ఉన్నది.

ఆల్ టిప్ సాల్ హాంగెరీ. విధేయుడు, జె. హెచ్.

ఉత్పత్తిదార్లు.

## 133 బహుజను లిచ్చిన జయపత్రిక

లీప్‌జిగ్ నుంచి నేను వెళ్లిలోపల, లీప్‌జిగ్ లోని ప్రకృతి చికిత్సాలయాధిపతులయిన లూయీ కూనేగారివలన, నేను పొందిన రోగనివారణ లాభమును కోరకుండానే బహుజనులలో వెల్లడించుచున్నాను. 66 సం॥ వయస్సు కలిగిన నేను, చిరకాలమునుండి మధుమేహాముతో బాధపడు చున్నాను.

ఎంతమందో వైద్యులసలహా తీసుకొన్నాను. నా వ్యాధి కుదురలేదు. మందు శస్త్రములతో నిమిత్తములేని కూనేగారి తోట్టివైద్యాన్ని గూర్చి విని లీప్‌జిగ్ వెళ్ళి వారిచ్చిన ప్రత్యేక సలహా ప్రకారం చికిత్స అవలంబించినాను. అదివరకు మూత్రములో — 1.85.% చక్కెర ఉండేది. 15 దినాలలోనే 1.10.% వరకు తగ్గిపోయినది. ఇంకొక వారం చికిత్స చేసేటప్పటికి మూత్రములో సాంతము, చక్కెర లేకుండా అంతరించినది. లీప్ జిగ్ పట్నములో నుండే 4 గురు డాక్టర్లు, విడివిడిగా మూత్రపరీక్షచేసి, ఈ సంగతిని వృధాపర్చినారు. ఆడాక్టర్ల పేర్లు. 1. రోహాదిగ్, 2. యల్‌సనర్, 3. బాక్, 4. ప్రైగర్, వీరు ప్రభుత్వమువారి వస్తుపరీక్షా నిపుణులు.

ఇందువలన కూనేగారి చికిత్సా విధానాన్ని రోగంతో బాధ పడే వారంతా అవలంబించతగినదని యెరిగి చెప్పచున్నాను. నేనుఉండే బార్‌మన్ పట్నములోకూడా కూనేగారి చికిత్సా విధానం అవలంబించి రోగములను నయముచేసుకున్న వారిని నే నెరుగుదును.

లీప్—జిగ్—1998 సం॥ ఆగష్టు 8 వ తేదీ,

బార్‌మన్ పట్టణవాసి – యల్. బి.

ఉత్పత్తిదారు.

# ముఖనివేదనము

మీరు ఆరోగ్యంగా ఉన్నారా?

వైద్యుని సహాయంలేకుండా ఈవిషయం తెలుసుకొనేది ఎలాగ?

ఆరోగ్యం అంటే ఏమిటి?

ఇట్టి అనేక అపూర్వసంగతులు మీరు తెలుసుకోవాలంటే

ఈ పుస్తకం చదవండి.

55 చిత్రపటములు గలవు. జర్మనీ దేశమునందలి లీప్జిగ్ నగరవాసియగు లూయీ కూనేగారు జర్మనీభాషలో వ్రాసిన "సయన్సు ఆఫ్ ఫేషియల్ ఎక్స్‌ప్రెషన్" అను స్వతంత్రమగు పరిశోధనలతో గూడిన నవీన నిదానశాస్త్రమును కెన్నెత్ రోమేన్సు అను వారు రచియించిన ఆంగ్లతర్జుమా ననుసరించి ప్రకృతి ధర్మవేత్త పుచ్చా వేంకటామయ్యాగారి ఆంధ్రీకరణము.

వెల రు 3—0—0.

ప్రకృతి కార్యాలయ ట్రస్టు,

బెజవాడ — 1.

ఇది లోకప్రఖ్యాత పురుషుండగు డాక్టరు లిండ్లహారీ యం. డి. గారి ఆంగ్ల గ్రంథమునకు ప్రకృతి వైద్య తత్త్వవేత్త మృత్తింటి ఆంజనేయులుగారి ఆంధ్రానువాదము. చక్కని కేలికోబైండు చేయబడినది. ఇందు 500 పుటలు గలవు. అందలి కొన్ని ముఖ్యవిషయములు.

ప్రకృతి వైద్యస్వరూపము పుట్టుక — రోగకారణమేమి ?— నివారణసూత్రములు — మైక్రోజిమూ పుట్టుపూర్వోత్తరాలు — మందులతో అణచిపెట్టుటవలన కలిగే ఫలితాలు — ఔషధములు — శస్త్రచికిత్స అనర్థకములు — ఆమాశయవ్రణములు — టీకాలు — సర్పమందు — ఆడువారు పడుబాధలు — అంతివ్రణము — సహజాహారము — ఉపవాసము — ధాతుశక్తిని వృద్ధిచేసికొనుట — మనోచికిత్స — ప్రార్థన — విశ్రాంతి.

వెల రు 5—0—0.

ప్రకృతి కార్యాలయ ట్రస్టు.

విజయవాడ — 1.

